

# ప్రియ ఘుమ ఘుమలు మీకోసం

అద్భుతం... ఇది అమోఘం... ఔనండీ - ఈ ప్రియ పచ్చళ్లు మీ కోసమే ! మేలైన దినుసులు, నోరూరించే మధురిమల సమ్మేళనం - ప్రియ ఏ వేళైనా... ఏ వంటకమై అది భోజనమైనా - అల్పాహారమైనా - అతిథి సత్కారమైనా... 'ప్రియ' జోడించండి... మరచిపోలేని అనుభూతిని పొందండి!

ప్రియ - ఇప్పుడు మీ కెంతో ఇష్టమైన 15 వేర్వేరు రుచుల్లో




Sista's-UEL-272/92 TEL.B.

**priya** ఊరగాయలు

ఉషోదయా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు- 500 482.



# చతుర కతలు

## మెప్పుతిప్పలు

ఆర్.టి.సి.లో చీఫ్ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేస్తున్న చక్రధర్ తన పైఅధికార్ల మెప్పు పొందాలని తెగతాపత్రయం పడుతున్నాడు. ఆ మెప్పు పైఅధికార్లకి కూరగాయలు తేవడంవలన, వాళ్ళ కాళ్లు పిసకడంవలన, బట్టలు ఉతకడంవలన రాదని అతనికి తెలుసు. పైగా తన ఉద్యోగ హోదాకి ఆ పనులు తగవు. సంస్థకి ఆర్థికపరమైన లాభం చేకూర్చితేనే ఆ ప్రశంసలు లభిస్తాయి. "త్వరలో ప్రధానమంత్రి ఆగమనం" అనే వార్త పేపర్లో చూసి తన గదికి ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్లని పిలిపించాడు. "మన డిపోలోని షెడ్యూల్డ్ బస్సులు చాలావాటిని ఆరోజు ఆపివేసి వైజాగ్‌కి స్పెషల్‌గా తిప్పాలి" అని చెప్పాడు చక్రధర్.

టి.ఐ.లకు అర్థంకాక "ఎందుకు సార్" అన్నారు. "అదే మీకూ నాకూ వున్న తేడా. వచ్చేవారం ప్రధానమంత్రిగారి మీటింగ్ వుంది వైజాగ్‌లో. ప్రభుత్వం భారీ ఎత్తున ఏర్పాట్లు చేస్తున్నది. పి.ఎం.ని చూడటానికైతే ఏం? ఆయన ప్రసంగం వినడానికైతే ఏం, రేపు ప్రజలు పెద్దఎత్తున తరలివెళతారని మా సిక్త్‌సెన్స్ చెబుతోంది" గర్వంగా చెప్పేడు.

టి.ఐ.లు విసుగ్గా తల విదిలించి చేసేది లేక "సరే, స్పెషల్ బస్సులు ఎన్ని ఆపరేట్ చేయమంటారు?" అడిగారు.



"కనీసం అయిదు నిమిషాలకు ఒకటి చొప్పున"

★ ★ ★

ఇది జరిగిన సుమారు నెలాపదిహేను రోజులకు డివిజనల్ మేనేజర్‌నుంచి కబురొచ్చింది. సి.ఐ. చక్రధర్‌కి.

ఆ గదిలో ఇద్దరే ఇద్దరు వున్నారు. ఒకరు డివిజనల్ మేనేజరు. మరొకరు చక్రధర్ పనిచేస్తున్న డిపోమేనేజర్.

"నమస్తే సార్" విష్ చేశాడు చక్రధర్.

కవర్ ఫొటో: జగ్‌మోహన్

"ఏమయ్యా... నీకు బుర్ర సరిగ్గా పనిచేయదా?" డివిజనల్ మేనేజర్ అడిగిన మొట్టమొదటి ప్రశ్న అది. చక్రధర్ తడబడ్డాడు.

"పి.ఎం. వైజాగ్ వచ్చిన రోజున షెడ్యూల్డ్ బస్సుల్ని రద్దుచేసి వైజాగ్ స్పెషల్స్ ఎందుకు పంపించావ్? పి.ఎం.నీకు ఏమైనా మేనమామా? లేక నువ్వు ఆ పార్టీ మనిషివా?"

"అ(... అది... అది..." చక్రధర్ గుటకలు వేయసాగాడు.

"చెప్పవయ్యా"

"రెండూ కాదు సార్. పి.ఎం.ని చూడటానికి జనం విపరీతంగా వెళతారని..."

"వెళతారు. నిజమే! కాని డబ్బులిచ్చుకొని మన బస్సులుమీద కాదు. ఆ పార్టీవాళ్ళు ఏర్పాటుచేసే లారీలు, వ్యాన్లు, బస్సులమీద వెళ్తారు. ఆరోజు పెర్సనల్ పనిమీద ప్రయాణం చేసేవాడు కూడా డబ్బులు మిగులుతాయని ఆ పార్టీవాళ్ల వెహికల్స్‌మీదే పోతాడు. మన బస్సులెక్కినా టికెట్ కొనరు. నీ అవివేకంవలన కార్పొరేషన్‌కి బోలెడు నష్టం కలిగింది. డి.ఎం.గారూ ఆరోజు ఖర్చయిన ఆయిల్, స్టాఫ్ జీతాలు, బస్సు మైంటెనెన్స్ కాస్ట్ లెక్కగట్టి ఈ సి.ఐ.గారి జీతంనుంచి రికవరీచేసే ప్రతిపాదన తయారుచేయండి" అన్నాడు డివిజనల్ మేనేజర్.

**-కొల్లిమల్ల అప్పారావు**

---

## ఆంగ్లేయుల్లా మాట్లాడండి

"ఆరు నెలల్లో ఆంగ్లభాష నేర్చుకోండి!
ఇంగ్లీషులో తప్పులు లేకుండా రాయగలరు.
కేవలం ఆరునెలల్లో ఆంగ్లేయుల్లా
ధారాళంగా మాట్లాడగలరు...
నేడే మా 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్
ఇంగ్లీషు'ను సంప్రదించండి.
మహిళలకు ప్రత్యేక క్లాసులు కలవు"

కూరగాయలు కొంటూ గోడమీది వాల్‌పోస్టరు చూసింది అన్నపూర్ణమ్మ. అప్పటివరకు ఇంగ్లీషు నేర్చుకోవాలన్న తపన చిన్న మొలకలా వుండేది. ఇప్పుడు సారపాదులా ఆమె మెదడులో అల్లుకుపోయింది.

పాతిక సంవత్సరాలక్రితం పదోతరగతివరకూ చదివి మానేసిందామె. కొడుకు డాక్టరీ చదివి అమెరికా వెళ్లి డాలర్లు పండించే ప్రయత్నంలో వుండిపోయాడు.

అమెరికాలో కొడుకు డాక్టరయితే కూతురు కెనడాలో కెమిస్టుగా స్థిరపడిపోయింది. కొడుకు, కూతుళ్లతో ఇంగ్లీషులో మాట్లాడాలని ఆమె ఉబలాటం.

ఇంటికి ఫోను వచ్చేసి చాలారోజులే అయింది.

ఫోనులో ఇంగ్లీషు దంచేస్తే చుట్టుపక్కల అమ్మలక్కలు చూసి ఈర్ష్యతో అత్తవొడి పువ్వుల్లే ముడుచుకుపోరూ.

భర్త రాగానే చెప్పేసింది. ఆ ఇన్‌స్టిట్యూట్‌లో చేరి ఇంగ్లీషు నేర్చుకోవాలనివుందని.

"నువ్వు ముచ్చటగా తెలుగులో మాట్లాడితేనే విదేశాల్లో వున్న పిల్లలు ఆనందపడతారే! ఇంగ్లీషు నేర్చుకోవాలనుకుంటే నేర్చుకోగాని పిల్లలతో మాత్రం ఇంగ్లీషులో మాట్లాడకు" అన్నాడు అన్నపూర్ణమ్మ భర్త.

"నేనెక్కడ ఇంగ్లీషు నేర్చుకుని అమెరికాలో సెటప్ అవుతానేమోనని మీ ఉడుకుమోతుతనం" అందామె మొహం చిట్లిస్తూ.

"నువ్వు ఇంగ్లీషు నేర్చుకోగాని ఆ సెటప్ గిటప్ పదాలు నాముందు వల్లించకు... ఏ తెలుగు సినిమానో చూసి ఆ పదం వంటబట్టించుకున్నట్లున్నావ్" అనేశాడాయన.

అన్నపూర్ణమ్మ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషుకు వెళ్లడం మొదలుపెట్టింది.

ఇన్‌స్టిట్యూట్‌వాళ్ళు చెప్పినట్లు ఇంగ్లీషుపదాలు వల్లెవేయడం, నోటుపుస్తకాల్లో పదాలు రాసినవే మళ్లీ రాయడం, ఇంగ్లీషు క్యాసెట్లు పెట్టుకుని క్యాసెట్‌లో మాట్లాడుతున్నవారిని అనుకరిస్తూ మాట్లాడటం- పగలు రాత్రి అదే ధ్యాస అయిపోయిందామెకు.

ఆరునెలలు గడిచిపోయాయి.

"మీకు ఇంగ్లీషులో ధారాళంగా మాట్లా



డటం వచ్చేసిందమ్మా!'' ఇన్‌స్టిట్యూట్‌వాళ్ళు మెచ్చుకున్నారు అన్నపూర్ణమ్మను.

ఫోనులో కొడుకు, కూతుళ్లతో ఇంగ్లీషులో మాట్లాడటం మొదలుపెట్టింది.

''నువ్వు మాట్లాడేదేమిటో అర్థం అయ్యిచావడంలేదు... నీకు పుణ్యం వుంటుందిగానీ తెలుగులో మాట్లాడమ్మా!'' అంటూ మొత్తుకోవడం మొదలుపెట్టారు కొడుకూ, కూతురూ కూడా.

అన్నపూర్ణమ్మకు వొళ్లు మండింది.

ఇన్‌స్టిట్యూట్‌వాళ్ళమీద విరుచుకుపడింది.

''ఆరు నెలల్లో ఆంగ్లేయుల్లా మాట్లాడగలరని కోతలు కోశారు... మా అమ్మాయికీ, అబ్బాయికీ వొక్క ముక్కా అర్థంకావడంలేదట'' అందామె కోపంతో ఊగిపోతూ.

''మీరు ఆంగ్లేయుల్లాగానే మాట్లాడుతున్నారమ్మా'' అన్నాడు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషు ప్రిన్సిపాల్‌గారు.

కోపంగా ప్రిన్సిపాల్‌వైపు చూసిందామె.

''ఇంగ్లీషువాళ్ళు మాట్లాడితే మనకేం అర్థం అవుతుందమ్మా! అలాగే మీరు ఆంగ్లేయుల్లా మాట్లాడుతుంటే అది అర్థం చేసుకోవడం వొక్క ఇంగ్లీషువాళ్లకే అంటే ఆంగ్లేయులకే సాధ్యం అవుతుంది. మీరు నేర్చుకున్న ఇంగ్లీషును తక్కువగా అంచనా వేసుకోకండి'' అంటూ వివరణ ఇచ్చేడు ప్రిన్సిపల్‌గారు.

—అలపర్తి రామకృష్ణ

## తిండి

''ఆడపిల్లలకి చదువు చెప్పించే విషయంలోనో, ఆస్తులు పంచిచ్చే విషయంలోనో, సినిమాలకీ, షికార్లకీ తిరగనిచ్చే విషయంలోనో పెద్దవాళ్ళు అన్యాయంగా వుంటున్నారంటే వప్పుకుంటాగానీ, తిండి విషయంలో కూడా మగవారికంటే ఆడవారికి అన్యాయం జరుగుతోందంటే వప్పుకోను'' ఆవేశంగా అన్నాడు సుందరం.

''నువ్వొప్పుకోనంతమాత్రాన వాస్తవాలు తారుమారవ్వవు'' అంది సుగుణ.

''ఏమిటి వాస్తవం?'' అని అరుస్తున్న భర్తని చిరునవ్వుతో చూసి-

''అనవసరంగా ఆవేశపడకు! నువ్వసలే వట్టిమనిషివి కూడా కాదు'' కాస్తాగి ''జబ్బుమనిషివి'' అంది సుగుణ.

తాను జబ్బు మనిషినని గుర్తుకురాగానే చల్లారాడు సుందరం. నెమ్మదిగా ''సుగుణా! నేను చాలా ఆలోచించి చెప్తున్నా! ఆడవాళ్ళకీ మగవాళ్ళకీ మధ్య అంతరాలుంటున్నాయిగాని... తిండివిషయంలో...''

''సరే... నేనోటడుగుతా చెప్పు. మీ అమ్మ

తనకి లేకుండా ఏ కూరో, ఏ ఎగ్గో కాస్త స్పెషల్‌గా మీ నాన్నకి పెట్టడం చూశావా?''

''ఎన్నోసార్లు పెట్టేది. భర్తంటే ప్రేమ''

''వప్పుకున్నా! అలాంటి ప్రేమతో మీ నాన్న మీ అమ్మకి పెట్టడం ఎప్పుడన్నా చూశావా?''

''అంటే?'' అని ఆలోచనలో పడ్డాడు సుందరం. అలాటి వక్క సందర్భం కూడా గుర్తురాలా! ఇంటిల్లపాదికీ పెట్టి తినీ తినకా వున్న తల్లే గుర్తొస్తోంది. అతనికి తల్లిమీద కోపం వచ్చింది. ''ఆడవాళ్ళు అలా వుండడం



వాళ్ళ తప్పే'' అన్నాడు.

''ఆ మాటన్నావు బాగుంది. అది వాళ్ళ తప్పే! కాని అలా వుండకపోతే కష్టం సుఖం తెలియనిదనీ, తిండిపోతనీ బిరుదులొస్తా యని భయం పాపం ఆడవాళ్ళకి'' అంది సుగుణ.

''నువ్వెన్ని చెప్పు! మగవాడితో సమంగా తినొద్దని ఎవ్వరూ అనరు!''

''అవును. నోటితో అనరు. అర్థం అయ్యేలా చేస్తారు''

ఏదో అనబోతున్న భర్తని ఆపి - ''సర్లే పోనీ! నీతో వాదించి వప్పించలేంగానీ, నాకు ఆకలి మండిపోతోంది. నీ మగ విశాలహృదయంతో నాకేమన్నా పెట్టించు'' అంది సుగుణ నవ్వు తూ.

''పద''

ఎదురుగా వున్న హొటల్లో, ఫామిలీ రూంలో, ఎదురుబొదురుగా కూర్చుని - ''ఏం తింటావు'' అన్నాడు సుందరం.

''నువ్వు?''

''నువ్వు తింటోంటే చూస్తుంటాను''

''ఫర్వాలేదులే. ఇడ్లీ తిను'' అంది సుగుణ.

''అలాగే'' బుద్ధిగా అన్నాడు సుందరం.

''ఒక ప్లేటు ఇడ్లీ ఒక మసాల దోశ'' బేరర్‌కి సుగణే ఆర్డరిచ్చింది.

ఇడ్లీ, దోశా వచ్చాయి. ఇడ్లీ సుగుణముందూ దోశ సుందరంముందూ పెట్టాడు బేరర్!

సుగుణ నవ్వుతూ సుందరంతో ''అత నెందుకలా పెడ్తున్నాడు'' అంది.

సుందరం అనుమానంగా సుగుణ మొహంలోకి చూశాడు.

''అడుగు అలా ఎందుకు పెట్టాడో'' అంది.

అడిగాడు సుందరం.

బేరర్ వినయంగా -''ఎవరికేది కావాలో నాకు చెప్పలేదు కాబట్టి ఈ పొరపాటు జరి గింది'' అన్నాడు.

''పొరపాటని కాదు దోశ నాకు పెట్టి యిడ్లీ ఆయనకివ్వొచుగద'' అంది సుగుణ.

''జనరల్‌గా లైట్ టిఫిన్ ఆడవాళ్ళు, హెవీ టిఫిన్ మగవాళ్ళూ తింటారుగదండీ'' అన్నాడ తను.

నవ్వుతూ - సరే వెళ్ళమంది సుగుణ. అతను వెళ్ళిపోయాడు.

''ట్రాజెడీ ఏమిటంటే ఆడవాళ్ళకీ మగవాళ్ళ కున్నట్టే ఓ పొట్టా, దాన్లో ఆకలీ వుంటాయి''

అంటున్న సుగుణ మొహంలోకి చూడలేక పోయాడు సుందరం.

-ఏ.కె.రావ్

# చతురప్రపంచం

## పోలీసుల్ని పిల్చిన దొంగ!

"ఆ ఇల్లాలంతటి చిచ్చరపిడుగని ముందే తెలిస్తే, చచ్చినా వాళ్ళింటికి కన్నంవేసి ఉండే వాడిని కాదు" అని విపరీతంగా వాపోతున్నా



డు ప్రస్తుతం జైలులో కూర్చున్న ఆ దొంగ. అసలు విషయం ఏమంటే, జపాన్‌లోని ఒసాకాకు చెందిన ఒకానొక కన్నపుదొంగ ఓ యింటికి కన్నంవేశాడు. అతని గీత తిన్నగా లేదేమో, ఇంటి యజమానురాలు అతని రాకను పసిగట్టింది. నిజానికారోజు ఆమె తప్ప ఇంట్లో మరెవ్వరూ లేరు. అయినా ఆమె బెదిరిపోలేదు. దొంగని డ్రాయింగ్‌రూమ్‌లోకి రానిచ్చి, అతని వెనుకే తనూ గదిలో దూరి తలుపు మూసి అడ్డంగా నిలబడింది. ఓ పిడిబాకు తీసి ఆమెపై దాడిచేయబోయిన దొంగని ధైర్యంగా ఎదుర్కొని ఒక్క దెబ్బతో అతని చేతిలోని బాకును ఎగరగొట్టింది.

అతను తేరుకోకముందే చటక్కున ముందుకుదూకి అతని చేతిని కటుక్కున కొరికింది. అతను లబోదిబోమన్నాడు. అంతటితో ఊరుకోకుండా అతని చేతిని దొరకబుచ్చుకుని చూపుడువ్రేల్ని నోటకరచిపట్టుకుని అతన్ని టెలిఫోన్‌వైపుకి నడిపించింది. రిసీవర్‌ని అతనిచేతే తీయించి, తను పోలీస్‌స్టేషన్ నెంబరు డయల్‌చేసింది. అటు పోలీసులు ఫోన్ లిఫ్ట్‌చేయగానే ఆమె బలవంతంమీద దొంగే వారితో మాట్లాడి అక్కడికి రప్పించాడు. మొదట అందుకతను మొరాయించాడుగానీ ఆమె వ్రేల్ని కసాపిసా నమిలేసరికి తప్పనిసరై పోలీసుల్ని స్వయంగా తానే పిల్చి అరెస్టు చేయించుకున్నాడు. అదీ ఆ అభాగ్యదొంగ కథ!

## అరెస్టుకోసం తిప్పలు

నిరుద్యోగిగా నికృష్టజీవితం గడపలేక, ప్రపంచంలోని అస్తవ్యస్త పరిస్థితుల్ని చూడలేక ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాడు ఇంగ్లండ్‌కి చెందిన జార్జిటెరాత్. అందుకోసమని ఎలాగో నానాతంటాలు పడి ఓ పిస్తోలు సంపాదించాడు. తీరా పిస్తోలు చేతికొచ్చాక ఆత్మహత్య చేసుకోడానికి ధైర్యంచాలలేదు.

అందుకుబదులుగా ఏదైనా బాంక్‌ని దోచుకొని ఆ నేరంకింద ఎంచక్కా జైలులో కాలక్షేపం చేయడం బెటర్ అనుకున్నాడు. అనుకున్నదే తడవు ఆక్స్‌ఫర్డ్‌లోని మిడ్‌లాండ్ బాంక్‌లోకి పిస్తోలుతోసహా ప్రవేశించాడు. కాని అందుక్కూడా గుండెధైర్యం చాలక ఆ ప్రయత్నాన్ని విరమించుకుని ఆ బాంక్‌లో ఓ అక్కౌంట్ ఓపెన్‌చేసి బయటకొచ్చాడు.

మళ్ళీ రోడ్‌మీదికి రాగానే ఎదురుగా బార్‌క్లేస్ బాంక్ కన్పించింది. అతనిలో మళ్ళీ మొండిధైర్యం వచ్చింది. 'ఈ బాంక్‌నైనా దోచుకోవాల్సిందే పోలీసులకి దొరికిపోవాల్సిందే' అని తీర్మానించుకున్నాడు. అయినా తను



దొంగతనం చేయంగానే వెంటనే పోలీసులు వస్తారో, రారో! అసలు పోలీస్‌స్టేషన్ ఆ బాంక్‌కి ఎంతదూరాన ఉందోనని అనుకొని ముందుగా వెళ్ళి పోలీస్‌స్టేషన్ ఎక్కడుందో చూసుకొని వచ్చాడు. తర్వాత బాంక్‌లోకి దూరి తుపాకితో కాషియర్‌ని బెదిరించి 2,400 డాలర్లు దోచుకున్నాడు. కాసేపు బాంక్‌లోనే పోలీసులు వస్తారని తచ్చాడాడు. కానీ అతన్ని చూసి బెదిరిన బాంక్ సిబ్బందిగానీ, లావాదేవీలు జరిపేందుకొచ్చిన ఖాతాదారులుగానీ పోలీసులకి ఫోన్‌చేసే సాహసం చేయలేదు.

చేసేదిలేక తనే దోచుకున్న సొమ్ముతోటి, పిస్తోలుతోటి నేరుగా పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాడు. కానీ అక్కడ ఎవరి గొడవలో వాళ్ళున్నారుతప్ప, అతన్ని ఎవరూ పట్టించుకోలేదు. తనొచ్చి రెండుగంటలు దాటినా ఎవరూ పట్టించుకోకపోవడంతో ఒళ్ళుమండిన జార్జి కోపంతో తుపాకి పేల్చి వారికి తన ఉనికిని తెల్పాలని ప్రయత్నించాడు. కానీ అతను పేల్చిన విధానం ఎంత లక్షణంగా ఉందంటే, తుపాకి అతని చేతినే గాయపరిచింది. అప్పటికిగానీ పోలీసులు నిద్రమేల్కోలేదు. వెంటనే అతన్ని అరెస్టుచేసి, చికిత్సకోసం ఆసుపత్రికి తరలించారు.

---

## "బతికే ఉన్నానయ్యా బాబూ"

దక్షిణాఫ్రికాలోని ట్రాన్స్‌వాల్‌కి చెందిన డాక్టర్ హెన్నీగ్రోవ్ తన కారులో ప్రయాణిస్తూ కాలక్షేపంకోసం కార్ రేడియో ఆన్‌చేశాడు. అది రేడియోలో వార్తలు వచ్చే సమయం. సీరియస్‌గా వార్తలు వింటూ డ్రైవ్ చేస్తున్న ఆ పెద్దమనిషి ఓ వార్త విని ఉలిక్కిపడ్డాడు. ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి. కొన్ని క్షణాల తర్వాత తేరుకుని సరాసరి రేడియో స్టేషన్‌కి కారును పరుగులు తీయించాడు. ఆ తర్వాత రేడియోస్టేషన్ అధికారులకీ, డాక్టర్‌గారికీమధ్య పెద్ద వాగ్వివాదమే జరిగింది. చిట్టచివరికి స్టేషన్ అధికారులు తమ తప్పును అంగీకరించి డాక్టర్‌గారికి క్షమాపణలు చెప్పారు.

అంతేకాదు... అప్పటికప్పుడే రేడియోలో ఇలా ప్రకటించారు- "ఇందాక చదివిన వార్తలలో - ఈ ఉదయం ఆసుపత్రుల తనిఖీకి బయలుదేరిన హాస్పిటల్ సర్వీసెస్ డైరెక్టర్ డాక్టర్ హెన్నీగ్రోవ్ రోడ్డుప్రమాదంలో మరణించారని ప్రకటించాం. కానీ ఆయన సురక్షితంగానే ఉన్నారు. నిజం చెప్పాలంటే అసలాయన కారుకి యాక్సిడెంటే జరుగలేదు. వారే స్వయంగా వచ్చి ఈ విషయాన్ని మా దృష్టికి



తెచ్చి, మా తప్పును సవరించుకునే అవకాశం కల్గించినందుకు వారికి మా కృతజ్ఞతలు. శ్రోతలకు కలిగిన ఈ అసౌకర్యానికి ఎంతో చింతిస్తున్నాం"

# చతుర

సంపుటి: 16 సంచిక: 1 ఫిబ్రవరి: 1993


ప్రేమలో ఘోరపరాజయాన్ని చవిచూసిన అతడు,.. పెద్దలు నిశ్చయించిన పెళ్ళే చేసుకోవాలనుకున్నాడు.

కానీ... పెళ్ళిచూపుల్లో కూడా అతడు అనూహ్యమైన అనుభవాలను ఎదుర్కొన్నాడు.

చివరికి... అర్థాంగిగా అతడి జీవితంలో అడుగుపెట్టిన స్త్రీనుండి... అతడు పొందింది ఏమిటి?

స్త్రీపట్ల అతని అభిప్రాయాలకీ, స్త్రీద్వారా జీవితంలో అతడికెదురయిన అనుభవాలకీ... చరమాంకం... ఎలాంటిది?

స్త్రీపురుష స్వభావాలనూ, వారి విభిన్న మనస్తత్వాలనూ విశ్లేషిస్తూ ఎమ్.లక్ష్మీరమణకుమారి రాసిన బంధం ఈ నెల 'చతుర' సమగ్రనవల.

## ఎమ్.లక్ష్మీరమణకుమారి

# బంధం

శిరీష ఆఫీసు నుంచి వచ్చి, పనులు పూర్తి చేసుకుని భర్త కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

రోజూ ఏడు దాటితేగానీ రాని రాఘవ ఆ రోజు ఆరు గంటలకల్లా వచ్చేశాడు.

"తొందరగా వచ్చేశారేం" నవ్వుతూ అడిగింది శిరీష. అతను నవ్వి ఊరుకున్నాడు.

భోజనాలయ్యాక నెమ్మదిగా అసలు సంగతి బయటపెట్టాడు.

"శిరీషా... రేపు నేను శలవుపెట్టాను"

"ఎందుకు?"

"శరత్ వస్తున్నాడు. మనింట్లో కొన్నాళ్లు ఉంటాడు" శిరీష ఆశ్చర్యంతో చూస్తూండిపోయింది.

"అతను ఒప్పుకున్నాడా?"

"బలవంతాన ఒప్పించాను. అతను చాలా నీరసంగా ఉన్నాడు. డిప్రెషన్‌లో ఉన్నాడు. మనింట్లోనే ఉంచుకుంటే మంచిదనిపించింది. నువ్వు కూడా అదే అన్నావుగా. యింకో విషయం శిరీషా... నువ్వు కనీసం ఒకవారం శలవుపెట్టి యింట్లోనే ఉండి అన్నీ చూసుకోవాలి. అసలు నేనే శలవుపెడదామనుకుంటే మా ఆఫీసులో ఇన్‌స్పెక్షన్ ఉంది. శలవు దొరకదు. ప్లీజ్ శిరీషా... నా కోసం కాస్త ఈ హెల్ప్ చెయ్యాలి" అన్నాడు రాఘవ.

"అలాగే" అంది శిరీష.

రాత్రి పదిగంటలు దాటిపోయినా శిరీషకి నిద్రరాలేదు.

రాఘవ మాత్రం హాయిగా నిద్రపోతున్నాడు.

శరత్ రేపట్నుంచి యిక్కడే ఉంటాడు కొన్నాళ్లు.

శరత్ రాఘవకి క్లోజ్ ఫ్రెండ్.

అతని జీవితంలోని ప్రతి ఘట్టం, ప్రతి సంఘటనా రాఘవకి తెలుసు. రాఘవ చెప్పగా విన్న శిరీషకి కూడా శరత్ గురించి బాగా తెలుసు.

శరత్ స్త్రీ ద్వేషి.

ఆడవాళ్ల నీడని కూడా సహించడు.

యిప్పుడు ఎలా ఉన్నాడో...

అతను స్త్రీ ద్వేషిగా మారటం వెనక చాలా కథ ఉంది.

ఒకరు కాదు... యిద్దరు కాదు... దాదాపు అతనికి ఎదురైన ప్రతి స్త్రీ అతనికి ఒక్కోరకం చేదు అనుభవాన్నే యిచ్చారు.

పదిహేనేళ్ళ క్రితం...

శరత్ జీవితంలో ప్రవేశించిన మొట్టమొదటి స్త్రీ విలాసిని.

ఆమె శరత్ క్లాస్‌మేటు. మధ్యతరగతి కుటుంబం నుంచి వచ్చింది. చాలా అందంగా ఉండటం, మధురంగా మాట్లాడగలగటం ఆమె ప్రత్యేకతలు.

ఆమెని చాలామంది యువకులు ఆరాధిస్తూ ఉండే వాళ్ళు. వాళ్ళల్లో శరత్ ఒకడు. కళ్ళతోనే తన ఆరాధననీ, ప్రేమనీ వ్యక్తీకరించిన శరత్‌కి ఆమె గ్రీన్ సిగ్నల్ యిచ్చింది. ప్రేమగా మాట్లాడి ఆశలు చిగురింపజేసింది.

విలాసినికి సెంట్ బాటిల్సూ, జెబురుమాళ్లూ, పెన్ సెట్టులూ, గోళ్లరంగులూ లాంటి చిన్న చిన్న ప్రెజంటేషన్స్ ఎన్నో యిచ్చాడు శరత్. ఆమె ఆనందంగా అవన్నీ స్వీకరించింది. తల్లికి సినిమాకెళ్లాననీ, హోటల్లో తిన్నాననీ దొంగలెఖ్ఖలు చెప్పి, ఎక్కువ డబ్బు తీసుకుని విలాసినికి బహుమానాలు కొన్నాడు. యింట్లో తల్లి చేసిన స్వీట్లు పాక్ చేసుకెళ్లి విలాసినికి యిచ్చాడు ఎన్నోసార్లు. ఆమె బాగున్నవని మెచ్చుకున్న రకాల్ని మళ్లీ మళ్లీ అడిగి తల్లి చేత చేయించేవాడు.

విలాసిని తనను మనస్ఫూర్తిగా ప్రేమిస్తోందని గాఢంగా విశ్వసించి కొన్నాళ్లయ్యాక తన మనసులోని ప్రేమను బయటపెట్టాడు.

"నువ్వు లేంది నేను బతకలేను" అన్నాడు కూడా.

విలాసిని నవ్వి ఊరుకుంది.

పురుషుడు తన ప్రేమను వ్యక్తీకరించాక ఆ స్త్రీ అందుకు అభ్యంతరం చెప్పకపోతే అది ఆమెకు అంగీకారమే అనుకుంటాడతను. అందులో అతని తప్పులేదు.

శరత్ కూడా అట్లాగే అనుకుని, ఆ ఉత్సాహంలో విలాసినికి తన ఉంగరం సైజు చిన్నదిగా చేయించేసి బహూకరించేశాడు. విలాసిని వద్దనకుండా తీసుకుంది.

ఫైనల్ పరీక్షలు మొదలయ్యేముందు తమ పెళ్లి ప్రస్తావన తెచ్చాడు.

"అయామ్ సారీ... నేను నిన్ను చేసుకోను" అంది విలాసిని. శరత్ నిర్ఘాంతపోయాడు.

"నువ్విట్లా అంటావనుకోలేదు. నువ్వు నన్ను చేసుకుంటావని ఎన్నో కలలుకన్నాను. మొదటే నువ్వు కాదంటే పోయేదిగా. యిన్నాళ్లూ ఎందుకు సస్పెన్స్‌లో పెట్టావు?" అన్నాడు తేరుకుని.

"నువ్వంటే నాకు అభిమానం ఉంది. కానీ నిన్ను పెళ్లి చేసుకునే ఉద్దేశం మాత్రం లేదు. నాకు గొప్పగొప్ప ఆశలున్నాయి. కార్లలో తిరగాలనీ, గొప్పగా బతకాలనీ, నలుగురిలో దర్జాగా ఉండాలనీ ఉంది. నువ్వు మహా చదివితే ఎం.ఏ. చదవగలవేమో. నీకు వెనక ఆస్తిపాస్తులు లేవు. నేను కోరుకునే జీవితం నువ్వు కల్పించలేవు" అంది విలాసిని.

శరత్‌కి ఆమె మనస్సేమిటో ఇంకా అర్థం కాలేదు. "విల్లీ... నువ్వు అనవసరంగా ఏవో అపోహలు పెంచుకుంటున్నావు. నన్ను చేసుకున్నంత మాత్రాన నీ ఆశలు నెరవేరవని ఎందుకనుకుంటున్నావు. నువ్వు పక్కన ఉంటే చాలు నేను కొండనైనా పిండి చేస్తాను. నువ్వు నాకు రెండేళ్ల గడువియ్యి చాలు. ఐ.ఏ.ఎస్. పరీక్ష రాసి పాసవుతాను. ఉద్యోగం సంపాదించాకే నన్ను పెళ్లి చేసుకో" అన్నాడు ఆవేశంగా.

విలాసిని నవ్వింది.

"వెయిటింగ్ అంటే నాకసహ్యం. ఎప్పుడో ఏదో అయి పోతావని యిప్పట్నుంచీ కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తుండమంటావా! మహా మహా వాళ్లే ఐ.ఏ.ఎస్ చదవలేక చతికిలబడ్డారు. యింక నీకు అదేం వస్తుంది" అంది.

"స్త్రీ తల్చుకుంటే పురుషుడి చేత ఏదన్నా చేయించగలదు. నీ ప్రేమకోసం నేను ఎంత గొప్పదైనా సాధిద్దామనే అనుకుంటున్నాను. ప్లీజ్... నాకా అవకాశం యివ్వు" అన్నాడు శరత్.

విలాసిని మాట్లాడలేదు.

"పోనీ యింకో దారి చూడు. మనిద్దరం కొద్ది రోజుల్లోనే గ్రాడ్యుయేట్లం కాబోతున్నాం. గట్టి ప్రయత్నం చేస్తే మంచి ఉద్యోగం వస్తుంది. యిద్దరం ఉద్యోగాలు చేస్తూ హాయిగా, సుఖంగా బతకొచ్చు. బాంక్‌లో ఆఫీసర్లం అయ్యామనుకో, బోలెడంత జీతం వస్తుంది" అన్నాడు శరత్.

"నేను తీరిగ్గా, హాయిగా జీవితం గడపాలనుకుంటున్నాను. నువ్వు చూపించే జీవితంలో హడావుడి, ఆయాసం తప్ప తీరిక, సుఖం ఉండవు. నువ్వు ప్రయత్నిస్తే ఐ.ఏ.ఎస్. కాగలనంటున్నావుకదా. అలాంటి ప్రయత్నమే చేసి నన్ను మర్చిపోడానికి ప్రయత్నించు. వస్తా" అనేసి నిష్క్రమించింది విలాసిని.

శరత్ నిశ్చేష్టుడై చూస్తుండిపోయాడు. ఎంతో ఆశతో నిర్మించుకున్న తన కలల సౌధాన్ని ఆమె ఒక్కతాపుతో తన్నేస్తుందని ఊహించని అతను విషణ్ణ వదనంతో అలాగే కూర్చుండిపోయాడు.

ఆ తర్వాత అతనికి జీవితంలో ఉత్సాహం, ఆశ కనిపించలేదు.

విలాసిని లేకుండా తను బతక లేనని పించింది. అయినా పరీక్షలు దగ్గర పడటంతో కొద్దిగా దార్లోపడి చదవటం మొదలు పెట్టాడు.

హాల్‌టికెట్ తీసుకోవటానికి వెళ్లినప్పుడు విలాసిని మళ్ళీ కనబడింది.

"శరత్... నువ్వు చెప్పినవి ఆలోచించాను. బాగానే ఉన్నట్లు తోచింది నాకు. నీకేవన్నా మంచి ఉద్యోగం రాగానే మనం పెళ్ళి చేసుకుందాం. ఆ తర్వాత నువ్వు ఐ.ఏ.ఎస్.కి కూడా చదవవచ్చు. తగినంత పుష్‌లేక యిలా ఉన్నావుగానీ లేకుంటే నీ బ్రెయిన్ అసలు ఎవరికుంది" అంది చిరునవ్వుతో.

శరత్ పొంగిపోయాడు.

"నిజంగా" అన్నాడు.

"ప్రామిస్... నిజంగా... ఐలవ్‌యూ... నిన్ను వదిలి నేనుండలేనని నువ్వు నాకు దూరమయ్యాకగానీ తెలియలేదు" అంది విలాసిని.

శరత్‌కి మైకం కమ్మినట్లయింది.

"థాంక్యూ విలాసినీ... నువ్వు నన్ను అర్థం చేసుకున్నావు. మనిద్దరం కలిస్తే సాధించలేనిదేముంది" అన్నాడు.

విలాసిని నవ్వింది.

ఆ తర్వాత అతనితో మరో పావుగంటసేపు

మధురంగా మాట్లాడి వెళ్ళింది.

శరత్ హాల్ టికెట్ తీసుకుని ఇంటికి వచ్చి చదువుకోవటం మొదలుపెట్టాడు. ఎట్లాగైనా మంచి మార్కులతో పాసవ్వాలని తపనగా చదువుతున్నాడు. రాత్రంతా నిద్ర మానేసి మరీ చదివాడు.

శరత్‌కి తెలియని విషయం వేరే ఉంది. విలాసిని యింటి పక్కనే ప్రభాకర్ అనే ఆగర్భ శ్రీమంతుడున్నాడు. విలాసిని అతనితో పరిచయాన్ని పెంచుకుని, స్నేహంగా మార్చుకుని, ప్రేమవరకూ తెచ్చింది. అపుడు అతన్ని పెళ్లి చేసుకోమని అడిగింది. కష్టపడందే సాహసించనిదే ఏదీ దక్కదని నమ్మిన మనిషి కాబట్టి అతనితో సినిమాలూ, షికార్లూ తిరిగింది. అతన్ని ఆకర్షించటానికి అన్ని ప్రయత్నాలూ చేసింది.

కానీ తాను శరత్‌కి ఏ సమాధానం యిచ్చిందో అట్లాంటి సమాధానమే ప్రభాకర్ నుంచి లభించిందామెకు.

విలాసిని, ప్రభాకర్‌లు చనువుగా తిరుగుతుండగా చూసిన వాళ్ళు ఆమె తండ్రి చెవిన వేశారా విషయం. ఆయన విలాసినిని గట్టిగా మందలించాడు. ప్రభాకర్ ఆమెని పెళ్ళి చేసుకోనని అన్నాడని తెలిశాక ఆయన అగ్గిమీద గుగ్గిలంలా అయాడు.

"ఛీ... అందరికీ తెలిసిపోయింది. నా పరువు తీశావు కదుటే... యిక నీకు పెళ్లి చెయ్యటం నావల్ల కాదు. అన్నీ బాగున్న పిల్లకే లక్షలు కట్నం అడుగుతున్నారు. ఇక యిట్లాంటి మచ్చవచ్చాక మరింత అడుగుతారు. ఎక్కడ్నుంచి తెచ్చి చావను" అంటూ తిట్టిపోశాడు.

విలాసిని తల్లి కూడా తలవాచేట్లు చివాట్లు పెట్టింది. "తిరిగితే తిరిగావు. మరీ ఊరందరికీ తెలిసేట్లు తిరుగుతావుటే. అవ్వ... పెళ్ళి చేసుకుంటాడో లేదో అడిగి ఆ తర్వాత తిరుగుతావా? శుభ్రంగా తిరిగి ఆ తర్వాత చేసుకోమని అడుగుతావా? మీ నాన్న కోపం నీకు తెల్సుగా. ఆయన నీకింక పెళ్ళి సంబంధం చూడడు. ఎట్లాగే పిచ్చితల్లీ. నీకు ఈ జన్మకి పెళ్ళి కాదు" అంది ఆమె.

విలాసినికి తల తిరిగింది.

"అమ్మా... ప్రభాకర్ పోతేపోయాడు. శరత్ అని మా క్లాసులో ఓ అబ్బాయి ఉన్నాడు. మన కులమే. అతను నన్ను చేసుకుంటానని ఒకటే అడుగుతున్నాడు. పోనీ అతన్ని చేసుకోనా"

"మెల్లగా చెపుతావేం. యింక ఆలస్యం ఎందుకు. ఆ శరత్‌నే చేసుకో. నా మాట విను. మీ నాన్నకి డబ్బంటే ప్రాణం. కట్నం ఇచ్చి చెయ్యాలంటే బాధ. ఏదో ఒక వంకపెట్టి నీ పెళ్ళి ఎగ్గొడదామని చూసినా చూస్తాడు. వెంటనే ఆ శరత్‌ని అడిగి పెళ్ళి చేసేసుకో" అంది ఆ తల్లి.

విలాసిని అక్కని స్కూల్ ఫైనల్‌లో ఉద్యోగం మాన్పించి టైపూ షార్ట్‌హాండూ చెప్పించి టైపిస్టుగా ఉద్యోగం వచ్చేట్లు చేశాడు తండ్రి. ప్రతినెలా ఠంచన్‌గా జీతం తీసేసుకుని ఆవిడ ఖర్చులకి డబ్బు కొద్దిగా ఇచ్చేవాడు. ఆ తర్వాత ఇంకేమీ పట్టించుకోని తండ్రిని పెళ్ళి చెయ్యమని అడగటానికి మొహమాటపడి, చివరికి తన ఆఫీసులోనే పని చేస్తున్న కొలీగ్‌ని ప్రేమించి, పెళ్ళి చేసుకుని ఆ యింటి నుంచి బయటపడింది.

ఇప్పుడు తండ్రి తనను ఆ అక్కకి వారసురాలిని చెయ్యడు కదా.

విలాసిని గుండె గుభేలుమంది.

"సినిమా హీరోలాంటి మొగుడు లేకపోతే పోయాడు, అసలు మొగుడంటూ ఒకడేడిస్తే వాడ్నే తనక్కావల్సినట్లు మలచుకోవచ్చు. జుట్టంటూ ఉంటే కొప్పు చుట్టుకోవచ్చు, వాల్జడ వేసుకోవచ్చు, విరబోసుకోవచ్చు, మనకు కావల్సినట్లు అలంకరించుకోవచ్చు. అసలు జుట్టే లేకపోతే ఎలా. అలాగే మొగుడంటూ శరత్ దొరికితే అతన్నే ప్రోత్సహించి బాగుపడేట్లు చేయొచ్చు. పెద్ద ఉద్యోగం సంపాదిస్తావా చస్తావా అని కూర్చుంటేసరి, చచ్చినట్లు పరీక్షలకి చదివి మంచి ఉద్యోగం సంపాదించేస్తాడు" అనుకుంది.

అందుకే శరత్‌కి తన అంగీకారం తెలిపింది. ఇంకేం! పరీక్షలు ఉత్సాహంగా రాశాడు శరత్.

చివరి పరీక్ష రోజున రాఘవతో చెప్పాడు, "నేను విలాసినిని పెళ్ళి చేసుకుంటున్నాను" అని.

రాఘవ అదిరిపడ్డాడు.

"ఏ విలాసిని, మన క్లాస్‌మేట్ విలాసినేనా"

"అవును"

"శరత్... నువ్వు నా ప్రాణ స్నేహితుడివి. నువ్వు అనవసరంగా యిబ్బందుల పాలవటం నేను సహించలేను. విలాసిని గురించి చాలా విన్నాను. కళ్ళారా చూశాను కూడా. వాళ్ళ పక్కింటి ప్రభాకర్‌తో చాలా క్లోజ్‌గా మసులుకునేది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకున్నారట కూడా. ఆ సంగతి నీకు చెప్పిందా"

"లేదే" ఆశ్చర్యంగా అన్నాడు శరత్.

"చూశావా... అందులోనే ఆమె ద్రోహ చింతన, వంచన కనిపించటం లేదూ. ప్రభాకర్ ఆమెని చేసుకోనన్నాడని విన్నాను, ఆ సంగతి కప్పిపుచ్చి యిక్కడ నీతో నాటకం ఆడుతున్నట్లుంది"

"రాఘవా!లోకం ఎన్నో చెప్పుకుంటుంది. నేనవన్నీ నమ్మను"

"లోకం సంగతి సరే... నేను చెప్పినా నమ్మవా" కోపంగా అడిగాడు రాఘవ.

"నమ్ముతాను... విలాసినిని అడిగి చూస్తాను. అయినా ఆమె చేసిన దాన్లో నాకేం తప్పు కనిపించటం లేదు. ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి ప్రేమించటం, పెళ్ళి చేసుకోవాలనుకోవటం నేరం కాదుగా"

"కాదు... కానీ ఆ పురుషుణ్ణి ప్రేమించిన సంగతీ, చనువుగా తిరిగిన సంగతీ దాచి పెట్టి, ఈ యింకో పురుషుణ్ణే ప్రేమిస్తున్నట్లు నటించడం ఉంది చూశావూ... ఇది మాత్రం తప్పకుండా ద్రోహమే. విలాసిని గురించి నాకు బాగా తెల్సు. నీకు రూఢిగా కావాలంటే ఒక రుజువు కూడా చూపిస్తాను. ఇవాళ సాయంత్రం పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్దాం. విలాసిని అక్కడ రంగరాజుని రోజూ కలుసుకుంటోంది. మనిద్దరంఆవిణ్ణి అనుసరిద్దాం. నీ కళ్ళతో నువ్వే చూసి నిజం ఏమిటో గ్రహించాకే ఒక నిర్ణయానికి రా" అన్నాడు రాఘవ.

"సరే" అన్నాడు శరత్.

రాఘవ తన ప్రాణమిత్రుడు, తనకు మేలు జరగాలని కోరుకునే మనిషి. ఏదో లేంది అతను ఇంతింత మాటలనడు.

ఆ సాయంత్రం పబ్లిక్‌గార్డెన్‌లో... విలాసినీ, రంగరాజూ చెట్టాపట్టాలేసుకుని నడుస్తున్నారు.

రంగరాజు విలాసిని తండ్రి సొంత ఊరు నుంచే వచ్చాడు. అక్కడ అతనికి పాతిక ఎకరాల సుక్షేత్రం ఉంది. అతని తల్లి దగ్గర వీశె బంగారం ఉంది. బాంకుల్లో డబ్బు ఉంది. అతని తల్లితండ్రులకు అతనొక్కడే కొడుకు.

ఇంత ఆస్తి ఉన్నా ఉద్యోగం పురుషలక్షణం అని తండ్రి పలుకుబడితో ఆఫీసర్ ఉద్యోగం సంపాదించాడు. ఆ ఉద్యోగంలో జాయినయ్యి ఓ వారమే అయింది.

విలాసిని తండ్రితో ఉన్న కొద్ది పరిచయాన్ని పురస్కరించుకుని చూసి పోదామని ఒకసారి వాళ్ళింటికి వస్తే విలాసిని తన మధురమైన మాటలతో అతనితో ఇట్టే పరిచయం పెంచుకుని పార్కులో షికార్లదాకా తెచ్చింది.

రంగరాజుకి పెద్దగా ఆశలు లేవు. ఏదో చూడ్డానికి బాగుండి, షోగ్గా తిరిగి యింగ్లీషులో మాట్లాడి స్టైలుగా ఉండే పట్నవాసం అమ్మాయిని చేసుకోవాలని మాత్రం ఉంది. ఆ లక్షణాలన్నీ విలాసినిలో ఉన్నాయి.

శరత్, రాఘవ కలిసి ఆమెకి ఎదురువెళ్ళారు. విలాసిని తడబడలేదు.

"హలో... మీరూ వచ్చారా" అంటూ అతి మామూలుగా పలకరించింది.

"వీళ్ళిద్దరూ మా క్లాస్‌మేట్స్" అని చెప్పి "ఈయన రంగరాజుగారనీ మా నేటివ్ ప్లేస్ నుంచి వచ్చారు. ఊరు చూపించమంటే తీసుకు వచ్చాను" అంది ఒకరికొకర్ని పరిచయం చేస్తూ.

రంగరాజు సరదాగా మాట్లాడాడు.

శరత్‌కి ఏమీ పాలుపోలేదు. ఎవర్ని నమ్మాలో తెలియలేదు. కొంచెంసేపు కూర్చుని వచ్చేశారిద్దరూ.

"ఆ రంగరాజుతో నువ్వూ ఆవిడా ప్రేమించుకుంటున్నారని చెప్పాల్సింది. అప్పుడు ఎట్లా రియాక్ట్ అయ్యేవాడో" అన్నాడు రాఘవ.

"చెప్పి ఏం లాభం"

"లాభం ఎందుకు లేదు. ఒకవేళ అతనికి ఆవిణ్ణి పెళ్ళి చేసుకోవాలని ఉందనుకో. అప్పుడు బయటపడి పోయేవాడు. ఆవిడ అతనితో

ఎట్లా ప్రవర్తిస్తున్నదో దాన్నిబట్టి మనకు తెలి సేది''

''ఏమో... నాకైతే యిదంతా పరమ చిరాగ్గా అనిపిస్తోంది. ఇది ప్రేమా లేక యుద్ధమా. ఎత్తులూ, జిత్తులూ, ఎత్తుకి పై ఎత్తులూ నాకు చేతకావు. రేపే విలాసినిని గట్టిగా అడిగేసి నా అనుమానాలన్నీ తీర్చుకుంటాను'' అన్నాడు శరత్.

''ఆ పని చెయ్యి'' అన్నాడు రాఘవ.

మర్నాడే శరత్ విలాసిని యింటికి వెళ్లాడు.

సాయంత్రం నాలుగు గంటలవుతోంది అప్పుడు. విలాసిని యింట్లోంచి పురోహితుడు వస్తున్నాడు. లోపల కొద్దిగా హడావిడిగా ఉంది.

పది నిమిషాలు గడిచాక విలాసిని వచ్చింది.

''హలో... ఎంత సేపైంది వచ్చి. లోపల రిలేటివ్స్ ఉన్నారు'' అంది.

గులాబీ రంగు మైసూర్ జార్జెట్ చీరె, జాకెట్టు ఆమె అందాన్ని ఇనుమడింపజే శాయి. మెళ్ళో ఎర్ర రాళ్ళ లాకెట్ గొలుసు, తలనిండా పూలు...

''ఏంటి విశేషం... స్పెషల్గా కనిపిస్తు న్నావు'' అన్నాడు శరత్.

''నాకూ రంగరాజుకీ పెళ్ళి... యిప్పుడే పురో హితుడొచ్చి ముహూర్తం పెట్టి వెళ్ళాడు'' అంది విలాసిని తడుముకోకుండా.

శరత్ నివ్వెరపోయి చూశాడు.

''విలాసినీ... ఏమిటీ అన్యాయం.... మొన్న నేగా నన్ను చేసుకుంటానని చెప్పావు'' అన్నా డు హీనస్వరంతో.

''పరీక్షలముందు నిరాశతో బాగా చదవక కెరీర్ పాడు చేసుకుంటావేమోనని అలా చెప్పా ను. నేను నిన్ను మంచి స్నేహితుడిలా భావించాను. అందుకే ఆమాత్రం సాయం చెయ్యటం నా కర్తవ్యం అనుకున్నాను. దానికి నువ్వు కృతజ్ఞతలు చూపాలి. అంతేగానీ అనవ సరంగా అల్లరి చెయ్యాలని చూడకు... ఇంట్లో చుట్టాలున్నారు. గొడవ చెయ్యకుండా వెళ్ళు... ఊఁ...'' అన్నది విలాసిని.

చేసేది లేక బయటకి వచ్చాడు శరత్.

తనకి గొడవ పడటం యిష్టం ఉండదు. ఈ మెతకతనం కనిపెట్టే విలాసిని తనను వెర్రివె ధవని చేసి ఆడించింది.

తను ఆమెకి ఒక స్పేర్టైర్లా ఉపయోగప డ్డాడు. ఎవరూ దొరకనపుడు తనతో ప్రేమ నటించింది. ప్రభాకర్ కనబడగానే తన్ని వది లించుకుంది. ప్రభాకర్ వద్దుపొమ్మనగానే మళ్ళీ తనను రమ్మంది. రంగరాజు కనబడ గానే తనని తన్ని తరిమేసి అతన్ని పట్టు కుంది.

ఛీ... ఏం ఆడది.

అతనికి విలాసిని అంటే అసహ్యం వేసింది. అసలు ఆడజాతి మీదే అనుమానం కలిగింది. తనమీద తనకే జాలిపుట్టింది. అవ మాన భారం, ఏదీ చెయ్యలేని నిస్సహాయత కలిసి అతన్ని కృంగదీశాయి.

అంతవరకూ ఎప్పుడూ తాగని వాడికి మొ దటిసారిగా తాగుదామనిపించింది. ఇంట్లో కట్టుబాట్లు, సంప్రదాయం అంటూ కట్టడిచేసి తాగటం తప్పనే భావన కలిగించారుగానీ యిప్పుడు విలాసినిని మర్చిపోవటంకన్నా విలాసిని తనను చవటని చేసిందన్న నిజం మర్చిపోవటానికైనా తాగాలనిపించింది.

''రాఘవా... నన్ను మంచి బార్కి తీసుకెళ్ళ వూ... ప్లీజ్'' అన్నాడు బేలగా.

రాఘవ అంతా విని నిట్టూర్చాడు.

''చూడు శరత్... ఈ ప్రేమలూ, దోమలూ అంతా ట్రాష్. ఆ విలాసినినే నీ గురువుగా భావించు. జీవితంలో ఎవరూ ఎవరికీ శాశ్వతం కాదు. ఏదీ శాశ్వతం కాదు. మానవ సంబంధా లన్నీ స్వార్థమనే తాటితో బంధించబడి ఉన్నాయి. ఆ సంగతి నువ్వు చూసుకో. అదెవ రో, ఎవడ్నో పెళ్ళి చేసుకుంటోందని నువ్వు తాగి నీ ఒళ్ళూ, ఇల్లూ గుల్ల చేసుకుంటే ఏం ప్రయోజనం? నీకేం కావాలో నువ్వు తెలుసు కుని అది సాధించేందుకు ప్రయత్నించు. యిప్పుడు నువ్వూ నేనూ ఎట్లాంటి పరిస్థితిలో ఉన్నామంటే ఏదో ఒక ఉద్యోగం దొరికితే తప్ప మన బతుక్కి ఆధారం లేదు. ఆ ప్రయత్నం చెయ్యి. జీవితంలో సెటిల్ అయ్యాక కావలిస్తే తీరిగ్గా కూర్చుని ఏడవ్వచ్చు'' అంటూ హిత బోధ చేశాడు.

అతను చేసిన బ్రెయిన్ వాష్వల్ల శరత్ విలాసినిని మర్చిపోయాడు.



# బురదలో ఫుట్‌బాల్

ఆస్ట్రేలియాలోని డెర్బీ పట్టణంలో ఏటా జరిగే 'బాబ్ పండుగ సందర్భంగా గమ్మత్తయిన పోటీలు నిర్వహిస్తారు. ఆ పోటీలలో భాగంగా జరిగిన బురదలో ఫుట్‌బాల్ క్రీడ ఘట్టమిది. ఆ బాల్ కూడా అన్ని ఫుట్‌బాల్స్‌లాకాక కొబ్బరి బొండాం ఆకారంలో ఉండడం మరో ప్రత్యేకత. బురదలో పొర్లాడుతూ అందగత్తెలు బంతిని గోల్ చేయడానికి విజృంభిస్తుంటే ప్రేక్షకులు ఆనందంతో కేరింతలు కొడుతుంటారు. గడ్డాలు పెంచేపోటీ, చెవులు పగిలేలా అరవడంలో పోటీవంటి తమాషా పోటీలెన్నో ఆ పండుగ వేడుకల్లో నిర్వహిస్తారు.

సచిత్ర విచిత్రం

పదిహేను రోజుల తర్వాత రాఘవ ఆనందంగా వచ్చి ''గురూ... నీకో శుభవార్త'' అన్నాడు.

''ఏమిటి''

''విలాసిని రంగరాజుని చేసుకోవటం లేదు... కాదు కాదు... రంగరాజు విలాసినిని చేసుకోవటం లేదు''

''ఎందుకని'' ఆశ్చర్యంగా అడిగాడు శరత్.

''తాంబూలాలదాకా వచ్చిన పెళ్లి ఎందుకు ఆగిపోయింది?''

''రంగరాజు తల్లివచ్చి నానా గొడవా చేసిందిట. తన బిడ్డని మాయచేసి, మంత్రం వేసి పెళ్ళికి ఒప్పించారని అరిచి, రంగరాజుని ఉద్యోగానికి సెలవుపెట్టించి తీసుకెళ్ళిపోయిందిట. అక్కడే మంచి సంబంధం చూసి పెళ్ళిచేసి, పెళ్లాంతో సహా ఏకంగా కాపరానికి పంపిస్తుందట. విలాసిని చచ్చేట్లు ఏడుస్తున్నదట'' గబగబా చెప్పాడు రాఘవ.

''పాపం... ఈసారి కూడా విలాసిని ఫెయిల్ అయ్యిందా'' అన్నాడు శరత్. అతని మాటల్లో అవహేళన ఉందో, ఆనందం ఉందో రాఘవకి అర్థం కాలేదు.

''బాగా జరిగింది కదూ'' అన్నాడు రాఘవ.

''మనకెందుకు... పోనిద్దూ'' అన్నాడు శరత్.

''ఆవిడ బుద్ధి తెలిసిపోయిందిగా. ఇక జాగ్రత్తపడు. యింకే పక్షీ ఆవిడకి దొరక్కపోతే నవ్వుకుంటూ వచ్చి పలకరించి నిన్ను మళ్ళీ బుట్టలో వేస్తుంది. ఈసారి ఆమెతో మాట్లాడావంటే మాత్రం నీతో ఇహ ఈ జన్మలో మాట్లాడను. ఆమె పలకరిద్దామని చూస్తే మొహం తిప్పుకు వెళ్ళిపో. మాట్లాడావంటే చాలు మాయలోపడిపోతావు'' రాఘవ నవ్వుతూ అన్నాడు.

''సర్లే ఊరుకో... మళ్ళీ మన మొహం చూడదులే''

''అదే నా ఆశ కూడా. ఇంకెవడో భోగరాజు ఆవిడకి దొరకాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను'' రాఘవ పగలబడి నవ్వాడు.

రాఘవ తమాషాకి అన్నాడు తప్ప విలాసిని మళ్లీ ఏ మొహంతో వస్తుందనుకున్నాడు.

కానీ...

ఓ రోజు టైప్ ఇన్‌స్టిట్యూట్ నుంచి వస్తుండగా విలాసిని ఎదురై నవ్వుతూ పలకరించింది.

''బాగున్నావా శరత్. ఐ.ఎ.ఎస్‌కి చదువుతున్నావా? మన రిజల్ట్స్ ఎప్పుడు వస్తాయిట''అంది.

''బాగున్నానుగానీ నాకు అర్జెంట్ పనుంది వెళ్తాను'' అన్నాడు శరత్.

''వెళ్దువుగానిలే... అంత అర్జెంట్ పనేమిటి. నాకు చెప్పకూడదా'' అంది గోముగా.

శరత్‌కి చెప్పలేనంత అసహ్యం వేసింది.

''నీ పెళ్ళి ఎప్పుడు'' అన్నాడు. విలాసిని మొహం సీరియస్‌గా మారింది.

''అదో పీడకల శరత్. నేను నిన్ను మనసా, వాచా గాఢంగా ప్రేమించాను. కానీ మా నాన్నకి నన్ను బాగా డబ్బున్నవాడికే చెయ్యాలని ఉంది. ఆయన మొండిపట్టుమనిషి. ఆయనకి నచ్చచెప్పలేక నేను నువ్వంటే యిష్టం లేనట్లు నటించాను. అప్పటికీ, యిప్పటికీ, ఎప్పటికీ నా హృదయంలో నువ్వే ఉన్నావు'' అంది విలాసిని.

శరత్‌కి ఆమె మొహం మరి చూడబుద్ధి కాలేదు. గోడకట్టినట్లు అబద్ధాలు ఆడుతున్న ఆమెకి ఘాటుగా సమాధానం చెప్పాలి అనుకున్నాడు.

''రంగరాజుతో నీ పెళ్ళెప్పుడని అడుగుతే ఏమేమో మాట్లాడుతావేం'' అన్నాడు కటువుగా.

విలాసిని తెల్లబోయింది. గంగిగోవులాంటి శరత్ ఇంత కరుగ్గా మాట్లాడేసరికి తబ్బిబ్బై సమాధానానికి తడుముకుంది.

''ఆ పెళ్ళి కాన్సిల్ చేయించాను. రంగరాజంటే నాకు ఇష్టం లేదు'' అంది మెల్లగా.

''అలాగా... సరే నీ పెళ్ళి... నీ ఇష్టం. నాకు మాత్రం నీతో మాట్లాడాలంటే ఏంటోగా ఉంది. ఇంకెప్పుడూ నన్ను కలుసుకునేందుకుగానీ, మాట్లాడేందుకు గానీ ప్రయత్నించకు. మీ నాన్నగారు చెప్పినట్లు మరో డబ్బున్నవాడ్ని ఎవర్నో చూసి చేసుకో' అనేసి అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

విలాసిని అట్లాగే ఆశ్చర్యంగా చూస్తూ

ఉండిపోయింది. శరత్‌కింత తెలివి ఎట్లా పుట్టిందో అర్థం కాలేదామెకు.



తర్వాత అదంతా విని రాఘవ నవ్వాడు.

"పోన్లే... మంచి పని చేశావు. పెద్ద తనకే తెలివి ఉందనుకుంది కాబోలు" అన్నాడు.

"ఏంటో రాఘవా... ఆవిడ్ని చూశాక అసలు ఆడవాళ్ళ మీదే నమ్మకం పోయింది. పెళ్ళి అంటేనే అసహ్యం పుట్టింది" అన్నాడు శరత్.

"నీ సెలక్షన్ అట్లాగ ఏడిసింది. దానికి ఆడవాళ్ళనందర్నీ తప్పు పడతావేం. విలాసిని లాంటివాళ్ళు లక్షకి ఒకళ్ళుంటారేమో. నీ దురదృష్టం కొద్దీ ఆవిడ నీకు తటస్థపడింది" అన్నాడు రాఘవ. శరత్ మాట్లాడలేదు.

"ఇంకా నువ్వు అదృష్టవంతుడివి. పెళ్ళికి ముందే ఆవిడ నిజస్వరూపం తెలిసిపోయింది. అట్లాంటి వ్యక్తి నీ భార్య కాకపోవటం నిజంగా నీ అదృష్టం" అన్నాడు రాఘవ.

శరత్‌కి నిజమేనన్పించింది. విలాసినిని తన భార్యగా ఊహించుకుంటేనే భయంతోనూ, అసహ్యంతోనూ ఒళ్ళు జలదరించింది.

"ప్రేమ పెళ్ళిలో ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకుని మరీ పెళ్ళి చేసుకుంటారు కాబట్టి సుఖాంతం అవుతుందనుకున్నాను. నా ప్రేమ ఇట్లా అవుతుందనుకోలేదు" అన్నాడు శరత్.

"చెప్పానుగా మనిషి స్వార్థజీవి. ప్రేమ వివాహాల్లో మాత్రం పూర్తి అవగాహన, అర్థం చేసుకోవటం ఉంటాయనుకుంటున్నావా. తన అసలు రూపం బయటపెట్టకుండా తళుకుల, మెరుగుల రూపం మాత్రమే పెళ్ళికి ముందు దాకా చూపించి ఆ తర్వాత అసలు అవతారాలు తెలుసుకుని వాళ్ళు దుర్మార్గులని వీళ్లూ, వీళ్ళు మంచివాళ్ళు కాదని వాళ్ళూ ఒకళ్ళనొకళ్ళు దూషించుకుంటూ ఉంటారు. ఇట్లాంటి వాళ్ళని తెలిస్తే పెళ్ళి చేసుకునే వాళ్ళం కాదని అనుకుంటున్న ప్రేమ జంటలు కొందర్ని కళ్ళారా చూశాను. ప్రేమ పెళ్ళి అయినా, పెద్దలు కుదిర్చిన పెళ్ళి అయినా ఒకర్నొకరు అర్థం చేసుకుని అడ్జస్టవటంలోనే ఉంటుంది" అన్నాడు రాఘవ.

★ ★ ★

శరత్‌కి ఎల్‌డీసీగా గవర్నమెంటు ఉద్యోగమే వచ్చి వెంటనే చేరిపోయాడు. రాఘవ ఎం.ఏలో చేరాడు.

"ఉద్యోగం వచ్చిందిగా ఇంక పెళ్ళి చేసుకో" అంది తల్లి.

కాని శరత్ అనుభవాలు వేరు. గోవిందయ్య శరత్ మేనమామ. పెళ్ళాన్ని చూస్తే పులిని చూసినట్లు వణుకుతాడు. అర్థం పర్థం లేని ఆవిడ వాగుడంతా రామవాక్యం వింటున్నంత శ్రద్ధగా వింటాడు.

"అవునోయ్... నువ్వు చెప్పింది కరెక్ట్" అంటుంటాడు. చూస్తే అసలు ఈయన వింటున్నాడో లేదోనని అనుమానం వస్తుంది ఎవరికైనా.

చనువున్న వాళ్ళు అడిగితే నవ్వేస్తాడు.

"మా ఆవిడ ఉత్త అమాయకురాలు, పిచ్చిది. పాపం ఏం తెలీదు. ఏదో మాట్లాడుతుంది. మనం కాదంటే బాధపడుతుంది. అనవసరంగా ఆవిడ్ని బాధపెట్టేబదులు అవును అనేస్తే పోలా" అంటాడు. భార్య ఎదుట ఆమాట అనేధైర్యం మాత్రం లేదు.

అతని అలుసు చూసుకుందో, లేకపోతే నిజంగానే ఆవిడకి పనిరాదో కానీ పీసమెత్తు పనికూడా చెయ్యదు గోవిందయ్య భార్య. ఆవిడ పేరు సామ్రాజ్యమ్మ.

గోవిందయ్య పొద్దున్నే లేస్తాడు. పాలు తెస్తాడు. వంట చేస్తాడు. పిల్లలకి స్నానాలు చేయిస్తాడు. ఆ తర్వాత పెళ్ళానికీ, పిల్లలకీ తినిపించి వాళ్ళు తిన్నాక తను తిని ఆఫీసుకి

పోతాడు. ఇంటికి వచ్చాక మళ్ళీ చాకిరీ. పనిమనిషి మానేసిందంటే అంట్లు తోమటం, బట్టలు ఉతకటం, ఇల్లు ఊడవటం కూడా తను చెయ్యాల్సిందే. భార్య చూస్తూ కూర్చుంటుందే కానీ చచ్చినా పూచికపుల్ల కూడా యిటునుంచి అటు పెట్టదు. యింటిపనీ, వంటపనీ, ఆఫీసు పనీ, గోవిందయ్య కిక్కురుమనకుండా చేసుకుపోతుంటాడు.

అక్కడితో గోవిందయ్య పాట్లు పూర్తికావు. సామ్రాజ్యమ్మకి సినిమాల పిచ్చి ఉంది. కొత్త సినిమా వచ్చిందంటే చాలు ఆమెకి టిక్కెట్లు తెచ్చిపెట్టాలి. అది చాలనట్లు ఆవిడ అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములూ తరచూ వచ్చి తిష్టవేస్తారు. వాళ్ళందరికీ మర్యాదలు చెయ్యాలి.

మేనమామ ఇంటికి చిన్నప్పుడు బాగా వెళ్ళేవాడు శరత్. అత్తకి తను రావడం ఇష్టంలేదనీ, ఆవిడకి తనవైపు వాళ్ళొస్తేనే సంతోషంగా ఉంటుందనీ, గోవిందయ్యని నిత్యం కాల్చుకు తింటోందనీ అతను చిన్నతనంలోనే గ్రహించాడు.

మేనమామమీద ఉన్న ప్రేమవల్ల అతను చేసే బండచాకిరీ చూసి బాధపడేవాడు. ఆడవాళ్ళంతా యింతే అనిపించేది అతనికి.

ఇంట్లోకూడా తల్లికీ, నాయనమ్మకీమధ్య జరిగే యుద్ధంచూస్తే యింటికి రావాలంటేనే విసుగేసేది.

శరత్‌కి ఒక్క అక్కమాత్రం ఉంది. ఆవిడకి పెళ్ళయి చాలారోజులవుతోంది. ఆవిడకీ అత్తగారికీ పడదు.

ఇట్లాంటి సంసారాలు చూసిచూసి విసుగేసి పెళ్ళంటేనే ఒదోమాదిరి భయం పట్టుకుంది.

ఆఫీసు పరీక్షలన్నీ చేరిన ఏడాదిలోగానే పాసయ్యాడు. "యింక పెళ్ళి చేసుకోరా తండ్రీ. నాకు మాత్రం ఎవరున్నారు. నీ ఒక్కడికీ పెళ్ళిచేసేస్తే ఇంక కృష్ణారామా అనుకుంటూ హాయిగా ఉంటాను" అన్నది తల్లి శాంతమ్మ.

బోలెడుమంది సంబంధాల కోసం వచ్చిపోతున్నారు. ఏదో ఒకటి స్థిరం చేసేస్తే పోతుందనుకుంటోంది ఆవిడ.

ఆవిడ మరీ వత్తిడి చెయ్యటంవల్ల యింక శరత్‌కి తప్పింది కాదు.

"సరే నీయిష్టం" అన్నాడు.

శాంతమ్మగారు గ్రీన్‌సిగ్నల్ యివ్వగానే ఆడపిల్లలతరపువాళ్ళు వచ్చిపడ్డారు.

ముందుగా ముకుందంగారనే ఆయన వచ్చాడు. "మా పిల్ల రంగు బంగారం అంటే నమ్మండి. చెంపకి చేరడేసి కళ్ళుంటాయి. పెద్ద జడ" అంటూ అద్భుతంగా వర్ణించాడు.

వింటుంటేనే శాంతమ్మకి కడుపు నిండిపోయినట్టయింది.

"రేపు సాయంత్రం ఆరు గంటలకి ముహూర్తం బాగుంది, నేను వచ్చి మిమ్మల్ని తీసుకెళ్తాను" అన్నాడాయన.

"సరే" అన్నారు.

ఆ అమ్మాయి ఎంత బాగుంటుందో అనిపించింది శరత్‌కి. తనది సామాన్యమైన రూపం. ఆ అమ్మాయి ముందు తీసికట్టుగా ఉంటాదా? అసలే ఆడవాళ్ళు భర్త తమకన్నా అన్నింటిలో గొప్పగా ఉండాలని కోరుకుంటారుట. తనకన్నా రూపంలో తక్కువని ఆ అమ్మాయి తనని చులకన చేస్తుందా? అయినా చూశాక ఆ అమ్మాయి నెమ్మదస్థురాలో కాదో తెలిసిపోతుందిలే. మరీ అహంకారిలా అనిపిస్తే ఆ సంబంధం మానుకుంటేనే నయం... యిట్లా రకరకాల ఆలోచనలు వచ్చాయి.

మర్నాడు అన్నటైమ్‌కి ముకుందంగారు వచ్చేశారు. ముగ్గురూ వెళ్ళేసరికి యింటినిండా కిటకిటలాడుతూ మనుషులు.

"మా చుట్టాలందరికీ చెప్పేశాను యివాళ పెళ్ళిచూపులున్నాయని. పెళ్ళికొడుకుని చూస్తామని సరదాపడి వచ్చారు" అన్నాడాయన.

వాళ్ళందరినీ పరిచయంచేశాక గులాబ్ జామ్,మిక్సర్ యిచ్చి, కూల్‌డ్రింక్స్ తెచ్చారు.

"వద్దండీ... కతికితే అతకదంటారు" అంది శాంతమ్మ.

"అవన్నీ పాతకాలం మాటలండీ. ఈ రోజుల్లో అవన్నీ ఎవరు పట్టించుకుంటున్నారు" అన్నారు ముకుందంగారు.

వేళకానివేళ, టిఫిన్లూ, కూల్‌డ్రింక్‌లూ ఎందుకని ఎంత బతిమాలినా వాళ్ళు వినలేదు. తినమని చాలా బలవంతంచేశారు.

తప్పనిసరిగా తిన్నారు.

అక్కడ వాళ్ళందరూ ఆప్యాయంగా మాట్లా

ఢ్తున్నారు. వాళ్ళని చూస్తే శాంతమ్మకి ముచ్చటేసింది. వీళ్ళకి బంధుప్రీతి, అభిమానాలూ బాగా ఉన్నట్లున్నాయి. యిట్లాంటి వాళ్ళే దొరకాలని ఆవిడ కోరుకుంటోంది. శరత్ తరఫున ఉన్నది తనూ, తన కూతురు మాత్రమే. అందుకే భార్య తరఫునుంచైనా శరత్‌కి బంధు బలగం ఉంటే బాగుండనిపించింది ఆవిడకి.

అమ్మాయిని తీసుకువచ్చి ఎదురుగా కూర్చోబెట్టారు.

శరత్‌కి సిగ్గుగా, బెరుగ్గా ఉంది. కుర్చీలో కూర్చున్న ఆమెవంక చూడకుండా నేల చూపులు చూస్తున్నాడు.

"ఏమన్నా అడుగుతారా" అన్నారు ముకుందంగారు. ఎట్లాగో ధైర్యం తెచ్చుకుని మెల్లగా తలెత్తి ఆమెని చూడటానికి ప్రయత్నించాడు శరత్.

జరీఅంచు జార్జెట్ చీరెని, మెడలో మెరుస్తున్న బంగారు హారాన్ని ఒక్కొక్కటిగా చూస్తూ కళ్ళు ఆమె మొహంమీద నిలిపాడు.

అంతే...

కెవ్వున కేకవెయ్యబోయి తమాయించుకున్నాడు.

అమ్మాయి పచ్చటి పసుపు, పెద్దపెద్ద కళ్ళు, పొడుగైన జడ. నిజమే... కానీ... ఎత్తు పళ్ళు భయంకరంగా ఉన్నాయి. ఆపైన బుగ్గలు చొట్టలుగా అదోమాదిరి వికారంగా ఉన్నాయి. ముక్కు అతికించినట్లు ఉండి ఎందుకో భయాన్ని కలిగిస్తోంది.

శరత్‌కి ఆ అమ్మాయిని చూస్తూనే ముచ్చెమటలు పోశాయి.

వికారంగా ఉండటంలో ఆ అమ్మాయి తప్పులేదు. పుట్టుకతో వచ్చిన ఆకారానికి ఎవరూ ఏమీ చెయ్యలేరు.

కానీ మనిషిలో ఉన్న లోపాలగురించి ఏ మాత్రం చెప్పకుండా ఉన్న ఒకటిరెండు మంచి లక్షణాల్నీ ఘనంగా వర్ణించి వినేవారి మతిపోగొట్టి పెళ్ళిచూపులకి ఒప్పించటం ఎందుకు. చూసేవారు తమ కళ్లతోనే చూస్తారు కాబట్టి వారికి ఎవరూ ఏమీ చెప్పకుండా ఉంటేనే బాగుంటుందనిపించింది శరత్‌కి.

ఇంత చెప్పేబదులు ఆ అమ్మాయి ఫొటోగనక చూపించిఉంటే చచ్చినా ఈ పెళ్ళిచూపులకి వచ్చుండేవాడిని కాదనిపించిందతనికి.

అయినా అప్పుడూ ఊరుకునే వాళ్ళు కాదేమో. ఫొటోలో బాగా లేదుగానీ, చూడటానికి నిజంగా అద్భుతంగా ఉంటుంది. రండని చెప్పి పెళ్ళిచూపులకి ఒప్పించే వాళ్ళు. అసలు ఎందుకిలా మసిపూసి మారేడు కాయ చేయటానికి ప్రయత్నించాలి.

శరత్‌కి తనకేదో అన్యాయం జరుగుతున్నట్లు అనిపిస్తోంది.

ఎట్లాగో ఆ పెళ్ళిచూపుల తతంగం పూర్తయిందనిపించి లేచారు.

తల్లీ కొడుకుల మొహాల్లో మార్పులు పెళ్ళివారు ఏ మాత్రం గమనించినట్లులేరు, లేకపోతే గమనించి కూడా అలా నటిస్తున్నారో తెలీదు. వాళ్ళల్లో వాళ్ళు వరసలతో పిల్చుకుంటూ సరసాలు ఆడుకుంటూ సరదాగా నవ్వేస్తున్నారు. ఈ సంబంధం కుదిరిపోయినట్లే కబుర్లు చెప్తున్నారు.

ఏం చెయ్యాలో తోచక ముళ్ళమీద గడిపినట్లు గడిపి బయటపడ్డాక ఊపిరి పీల్చుకున్నారు యిద్దరూ.

వద్దన్నా వినకుండా ఆయన ఆటోతెచ్చి తనూ ఎక్కి కూర్చుని యింటివద్ద దింపాడు. ఆటోకి ఎంత మొత్తుకుంటున్నా వినకుండా తనే డబ్బులిచ్చి పంపాడు.

"ఎప్పుడు రమ్మంటారు. మంచిరోజు చూసుకుని నిశ్చయం చేసుకుందాం" అన్నాడు.

ఏం చెప్పాలో తెలీక శరత్, శాంతమ్మా మొహాలు చూసుకున్నారు.

"రెండ్రోజులు టైమ్ యివ్వండి. ఆలోచించుకుని మీకు ఏ సంగతీ చెప్తాం" అన్నాడు శరత్.

ఆయన సరేనని వెళ్ళిపోయాడు.

మూడోరోజు పొద్దున్నే వచ్చాడు.

ఈ లోపలే శరత్ తల్లికి ఖండితంగా చెప్పాడు ఆ అమ్మాయి తనకు నచ్చలేదని. ఆవిడకు కూడా నచ్చలేదు.

అయితే ఆమాట ఎట్లా చెప్పాలో తెలీక, "ఏం బాబూ... ముహూర్తం ఎప్పుడు పెట్టించను" అన్నాడు ఆయన మూడోరోజు వచ్చీరాగానే, మహోత్సాహంగా.

శరత్ యింక మొహమాటాన్ని వదిలిపెట్టా డు. యిది ఒకరోజుతో పోయే సమస్యకాదు సరిపెట్టుకుపోవటానికి. తన జీవిత సహధర్మ చారిణిని ఎన్నిక చేసుకోవటంలో తనకి పూర్తి స్వాతంత్ర్యం ఉంది. ఆ హక్కుని ఎవరూ కాదనరు.

"మాకు మీ అమ్మాయి నచ్చలేదండీ" అనే శాడు.

ఆయన తోకతొక్కిన తాచులా లేచాడు.

"ఏం నాయనా. మా అమ్మాయికి ఏం తక్కువైంది. లక్షణమైన పిల్లను చూపిస్తే చేసుకోవటానికి ఏం రోగం? నీ మొహం ఎప్పుడైనా అద్దంలో చూసుకున్నావా. మా అమ్మాయికి నువ్వు అసలు తగినవాడివి కాదు. నిన్ను చూడగానే నాకు నచ్చలేదు. కానీ తీరా వచ్చి వెనక్కుపోవటమెందుకని నీకు అమ్మాయిని చూపిస్తే నచ్చలేదంటున్నావా" అంటూ నానా మాటలూ అనటం మొదలెట్టాడు.

శరత్‌కి కూడా నిగ్రహం నశించింది.

"మీరు ఎక్కువ మాట్లాడకండి. తండ్రిగా మీరు మీ అమ్మాయి మంచికోరే వాళ్ళయితే యిట్లా చెయ్యరు. పెళ్ళికావటం కాదు, అయ్యాక వాళ్ళు ఎలా ఉంటారన్నది ముఖ్యం. మాటల గారడీతో పెళ్ళి చేసినా ప్రయోజనం ఉండదు. యింకనైనా కోతలు కోయకుండా ఉన్నదున్నట్లు మాట్లాడటం నేర్చుకుంటే మీకే మంచిది" అనేశాడు.

ఆయన కొద్దిగా తగ్గాడు.

"మరి మా బంధువులందరికీ ఈ పెళ్ళి కుదిరినట్లేనని చెప్పేశాను. వాళ్ళకేం సమాధానం చెప్పను" అన్నాడు.

"అది మీరు ముందే ఆలోచించుకోవాల్సింది. కేవలం పెళ్ళిచూపులకి వస్తామన్నంత మాత్రాన సంబంధం కుదిరిపోయినట్లేనని యింత అనుభవం ఉండి కూడా మీరెలా చెప్పారో అర్థంకావటం లేదు" అన్నాడు శరత్.

"పోనీ యింకొన్ని రోజులు టైమ్ తీసుకుని బాగా ఆలోచించుకోండి. మీరు కోరినంత కట్నం, స్కూటర్ కూడా యిస్తాను. పెళ్ళయ్యాక మిగతా ముద్దుముచ్చట్ల కేలోపం రానివ్వను" అన్నాడాయన.

"మహాప్రభో మాకేవీ అక్కర్లేదు. నాకు మీ సంబంధం వద్దు. దయచేసి వెళ్ళిరండి" అన్నాడు శరత్.

ఎంత చెప్పినా ఆయన అదేసోది చెప్పుకుంటూ పోవటంతో చిరాకేసి కొంచెం కటువుగానే అన్నాడామాట!

ఆయన గంయ్యిమని లేచి నానా తిట్లూ తిట్టాడు. శరత్‌కి పుట్టగతులుండవన్నాడు. చివరికే కోతిలాంటి అమ్మాయినో, చేసుకోకపోతే చెవికోయించుకుంటానన్నాడు. యిట్లా వి(ర్రవీ)గిన వాళ్ళందరికీ అలాంటిగతే పట్టడం తను ఎన్నో కేసుల్లో చూశానన్నాడు. శరత్, శాంతమ్మ కిక్కురుమనకుండా కూర్చున్నారు.

యిదెక్కడి గొడవరా బాబూ అనిపిస్తోంది. కానీ ఏం చెయ్యాలి? ఎదురుతిరిగి ఏమన్నా అనొచ్చుగానీ ఆయన మరింత రెచ్చిపోయి యింకాస్త తిడతాడు. అందుకని అరిచి అరిచి నోరు నెప్పెడితే ఆయనే పోతాడులే అని నోరు మూసుకుని కూర్చున్నారు.

ఆ గొడవకి చుట్టుపక్కల వాళ్ళంతా కిటికీల్లోంచి చూస్తున్నారు.

ఆయన వెళ్ళిపోగానే పక్కింటి పిన్నిగారు తలుపు తీసుకుని వచ్చారు, "ఆయనెవరు శాంతమ్మా" అంటూ! అంతా శ్రద్ధగా విన్న ఆవిడకి జరిగిందేమిటో శుభ్రంగా బోధపడింది. అయినా కావాలనే తెలియదన్నట్లు అడిగింది.

శాంతమ్మ చెప్పింది.

"మరీ అఘాయిత్యం మనిషిలా ఉన్నాడు. అయినా మీరు కూడా అన్నీ నచ్చాకే పెళ్ళిచూపులకి వెళ్ళాలి శాంతమ్మా. పాపం చూపులకి కూర్చునే అమ్మాయిలకి ఆశలుంటాయిగా. వాళ్ళ ఉసురు తగలకూడదు" అన్నదావిడ.

శరత్ ఊరుకోలేదు.

"మరి మాకూ ఆశలూ, ఆశయాలూ ఉంటాయిగా, మా ఉసురు వాళ్ళకి తగలదా" అన్నాడు.

"ఇట్లా మాట్లాడితే ఎవరేం చెప్పగలరు" అన్నట్లు ఒక్క చూపు చూసి ఆవిడ వెళ్ళిపోయింది.

"మనలో దోషంలేదు. ఆయన మాటలు ఆయనకే కొడతాయి. ఆడలేక మద్దెల ఓటని అన్నట్లు మనం కాస్త మెత్తగా కనిపించేసరికి మన నెత్తి నెక్కుదామని చూశాడు. ఆయన

పాపాన ఆయన పోతాడు. యిక నుంచీమాత్రం ముందే ఆపిల్ల ఫొటోచూసి, వీలైతే వాళ్ళకి చెప్పకుండా పిల్లనికూడా చూసి ఆ తర్వాతే పెళ్ళిచూపులకి వెళదాం'' అన్నది శాంతమ్మ.

''అంతే'' అన్నాడు శరత్.

రెండోరోజుకి యింకో సంబంధం వచ్చింది. అమ్మాయి చాలా బాగుంటుందిట. ఫొటో కూడా చూపించారు. కట్నం కావల్సినంత యిస్తామన్నారు. శాంతమ్మ కట్నం వద్దంటే వింతగా చూసి పోన్లే మీ యిష్టం అన్నారు.

పెళ్ళిచూపులకి వెళ్ళారు.

కాస్త ఉన్నవాళ్ళలాగే ఉన్నారు వాళ్ళు. యిల్లు అందంగా సర్దుకున్నారు. మర్యాదలు బాగా చేశారు.

వద్దు మొర్రో అన్నా వినకుండా స్వీట్లూ హాట్లూ ప్లేటునిండా తెచ్చి తినమని బలవంతం చేశారు.

ఫలహారాలు పూర్తయ్యాక ఆ అమ్మాయి వచ్చింది. గదిలో మెరుపు మెరిసినట్లు అనిపించింది.

ఆ అమ్మాయి చాలా చాలా బాగుంది. అందానికి తగ్గట్లు భేషుగ్గా అలంకరించుకుంది.

బుగ్గలకి, పెదవులకీ, కళ్ళకీ రంగు. జుట్టు లేటెస్ట్ స్టైల్‌లో దువ్వి పోనీటైల్ కట్టింది. నిజం చెప్పాలంటే ఆ అలంకరణ ఏదీ లేకున్నా ఆ అమ్మాయి చాలా బాగుంటుంది. అనిపించింది. ఆ రంగులూ మెరుగులూ వికారంగా లేవు. ఆ అలంకరణతో ఆ పిల్ల అందం ఇనుమడించింది. చీరె కట్టులో, జాకెట్టులో అన్నింటిలో అదోమాదిరి అందం, చూస్తే కళ్ళు తిప్పుకోవటం కష్టం.

ఆ అమ్మాయిని చూడగానే శరత్ ముందు మాట్లాడలేకపోయాడు. అద్భుతంగా గీసిన చిత్రంలా అనిపించిందామె అతని కంటికి.

అతని చూపుల్లోని ప్రశంస గమనించి ఆ పిల్ల గర్వంగా తల ఎగరేసింది.

శాంతమ్మ గతుక్కుమంది అది చూడగానే.

ఆ అమ్మాయి అణువణువునా అందంతోపాటు గర్వం, అదోమాదిరి నిర్లక్ష్యం కనిపిస్తున్నాయి.

''నీ పేరేంటమ్మా'' అంది శాంతమ్మ.

''మా డాడీ చెప్పే ఉంటారుగా'' అందామె నవ్వుతూ. ఈసారి యింకా గర్వంగా తల విదిలించింది.

ఆ అమ్మాయి తల్లిదండ్రులు అదో జోక్ అయినట్లు నవ్వుతున్నారు.

శాంతమ్మకి యింకేం అడగాలన్నా భయంవేసి మాట్లాడకుండా ఊరుకుంది.

''మీరేమన్నా అడగండీ'' అన్నాడు ఆ అమ్మాయి తండ్రి శరత్‌తో.

శరత్ బెరుకుగా చూశాడు.

ఏం అడగాలో తెలీలేదు.

చివరికి పెగిలించుకుని గొంతు విప్పాడు. ''ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నారా'' అన్నాడు.

ఆమె చురుగ్గా చూసింది.

''అనుకోవటం లేదండీ... ఆఫ్టరాల్ వస్తే మాత్రం ఎంత జీతం వస్తుంది. నా కాస్మెటిక్స్‌కి అయే ఖర్చుకూడా రాదు'' అన్నది.

''అవునండీ... ఆ మాత్రం జీతంకోసం ఒళ్ళు హూనంచేసుకుని ఉద్యోగం ఎందుకు చెయ్యాలండీ'' అన్నాడామ్మాయితండ్రి!

శరత్‌కి ఉద్యోగంచేసే అమ్మాయే కావాలని లేదు. అసలు ఆ అమ్మాయిని ఎందుకు ఆ ప్రశ్న వేశాడో కూడా తెలీదు. కానీ ఒకటి మాత్రం అర్థమైంది. ఆ అమ్మాయి కాస్మెటిక్స్‌కి వందలకొద్దీ ఖర్చుపెడుతుంది.

ఆ నిర్లక్ష్యమూ, తల ఎగరెయ్యటమూ, వెక్కిరిస్తున్నట్లు నవ్వటం యివన్నీ చూస్తే తలనెప్పిగా ఉంది.

భార్యను షోకేసులో బొమ్మలా గొప్పగా ప్రదర్శించుకోవాలనుకునే వాళ్ళకు ఆ అమ్మాయిని భరించటం చేతవుతుందేమో కానీ తనవల్ల మాత్రం కాదు.

ఇంక ఏ ప్రశ్నా అడక్కుండా మౌనంవహించాడు.

''అమ్మాయిని లోపలికి తీసుకెళ్ళమా. యింకేమన్నా అడగాలా'' అన్నాడు తండ్రి.

''తీసుకెళ్ళండి'' అన్నది శాంతమ్మ.

ఆ అమ్మాయి లేచి శరత్‌ని ఒక్కసారి చూసింది. ఆ చూపులో వెర్రివెధవా నీకు నేను నచ్చకేం అవుతాన్లే అన్న భావం కనపడింది శరత్‌కి.

లేచి, మళ్ళీ తల ఎగరేసేసరికి జుట్టు అందంగా ఎగిరి ఆమె భుజంపై పడింది. అది సర్దుకుంటూ అందంగా లోపలికి నడిచింది.

ఆ అమ్మాయి లోపలకు వెళ్ళగానే తల్లీ తండ్రీ మొదలుపెట్టారు. ఎంతోమంది క్యూలో నిలబడి మీపిల్లను మాకివ్వండి అని బతిమాలారుట. కానీ ఆయనకి యివ్వాలన్పించలేదుట. డబ్బుదేముంది, కాస్త నెమ్మదైన వాడు దొరికి పిల్లను బాగా చూసుకుంటే చాలు గుమస్తాకైనా యిచ్చేద్దామని శరత్ సంబంధంకోసం వచ్చామని చెప్పాడాయన.

ఆయన గొప్పగా చెప్పుకుంటున్నవి నిజమే కావచ్చు. ఆ అమ్మాయిని ఎవరన్నా చేసుకుంటారు, సందేహంలేదు. కానీ ఆయన 'గుమస్తా' అన్న పదాన్ని నొక్కిచెప్పి తనకేసి చూసిన చూపు శరత్ భరించలేకపోయాడు.

ఇంటికి వచ్చాక శాంతమ్మ అంది, "నీ అభిప్రాయం ఏమిటి? నీకిష్టమైతే సరేనని చెపుదాం. నాకు మాత్రం కాస్త భయంగా ఉంది ఎందుకో" అన్నది.

"నాకు మరీ భయంగా ఉంది. ఆ అమ్మాయికి నేను తగను. నా బోటి 'గుమస్తా'గాడికిచ్చి ఆ అమ్మాయి కాస్మొటిక్స్ కొనటానికి కూడా కటకట పడేట్లు చెయ్యాలని చూస్తున్న ఆ పిల్లతండ్రిని చూస్తే నాకు అసహ్యంగా ఉంది కూడా. ఆయనవస్తే మేము మీ సంబంధానికి తూగలేం అని చెప్పెయ్యి" నవ్వుతూ అన్నాడు శరత్.

శాంతమ్మకి కూడా నవ్వువచ్చింది.

"బాగా ఆలోచించుకో. పిల్ల బంగారం బొమ్మలా ఉంది. మళ్ళీ యిలాంటి సంబంధం దొరకదు" అంది శాంతమ్మ.

"ఆలోచించక్కర్లేదమ్మా. అసలు అక్కడే ఈ నిర్ణయానికి వచ్చాను. నువ్వుకూడా సందేహించకుండా చెప్పెయ్యి. యింక ఆ సంగతి ఆలోచించకు" అనేసి శరత్ బయటికి వెళ్ళాడు.

ఆ అమ్మాయి తండ్రి రాగానే శాంతమ్మ మెల్లగా తమ నిర్ణయం చెప్పింది.

భయపడ్డట్లుగానే ఆయన కాలరుద్రుడయ్యాడు. "ఎందుకు వద్దనుకుంటున్నారు" కోపంగా అడిగాడు.

శాంతమ్మ జవాబు చెప్పలేదు.

వాళ్ళ మౌనం ఆయన కోపాన్ని యింకాస్త పెంచింది.

"అసలు మీరిలా అంటారని నాకు ముందే తెలుసు. మొన్న ముకుందంగారు కనబడి చెప్పాడు. వాళ్ళు అందరి యిళ్ళకీ వెళ్ళి తిండికి మొహం వాచినట్లు ఫలహారాలు తినేందుకేగానీ పెళ్ళిచేసుకునేందుకు కాదయ్యా అన్నాడు. విన్నాను కాను. వాళ్ళింట్లో కూడా ఎగబడి స్వీట్లన్నీ ఖాళీచేసి చివరికి పిల్ల నచ్చలేదు పొమ్మన్నారట. అయినా ఏదో చెప్పున్నాడులే, నిజం కాకపోవచ్చునని అనుకుని మీ ఇంటికి వచ్చాను. తింటానికి కాకపోతే మీరెందుకు పెళ్ళిచూపులకి వచ్చినట్లు. మా అమ్మాయిలో మీకేం లోపం కన్పించింది. యిట్లా ఆడపిల్లల యిళ్ళకెళ్ళి శుభ్రంగా తిని రావటం తప్పని మీకనిపించటం లేదా" అన్నాడు బిగ్గరగా అరుస్తూ.

శాంతమ్మ జవాబు చెప్పటానికి యింకా సందేహిస్తోంది కానీ అప్పుడే వచ్చిన శరత్ మాత్రం అది విని కోపం పట్టలేకపోయాడు.

"మీరు మాట్లాడినదానికి వందరెట్లు ఘోరంగా మాట్లాడగలను,. వద్దని మొత్తుకున్నా వినకుండా స్వీట్లుపెట్టి పిల్లను అంటగట్టాలని చూశాడాయన. యింక మీ సంబంధం ఎందుకు నచ్చలేదో చెప్పమని నిలదీసి అడిగారు కాబట్టి చెప్తున్నాను. నాకు సాదాసీదా అమ్మాయి కావాలి. నాతో కలసిపోయి నా భార్యగా ఉండే అమ్మాయి కావాలి కానీ సినిమాస్టార్లా ఉండి నన్ను నిర్లక్ష్యంగా చూస్తుంటే నేను భరించలేను. మీ అమ్మాయిని ఏ కలెక్టరుకో మినిస్టర్‌కో యిచ్చుకోండి. నాబోటి గుమస్తాకి కాదు. మీ గొప్పలు తెలీక పెళ్ళిచూపులకి వచ్చాను మహాప్రభూ. నన్ను క్షమించండి. మీరు ఆ స్వీట్లకి ఎంత ఖర్చుపెట్టారో చెపితే అణాపైసల్తోసహా యిచ్చేస్తాను. దయచేసి ఆ డబ్బు తీసుకుని నన్ను వదిలిపెట్టండి" అన్నాడు నగం వెటకారం, నగం కోపంగా.

ఆయన కొరకొరా చూసి వెళ్ళిపోయాడు.

'అమ్మయ్య' అనుకుని చెరో గ్లాసూ మంచినీళ్ళు తాగారు.

"యింకమీదట వెళ్ళినచోట పచ్చిమంచినీ

ళ్ళు కూడా తాగకూడదు. యిదే మా ఆనవాయితీ అని చెప్పాలి. చచ్చినా వాళ్ళు పెట్టేవి తినకూడదు" గట్టినిర్ణయం తీసుకున్నారు.

యింకో సంబంధం చూశారు.

ఆ అమ్మాయి మరీ వికారంగా ఉంది.

ఆ మాటంటే బాగుండదని మాకు యిప్పుడే చేసుకోవాలని లేదండీ అన్నాడు శరత్ తప్పించుకోవటానికి.



వాళ్ళు గయ్యిన లేచారు.

"చేసుకోవాలని లేకుంటే పెళ్ళి చూపుల కెందుకు రావాలయ్యా" అంటూ చొక్కా చేతులు మడిచాడు ఆ అమ్మాయి మేనమామ.

బాబోయ్ అనుకుని ఆయనకేదో సర్దిచెప్పుకుని పంపేశారు.

ఎందుకిలా జరుగుతోందని ఆలోచించటం మొదలు పెట్టాడు శరత్.

అందరికీ యింతేనా, లేక తనకే యిట్లాంటి అనుభవాలు ఎదురవుతున్నాయా.

ఎక్కడుంది లోపం. తనలోనా. వాళ్ళలోనా "ఏమయ్యా. ఎన్ని సంబంధాలు చూస్తావు. మాకు పప్పన్నం పెట్టించేది ఎప్పుడు" అని ఎవరన్నా అంటే ఒళ్ళు మండిపోతోంది.

ఇప్పుడు ముందు పిల్ల వివరాలన్నీ కనుక్కుని, ఫొటోచూసిగానీ పెళ్ళిచూపులకి పోవటంలేదు. అయినా నచ్చిన సంబంధం దొరకటంలేదు.

ఇట్లాగ ఎన్నని చూడాలి.

తనూ మనిషే. తనకూ మానవత్వం ఉంది. పెళ్ళిచూపులంటూ వెళ్ళి ఒక ఆడపిల్లని పరీక్షగా చూడటం, ఏవో ప్రశ్నలడగటం యివన్నీ తనకు బొత్తిగా యిష్టంలేని విషయాలు. అయినా తనను అర్థంచేసుకునే వాళ్ళే కరువయ్యారు. నచ్చిన సంబంధం కుదరకపోవటం అటుంచి తనో కర్కోటకుడిగా ప్రచారం అయ్యే ప్రమాదం కూడా కనిపిస్తోంది.

"ఎన్నని చూస్తాం. ఏదో ఒకటి కుదిర్చేసుకుందాం. ఈసారి ఏ పిల్లని చూస్తానో ఆ అమ్మాయినే చేసుకుంటాను" అనేశాడు చివరికి.

"ఏం చేస్తాంరా. మనమేం రంభా ఊర్వశీ కావాలని అనటంలేదు. కట్నం, కానుకల ఆశ లేదు. ఏదో కాస్త కనుముక్కు తీరుండి, మంచి వాళ్ళైతే చాలని అనుకుంటుంటే ఆ మాత్రం సంబంధం కూడా ఎదురుపడటం లేదు. అయినా నువ్వు తొందరపడకు. ఏదో ఒకటి ఎందుకు కుదుర్చుకోవటం. మనకి నచ్చింది దొరికిందాకా ఎదురుచూద్దాం" అన్నది శాంతమ్మ.

తల్లికి ఏ సమాధానం చెప్పకుండా ఊరుకున్నాడు కానీ తను మాత్రం మనసులో గట్టి నిర్ణయం తీసుకున్నాడు శరత్. ఈసారి చూసే అమ్మాయి ఏ మాత్రం బాగున్నా చేసేసుకోవాలి. ఎన్నాళ్ళని ఈ పెళ్ళిచూపులు. విసుగెత్తిపోతోంది. పోనీ అంటే ప్రతీవాడూ ఏదో ఒక సంబంధం పట్టుకువచ్చి వర్ణించి చంపేవాడే. బ్రహ్మచారి అనగానే వాడికి ఎలాగోలా పెళ్ళిచేసేద్దాం అన్న ఆలోచన తప్ప మరోటి రాదేమో. పెళ్ళి ఎందుకు చేసుకోవాలో ఉపన్యాసాలు యిచ్చి పెళ్ళి మానుకుంటే ఉండే కష్టాలన్నీ చెప్పి ఊదరకొడతారు. పెళ్ళిచేసుకోవాలి నిజమే. అదే ప్రేమవివాహంలో అయితే ఈ పెళ్ళిచూపుల్లాంటి సమస్యలు ఎదురుకావు. కానీ తను అందులో ఘోరాతిఘోరమైన పరాజయాన్ని చవిచూశాడు.

సాధారణంగా పెళ్ళిసంబంధాలవాళ్ళు ఆదివారాలే వస్తుంటారు. వాళ్ళకూ శలవ ఉంటుంది కాబట్టి తీరిగ్గా వస్తారు. అట్లాగే పెళ్ళికొడుకు కూడా యింట్లోనే ఉంటాడు కాబట్టి వాడ్నీ చూడొచ్చు అన్నట్లు ఉంటుంది వాళ్ళరాక.

ఆ ఆదివారం సూర్యనారాయణగారని ఒకాయన వచ్చారు. ఆయనకి ముగ్గురు అమ్మాయిలు, ఇద్దరు అబ్బాయిలట. రెండో అమ్మాయికి పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాడు. మొదటి పిల్లకి పెళ్ళయి రాజమండ్రిలో ఉంటోందిట. రెండో అమ్మాయి బి.ఎ. చదువుతోందిట. చివరి సంవత్సరంలో ఉంది కాబట్టి పెళ్ళి చేసేయాలనుకుంటున్నాడుట. పిల్ల బాగానే ఉంటుందన్నాడు. కట్నకానుకలు యిచ్చుకోలేని పేదవాడినన్నాడు. మరీ పట్టుపడితే ఎంతో కొంత యివ్వకపోనన్నాడు. పెళ్ళిచూపులకి కావాలంటే ఆరోజే బావుంది రమ్మన్నాడు.

శాంతమ్మగారికి ఫర్వాలేదు వెళ్ళొచ్చు అనిపించింది. శరత్‌వైపు చూసింది.

అతను సరేనన్నట్లు తల ఊపాడు.

ఆ సాయంత్రం నాలుగు గంటలకి ఆ అమ్మాయిని చూసి రావటానికి వెళ్ళారు.

అమ్మాయి చూపులకి ఫర్వాలేదు. ఇంట్లో వాళ్ళూ మంచివాళ్ళలాగానే కనిపించారు. మర్యాదగా మాట్లాడుతున్నారు.

మర్నాడు ఆయన రాగానే సరేనని చెప్పారు. సూర్యనారాయణగారు సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయినట్లు కనిపించారు. నిజంగా యింత తేలిగ్గా సంబంధం కుదిరిపోవటం ఆయన ఎంతమాత్రం ఊహించని సంఘటన.

వెంటనే వెళ్ళి తాంబూలాలు పుచ్చుకోవటానికి, తేదీ నిర్ణయించటానికి సిద్ధాంతిని కలిసి వచ్చాడు.

"వచ్చేవారం బుధవారం రోజున పొద్దున్న పదకొండు గంటలకి బావుందన్నాడండీ. యిద్దరి జాతకాలూ చూపించాను. మూడువారాల్లో మంచి ముహూర్తం ఉందన్నాడు" అన్నాడు.

"మూడువారాల్లో అంటే కష్టమండీ. నేను పి.ఎఫ్. లోన్ అప్లై చెయ్యాలి. అది శాంక్షనై చేతికి రావాలి. ఆ తర్వాతే పెళ్ళి" అన్నాడు శరత్.

"అదేంటండీ. ఎక్కడైనా అమ్మాయి పెళ్ళికి లోన్లు తీస్తారుకానీ మొగపిల్లవాడి పెళ్ళికి లోన్లు

ఏమిటంటే. మూడువారాల్లో ఉన్న ముహూర్తం బ్రహ్మాండమైందిట. అప్పుడు గనక పెళ్ళి యితే వాళ్ళు జీవితాంతం చాలా హాయిగా ఉంటారుట. యింకేం చెప్పకుండా ఆ ముహూర్తానికి ఊ అనండి. నేను మరీ అంత హీనస్థితిలో లేను. అయిదువేలు కట్నం ఆనందంగా యిచ్చుకోగలను. అదిపెట్టి హాయిగా ఖర్చుపెట్టుకోండి'' అన్నాడాయన.

''వద్దండీ. కట్నాలు తీసుకోకూడదనే అనుకున్నాం. మా అక్కయ్య పెళ్ళికి మేము కట్నం డబ్బు సర్దలేక చాలా కష్టపడ్డాం. ఆ కష్టం ఏమిటో తెలిసుండీ యింకోళ్ళని అదే కష్టంపెట్టాలని నాకులేదు. మీరు కొన్నాళ్ళు ఆగండి'' అన్నాడు శరత్.

ఆయన బతిమాలి లాభంలేక వెళ్ళిపోయాడు. వెళ్ళగానే తన బావమరిది బ్రహ్మానందరావుని సలహా అడిగాడు.

''వెంటనే పెళ్ళి జరిపించటం మంచిది. అనుకోకూడదుగానీ మన ఆడపెళ్ళివాళ్ళంత కక్కుర్తిగాళ్ళు లేరనుకో. మొన్న నేను గుడివాడ సంబంధం చూసి పాతికవేలకి బేరం ఫిక్స్‌చేసుకొచ్చాను. ఈలోపల యింకోడు వెళ్ళి ముప్పై వేలిస్తానని వాడ్ని ఊరించి సంబంధం ఖాయంచేసుకుని పదిరోజుల్లో పెళ్ళి జరిపించి పారేశాడు. నేనింకా తాంబూలాలు పుచ్చుకునేందుకు మంచిరోజు వెతుకుతుండగానే వాడి పెళ్ళి శుభలేఖ వచ్చింది. అసలు గుడివాడ వెళ్ళి వాడ్ని చెడామడా కడిగేద్దాం అనుకున్నానుగానీ మళ్ళీ ఛార్జీలు దండగని మానుకున్నాను. అందుకని నేను చెప్పొచ్చేదేమిటంటే ఎవడన్నా చేసుకుంటానని అనగానే వెంటనే ముడి పెట్టి పారెయ్యాలి. మగపెళ్ళివాళ్ళున్నారు చూశావ్, అంతా కుక్కబుద్ధి అనుకో. యిజ్జో యిజ్జో అంటే యిటొస్తారు. జూ, జూ అని యింకోడు యింకాస్త మంచి సంబంధం చూపిస్తే అటుపోతారు'' అంటూ ఆయన ఆడపెళ్ళివాళ్ళనీ, మగపెళ్ళివాళ్ళనీ కలిపి తిట్టాడు.

సూర్యనారాయణకి కాళ్ళూ, చేతులూ ఆడలేదు. శరత్ అడిగిన టైమిస్తే నిజంగానే ఎవడో ఒకడు వచ్చి అతన్ని ఎగరేసుకుపోయే డేంజరుంది. నోటిమాటలకీ, తాంబూలాలకీ విలువేముంది. వాళ్ళు యింకో సంబంధం చూసేసుకుని చేసేసుకుంటే తనేం చెయ్యగలడు.

''నువ్వే ఏదో చెప్పి వాళ్ళను ఒప్పిద్దూ'' అని బతిమాలాడు.

''నాకుమాత్రం మేనకోడలుకాదా? నా కూతురు ఒకటీ నా అక్క కూతురు ఒకటీ కాదు. దాని పెళ్ళి భారం నేను తీసుకుంటాను. ఆ పిల్లాడ్ని ఒప్పించే బాధ్యత నాది'' అని నడుం బిగించాడు బావమరిది.

బ్రహ్మానందరావుది బ్రహ్మాండమైన బుర్ర. అతని మాటలు అమోఘంగా ఉంటాయి. ఆ నోరు తియ్యగా, ఘాటుగా, చేదుగా ఎలా కావాలంటే అలా మాట్లాడగలదు. ఎట్లాంటి మనిషినైనా మాటలతో లొంగతీయటం అతనికి వెన్నతో పెట్టిన విద్య.

మర్నాడు పొద్దున్నకల్లా యిద్దరూ శరత్ యింటికి చేరుకున్నారు.

యింట్లో శరత్ లేడు. పేపర్ రాలేదని బజార్లో కొనటానికి వెళ్ళాడుట. శాంతమ్మ ఒక్కతే ఉంది.

బ్రహ్మానందరావు తన మాటల మూట విప్పాడు.

''వదినగారూ! మీరు అమాయకులు. మీకు లోకంపోకడ తెలియటంలేదు. వయసులో ఉన్న కుర్రాడిని పెళ్ళిచేయకుండా వదిలేస్తే వచ్చే కష్టాలు మీకు తెలీటంలేదు. ఈరోజుల్లో ఆడపిల్లలు చాలామంది సిగ్గూశరం వదిలేసి మొగవాడు కనబడితేచాలు ఎగబడి పెళ్ళి చేసుకుపోతున్నారు. మనబ్బాయి మంచివాడే అనుకోండి. అయినా అవతలివాళ్ళు ఏదోలాగ ప్రలోభపెట్టి వలలో వేసుకుంటే మనం ఏం చెయ్యగలం చెప్పండి. అందుకని నా మాట విని వీలైనంత తొందరలో పెళ్ళి జరిపించెయ్యండి. అనక అబ్బాయి ఎవర్నో ఒకర్ని తీసుకొచ్చి నీ కోడలమ్మా అనేశాడంటే మీరెంత బాధపడ్తారు చెప్పండి. మీ మంచికోసం చెప్తున్నానుకానీ పెళ్ళి ఎట్లాగూ కుదిరాక యింకో నెల గడువుకి మాకేం అభ్యంతరం చెప్పండి. మా సూర్యనారాయణ బావ చెప్పింది దివ్యమైన ముహూర్తం. వాళ్ళు సుఖపడాలనిగాక మనకింకో ఆలోచనేముంటుంది చెప్పండి'' అంటూ బెదరగొట్టాడు.

శాంతమ్మకి అతని మాటలు వింటుంటే నిజమే అనిపించింది. శరత్ ఎవర్నో ఒకళ్ళని

చేసేసుకుని యింటికి తెచ్చినట్లు, తను నలుగురిలో చిన్నబోయినట్లు ఊహించుకుని నిజంగానే భయపడిపోయింది.

"ఏం చెయ్యమంటారు చెప్పండి. వాడు లోన్ శాంక్షనయ్యాకే పెళ్ళి అంటున్నాడు. మాదగ్గర డబ్బు లేక ఈ యిబ్బందులన్నీ" అన్నది.

"గవర్నమెంటు ఆఫీసుల్లో లోన్లు శాంక్షనయ్యాక పెళ్ళి అంటే పెళ్ళి మానక్కూర్చోవాలి వదినగారూ. మీకు తెలియందేముంది" అన్నాడు బ్రహ్మానందరావు.

శాంతమ్మ మాట్లాడలేదు.

"మీరు అంగీకరించండి చాలు. అబ్బాయిని నేను ఒప్పిస్తాను" అన్నాడు బ్రహ్మానందరావు.

"సరే... మీయిష్టం" అంది శాంతమ్మ.

శరత్ ఈలోపల పేపర్ కొనుక్కుని వచ్చాడు.

"ఈయనే పెళ్ళికొడుకు" పరిచయం చేశాడు సూర్యనారాయణ.

"చూడగానే అనుకున్నాను. బాబూ మా రాజేశ్వరి అదృష్టవంతురాలు. చక్కటి భర్త దొరుకుతున్నాడు" నవ్వాడు బ్రహ్మానందరావు.

శరత్ సిగ్గుపడ్డాడు.

శాంతమ్మ కాఫీలు తెచ్చింది.

"ఎందుకమ్మా" అంటూనే కాఫీలు అందుకున్నారు.

బ్రహ్మానందరావు శరత్‌మీద దండయాత్ర ప్రారంభించాడు.

"బాబూ... మీ అమ్మగారు కూడా వీలైనంత త్వరలో నీ పెళ్ళి చూడాలని ముచ్చట పడుతున్నారు. నువ్వు కట్నం తీసుకోకూడదని అనుకుంటున్నావని విని చాలా సంతోషపడ్డాను. ఈరోజుల్లో నీలాంటివాళ్ళు ఎక్కడున్నారు. పోతే నేను చెప్పొచ్చేదేమిటంటే నువ్వు కట్నం తీసుకోకు. కానీ పెళ్ళి వాయిదావెయ్యకు. పెద్దవాళ్ళం మా చాదస్తాలు మాకుంటాయి. మంచి ముహూర్తం దాటిపోనిస్తే మళ్ళీ అట్లాంటిది దొరకదు బాబూ. మాకేం ఆశలుంటాయి. మీరు సుఖంగా ఉండాలనితప్ప మాకు మరేం ఉంది. ఆ ముహూర్తానికే పెళ్ళి కానివ్వు. నీకు కట్నం వద్దంటే పోనీ అప్పుగా మా బావదగ్గర అయిదువేలు తీసుకో. నీకు లోన్ శాంక్షన్ కాగానే తీర్చేద్దువుగాని. నా మాట కాదనకు" అంటూ అనునయంగా మాట్లాడాడు. అలా ఆయన తన వాక్చాతుర్యం ప్రదర్శించి మొత్తంమీద శరత్‌ని ఒప్పించాడు.

ఆయన ధోరణి అంతా శరత్ మంచికోసమే నన్నట్లు సాగిపోయింది.

"రేపే అయిదువేలూ పట్టుకొచ్చి యివ్వు. మగపెళ్ళివాళ్ళైనా వాళ్ళ ఖర్చులు వాళ్ళకుంటాయి. బట్టలు కొనుక్కోవటం, శుభలేఖలు అచ్చేయించుకోవటం, రిసెప్షనూ, సత్యనారాయణ వ్రతం వగైరా బోలెడున్నాయి. ఆడపిల్ల పెళ్ళికీ, మగపిల్లవాడి పెళ్ళికీ కూడా ఎక్కడ డబ్బు పొదుపు చేసుకుంటాం. ఏవో మధ్యతరగతి సంసారాలు. నడిచిపోతుండాలి బండి. బుధవారంనాడు తాంబూలాలు పుచ్చుకోండి. ఆ... ఇంక నేను వెళ్ళొస్తానమ్మా" అంటూ బయల్దేరాడు బ్రహ్మానందరావు.

ఆయన్ని చూస్తుంటే సొంత బాబాయిని చూసినట్లు ఉంది శరత్‌కి.

ఆ తర్వాత వేగంగా జరిగిపోయాయి రోజులు.

తాంబూలాలు పుచ్చుకున్నాకగానీ సూర్యనారాయణ డబ్బులు యివ్వలేదు. తాంబూలాలు పుచ్చుకున్న మర్నాడు యిచ్చాడు.

అది కూడా చెక్‌రూపేణా.

"డబ్బు తేకపోయారా. మళ్ళీ చెక్కు ఎందుకు" అంది శాంతమ్మ.

"డబ్బు తెస్తుంటే ఎవరన్నా దొంగ చూసి పసిగట్టి వెంటబడి ఎత్తుకుపోయే ప్రమాదం ఉందండీ. అదే చెక్కు అనుకోండి. హాయిగా మీ అకౌంట్‌లో వేసుకుని కావల్సినప్పుడల్లా కాస్త కాస్త తీసుకుని ఎంచక్కా వాడుకోవచ్చు. యింట్లో ఉంటే లేనిపోని రిస్కు" బ్రహ్మానందరావు చక్కగా చెప్పి ఒప్పించాడు.

"సరేలెండి. డబ్బైతేనేం, చెక్కైతేనేం" అని ఊరుకున్నాడు శరత్.

"అంతగా మీరు అభ్యంతరం అనుకుంటే తిరిగి యిచ్చేటప్పుడు మీరూ చెక్కురూపేణానే యివ్వండి. సరికి సరి" నవ్వాడు బ్రహ్మానందరావు.

పెళ్ళిప్రయత్నాలు ప్రారంభం అయ్యాయి.

పెళ్ళికూతురికి నల్లపూసలూ, రెండు పట్టు చీరెలూ అయినా పెట్టాలి, తప్పదన్నది పెళ్ళి కూతురు తల్లి రంగమ్మ.

"ఫొటోలు మీరే తీయించండి"

"ఆ డబ్బులోనే ఉంగరం కొనుక్కోండి"

"మీకు వాచీ లేదులాగుంది అదికూడా కొనుక్కోండి"

"పెళ్ళికి కాకపోతే మరింకెప్పుడు చెప్పండి మనలాంటివాళ్ళు పట్టుచీరెలూ, మంచి బట్ట లూ కొనుక్కునేది. అందుకే కాస్త నాలుగు కాలాలపాటు మన్నేట్లు మంచి దిట్టమైనవీ, వెండిజరీవి మాత్రమే తీసుకోండి పట్టుచీరె లు"

"రిసెప్షన్‌కి ఏమేం వంటలు చేయిస్తున్నా రు" ఇలా పెళ్ళికూతురి తరఫువాళ్ళ ఆజ్ఞలు, ఆనవాయితీపేర చెప్పే మాటలు రోజురోజుకీ ఎక్కువయిపోయాయి.

"ఏమేంతెచ్చుకుంటాం నల్లపూసలూ, పట్టుచీ రెలూ. మళ్ళీ మీరు తెచ్చినవి మాకు నచ్చక పోతే మీరే బాధపడతారు. యింత డబ్బూ ఖర్చు చేసుకుంటూ నచ్చని రకాలు తెచ్చుకో వడం ఎందుకూ" అన్నది రంగమ్మ.

"మీ యిష్టం" అన్నది శాంతమ్మ.

మళ్ళీ ఏమనుకుందో ఏమో రంగమ్మ, శాంతమ్మని కూడా రమ్మని అడిగింది. పొద్దున్న పదిగంటలకి రాజేశ్వరి యింట్లోంచి కదిలారు పట్టుచీరెల సెలక్షన్ ముఠా.

రాజేశ్వరి, రంగమ్మ, శాంతమ్మ, రాజేశ్వరి పిన్ని సుందరమ్మగారు, ఆవిడ కూతురు సీతా లక్ష్మి.

మొదటిషాపులో చూసిన చీరెలు సీతాలక్ష్మి కి నచ్చలేదు. ఆమె మొగుడు పెద్దాఫీసరు కాబట్టి బోలెడు పట్టుచీరెలు కొనిపెట్టాడుట. చీరె నాణ్యం, జరీ అసలుదా, రాగిదా వగైరాలు చెప్పి మంచి చీరెలు తీయిస్తుందట ఆవిడ. అందుకే ఆవిడ్ని తోడురమ్మన్నారు. సుందర మ్మగారికి కూడా వీలైతే ఒక పట్టుచీరె కొనుక్కో వాలని ఉంది. ఆవిడ వీళ్ళకి తోడుగా వచ్చి మరీ నచ్చిన చీరె, కాస్త సరసమైన ధరలో దొరికితే కొనిపారెయ్యాలని డబ్బు తెచ్చుకుంది.

రెండోషాపులో చూసిన చీరెలు రాజేశ్వరికి నచ్చలేదు.

తల్లి సీతాలక్ష్మిని కూడా రమ్మంటే పోనీ మంచివి సెలెక్ట్ చేస్తుందిలెమ్మని ఊరుకుంది గానీ సీతాలక్ష్మి అంతా తనదే పెత్తనం అన్న ట్లు ఏ చీరెనీ కొననియ్యకుండా ఫోజుకొట్టడం రాజేశ్వరికి నచ్చలేదు.

పోనీలెమ్మని ఊరుకోవటానికి యిది మామూ లు చీరెల సెలక్షన్ కాదు. పట్టుచీరెల ఎన్నిక. రేపొద్దున్న అవి కట్టుకుని పెళ్ళిళ్ళకీ, పే రంటాలకీ వెళ్ళవలసింది తను. తన పెళ్ళిలో ఆ చీరెలు చూసి తనెంత బాగా సెలెక్ట్ చేస్తుందో తెలుసుకుని అందరూ అదిరిపో వాలి. సీతాలక్ష్మి మాటలు విని ఆవిడకి నచ్చిన చీరెలు తీసుకుంటే ఏళ్ళతరబడి బాధపడాలి.

తన చీరెలు, తన యిష్టం. అంతే.

ఈ నిర్ణయానికి రాగానే రాజేశ్వరి ఫోజు మార్చి మొహం గంభీరంగా పెట్టింది. అరల్లో నుండి తనకు నచ్చిన చీరెలు తీయించి ముందు వేసుకుని పరీక్షిస్తోంది. సీతాలక్ష్మి వంక కూడా చూడలేదు మళ్ళీ.

తన అధికారం ఊడగొట్టబడిందని సీతాల క్ష్మికి పదినిమిషాల్లో తెలిసిపోయింది. పిలిచి మంచి చీరె సెలెక్ట్ చెయ్యమని ప్రాధేయపడి, ఒక షాపు తిరగగానే తనను సెలెక్షన్ కమిటీ నుంచి తొలగించిన రాజేశ్వరిని ఘనంగా అవ మానించాలని పొంచి ఉంది అవకాశంకోసం.

రాజేశ్వరి ఒక ముదురు రంగు చీరెని పట్టుకుని భుజాన వేసుకుని చూస్తోంది.

"అది తెల్లటివాళ్ళకైతే బాగుంటుంది" అంది సీతాలక్ష్మి.

రాజేశ్వరి వినిపించుకోలేదు.

"నా ఒంటిమీద ఈ రంగు బాగా నప్పు తుందమ్మా. కానీ దాని అంచే మరీ తేలిపోయి నట్లుంది" అన్నది తల్లితో.

సీతాలక్ష్మి చేతులు ముడుచుకుని కూర్చోద ల్చుకోలేదు. రాజేశ్వరి ఆ షాప్‌లో ఏదీ సెలెక్ట్ చేసుకోలేదు. అట్నుంచి మూడు షాపులు తిరి గారు. మధ్యలో కూల్‌డ్రింక్‌లు తాగారు.

శాంతమ్మ అక్కడ తను నామమాత్రంగా నిలబడాల్సిందేతప్ప చీరెల సెలక్షన్‌లో తనకే అధికారమూ లేదని ముందే గ్రహించింది కాబట్టి మాట్లాడకుండా వాళ్ళు తిప్పినచోటుక

ల్లా తిరుగుతోంది.

ఇంకో షాపులో కూడా చూసి వద్దనుకుని లేచేసరికి మధ్యాహ్నమయింది.

సీతాలక్ష్మి సమయం చూసి దెబ్బకొట్టాలని కాచుకుని కూర్చుంది.

''ఏంటే రాజీ. నువ్వు మొగుడ్ని అయిదు నిమిషాల్లో సెలెక్ట్ చేసుకోగలిగావుకానీ పట్టుచీరెల సెలక్షన్ ఒకపూట గడిచినా కావటంలేదే'' అన్నది హాస్యంగా.

రాజేశ్వరి ఏమీ మాట్లాడలేక ఊరుకుంది.

సీతాలక్ష్మి తల్లి యిదేసందని తను ఒక పట్టుచీరె బేరంచేసింది. వందరూపాయలు తక్కువపడ్డాయి.

''నీదగ్గర ఉంటే వందరూపాయలు యివ్వు. తర్వాత యింటికెళ్ళాక యిస్తాను'' అన్నది.

రంగమ్మ గతుక్కుమంది.

''నువ్వు యింకోసారి తీసుకో. యిప్పుడు పెళ్ళిచీరెలకి డబ్బు తక్కువయిందంటే కష్టం'' అన్నది నిర్మోహమాటంగా.

ఈ షాపులు తిరగటం, తననొక్కమాటన్నా సలహా అడగకపోవటం, నిర్మోహమాటంగా వ్యవహరించటం యివన్నీ గమనిస్తున్నా శాంతమ్మకి పెద్దగా తెలివితేటలు లేకపోవడంవల్ల రాజేశ్వరి మనస్తత్వాన్ని గ్రహించలేకపోయింది.

చివరికి సాయంత్రం అయ్యేసరికి రాజేశ్వరికి నచ్చిన చీరెలు కనబడ్డాయి.

''హమ్మయ్య'' అనుకుంది శాంతమ్మ.

కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది. అలవాటులేక ఎండలో తిరిగి నీరసం వచ్చింది.

యిల్లు చేరేసరికి చీకటిపడింది.

శరత్ యింటికి వచ్చి మళ్ళీ వెళ్ళాడుట. పక్కింటివాళ్ళు చెప్పారు.

''యింతసేపుంటామని అనుకుంటే తాళాలు మీకిచ్చి వెళ్ళేదాన్ని'' అన్నది శాంతమ్మ వాళ్ళతో.

''మరి ఆడవాళ్ళ చీరెలు, అందులో పట్టుచీరెలు కొనటం అంత తొందరగా అవుతుందేంటి పిన్నిగారూ. యింకానయం, మా ఆవిడ అయితే రేప్పొద్దున్నదాకా వచ్చేదికాదు'' అన్నాడు పక్కింటాయన.

శాంతమ్మ నవ్వి లోపలకు వచ్చింది.

ఇంకో పదినిమిషాల్లో శరత్ వచ్చాడు.

''రెండు పట్టుచీరెలు తీసుకుంది బాబూ'' అనేసి ఊరుకుంది శాంతమ్మ.

''చాలాసేపైంది కదమ్మా''

''అవును బాబూ'' అంటూ శాంతమ్మ రాజేశ్వరి సెలక్షన్ గురించి వివరంగా చెప్పింది.

రాజేశ్వరి పట్టుచీరెల సెలక్షన్ ఘట్టం గురించి తెలుసుకున్నాక, నిజానికి శరత్ ఏమాత్రం ముందుచూపు ఉన్నవాడైనా ఆమె మనస్తత్వాన్ని అవగాహన చేసుకునేవాడు.

పెద్దరికానికి ఏమాత్రం గౌరవం యివ్వకపోవటం, పూర్తిగా తన స్వార్థంకోసమే పాటుపడటం, తనపని పూర్తికావాలంటే ఏస్థాయికైనా దిగజారగలగటం రాజేశ్వరి సహజగుణాలు. యివన్నీ ఆ చీరెల సెలక్షన్ ఘట్టంలో గుబాళించకపోయినా అన్నం ఉడికిందో లేదో చూడ్డానికి ఒక మెతుకు పట్టుకు చూస్తే చాలన్నట్లు తెలివిగలవాళ్ళు అయితే కనిపెట్టగలరు. అదే గనక రాజేశ్వరి తల్లి రంగమ్మ అయిఉంటే తప్పకుండా రాబోయే కోడలి గుణగణాలు అంచనావేసేసి ఉండేది. పెళ్ళంటే భయం ఉన్న శరత్ కూడా యిప్పుడెందుకో భయపడటంలేదు. అందరిలాగే తనూ పెళ్ళిచేసుకుంటున్నాడు అని తప్ప పెళ్ళిగురించి మరో ఆలోచనలేదు.



**మొ**త్తంమీద శరత్ పెళ్ళిముహూర్తం దగ్గరపడింది.

అంతా కుదుర్చుకుని అప్పుడు తనకి

## జాతీయ పొదుపు సర్టిఫికెట్లు (VIII విడుదల)

# సంపాదించండి పొదుపు చేయండి... చక్రవడ్డీతో సహా ఆర్జించండి. జాతీయ పొదుపు సర్టిఫికెట్లు (VIII విడుదల)



జాతీయ పొదుపు సర్టిఫికెట్లు (VIIIవ విడుదల) ద్వారా, అత్యంత సురక్షితమైన రీతిలో మీ పొదుపులను వృద్ధి పరుచుకోండి. అసలు ఫాయిదాలను అనుభవించండి.

ముఖ్యమైన అంశాలు:

- ★ వడ్డీ రేటు 12% (కాంపౌండు పద్ధతిపై)
- ★ పెట్టుబడి పై గరిష్ఠ పరిమితి లేదు.
- ★ పెట్టుబడి సెక్షన్ 88 ప్రకారం ఆదాయపు పన్ను రాయితి మరియు వడ్డీ పైకూడా సెక్షన్ 80'L' ప్రకారం పన్ను రాయితి.
- ★ రూ. 5.00 లక్షల వరకు సంపద పన్ను రాయితి.
- ★ రుణ సౌకర్యం గలదు.

మీ పొదుపులను ఆరేళ్ళలో రెట్టింపు చేసుకోండి! ఎలాగంటే

| సర్టిఫికెట్ల మొత్తం (రు.) | పరిపక్వం విలువ (రు.) |
|---|---|
| 1,000 | 2015.00 |
| 5,000 | 10,075.00 |
| 10,000 | 20,150.00 |

సౌఖ్యవంతమైన భవిష్యత్తుకై నేడే పొదుపు చేయండి.

ఇతర వివరాలకు:
మీ సమీప పోస్టాఫీసును లేదా కలెక్టొరేట్‌లో నున్న తహసీల్దారుని గానీ, జిల్లా సేవింగ్స్ ఆఫీసర్, నేషనల్ సేవింగ్స్ లేదా అనుమతించబడిన ప్రతినిధులనుగానీ నేడే సంప్రదించండి.

కమీషనర్
చిన్న మొత్తాల పొదుపు సంస్థ
తిలక్ రోడ్, 5వ అంతస్తు, ఇన్సూరెన్స్ బిల్డింగ్.
అబిడ్స్, హైదరాబాదు-500 001. ఫోన్: 234412

కూపన్‌ను పూర్తి చేసి, కమీషనర్ గారికి నేడే పంపండి.

ఈ పథకం గురించి తెలుసుకోవాలని ఉంది. దయచేసి వివరాలు పంపగలరు.
పేరు: ____________________
చిరునామా ____________________
____________________
పథకం ____________________

AKSHARA(H)

## మీ భద్రతే మా లక్ష్యం

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/–, రూ. 75/–, రూ. 50/– చొప్పున, మరో మూడింటికి రూ. 25/– చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

---------- కూపన్ ----------

ఫిబవరి చతురనవల బంధం

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

ఉత్తరం రాస్తారా అంటూ శరత్ అక్క భాను మతి వచ్చి పోట్లాడింది.

పెళ్ళికి బంధువులు, స్నేహితులు అందర్నీ పిలిచారు. దగ్గర బంధువులంతా మూడ్రోజుల ముందే వచ్చేశారు.

"కట్నం లేకుండా చేసుకోవటానికి ఏం ఖర్మరా నీకు. అయినా అంత కట్నం లేకుండా చేసుకోవాలనుకునేవాడివి మాకు ఒక్కమాట చెప్పలేకపోయావా. మన దగ్గరవాళ్ళల్లోనే ఎంతోమంది కట్నం యివ్వలేనిస్థితిలో ఉండి పెళ్ళికాక బాధపడ్తున్నారు. అయినవాళ్ళనంద ర్నీ ఒదిలి ఎవరో కానివాళ్ళకి ఉపకారం చేసిపె డ్తావా" అంటూ సాధించారు కొందరు.

వాళ్ళకి మర్యాదలు చెయ్యటానికే ఎక్కడి సమయం చాలటంలేదు శాంతమ్మకి.

చంటిపిల్లలు ఏడుస్తున్నారు. కాస్త పెద్ద పిల్లలు జట్టుగా చేరి ఆడుకుంటున్నారు. ఆడ వాళ్ళు గోలగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఒకళ్ళ చీరెలు ఒకళ్ళు చూసుకుంటున్నారు. మగవాళ్ళంతా ఒకచోట చేరి పేకాట ఆడు కుంటున్నారు. అంతా ఎవరి ధోరణిలో వాళ్ళు న్నారు.

"మగపెళ్ళివాళ్ళంకదా, మనమేం పనిచె య్యక్కర్లేదు. హాయిగా తిరిగెయ్యటమే. ఎన్నా ళ్ళనుంచో అనుకుంటున్నాను మొగపెళ్ళివాళ్ళ తరపున పెళ్ళికి వెళ్ళాలని, ఈమధ్య ఎన్ని పెళ్ళిళ్ళకి వెళ్ళినా అన్నీ ఆడపిల్లల తరఫే. యిప్పుడు చూడు నా తడాఖా ఎలా చూ పిస్తానో" అంటోంది ఒకావిడగారు.

గోవిందయ్య పెళ్ళాం, పిల్లలతో వచ్చేశాడు. రామేశ్వరం పోయినా శనేశ్వరం తప్పనట్లు మేనల్లుడి పెళ్ళికి వచ్చినా అతనికి మాత్రం పెళ్ళాం, పిల్లల చాకిరీ తప్పలేదు. వాళ్ళకి కావాల్సిన కాఫీ, ఫలహారాలు అందించటం, భోజన సదుపాయాలు చూడటం, వాళ్ళు విడి చిన బట్టలు ఉతకటం, అతనికి తీరికి లేకుండా పని ఉంటోంది.

ముహూర్తం పొద్దున్న పదిగంటలకి. రాత్రికే విడిదికి చేరారు.

పొద్దున్న స్నానాలకి వేణ్ణీళ్ళు ఒక్క పెళ్ళికొ డుక్కిమాత్రం పంపించి ఊరుకున్నారు ఆడ పెళ్ళివాళ్ళు.

"మగపెళ్ళివాళ్ళు అని ఏమన్నా లక్ష్యం ఉందా వాళ్ళకి. వేణ్ణీళ్ళు కూడా యివ్వలేదు..." అన్నారు కొంతమంది.

అవి ఆ నీళ్ళు పెట్టి వెళ్తున్న ఆడపెళ్ళివారి తాలూకు ముత్తయిదువుల చెవిలో పడ్డాయి. వాళ్ళు వెనక్కి తిరిగి వచ్చారు.

"ఏంటమ్మా అంటున్నారు. మీరింతమంది వచ్చిపడితే అందరికీ వేణ్ణీళ్ళు ఎక్కడ్నించి వస్తాయి" అన్నారు కోపంగా చూస్తూ.

"బాగుందమ్మా. ఎక్కడ్నుంచి వస్తాయని నన్నడిగితే నేనేం చెప్తాను. ముందు చెప్పా ల్సింది వేణ్ణీళ్ళు యివ్వం అని. మా ఏర్పాటేదో మేం చేసుకునేవాళ్ళం. యిప్పుడు ఉన్నపా టున యివ్వం అని అంటే ఎక్కడ్నించి తెచ్చు కుంటాం. పెద్దవాళ్ళం ఏవో తిప్పలుపడి చన్నీ ళ్ళు పోసుకున్నా పసిపిల్లలున్నారు. వాళ్ళ సంగతేంటి" నిలదీసింది ఒకావిడ.

"మీరు చెప్పారా వేణ్ణీళ్ళు కావాలి అని. ముందే చెప్పి ఉంటే ఏదో ఏర్పాటు చేసేవా ళ్ళం. పసిపిల్లల్ని తీసుకుని వచ్చేముందు అన్నీ ఆలోచించుకురావాలి పిల్లల తల్లులు" ఎత్తిపొడిచింది ఆడపెళ్ళివారి బంధువు.

"మరే... నువ్వు చెప్పలేదని ఆలోచించలే దు" అంది మగపెళ్ళివారి తాలూకు చుట్టం.

అక్కడ నీళ్ళయుద్ధం జరిగి, యిరువక్షాలూ వాదవివాదాలు జరిపి, పెళ్ళివేళ దగ్గరపడు తోందని అర్థాంతరంగా వివాదాన్ని ముగించి స్నానాలకు బయల్దేరారు.

అక్కడితో అయిపోలేదు.

భోజనాలదగ్గరా, పెళ్ళిఏర్పాట్లదగ్గరా, పలక రింపులదగ్గరా ప్రతిచోటా ఒక చిన్నసైజు యు ద్ధం. ఆ యుద్ధాలన్నింటిల్లో చిత్రంగా పాల్గొ న్నది దూరపు బంధువులేతప్ప దగ్గరివాళ్ళు కాదు.

శరత్‌కి అన్నీ వినబడ్తున్నాయి. వినబడని వాగ్వివాదాలగురించి విడిదిలో, పెళ్ళిపందిట్లో కొందరు చర్చించుకుంటుండగా విని గ్ర హించాడు.

శరత్‌కి చాలా దూరపుబంధువు గురుదేవ య్య అయితే ఆడపెళ్ళివాళ్ళతో వీరావేశంతో పోట్లాడాడు. అతనికి వత్తానుగా బోలెడుమంది వెళ్ళారు. అటునుంచి అతనికి తిరస్కారం,

తిట్లు పుష్కలంగా లభించాయి. గురుదేవయ్య అవన్నీ చిరునవ్వుతో స్వీకరించి శరత్‌కోసం తాను ఆడపెళ్ళివాళ్ళచేత అన్ని మాటలు పడ్తున్నానన్నాడు.

శరత్ సరిగ్గా అన్నం తినలేదు. అదోమాదిరి టెన్షన్, ఎక్సైట్‌మెంట్, రెండ్రోజుల్నించి నిద్ర పోలేదు. పెళ్ళికి వచ్చిన అందరూ శుభ్రంగా తింటున్నారు. గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. నవ్వుతూ, తుళ్ళుతూ తిరుగుతున్నారు.

పెళ్ళి తనకా, వీళ్ళకా అన్న అనుమానం వచ్చింది శరత్‌కి. తన పెళ్ళే అయితే తనింత మామూలుగా ఉన్నాడు. వీళ్ళంత ఉద్వేగంగా, ఉత్సాహంగా, ఉద్రేకంగా పాల్గొంటున్నారేంటి. అన్ని కార్యక్రమాల్లో, పోట్లాటల్లో తను యిక్కడ మామూలు ప్రేక్షకుడిగా మిగిలిపోయాడేంటి?

వీళ్ళు ఎన్నడూ అన్నం మొహమూ, ఫలహారాల మొహమూ చూడనట్లు ప్రవర్తిస్తున్నారు. ఆ ఆడపెళ్ళివాళ్ళేమో వీళ్ళన్న మాటలకి తప్పుపడుతూ ఊరికే తినిపోయేందుకు వచ్చినవాళ్ళని చూసినట్లు చూస్తున్నారు.

ఈ పెళ్ళి కార్యక్రమంలోనే ఏదో లోపం ఉందనిపించింది. ఏమిటో అర్థంకాలేదు.

పెళ్ళి జరిగిపోయింది.

ఆ తర్వాత కార్యక్రమాలు కూడా జరిగి రాజేశ్వరి శరత్ జీవితంలో ప్రవేశించింది.

★ ★ ★

''హనీమూన్‌కి ఎక్కడికి వెళదాం'' అడిగాడు శరత్.

రాజేశ్వరి నవ్వేసింది.

''మీరు ఎంతవరకూ డబ్బు తేగలరు'' అన్నది వెటకారంగా.

శరత్ గతుక్కుమన్నాడు.

అంతా ఖర్చయిపోగా అయిదారువందలు మాత్రం ఉంది తనచేతిలో. ఆ సంగతి ఆలోచించకుండా అనేశాడు. అందరూ హనీమూన్‌కి ఎక్కడికెళ్తున్నారూ అని అడిగేవాళ్ళే. పెళ్ళికన్నా హనీమూనే ముఖ్యమనీ, పెళ్ళి ఎలా జరిగిందని ఎవరూ అడగరుకానీ హనీమూన్ ఎక్కడికెళ్ళొచ్చారని అందరూ అడుగుతారనీ, అందుకే తను పెళ్ళిచేసుకోకపోయినానరే, ఎవరైనా సిద్ధపడితే హనీమూన్‌కి పోయిరావటానికి తయారుగా ఉన్నాననీ ఒక మిత్రుడు చమత్కరించాడుకూడా. అందుకే తనూ వెళ్ళాలనుకుని అన్నాడు.

అయినా వెళ్దామనుకుంటే ఊటీ, సిమ్లాలూ, బృందావన్ గార్డెన్సేకాదు, పక్కఊరికే పోయివచ్చినా నూతన దంపతులు ఆనందంగా గడపడంలో ఉంటుంది ఆ అనుభూతి అంతా. ఆ అనుభూతి తనూ మిగుల్చుకోవాలనుకున్నాడు. కానీ రాజేశ్వరి యింతమోటుగా నీ తాహతెంత అని డైరెక్ట్‌గా అడుగుతుందనుకోలేదు. ఆ మాటే కొంచెం ప్రేమ మేళవించి అనుంటే ఎంత బాగుండేది.

''ఎట్లాగూ మా అమ్మావాళ్ళకి మొక్కుంది. తిరపతికి పోయిరావాలి. అది చాల్లెండి'' అన్నది రాజేశ్వరి దయదల్చినట్లుచూస్తూ.

''సరే నీయిష్టం'' అన్నాడు శరత్.

తిరపతికి వెళ్తున్నారన్నమాట తెలియగానే శాంతమ్మ తనుకూడా వెళదామా అనుకుంది కానీ మళ్ళీ కొత్తగా పెళ్ళయినవాళ్ళమధ్య తనెందుకని అడగలేదు.

రాజేశ్వరి తల్లీతండ్రీ కూడా వస్తామని బయల్దేరారు. అసలు రాజేశ్వరే వాళ్ళని రమ్మని బలవంతం చేసింది కూడా.

వాళ్ళు బయల్దేరే రోజున కానీ అందరూ వెళ్తున్నారన్న సంగతి శాంతమ్మకి అర్థంకాలేదు.

''మీరిద్దరే వెళ్తున్నారనుకుని అడగలేదు. నాకూ తిరపతికి రావాలని ఉంది'' అన్నది.

రాజేశ్వరి మొహం చిట్లించుకుంది.

శరత్ ఏం సమాధానం చెప్పాలో తెలీక రాజేశ్వరివైపు చూశాడు.

''మీరు ముందే చెప్పాల్సింది. రిజర్వేషన్లు అయిపోయాయి. యింక యిప్పుడు మీరు జనరల్ కంపార్ట్‌మెంట్‌లో రావాలి. నలుగురూ చూసి నవ్వుకోరా. వీళ్ళంతా హాయిగా బెర్తులు రిజర్వ్ చేయించుకుని ఆ పెద్దావిడ్ని జనరల్ కంపార్ట్‌మెంట్‌లో తీసుకెళ్తున్నారు అనుకుంటే మాకు కష్టంగా ఉంటుంది. అదీగాక మీరు జనరల్‌లో అవస్థలు పడలేరు'' అన్నది.

శాంతమ్మ ఏం మాట్లాడలేదు.

''అవున్లే. నువ్వు చెప్పింది నిజం'' అనేసి ఊరుకుంది.

శరత్‌కి యిదంతా కష్టంగానే ఉంది. తల్లికి

లేకలేక కలిగిన ఒక్క కోర్కెను కూడా తను తీర్చలేకపోవటం సిగ్గుగా అనిపించింది. అయినా రాజేశ్వరి చెప్పినమాటల్ని ఖండించ లేని అదేదో అశక్తత ఆవరించింది.

ప్రయాణంలో కొత్త అల్లుడు అని బెరుకు, సంకోచం లేకుండా కావల్సినవన్నీ అడిగి తెప్పించుకుంటున్నారు శరత్‌చేత.

రాజేశ్వరి తండ్రి డబ్బులు బయటపెట్టడు. శుభ్రంగా యిడ్లీలు, కాఫీలు, హొటల్లో భోజనాలు, టాక్సీ ఛార్జీలు అన్నీ శరత్‌చేత పెట్టిస్తున్నాడు.

"ఏదో భయపడ్డాంగానీ మన అల్లుడు చాలా మంచివాడు సుమా. ఎట్లాంటివాడొస్తాడో నని భయపడి చచ్చాం. ఆ తిరపతి వెంకన్న దయవల్ల ఏదో మంచి మహారాజు దొరికాడు. మళ్ళీ మనవడు పుట్టాక వచ్చి దర్శనం చేసుకోవాలి" అని శరత్‌కి మంచివాడనే సర్టిఫికెట్ యిచ్చేశారు.

మంచివాడు, మంచివాడని పొగిడి పారేస్తుంటే శరత్‌కి గర్వంగానే ఉంది. ఆ మంచిపేరు నిలబెట్టుకోవటానికని వాళ్ళు ఏం అడిగినా చేసెయ్యాలనిపించింది.

రాజేశ్వరి శరత్‌తో ఎక్కువ మాట్లాడటంలేదు. ఏదన్నా అడిగితే సమాధానం చెపుతుంది కానీ తనంతట తాను కల్పించుకుని మాట్లాడదు.

"మరీ చనువుగా మాట్లాడకు. కాస్త బెట్టుచూపించకపోతే ఈ మొగుళ్ళు నెత్తినెక్కి పిండిగొడ్తారు. మాట్లాడినకొద్దీ చులకనైపోతాం. మూతి బిగించుకుని కూర్చుని ఏమంటే ఏం కోపం వస్తుందో, ఏ మాటకి ఏం బాధపడ్తుందోనని మొగుడు హడలిపోయేట్లుండాలి. అప్పుడే కాస్త జాగ్రత్తగా మసులుకుంటూ ఉంటాడు. నువ్వడిగినవన్నీ చేస్తాడు" అంటూ మొగుడ్ని ఎట్లా గుప్పిట్లో పెట్టుకోవాలో తారకమంత్రం బోధించినట్లు బోధించారు చుట్టాలూ, స్నేహితులు, పెళ్ళికిముందు, పెళ్ళికి తర్వాతా.

వాళ్ళన్నవన్నీ శ్రద్ధగా విని మనసుకు వంటబట్టించుకుంది రాజేశ్వరి. అందుకే అవసరమైతేతప్ప శరత్‌తో మాట్లాడటంలేదు.

తమ కూతురు మొగుడ్ని బాగానే కంట్రోల్ చెయ్యగలుగుతోందనే సత్యాన్ని గ్రహించాక రాజేశ్వరి తల్లితండ్రుల్దిరూ ఆనందపరవశులై దేవుడికి మరోసారి మొక్కి కొండదిగారు.

హైదరాబాద్ వచ్చాక రాజేశ్వరి పుట్టింట్లోనే దిగింది.

"మంచిరోజు చూసి కాపరానికి పంపిస్తాం బాబూ. ఈలోపల నువ్వు వచ్చిపోతుండు" అన్నారు.

"సరేనండీ" అన్నాడు శరత్.

ఆఫీసులో జాయినింగ్ రిపోర్ట్ యిచ్చి మిత్రులందరికీ తిరపతి విశేషాలు చెప్పి సాయంత్రం యింటికి వెళ్ళి మళ్ళీ శుభ్రంగా స్నానంచేసి రాజేశ్వరి వాళ్లింటికి వెళ్తున్నట్లు శాంతమ్మకి చెప్పి బయల్దేరాడు.

రాజేశ్వరి తెల్లటి జరీచీరె, జాకెట్టు, సన్న జాజి పూలు వగైరా అలంకరణతో రంభలాగా కనిపించింది.

అత్తగారు ఘుమఘుమలాడే వంటకాలు చేసి వేడిగా వడ్డించింది. ఆ రాత్రి అక్కడే నిద్రపోయాడు.

రాజేశ్వరి భర్తని లొంగదీసుకునే కార్యక్రమాల్లో ఒకటిగా పడకసుఖాన్ని కూడా లెక్కించడం శరత్ **అదృష్టమనే చెప్పుకోవాలి. అతడ్ని** పూర్తిగా తన పాదాక్రాంతుణ్ణి చేసుకోవాలనే తలంపుతో అతనికి పూర్తి ఆనందాన్ని అందించింది.

"ఎవడైనా పడిచచ్చేది ఆ సుఖానికే. అది బాగా అలవాటైందనుకో, నీ కొంగు వదిలిపోడు. అందుకని కొత్తల్లో ఎదురుచెప్పకుండా ఆ విషయంలోమాత్రం కాదనకు. ఆ తర్వాత సహాయనిరాకరణోద్యమంగానీ మొదలెట్టావంటే చచ్చినట్లు పడుంటాడు" అని అనుభవజ్ఞులైన మహిళలు కొందరు బోధించారు. వాళ్ళ మొగుళ్ళు వాళ్ళ కాళ్ళదగ్గర చచ్చినట్లు పడున్నరకాలే కాబట్టి రాజేశ్వరి అందులో నిజముందని గ్రహించి తూ.చా. తప్పకుండా ఆచరణలో పెట్టింది.

ఆనందంగా నిద్రపోతున్న శరత్‌ని చూసి అదోమాదిరి గర్వం ఆవరించింది ఆమె మనస్సుని.

యింకో వారంరోజుల్లో మంచి ముహూర్తం ఉందని చెప్పారు. ఆరోజున కొత్తకాపరం మొదలుపెట్టొచ్చన్నారు.

వారంరోజులు ఒక్క క్షణంలా గడిచిపో

యాయి.

ఆరోజు సాయంత్రం రాజేశ్వరి వస్తుంది. పొద్దున్నే ఏమన్నా కావాలేమో కనుక్కుందా మని రాజేశ్వరిని పిలిచాడు.

"ఏమిటి" అన్నది కొద్దిగా చిరాగ్గా.

ఆమె చిరాకుచూసి కొద్దిగా జంకాడు. "ఏంలేదు. సాయంత్రం వస్తున్నారుకదా. ఏమ న్నా కావాలా చెప్పు" అన్నాడు లాలనగా.

"నేనడిగేది మీరు యివ్వలేరులెండి" అన్నది రాజేశ్వరి.

"అదేంటి..." శరత్‌కి ఆమె ఏం అన్నదో అర్థంకాలేదు.

అతని ఉద్దేశం రాజేశ్వరి మకాం పుట్టింటి నుంచి అత్తింటికి మార్చటంవల్ల ఏమైనా వస్తు వులు అవసరమైతే కొనాలని. సబ్బో, పౌడరో లాంటివి అడుగుతుందనుకున్నాడు.

కొత్తగా కాపరానికొస్తున్న ఆమె అడిగేది ఏదై నాసరే యిచ్చెయ్యాలనిపించింది.

"రాజీ, నువ్వు ఏం అడిగినా యిచ్చేస్తాను" అన్నాడు లాలనగా చూస్తూ.

రాజేశ్వరి ఒక్కసారి సూటిగా చూసి కళ్ళువా ల్చుకుంది.

"అడుగు. నేను తీర్చగలిగేది అయితే తప్ప కుండా చేస్తాను" అన్నాడు.

"అడిగాక కోపం తెచ్చుకోకూడదు"

"తెచ్చుకోను"

"ఏమండీ... కొత్తగా పెళ్ళయిన మనమధ్య మీ అమ్మగారు ఎందుకు చెప్పండి. ఆవిడ్ని కొన్నాళ్ళు ఎటన్నా పంపరాదూ" అంది రాజే శ్వరి.

శరత్ నిర్ఘాంతపోయాడు.

అతని మౌనం చూసి రాజేశ్వరి విజృంభించింది. "మీరే చెప్పండి. మనం స్వేచ్ఛగా మనులుకోవటానికి, సరదాగా ఉండ టానికి ఆవిడ ఉంటే కుదురుతుందా. అత్తగా రు యింట్లో ఉన్నారంటే నాకు అనీజీగా, యిబ్బందిగా ఉంటుంది. యింకో మనిషి యింట్లో ఉంటే, ఆవిడ మీకెంత తల్లి అయినా నాకుమాత్రం అదోలా ఉంటుందండీ. ఒక సెంటు పూసుకోవాలన్నా కాస్త మల్లెపూలు పెట్టుకోవాలన్నా తెల్లచీరె కట్టుకుని అందంగా తయారవాలన్నా దేనికైనాసరే, యింట్లో యింకో ళ్ళున్నారనేసరికి నాకు సిగ్గుసిగ్గుగా ఉంటుంది. మీకోసం, మీ ఆనందంకోసం ప్రతి క్షణం తపించిపోతుంటాను. మీకు అన్నివి ధాలా ఆనందం కలిగించాలంటే... ఆవిడ ఉంటే కుదరదేమోనని... భయం... అంతే" అన్నది.

శరత్‌కి ఏంచెప్పాలో అర్థంకాలేదు. నిజమే మరి - రాజేశ్వరి చెప్పినదాంట్లో సత్యం ఉంది. కొత్తకాపురంలో దంపతులిద్దరే ఉంటే అన్ని సుఖాలూ స్వేచ్ఛగా ఆనందంగా పొందే అవ కాశం ఉంది... కానీ... కానీ... యిప్పుడు తల్లిని ఎక్కడికి పంపటం.

"రాజీ... యాత్రలకి నాదగ్గర డబ్బులేదు. లేకుంటే ఒక అయిదారు నెలలు ఆవిడ్ని ఏ యాత్రాస్పెషలో ఎక్కించి ఉత్తర, దక్షిణదేశ క్షేత్రాలన్నీ పంపిచేవాడ్ని" అన్నాడు.

"కొన్నాళ్ళు మీ అక్కయ్యగారింటికి పంపరా దూ"

"బాగుండదు. మా అక్క ఒక్కత్తే అయితే ఫర్వాలేదుకానీ అది ఉమ్మడి కుటుంబం. ఆవిడ అత్తగారూ, మామగారూ, మరుదులూ, ఆడపడుచులూ అది బోలెడుమందున్న యిల్లు. వాళ్ళందరూ ఈవిడ్ని కూతురింట్లో తినిపోవటానికి వచ్చిన మనిషిని చూసినట్లు చూస్తారు. వాళ్ళు పెద్ద సంస్కారం గల మను మలు కాదు. మనిషిని చూసి సహించలేరు"

"పెళ్ళిలో చూశానుగా. సరే పోనియ్యండి. మరి మీ మామయ్య యింటికి వెళ్తే... తమ్ము డ్ని ఆయన కాపరాన్ని చూసుకున్నట్లు ఉంటుందిగా. నాలుగు నెలలయ్యాక రావచ్చు. వాళ్ళుండేది విజయవాడదగ్గర పల్లెటూర టగా. బోలెడు పాడి, కూరగాయలకీ, పప్పుబి య్యాలకీ లోటులేదంది మీ అత్తయ్య. హాయిగా కొన్నాళ్ళు పల్లెవాయువులు పీల్చిన ట్టుండదూ"

"ఉంటుంది. కానీ మా అత్తయ్యకి మేమెవ రమన్నా పడదు. ఆవిడ రెండ్రోజులు కూడా మా అమ్మని ఉంచుకోదు. ఆ నమ్మకం నాకుంది" అన్నాడు శరత్.

"మరెలా..." రాజేశ్వరి బేలగా అంది.

"మనమే సర్దుకుపోవాలి. నగటు మనిషికి

యింతకన్నా జరుగుబాటు ఎక్కడ ఉంటుంది. మనకంత యిబ్బందేం ఉండదనుకుంటాను. మా యింట్లో మనకంటూ ఒక గది ఉంది విడిగా. కావల్సినంత ప్రైవసీ ఉంటుంది''

''సరే మీయిష్టం. మీకోసం అనిగానీ నాకు మరేం ఉంది'' అంది రాజేశ్వరి.

ఆమె మొహం కాస్త వన్నె తరగటం గమనించిన శరత్ కుంగిపోయాడు.

అతను ఫీలవటం గమనిస్తున్న రాజేశ్వరి మనసులోనే గర్వంగా నవ్వుకుంది.

''నాకు ఏపనీ సరిగ్గా రాదు. అత్తయ్యగారే మనుకుంటారో'' అంది.

''ఫర్వాలేదు. మా అమ్మకి వంట చెయ్యటం కష్టమైన పని కాదు. మా యిద్దరికీ ఎలాగూ చేస్తుందిగా. నీ ఒక్కదానికి ఎక్స్‌ట్రా ఏముంది. యింకాస్త బియ్యం ఎక్కువ పడేస్తే సరి. కొన్నాళ్ళు ఆవిడదగ్గర ట్రైయినింగ్ పొందావంటే సరి, బ్రహ్మాండంగా వస్తుంది పని''

''నాకు ఎవర్ని చూసినా సిగ్గు... మాట్లాడలేను''

''ఫర్వాలేదు... మా యింట్లో నిన్నెవ్వాళ్ళూ మాట్లాడించరు. మాకున్న బంధువర్గం చూశావుగా. ఎవళ్ళూ వచ్చి తిష్టవేసి ఉండేవాళ్ళు లేరు. నీకిష్టమైతే నాతో మాట్లాడు లేకుంటే లేదు''

''జోక్ కాదు...''

''కాదుగాక కాదు. నేను నిజంగానే అంటున్నాను. మనింట్లో నీకు ఏ లోటూ ఉండదు. ఒకేసారి పుట్టిల్లు వదిలి కొత్తయింట్లో, కొత్తమనుమలమధ్య నీకెంత సంకోచంగా ఉంటుందో నేను అర్థంచేసుకోగలను. మా అమ్మ కూడా చాలా మంచిమనిషి. మా అమ్మని అనటంకాదుగానీ ఆవిడ చాలా నెమ్మదస్థురాలు. ఒకళ్ళని వల్లెత్తుమాట అనెరుగదు. కావాలంటే తనే నాలుగు పడుతుందిగానీ ఒకళ్ళని అనదు. నిన్ను చాలా బాగా చూసుకుంటుంది. నీకే అర్థమవుతుంది ముందు ముందు...''

''ఏమైనా కొత్తల్లో బిడియంగా అనిపిస్తుంది. ఆవిడ మరోలా అనుకుని నన్ను సాధిస్తుందేమోనని భయంగా ఉంది''

''అలాంటిదేం ఉండదని నేను హామీయిస్తున్నాగా. నీకు నేనున్నాను. ఏం కావాలన్నా నన్నడుగు. అంతే...''

''సరే... మీరన్నట్లే... నాకేదన్నా కష్టంగా తోస్తే మీదగ్గర చెప్పుకుంటాను'' అంది రాజేశ్వరి.

భర్త దగ్గర్నుంచి పొందాల్సిన హామీలన్నీ పొందాక రాజేశ్వరి ఆ యింట్లో అడుగుపెట్టింది.

రాజేశ్వరికి పెద్ద చదువులు చదవాలని లేదు. ఉద్యోగాలు చేసి ఊళ్ళేలాలని లేదు. తెలీని సంగతులు తెలుసుకుని విజ్ఞానం సంపాదించాలని ఆకాంక్షా లేదు.

ఆవిడ పరిధి ఆ యిల్లు మాత్రమే.

అందుకని ఆ యింట్లో తన సామ్రాజ్యస్థాపన చేసి, ఏకచ్ఛత్రాధిపత్యం సాగించాలని ఉంది.

ఆ సామ్రాజ్య స్థాపనకి ఎదురునిల్చి పోరాడే శత్రువులు ఎక్కువమంది లేకపోవటం ఆవిడకి సంతోషం కలిగించింది.

ఆడపడుచు ఉన్నా లేనట్లే. మామగారు లేరు. మొగుడు తనమాట ఏదీ కాదనేరకంలా లేడు. యిక మిగిలింది అత్తగారు. ఆవిడ్ని కాస్తా లొంగదీసుకుని బానిసలా చేసుకొనో, లేక శాశ్వతంగా ఆవిడ్ని ఏ కాశీకో వంపేసో పీడ విరగడ చేసుకోవాలి.

అప్పుడు తన సార్వభౌమాధికారాన్ని కాదనేవారు ఉండరు.

భర్త తన మాటకి ఎదురుచెప్పడు. స్వతహాగా మెతకమనిషి కావటం ముఖ్యకారణం. తనకు తన యింట్లో తిరుగులేదు.

అత్తగార్ని యింట్లో ఉంచుకోవాల్సినంత బలమైన కారణం కనిపిస్తే ఉంచుకోవచ్చు. లేకుంటే తన కాపురం కాస్త పాతపడి, తను గయ్యాళిగా అరిచినా భర్త పెద్ద ఎఫెక్ట్ కాని పరిస్థితి వచ్చాక హడలగొట్టి ముసల్దాన్ని మూడొందల మైళ్ళదూరం తరమొచ్చు.

రాజేశ్వరి మనసులో చెలరేగుతున్న అధికారకాంక్ష దానికోసం ఆమె వేయదల్చుకున్న ఎత్తులు, పైఎత్తులు ఆవిడ హృదయంలో ఉన్న జిత్తులు తెలియని శరత్ ఆమెని చూసి జాలిపడ్డాడు. తనకోసం అందర్నీ వదులుకుని వస్తున్న మనిషని అతని హృదయంలో ఆమెపట్ల చెరగని అభిమానం ఏర్పడ్డది కూడా.

పైపెచ్చు ఆవిడ అమాయకురాలనీ, తన సు ఖంకోసం బోలెడు తాపత్రయ పడుతోందనీ సానుభూతి కూడా పెంచుకున్నాడు.

స్త్రీ పురుషుడికి ఎన్నో యిస్తుంది. అతని కోసం, అతని వంశాభివృద్ధికోసం తనవాళ్ళంద రినీ వదులుకుని వస్తుంది. అట్లాంటి స్త్రీని తన హృదయంలో భాగంగా భావించి ప్రేమించా ల్సిన బాధ్యత పురుషుడిమీద ఉంది. ఆమెకు ఏ బాధా కలగకుండా చూసుకోవాలని అనుకు న్నాడు.

అతనికి ఎవరినైనా నమ్మటం, వాళ్ళు చె ప్పింది వాళ్ళ హృదయంలోంచే వస్తున్నదని అనుకోవటం, వాళ్ళకోసం ఏదైనా చేసెయ్యాల నుకోవటంలాంటి బలహీనతలున్నాయి.

ఆ బలహీనతలే తన బలంగా విజృంభించింది రాజేశ్వరి.

★ ★ ★

తన స్వభావాన్ని కాస్త సిగ్గరిగా, బిడియస్థు రాలిగా చిత్రించి రాజేశ్వరి మొదటి అడుగు జయప్రదంగా వేసింది. స్నానానికీ, భోజనా నికీ తప్ప గదిలోంచి బయటికి రాదు.

శాంతమ్మ ముందు ఎక్కడలేని దర్జా ఒలక పోస్తుంది. ఏది పెట్టినా సరిగా తినదు. ముసలి అత్తగారికి చేదోడు వాదోడుగా ఉండి వంటపని ఆదుకునేది లేకపోగా ఆవిడ చేసిన వంటకి వంకలుపెట్టి నహించలేదంటూ కూర్చుం టుంది.

శాంతమ్మ పలకరిస్తే సరిగ్గా జవాబు చెప్ప దు. ఆ, ఊ, సరే... అలాగే, వద్దు... యింత తప్ప వేరే మాట్లాడదు. అడిగినదానికి బెట్టుగా జవాబుచెప్తుంది.

శాంతమ్మ ఒకటి రెండుసార్లు శరత్ ముందు బాధపడింది. కోడలు మనసు విప్పి మాట్లాడనందుకు మనస్సు కలుక్కు మంటుంది ఆవిడకి. శరత్ ఉండగా రాజేశ్వరి బాగానే ప్రవర్తిస్తుంది. అతను కనుమరుగు అయ్యాకమాత్రం ఏదన్నా అడిగితే పొగరుగా జవాబిస్తుంది. పొరపాటున ఏదైనా పని చెప్తే చెయ్యదు.

"తనకి సిగ్గమ్మా... కొత్తకదూ. నాలుగురోజు లు గడిస్తే మనలో కలిసిపోతుంది" అన్నాడు శరత్.

"సరేలే" అనేసి ఊరుకుంది శాంతమ్మ.

పాలు పొయ్యిమీద పెట్టి కాస్త చూస్తుండ మంటే రాజేశ్వరి చూస్తూ ఊరుకుందికానీ దింపలేదు. పాలు కాస్తా శుభ్రంగా పొంగిపో య్యాయి.

"అయ్యో... నిన్ను చూడమన్నాగా" అంది శాంతమ్మ. అంతే... రాజేశ్వరి భోరున ఏడవటం మొదలుపెట్టింది.

శాంతమ్మ హడలిపోయింది. "నేనేమన్నా ననీ... పోనీలే అలవాటులేక పరధ్యానంగా ఉండి దింపలేదు. దానికి ఏడుపెందుకమ్మా" అంటూ లాలించబోయింది.

రాజేశ్వరి ఊరుకోలేదు.

యింకా వెక్కి వెక్కి ఏడ్చింది. స్నానం చేస్తున్న శరత్ రాజేశ్వరి ఏడుపు వినిపించి స్నానం ఆపిమరీ బయటికి వచ్చాడు.

కొడుకుని చూసిన శాంతమ్మకి కాళ్ళూ, చేతు లూ ఆడలేదు.

"నేనేం అనలేదురా. పాలు పొంగిపో యాయి" అంది గాభరాగా.

శరత్ ఆమెని కొంచెం చిరాగ్గా చూసి తిరిగి బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

రాజేశ్వరి లేచి తనగదిలోకి వెళ్ళిపోయింది. శరత్ చూపులకి, రాజేశ్వరి ఏడుపుకి శాంతమ్మ కుంగిపోయింది.

హఠాత్తుగా ఒంటరితనం చుట్టుముట్టినట్ల యింది. ఆమెకి కూడా ఏడుపు వచ్చేసిందికానీ బలవంతాన ఆపుకుంది.

ఏమిటీ ఖర్మ...

శరత్ అపార్థం చేసుకుని తనకు దూరమై పోతాడా. ఎంత సరిపెట్టుకున్నా ఏమీ అన కుండా ఊరుకున్నా రాజేశ్వరి ఎందుకిట్లా ప్రవ ర్తిస్తోంది. యిప్పుడు ఏడవవలసిన అవసరం ఏముంది.

ఎదురుగా పాలు పొంగిపోతున్నా చూస్తూ ఊరుకుంటే ఆ పిల్ల కన్నతల్లి అయినా ఊరు కుంటుందా.

తల్లి అయితే అసలు ఊరుకోదు. చెంపలు ఛెళ్ళున వాయించుతుంది కూడా. అత్త కాబట్టి తను కోపం దిగమింగుకుని యథాలాపంగా అడిగిన మాటకి ఆ పిల్ల యింత కోపం, ఏడుపూ తెచ్చుకుంటే యిలాంటి పిల్లతో ఎలా

వేగాలి.

ఏమాటకీ సరైన సమాధానం రాదు. పెడసరంగా, పొగరుగా సమాధానం యిస్తుంది. అంటీముట్టనట్లుగా వ్యవహరిస్తుంది. ఒక్క పనికూడా అందుకుని చెయ్యదు. పైపెచ్చు కూర్చున్న కుర్చీలోకి సమస్తం అమర్చిపెడుతున్నా ఏదో ఒక గోల చేస్తూ, వంకలు పెడ్తుంటుంది.

ఆ అమ్మాయి ఏడిస్తే ఓదార్చేందుకు శరత్ ఉన్నాడు. కానీ తనకి ఎవరున్నారు. దేముడున్నాడు. అంతే...

శాంతమ్మ మనశ్శాంతికోసం గుడికి వెళ్ళింది. శాంతమ్మ వెళ్ళగానే శరత్ రాజేశ్వరి గదిలోకి వెళ్ళాడు.

"రాజీ! ప్లీజ్ ఊరుకో" అన్నాడు ఆమె భుజంమీద చేతులువేసి.

రాజేశ్వరి కాస్సేపు బతిమాలించుకుని ఆ పూట తిండి తినేందుకు ఒప్పుకుంది.

కొంతమంది మనుషులకి అస్తమానం తమని ఎవరో బతిమాలి, బుజ్జగించి ముద్దు చెయ్యాలని ఉంటుంది. చీటికీ మాటికీ అలక తెచ్చుకుని అవతలి మనిషిని హడలగొట్టి వాళ్ళచేత బతిమాలించుకుని సంతోషపడుతుంటారు. ఆవిధంగా తమ ప్రాముఖ్యాన్ని ఎప్పటికప్పుడు రుజువుచేసుకుంటూ అహాన్ని సంతృప్తిపరచుకుంటారు. రాజేశ్వరిలో అధికార కాంక్షేకాక అహం కూడా జాస్తి కావటంతో మాటిమాటికీ ఈ అలక ప్రయోగం చేసి యింట్లోవాళ్ళని బెదరగొట్టి సంతోషపడటం ప్రారంభించింది.

పాలు పొంగినరోజు ఆమె అలిగినందుకు మూల్యంగా శరత్ పట్టుచీరె కొన్నాడు. దాని కోసం పక్కసీటు గుర్నాథం దగ్గర అప్పుచేశాడు.

గుర్నాథం శరత్‌కి ఆప్తుడు. కాబట్టి డబ్బు ఊరికే యివ్వకుండా ఎందుకూ, ఏమిటీ అని ఆరాతీశాడు.

"మా ఆవిడకి పట్టుచీరె కొనాలి" అన్నాడు శరత్.

"ఎందుకయ్యా. మొన్నేగా పెళ్ళయింది. పెళ్ళికి తీసుకున్న చీరెలుంటాయిగా. మనలాంటివాళ్ళం పట్టుచీరెకోసం అప్పు చేయటం..." అంటూ ఆపాడు గుర్నాథం.

"నిజమేనయ్యా. కానీ జరిగిందేమిటంటే..." అంటూ పాలపొంగు వ్యవహారం అంతా చెప్పుకొచ్చాడు శరత్.

వింటున్న గుర్నాథం చచ్చేట్లు నవ్వటం మొదలుపెట్టాడు.

"శరత్... నువ్వొట్టి పిచ్చాడిలా ఉన్నావు. కన్నీళ్ళకి కరిగిపోవటం మొదలుపెడ్తే ఆడది నిన్ను మొత్తం కరిగించి నామరూపాలు లేకుండా చేస్తుంది" అన్నాడు.

"మా ఆవిడ అలాంటిది కాదయ్యా"

"అలాంటి యిలాంటి అని లేదు. లోకం అంతా ఒక్కటే. ఆడాళ్ళందరూ ఒకటే. నువ్వు వాళ్ళని నెత్తిన పెట్టుకుని పూజిస్తే నిన్ను పాతాళానికి అణగదొక్కి నీ నెత్తిన శివ తాండవం చేస్తారు. నువ్వు వాళ్ళ నెత్తినెక్కి పిండిగొడితే నోర్మూసుకుని పడుంటారు. వాళ్ళని ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచాలి. పాలెందుకు పొంగించావు అని గుడ్లెర్రచేసి కసుర్తే మీ ఆవిడ మాట్లాడకుండా ఊరుకునేది. అదే మామూలుగా అయ్యో పాలు పొంగాయే అంటే మీరేదో అపరాధం చేసినట్లు సాధిస్తుంది. నా మాట విని ఆవిడ అలకకి బెదరకు. యిట్లా పట్టుచీరెలు కొనటం అలవాటుచేస్తే ఆవిడ చీటికీ మాటికీ అలిగి నీ జేబు ఖాళీచేస్తుంది. నాదగ్గర లేవని కాదు. నీకు డబ్బు యిస్తానుగానీ నువ్వు మరోసారి ఆలోచించు" అన్నాడు గుర్నాథం.

తన భార్య లంఖిణీ, శంఖిణీ అని గుర్నాథం ఎప్పుడూ బాధపడ్తుంటాడు. గుర్నాథం భార్య నిజానికి ఆ కోవకి చెందిందే కూడా. తను కూడా పిశాచగణానికి సరిపోయే సమర్థుడు కావటంవల్ల ఆవిడతో నెగ్గుకొస్తున్నానని బహిరంగంగా చెప్తుంటాడు.

శరత్ నవ్వేసి ఊరుకున్నాడు.

రాజేశ్వరి యిష్టపడ్డ పట్టుచీరె కొని అది ఆవిడ కట్టుకున్నప్పుడు ఆమె మొహంలో విరిసిన కాంతుల్ని చూశాక తను పెట్టిన డబ్బుకి సార్థకత లభించిందనిపించింది.

రాజేశ్వరి మామూలు మనిషి కాదు.

ఎట్లాగైనా యింటి అధికారాన్ని చేజిక్కించుకునే ప్రయత్నంలో ఆవిడ మొదటి దండయా

త్ర దిగ్విజయంగా సాగింది.

అందులో భాగంగా తననొక అమాయకురాలిగా నోట్లో నాలికలేని వ్యక్తిగా భర్త మనసులో నమ్మకం కుదిర్చింది.

యింక రెండోది... చాలా ముఖ్యమైంది. దాన్ని రాజేశ్వరి విజయవంతంగా నిర్వహించింది.

అది శత్రువుని బలహీనపరచటం. సంసారంలో జరిగే పోరాటాలకి సాధారణంగా శారీరక బల ప్రసక్తి లేదు. అత్తాకోడళ్ళమధ్య జరిగే పోరు కేవలం మానసిక పోరాటమే. మానసికంగా ఎవరు ఎక్కువ బలవంతులైతే వాళ్ళు గెలుస్తారు. మానసిక బలాన్ని చేకూర్చటానికి బలగం, వయసు బలం, ఆపైన మనుమల అండదండలు, డబ్బు వగైరా కావాలి.

రాజేశ్వరి ఏం అన్నా తందానా తానా అని పలికి వెనకేసుకొచ్చే తల్లిదండ్రులున్నారు.

పాపం అత్తగారింటికొచ్చింది. ఆ అత్త ఏం ఆరళ్ళు పెడ్తోందోనని జాలిపడే లోకం ఉంది.

వయసు ఉంది. బలం ఉంది. అన్నిటికీ మించి అణగిమణిగి ఉన్న భర్త ఉన్నాడు.

యివన్నీ తనకున్నవని శాంతమ్మకి స్పష్టంగా తెలియజేస్తూ, ఆవిడకి లేవని తెలియజెప్తూ రాజేశ్వరి తన శత్రువుని మానసికంగా దెబ్బతియ్యగలిగింది.

దాంతో ఏ కొద్ది పోరాటపటిమ ఉన్నా అది బహిరంగవర్చలేక శాంతమ్మ కోడలిముందు పూర్తిగా తలవంచింది.

యింతలో రాజేశ్వరి నెలతప్పింది.

శాంతమ్మ సంబరపడింది.

తనకొక మనవడు పుడ్తున్నాడంటే సంతోషంగా అనిపించింది.

★ ★ ★

"మా చెల్లెలికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. మీరు కట్నం డబ్బు వాపస్ యిస్తానన్నారుగా... యివ్వండి" అన్నది రాజేశ్వరి.

బాంబ్ పేలినట్లు అదిరిపడ్డాడు శరత్. ఆ డబ్బు తిరిగి యిచ్చేద్దామనే ఉంది కానీ ఎట్లా కుదుర్తుంది.

రాజేశ్వరి కాస్త సహకరించి ఉంటే తను ఎన్నో చెయ్యగలిగి ఉండేవాడు. పెళ్ళయ్యాక తను పాంటు గుడ్డ కూడా కొనుక్కోలేదు యింత వరకూ. అన్నీ రాజేశ్వరికే సమకూరుస్తూ వచ్చాడు. తన జీతం, తన ఖర్చులు అన్నీ రాజేశ్వరికి తెలుసు. అయినా యిట్లా అడుగుతోంది.

"ఆ డబ్బు యివ్వటం యిప్పట్లో కుదరదు" అన్నాడు.

"అవున్లెండి. గొప్పగా కబుర్లు చెప్తారుగానీ, తీరా చేతల దగ్గరికి వచ్చేసరికి అందరూ యింతే. కట్నం అడిగినవాడిని చేసుకోకూడదనుకున్నానుగానీ, హు... ఈ లోకంలో కుదుర్తుందా" అంది రాజేశ్వరి.

శరత్ కుంచించుకుపోయాడు. ఆమె ముందు తను తనని తాను అమ్ముకున్న బానిసలా కనిపించి సిగ్గుపడిపోయాడు.

ఆ తర్వాత చాలాసార్లు రాజేశ్వరి ఆ అస్త్రం ప్రయోగించి అతన్ని నిర్వీర్యుణ్ణి చేసేసింది.

శరత్‌కి తెలీదు, రాజేశ్వరి కావాలనే అట్లా మాట్లాడుతున్నదని. అందుకనే ఆమె పుల్లవిరుపుగా మాట్లాడితే నోరుమెదపలేకపోయేవాడు.



నెల తప్పిన రోజునుంచీ రాజేశ్వరి మంచంమీదకే అన్నీ తెప్పించుకుని తింటం మొదలుపెట్టింది.

అపురూపంగా చూసుకుంటున్నా వంకలేసమ్మ డొంకపట్టుకు ఏడ్చిందన్నట్లు ఏదో ఒకదానికి వీలుచేసుకుని పోట్లాట జరిగేట్లు చూస్తున్నది.

చెవులకి జూకాలు, చేతికి గాజులు చేయించమంది. డబ్బులేదన్నాడు శరత్. రాజేశ్వరి ఒప్పుకోలేదు. తల్లిదండ్రులకి చెప్పి గొడవ చేసింది.

యింట్లో చిన్న గొడవ అయినాసరే సూర్యనారాయణగారూ, రంగమ్మా ఛటాల్న వచ్చేస్తారు.

"యిదేంటయ్యా యిట్లా చేస్తున్నావు. యిన్నాళ్ళూ అపురూపంగా పెంచుకుని నీ చేతిలో పెట్టింది యిట్లా బాధలు పడటానికేనా" అంటాడాయన.

పెళ్ళికి ముందురోజుదాకా శరత్ ఎరిగిన సూర్యనారాయణ వేరు. పెళ్ళి అయినరోజు నుంచే తెలిసిన కొత్త సూర్యనారాయణ వేరు. అసలు ఆయనేనా ఈయన అన్నట్లున్నాడు.

పెళ్ళికి ముందు వినయం, అణకువ, మర్యాద ఒలకపోసిన ఆయన, ఆయన కుటుంబం మొత్తం పెళ్ళయినరోజునుంచీ అవతారం మార్చేసి అసలురంగు బయటపెట్టారు.

"యింత పెద్ద కోరికలు కోరితే నేనెక్కడ తీర్చగలనండీ" అన్నాడు శరత్.

"ఏం ఫర్వాలేదయ్యా. నాకు తెల్సిన మార్వాడీ ఉన్నాడు. చాలా మంచివాడు. నేను చెప్పి నీకు అప్పు యిప్పిస్తాను. డబ్బు తీర్చమని తొందరపెట్టడు కూడా" అన్నాడు సూర్యనారాయణ.

శరత్ గుండె ఝల్లుమంది. యిన్నాళ్ళూ గుట్టుగా కాలం గడుపుతున్న కుటుంబం తమది. తండ్రి లేకున్నా ఉన్నంతలో ఏదో ఒకటి తిని, లేనినాడు పస్తులుండి కాలం గడిపారు. యిప్పుడు జూకాలకోసం, బంగారు గాజులకోసం అప్పులు చెయ్యాలంటే చేతులు, కాళ్ళు వణుకుతున్నాయి.

"వద్దండీ. వేరే ఎక్కడన్నా చూస్తే" అన్నాడు.

"ఏం ఫర్వాలేదు పదవయ్యా" అన్నాడు సూర్యనారాయణ. ఆ మార్వాడీ ఏమీ అడక్కుండానే డబ్బు యిచ్చాడు. వడ్డీ చాలా హెచ్చురేటు. గవర్నమెంటు ఉద్యోగస్థులకి ఏమీ తాకట్టుపెట్టుకోకుండానే యిస్తాడుట. ఎక్కడికి పోతారని ధీమాకాబోలు.

గాజులు, జూకాలు పెట్టుకుని రాజేశ్వరి మురిసిపోయింది.

"మీకోసమే కదండీ ఈ అలంకారం" అంది నవ్వుతూ. ఈమధ్యలో రాజేశ్వరి చెల్లెలి పెళ్ళి అయింది. పెళ్ళికొడుకు పేరు రామ్‌గోపాల్. గోళ్ళూడగొట్టి కట్నం, కానుకలు వసూలు చేశాడు. చిన్నచిన్న కోరికలు తీర్చలేదని అలిగి కూర్చున్నాడు. గోల చేసిమరీ అవన్నీ తీర్చుకున్నాడు.

పెళ్ళిలో రాజేశ్వరి కొత్త గాజులూ, జూకాలూ, మడతనలగని పట్టుచీరెలూ కట్టుకుని అందరీ్నీ హడలగొట్టింది.

"మన రాజీ మొగుడు చాలా మంచివాడే. ఎన్నెన్ని కొన్నాడో చూడు" అనుకున్నారు అందరూ.

రామ్‌గోపాల్‌దీ తనమాదిరి ఉద్యోగమే. అతనికి యింకా బాధ్యతలు కూడా ఉన్నాయి. తనకన్నా అందంగానూ ఉండడు. అయినా అతనికి చేసిన మర్యాదలు తనకి చెయ్యటంలేదని గ్రహించాడు శరత్. ఖర్చయిన డబ్బుని తల్చుకుంటూ మిగిలిన విషయాలు మర్చిపోయాడు.

రామ్‌గోపాల్ కూడా యిదే ఊరులో ఉద్యోగం చేస్తున్నాడు. వాళ్ళ సొంత ఊరు రాజమండ్రి దగ్గర అదేదో పల్లెటూరట. ఉద్యోగంకోసం హైదరాబాద్ వచ్చాడు. కానీ అతనికి యిక్కడ బోలెడుమంది తెలుసును. అందరితో త్వరగా కలసిపోయి చనువుగా మాట్లాడి పరిచయం పెంచేసుకుంటాడు.

అతన్ని తన భర్తతో పోల్చుకుని రాజేశ్వరి దిగులు పడ్తుంటుంది.

"ఏంటో... మావారికి చురుకులేదండీ. అదే మా మరిది చూడండి. ఎంత హుషారుగా ఉండి ఎన్నెన్ని చేస్తున్నాడో" అని పక్కింటావిడతో చెప్తుంటే విని శరత్ తనేదో తప్పుచేసినట్లే ఫీలయిపోయాడు.

పాత యిల్లు మారి చిక్కడపల్లిలో యింకో యిల్లు అద్దెకి తీసుకున్నారు. ఈ యిల్లు రాజేశ్వరి బంధువులది. వాళ్ళు ట్రాన్స్‌ఫర్‌మీద వెళ్తూ అద్దెకి యిచ్చారు. రెండు పోర్షన్ల యిల్లు. ఒక పోర్షన్లో సుబ్బాయమ్మగారని రాజేశ్వరికి చాలా దూరపు బంధువుట ఆవిడ కుటుంబం ఉంది. యింకో పోర్షన్లో శరత్‌వాళ్ళు దిగారు.

సుబ్బాయమ్మగారికీ, రాజేశ్వరికీ యిట్టే స్నేహం కుదిరిపోయింది, యింతకుముందు పరిచయంగానీ, స్నేహంకానీ లేకున్నా.

సుబ్బాయమ్మ రాజేశ్వరి అన్న ప్రతి మాటకీ

తాళం వేస్తుంది. ఆవిడకి యిద్దరు ఆడపిల్లలు. పెళ్ళిళ్ళయి విడిగా కాపరాలు చేసుకుంటున్నారు. భర్త చెప్పిన మాట వింటాడు. ఆవిడ ఏమంటే అది ఔనంటాడు. అల్లుళ్ళూ అంతే.

యిల్లూ, పరిసరాలూ బాగానే నచ్చాయి శరత్‌కి. ఆఫీసుకి కూడా పెద్ద దూరం కాకపోవటంవల్ల యిబ్బందిగాలేదు.

మార్వాడీకి అప్పు తీర్చటం, యితర అప్పులు తీర్చుకోవటం, రాజేశ్వరి సరదాలు తీర్చటం వీటితో జీతం ఎంతమాత్రం సరిపోవటంలేదు.

ఆఫీసులో ఒక సీటు భర్తీ చెయ్యలేదు. ఓవర్‌టైమ్ యిచ్చి ఆ పని చేయిస్తున్నారు. శరత్ ఓవర్‌టైమ్ చేసి సంపాదిస్తున్నాడు. రాజేశ్వరి డాక్టరుఫీజులు, మందులు, పళ్ళు, పాలు, బలవర్థక - ఆహారం వీటికి బోలెడు ఖర్చవుతోంది.

ఏం చెయ్యటమా అని ఆలోచిస్తుండగా రాజేశ్వరే పరిష్కారం చెప్పింది.

"మీకు ఊళ్ళో ఎకరం పొలం ఉందిగా. అమ్మి పారెయ్యండి. ఒకసారి అప్పులు తీర్చుకున్నామంటే ఆపైన జీతం డబ్బుల్తో ఎట్లాగో సరిపెట్టుకోవచ్చు" అన్నది.

ఈ ఆలోచన బాగానే ఉన్నా శరత్ కొద్దిగా సందేహించాడు. తల్లి ఏమంటుందో అనిపించింది.

"అమ్మ ఏమంటుందో..." అన్నాడు.

"ఎందుకంటారండీ. ఆవిడ ఎట్లాగూ మన దగ్గరే ఉంటారు. మనమా... వెళ్ళి అక్కడి పంట డబ్బులు వసూలు చేసుకురాలేము. శుభ్రంగా అమ్ముకుంటే సరి" అంది రాజేశ్వరి.

శాంతమ్మ కూడా అభ్యంతరం చెప్పలేదు. కొడుకు ప్రయోజకుడయ్యాడు. యింక ఆ పొలం ఉన్నా లేకపోయినా ఒకటే అనిపించింది.

పొలం అమ్మి మార్వాడీ అప్పు తీర్చేశారు. కొన్ని చిల్లర అప్పులు కూడా తీర్చారు. మిగిలిన డబ్బు నాలుగువేలుంటే బాంక్‌లో వేశారు. అది రాజేశ్వరి కాన్పుకీ, యితర ఖర్చులకీ సరిపోయింది.

రాజేశ్వరి కొడుకుని కన్నది. కొడుకు కూడా పుట్టాక యింక తను భర్తముందు నటించాల్సిన అవసరం ఎంతమాత్రం కనిపించలేదు రాజేశ్వరికి. అందువల్ల తన అసలురూపం బయటపెట్టటానికింక ఏమాత్రం సంకోచించలేదు.

ఆమెను బిడియస్తురాలిగా, సిగ్గరిగా అనుకున్న శరత్ ఆమె నిస్సిగ్గుగా ప్రవర్తిస్తుంటే చూసి విస్తుపోవటం మొదలుపెట్టాడు.

శాంతమ్మని ఆ యింటి పనిమనిషిగా మార్చేసింది రాజేశ్వరి.

యింటిపని, వంటపని, బట్టలుతకటం, అంట్లుతోమటం, మనవడ్ని ఆడించడం, వాడికి కావల్సిన పనులన్నీ చేయటం... వీటన్నిటితో ఊపిరిసలపని కార్యక్రమాలతో తల్లి అలసిపోవటం శరత్ గమనిస్తూనే ఉన్నాడు.

కానీ ఎందుకో యిదేంటని రాజేశ్వరిని అడగలేడు. ఈమధ్య రాజేశ్వరి అతన్ని నలుగుర్లోనూ తీసిపారెయ్యటం మొదలుపెట్టింది.

ఏం చెప్పబోయినా ఖండిస్తుంది.

"మీకేం తెలీదు, మీరు ఊరుకోండి" అనేస్తుంది.

ఆవిడ మనసులో, ఆవిడ తల్లీ, తండ్రీ, మరిదీ మాత్రమే తెలివైనవాళ్ళు. వాళ్ళు చెప్పింది వేదం.

సుబ్బాయమ్మ రాజేశ్వరిని మంచిచేసుకుంటే మంచిదికానీ, ముసల్దానితో మనకెందుకు అనుకుందో, లేక సహజంగానే రాజేశ్వరిపట్ల ఆకర్షితురాలైందో తెలీదుకానీ రాజేశ్వరి ప్రతీ మాటనీ, ప్రతీ పనిని సమర్థిస్తుంది.

యింట్లో, బయటా, బంధువర్గంలో అంతటా తను ఒంటరివాడిననే భావం శరత్‌కి కలుగుతోంది.

ఏం చెయ్యాలి. తన మనసులో భావాలన్నీ రాఘవకి ఉత్తరం రాశాడు. రాఘవకి యింకా పెళ్ళికాలేదు. కొన్ని బాధ్యతలున్నాయి. అవి తీరితేగానీ చేసుకోదల్చుకోలేదు.

రాఘవ విశాఖపట్నంనుంచి వచ్చాడు. శరత్ దిగులుగా ఉండటం చూసి రాఘవ బాధపడ్డాడు. "చెప్పు శరత్... ఎందుకిలా బాధపడుతున్నావు. నీ ఉత్తరం చదివాను. నీ భార్య ప్రవర్తనలో నాకు పెద్ద చిత్రం ఏదీ కనిపించటంలేదు. నూటికి తొంభైమంది ఆడవాళ్ళకి

అత్తతో పడదు. చాకిరీ అంతా అత్త చేస్తే బాగుండునని కోడలు, కోడలు చేసిపెడ్తే తిని కూర్చుందామని అత్తా అనుకుంటారు. అత్తాకోడళ్ళనేవాళ్ళు రెండు భిన్నధృవాలు. ఒకళ్ళకీ ఒకళ్ళకీ చస్తే పడదు. యిదేదో నీ యింట్లోనే జరుగుతున్నట్లు బాధపడకు. లోకంలో చాలా మంది యింతే'' అన్నాడు.

''లేదు రాఘవా. నాకేదో మార్పు కనిపిస్తోంది. మా ఆవిడ గయ్యాళితనం నీకు తెలీదు. అసలు పెళ్ళికిముందు యింత స్వార్థపరురాలనీ, గడుసుదనీ ఏమాత్రం తెలిసినా నేను చేసుకునేవాడ్ని కాను. ఆవిడేదో నన్ను మోసంచేసినట్లు ఫీలవుతున్నాను'' అన్నాడు శరత్.

''ప్రేమవివాహాల్లో కూడా పెళ్ళికి ముందు ఒకలాగా, పెళ్ళయ్యాక మరోలాగా ప్రవర్తిస్తారు. యిక ఈ అరేంజ్డ్ మారేజస్ సంగతి చెప్పాలా. ఎవరైనా యిట్లాగే ఉంటారు''

''ఆవిడ నన్ను గౌరవించటంలేదు''

''ఏ భార్యా తన భర్త గొప్పవాడనుకోదు''

''మా అమ్మని పనిమనిషిలా చూస్తోంది. తన తల్లికి ఎంత ప్రేమ, గౌరవం యిస్తుందో... మరి నా తల్లిని నేను అంత ప్రేమగా చూడక్కర్లేదా... అసలు మా అమ్మతో మాట్లాడితేనే ఆవిడ భగ్గుమంటుంది''

'''అసూయ ముందుపుట్టి ఆడది తర్వాత పుట్టిందంటారు' అత్తగార్ని తల్లిలా చూసుకునే కోడళ్ళు ఉంటే వాళ్ళ కాళ్ళకి రోజూ దండం పెట్టవచ్చు. మానవ సహజమైన ఈర్ష్యాద్వేషాలు ఎవరూ మానుకోలేరు''

కొంచెంసేపు యిదేమాదిరి సంభాషణ జరిగింది. ''సర్లే... నా సంగతి సరేగానీ నువ్వెప్పుడు పెళ్ళిచేసుకుంటావ్. మా పిల్లాడికి యిప్పుడు రెండో ఏడాది తెల్సా. తొందరగా చేసుకో'' నవ్వాడు శరత్.

''పెళ్ళి యిప్పుడే వద్దు బాబోయ్. యింకా మా చెల్లెళ్ళ పెళ్ళిచేయాలి నేను''

''పెళ్ళి చేసుకుంటే మాత్రం వాళ్ళపెళ్ళిళ్ళు చేయవా''

''ఏమో బాబూ ఎలాంటి వాళ్ళొస్తారో; నా దృష్టిలో నూటికి తొంభైశాతంమంది ఆడవాళ్ళు సహనంలేని వాళ్ళే. నువ్వు యిందాక చెప్పినట్లుగా మొగుడు తన కుటుంబసభ్యులతో మాట్లాడితేనే సహించలేరు. పెళ్ళికాగానే వాడు తన చెల్లెళ్ళనీ, తల్లితండ్రుల్నీ అందర్నీ మర్చిపోయి తన కొంగు పట్టుకుని తిరగాలని అనుకుంటారు. అట్లాంటిది యింక నేను నా చెల్లెళ్ళ పెళ్ళిచేసుకుంటానని వేలు ఖర్చుపెడ్తే చూసి సహిస్తారనుకుంటున్నావా. చేసుకుని తిప్పలు పడేకన్నా మానుకుని కూర్చోవటంలోనే సుఖం కనిపిస్తోంది''

''అంతేనంటానా''

''అంతే... మంచివాళ్ళు కూడా ఉంటారనుకో. కానీ రిస్క్ తీసుకోవటం దేనికి''

''సరే... నీ యిష్టం''

రాఘవతో మాట్లాడాక మనసు తేలిక పడ్డట్లనిపించింది. నూటికి తొంభై కాపురాలు రసహీనంగానే ఉంటాయని అతను చెప్పాక కాస్త ఊరట కలిగింది. మునిగిపోతున్నా నలుగురూ మునిగారు, నేనూ మునిగాను అనుకోవటంలో ఆనందం ఉంటుంది మరి.

రాఘవకి భోజనం పెట్టాలనిపించింది.

రాజేశ్వరికి చెప్పాడు.

''నా ఫ్రెండ్ రాఘవ అని తెలుసుకదూ. ఊళ్ళోకి వచ్చాడు. మనింటికి భోజనానికి పిలుద్దాం'' అన్నాడు.

రాజేశ్వరి ఒప్పుకోలేదు.

''ఎందుకండీ... పెద్దవాళ్ళమయ్యాక ఏం స్నేహాలులెండి'' అనేసింది.

సూర్యనారాయణా, రంగమ్మ ముందే ఆమెకి యిచ్చిన ట్రెయినింగ్‌లో స్నేహితుల్ని ఎంత మాత్రం ఆదరించకూడదని కూడా ఉంది.

''ఎంతసేపూ ఫ్రెండ్స్ ఫ్రెండ్సని తిరుగుతారు మగాళ్ళు. ఏం ఫ్రెండ్స్? ఊరికే తిని పోరంబోకుల్లా తిరగటమేగా. మగాళ్ళు యిద్దరు చేరారంటే సిగరెట్లు తాగటం, సీసాలు తాగటం యింతే... స్నేహితుల్తో తిరగనియ్యకు. చెడ్డలవాట్లు అవుతాయి'' అని వాళ్ళు చేసిన బోధ రాజేశ్వరి చెవుల్లో యింకా మారుమోగుతూనే ఉంది.

స్నేహంలోని మాధుర్యాన్ని ఆప్యాయతానురాగాల్ని చవిచూద్దామని రాజేశ్వరికి ఏనాడూ లేదు. తనకవసరం వచ్చిన వాళ్ళతో గంటల

తరబడి మాట్లాడటం, యిష్టంలేని వాళ్ళని చూడగానే మూతిముడుచుకోవటం యింతక న్నా ఆమెకి తెలీదు.

రాఘవ వెళ్ళిపోయాడు.

రాఘవకి నిజానికి శరత్‌కి తగిన భార్య దొరకనందుకు చాలా బాధగా ఉంది. అయినా ఆ మాట చెప్పి శరత్‌ని యింకా బాధపెట్ట టమే అవుతుందని బయటికి చెప్పలేదు. పెళ్ళికి ముందు, చేసుకోబోయే అమ్మాయి గుణ గణాలు ఆలోచించవచ్చు. కానీ తీరా పెళ్ళి కాస్తా అయిపోయాక యింక చేసేదేముంది. అనుకుని బాధపడేకన్నా సర్దుకుపోవటంలోనే





శాంతి దొరుకుతుందని శరత్‌కి నచ్చజెప్పినట్లు మాట్లాడాడు.

బ్రహ్మానందరావు కూతురి పెళ్ళి వచ్చింది.

పెళ్ళిలో ఘనంగా కనబడాలని కొత్త పట్టుచీరె అడిగింది రాజేశ్వరి.

"ఇప్పుడు కొస్త కష్టమే..." నసిగాడు శరత్.

"ఏం... ఏమొచ్చింది" అన్నది రాజేశ్వరి.

"అంత డబ్బులేదు"

"మీ తెలివి తెల్లారినట్లే ఉంది. డబ్బంతా యిచ్చి కొంటామా ఏమన్నానా. మా మరిధికి తెలిసిన షావతను పట్టుచీరెలు కూడా యిన్‌స్టాల్‌మెంట్లుమీద యిస్తాడు. ఆయన మనకి కూడా యిప్పిస్తానన్నాడు" అంది రాజేశ్వరి.

రామ్‌గోపాల్ రికమండేషన్‌మీద బట్టలు తీసుకోవటం శరత్‌కి నచ్చలేదు. పెళ్ళికి కట్టుకు వెళ్ళటానికి పట్టుచీరెలకి కొదువలేదు.

"నా చీరెలన్నీ పాతవడ్డాయి. అదీగాక మా వాళ్ళందరూ ఆ చీరెలన్నీ చూసేశారు. ఫొటోల్లో అన్నిట్లో అవే చీరెలు కట్టుకుని కనబడ్తూంటే నలుగురూ నవ్వుతారు"

ఈవిడ ఏం కట్టుకుందో జనం కనిపెట్టి చూడ్డానికి రాజేశ్వరి ఏమన్నా సూపర్‌స్టారా. శరత్‌కి నవ్వు వచ్చినా ఆపుకున్నాడు.

ఏమన్నా అంటే అరిచిపోట్లాడుతుంది.

ఆ అనుభవాలు కూడా అయ్యాయి.

ఆమె నోటికి హద్దూపద్దూ లేదు. ఎంత మాటంటే అంతమాట నిస్సంకోచంగా అనేస్తుంది. ఆవిడ నోటిముందు తను నిలవలేడు. ఒకవేళ కోపంలో తనూ ఒకమాట తూలినా చుట్టుపక్కల వాళ్ళు ఏమనుకుంటారోనని సిగ్గుగా అనిపిస్తుంది.

ఆవిడకి మాత్రం అలాంటి సిగ్గులూ, భయాలూ లేవు. ఏమిటి తనలో లోపం. రాజేశ్వరి ఎందుకిలా చేస్తోంది. మంచితనమే తన లోపమా. మంచివాడు ఆఖరికి పెళ్ళానికి కూడా లోకువేనా.

చేసేదిలేక పట్టుచీరె కొనుక్కోవటానికి ఒప్పుకున్నాడు. ఆ షాపతను రామ్‌గోపాల్‌ని చూసి మర్యాదచేసి కూల్‌డ్రింక్‌లు తెప్పించాడు. రామ్‌గోపాల్, 'చూశావా నా గొప్ప' అన్నట్లు శరత్‌వైపు ఒక చూపు పారేసి, శరత్‌ని అతనికి పరిచయం చేశాడు.

"నా పేరుమీద వీళ్ళకి బట్టలు యివ్వండి" అన్నాడు శరత్‌వైపు ఉద్ధరించినట్లు చూస్తూ.

రాజేశ్వరి ఒక పట్టుచీరె, ఒక నూలుచీరె తీసుకుంది. చీరెల సెలక్షన్‌లో రామ్‌గోపాల్ సాయపడ్డాడు.

శరత్‌కి అక్కడ కూర్చోవాలంటే ముళ్ళమీద కూర్చున్నట్లే అనిపించింది.ఇంతసేపూ మరిదితో తుళ్ళుతూ, నవ్వుతూ కబుర్లు చెప్పిన రాజేశ్వరి శరత్ మొహం చూసి సీరియస్‌గా అయిపోయింది యింటికి రాగానే.

"మా మరిదికి చూశారా ఎంత పలుకుబడి ఉందో. అంతంత ఖరీదైన చీరెలు అప్పుకి యిచ్చారు" అన్నది.

"అందులో గొప్పేం ఉంది. వ్యాపారస్థులు వాళ్ళకి తెలిసిన వాళ్ళకి యిన్‌స్టాల్‌మెంట్ యిస్తూనే ఉంటారు"

"పోనీండి... అయినా మా మరిది తన పేరుమీద బట్టలు ఇప్పించాడు. మనం కట్టకపోతే తను కట్టుకోవాల్సిందేగా ఆ డబ్బు"

తను కట్టకుండా ఎక్కడికి పోతాడు. అంతటి ధైర్యం అసలుందా తనకి. నీతి, నిజాయితీ సంగతి అవతలపెట్టే అసలు డబ్బులు ఎగ్గొట్టి తిరగటానికి తనకు గుండె ఉందా. తను ఎలాంటివాడో రామ్‌గోపాల్‌కి బాగా తెలుసు. అదీగాక తను ఎగ్గొట్టినా యింటికొచ్చి గోళ్ళూడగొట్టి వసూలుచెయ్యగల సామర్థ్యం రామ్‌గోపాల్‌కి ఉంది.

రాజేశ్వరి ఉద్దేశమే నిజమేమో. తను అసమర్థుడు రామ్‌గోపాల్ గొప్ప సమర్థుడు. యిదే తను గనక తన పేరుమీద రామ్‌గోపాల్‌కి బట్టలు యిప్పిస్తే ఆ యిన్‌స్టాల్‌మెంట్స్ అతను చచ్చినా కట్టడు. తనే కట్టుకోవాలి. కట్టనంటే రాజేశ్వరి తన్ని మరీ కట్టిస్తుంది.

తనలోనే ఏదన్నా లోపం ఉందా. ఉంటే ఏమిటి? ఏమిటది?

★ ★ ★

డబ్బు... డబ్బు...

భార్యాభర్తలమధ్య అనుకూలతనీ, వారి కాపురంలోకి ముచ్చట్లనీ, ముద్దుల్నీ అన్నింటినీ తెచ్చిపెట్టగల అధికారం డబ్బుకి ఉందని పించింది శరత్‌కి.

తనకి చిన్నప్పుడే తండ్రిపోయి, తల్లి లోకం అంటే ఏమిటో తెలీకుండా పెంచినందువల్ల యిలా ఉన్నదా.

మిగతావాళ్ళంతా ఉన్నట్లు తను లేడా... లేక మిగతా స్త్రీలలాగా రాజేశ్వరి ప్రవర్తించటంలేదా.

ఏవో కోరికలు... ఎన్ని ఉన్నా మళ్ళీ చీరెలు, నగలు, అప్పులు. మార్వాడీదగ్గర అప్పు, చీరెల దుకాణంలో అప్పు. అదొక చక్రం, అంతే.

ఎదురింట్లోకి కొత్తగా ఒక కుటుంబం వచ్చింది. భర్తకి నలభై అయిదేళ్ళు ఉంటాయి. భార్యకి నలభై. వాళ్ళకి యిరవై ఏళ్ళ కొడుకూ, పదిహేనేళ్ళ కూతురు ఉన్నారు. రాజేశ్వరి వాళ్ళతో పరిచయం చేసుకుంది. ఆయన పేరు కుటుంబం అనీ, ఆవిడపేరు రాధాసుందరి అనీ తెలిసింది.

వచ్చిన దగ్గర్నుంచీ ఆవిడ రైలింజన్లా బొయ్యిమని అరుస్తూనే ఉంది కానీ ఆ మహాను

భావుడి గొంతు మాత్రం వినిపించలేదు.

ఇంతవయసు వచ్చినా ఆవిడ మొగుడి మీద రోజూ అరుస్తూనే ఉంటుంది. పిల్లలు కూడా తల్లి పక్షంచేరి తండ్రిని సాధిస్తూ ఉంటారు. ఆ మానవుడు తనింట్లో తనే పరాయివాడై పోయి, తన వాళ్ళందరిముందూ దోషిలా తిరుగుతుంటాడు.

కుటుంబంకి దురలవాట్లు లేవు. ఆఫీసు నుంచి తిన్నగా యింటికి వచ్చేస్తాడు. యింట్లో పెళ్ళాం అడిగిన పనులన్నీ చేస్తాడు. ఆవిడ మాటకి ఎదురు చెప్పడు. జీతం డబ్బులన్నీ తెచ్చి ఆవిడ చేతిలోనే పోస్తాడు.

ఇంతచేసినా రాధాసుందరికి సంతృప్తిలేదు. యింకా ఏదేదో చెయ్యాలని ఆవిడ అభిప్రాయం. ఆవిడ బంధువులందరూ వ్యాపారాలు చేసి లక్షలు గడించారట. ఆయన్ని కూడా అట్లా చెయ్యమంటుంది. ఆయన తనవల్ల కాదంటే పోట్లాడుతూ కూర్చుంటుంది. ఆవిడకి పోట్లాటకి కారణం అక్కర్లేదు. ఏదో ఒకటి అప్పటికప్పుడు కల్పించి భీభత్సమైన సీన్ సృష్టించేస్తుంది. అరిచిగోల చేస్తుంటే పిల్లలు ఆవిడకి వంతపాడుతుంటారు. కుటుంబం బిక్కుబిక్కుమంటూ కూర్చుంటాడు. వాళ్ళంతా శాంతించాక తినబుద్ధిపుడుతే అన్నం తింటాడు. లేకుంటే పస్తుపడుకుంటాడు.

అట్లాంటి కుటుంబానికి ఉన్నట్లుండి పెద్ద కష్టంవచ్చి పడింది.

రాధాసుందరి ఒకరోజు దేనికోగానీ పెద్దపెట్టున కుటుంబంతో గొడవపెట్టుకుంది. ఆ రోజు రాత్రి ఆవిడ ఎక్కడికో వెళ్ళి తిరిగి రాలేదు.

ఆవిడ తమ్ముడు ఈ ఊర్లోనే ఉన్నాడు. తమ్ముడింటి కెళ్ళిందేమోనని కుటుంబం సరిపెట్టుకుని ఆ రాత్రికి ఊరుకున్నాడు. అప్పుడప్పుడూ ఆవిడ తమ్ముడింటికి వెళ్ళి తెల్లవారింతర్వాత రావటం కూడా జరుగుతూనే ఉంది. అందుకే కుటుంబం ఏమాత్రం సందేహించకుండా ఊరుకున్నాడు. మర్నాడు పొద్దున్న అతను ఆఫీసుకెళ్ళేలోపల ఆవిడ రాలేదు. కుటుంబం అన్నం వండి, తను తిని పిల్లలకి పెట్టాడు. పిల్లలు కాలేజీకి,కుటుంబంఆఫీసుకీ వెళ్ళారు.

సాయంత్రం కూడా ఆవిడ రాకపోయేసరికి పిల్లల్ని మామయ్య యింట్లో చూసి రమ్మని పంపాడు. అక్కడికి వెళ్ళలేదని తేలగానే వేరే చోట్ల వాకబు చేశాడు. రాధాసుందరికి బోలెడు మంది స్నేహితురాళ్ళున్నారు. వాళ్ళల్లో కొద్ది మంది ఇళ్ళు కుటుంబంకి తెలుసు. వాళ్ళందరి యిళ్ళకూ వెళ్ళి అడిగాడు. వాళ్ళూ రాధాసుందరి రాలేదనే చెప్పారు.

కుటుంబం గుండెలు దడదడలాడుతున్నాయి. కాళ్ళీడ్చుకుంటూ యింటికి వచ్చాడు.

ఈ లోపల నలుగురికీ విషయం తెల్సి గుమిగూడారు. కుటుంబం బావమరిది యింటినుంచి పిల్లలతోపాటు అతని బావమరిది కూడా వచ్చేశాడు.

రాగానే విసురుగా కుటుంబం చొక్కా పట్టుకున్నాడు బావమరిది. అతనిపేరు హరేరాంట.

"చెప్పు... మా అక్కయ్యనేం చేశావ్" అన్నాడు గర్జిస్తున్నట్లు. కుటుంబం హడలిపోయాడు.

"నాకేం తెలుసు" అన్నాడు.

"నీకుగాక యింకెవరికి తెలుస్తుంది. చెప్పు. రాత్రి ఏదన్నా గొడవచేశావా" అడిగాడతను.

"లేదు"

"లేకుంటే మరేం జరిగింది" అతను యిల్లెగిరిపోయేట్లు అరిచాడు.

కుటుంబం బిక్కచచ్చి చూస్తున్నాడు.

పిల్లలు హరే రామ్ పక్కన చేరి తండ్రివైపు కోపంగా చూస్తున్నారు.

"ఏమమ్మా... మీ అమ్మ కనిపించకుండాపోయింది ఎప్పట్నుంచి" అడిగాడతను మేనకోడల్ని.

"నిన్న సాయంత్రం మామయ్యా"

"అంతకుముందు ఏదన్నా పోట్లాట జరిగిందా"

"జరిగింది మామయ్యా. ఏదో చీరె కొనమని అంది అమ్మ. నాన్నేమో వద్దన్నాడు" అని యింక మాట్లాడలేదు ఆ అమ్మాయి.

"యింకేం... దానిమీదే గొడవచేసి యింట్లోంచి వెళ్ళగొట్టి ఉంటాడు. లేకపోతే ఎక్కడికి వెళ్ళి ఉంటుంది. మా యింటికే వచ్చి ఉండాలికదా. ఏమయ్యా... మా అక్కయ్యనిగానీ చంపెయ్యలేదుకదా నువ్వు" అడిగాడతను కుటుంబాన్ని.

కుటుంబం వణికిపోయాడు.

"అవేం మాటలు... దేవుడిమీద ఒట్టు. ఆవిడ ఎక్కడికి వెళ్ళిందో నాకు తెలీదు. ఏదో, చీరె కొనమంటే డబ్బులేదు కాబట్టి వద్దన్నాను. అంతమాత్రానికే కోపంవచ్చి ఎక్కడికెళ్ళిందో... నాకేం తెలీదు" అన్నాడు.

"ఇట్లా అడిగితే కుదరదులే. నీలాంటి మొండిఘటాల్ని ఎట్లా తిక్కకుదిరించాలో నాకు తెలుసు. యిప్పుడే పోలీస్ రిపోర్ట్ యిస్తాను" అన్నాడు హరేరామ్.

"నీకేమైనా మతిపోయిందా. యింటి గుట్టు రచ్చకెక్కించకు. యింకాస్సేపైతే ఆవిడే వస్తుంది. వెతుకుదాం" అన్నాడు కుటుంబం.

"ఎలా వస్తుంది. నువ్వు చంపి ఎక్కడ పారేశావో. యింకేం వస్తుంది. పెళ్ళై యిన్నేళ్ళయ్యాక ఆడది గడపదాటి ఎక్కడికి వెళ్తుందయ్యా. పోలీస్‌రిపోర్ట్ యివ్వాల్సిందే" అంటూ ముందుకి కదిలాడతను.

పోలీసులొచ్చారు.

కుటుంబంని ఏవేవో ప్రశ్నలడిగారు. వాళ్ళు వెళ్ళిపోగానే చుట్టుపక్కల వాళ్ళంతా గుమికూడి మాట్లాడటం మొదలుపెట్టారు.

"ఏమై ఉంటుంది ఆవిడ. కుటుంబం చూస్తే మంచివాడిలా ఉన్నాడు. చంపి ఎక్కడో పాతిపెట్టేసి నాటకమాడుతున్నాడంటావా" అన్నాడొకాయన.

"ఏమోనయ్యా... యింతకన్నా మెత్తగా కనిపించేవాళ్ళు కూడా పెళ్ళాన్ని చంపిన వాళ్ళున్నారు. చెప్పలేం"

అక్కడ మాట్లాడినవాళ్ళు కొన్ని సందేహాలు వెలిబుచ్చారు.

ఒకటి... పెళ్ళాం రాత్రి కనిపించకపోతే కుటుంబం రాత్రే ఎందుకు గాభరా పడలేదు. కనీసం బావమరిది యింటికి ఫోన్‌చేసి ఎందుకు కనుక్కోలేదు. రెండోది... యింతవయసొచ్చి, పిల్లలు పెళ్ళీడుకొచ్చి ఉన్నాక ఆవిడ ఎక్కడికి పోయిఉంటుంది. ఆత్మహత్య చేసుకుందామని వెళ్ళినా, ఒక ఉత్తరం అయినా రాసిపెట్టి వెళ్ళాలికదా.

ఇంకా... యింట్లో డబ్బు యధాతథంగా ఉంది. ఆవిడ డబ్బు తీసుకెళ్ళలేదు, కాబట్టి ఎక్కడికో వెళ్ళిపోయి ఉండదు. మరేం అయింది.

కాబట్టి కుటుంబం ఆమెని చంపాడనటానికి ఎక్కువ ఆధారం ఉంది, అని నిర్ణయించేశారు.

అంతే కుటుంబం బతుకు అల్లకల్లోలం అయింది.

ఆ రోజూ, ఆ మర్నాడూ, ఆ మూడోనాడూ కూడా జనం కుటుంబాన్ని కాకుల్లా పీక్కుతిన్నారు. పిల్లలు అతనితో మాట్లాడటానిక్కూడా యిష్టపడలేదు. బావమరిది బండబూతులు తిడుతున్నాడు. పోలీసులు యక్ష ప్రశ్నలు వేస్తున్నారు.

రెండ్రోజులకే కుటుంబం డొక్కులా అయిపోయాడు. మొహం పీక్కుపోయి, కళ్ళు గుంటలు పడ్డాయి. మనిషి వణుకుతున్నాడు. ఎవరివైపన్నా చూడాలన్నా భయపడిపోతున్నాడు. అన్నం తినలేదు. నీళ్ళు తాగలేదు. పలకరిస్తే ఏడ్చేసేటట్లున్నాడు. ఒక్కళ్ళూ అతన్ని సానుభూతిగా పలకరిద్దామని చూడలేదు కూడా.

ఇదంతా గమనిస్తున్న శరత్‌కి కుటుంబాన్ని పలకరించి సానుభూతి చూపిద్దామనిపించింది. రాధాసుందరి అరుపులూ కేకలూ ఇన్నాళ్ళనుంచీ వింటూనే ఉన్నాడు. ఆవిడకి సహనం తక్కువ. గయ్యాళి. ఆత్మహత్య చేసుకునేంత కారణాలు లేవుకూడా. ఇవేవీ ఆలోచించకుండా సమయం దొరికింది కదా అని నిర్దాక్షిణ్యంగా ఒక మనిషిని అన్యాయంగా ఇంతమంది ఇన్ని మాటలంటున్నారే అని బాధ కలిగింది.

కుటుంబంని పలకరిద్దామనుకున్నాడుగానీ రాజేశ్వరి అడ్డంగా మాట్లాడి పోనివ్వలేదు.

"మీకెందుకు... ఆయనతో బాగా మాట్లాడుతుంటే చూసి మీకూ ఏదో ఉందనుకుంటారు. పదండి... లోపలికి పదండి... అనవసరంగా చిక్కుల్లో పడిపోవటం అంటే భలే హుషారు మీకు" అంది.

చేసేది లేక బయటికి పలకరించకపోయినా మనసులోనే సానుభూతి తెలుపుకుని ఊరుకున్నాడు.

ఆ రోజు, రాత్రి ఏడు గంటలవుతోంది.

ఆ వీధిలో జనం ఎప్పటిలాగే గుంపుగా చేరి రాధాసుందరి అదృశ్యం గురించి చర్చిస్తున్నారు. లోపల గదిలో కూర్చుని కుటుంబం బిక్కు బిక్కుమంటూ తన భవిష్యత్తేమిటా అని ఆలోచిస్తున్నాడు.

ఇంతలో ఒక ఆటో ధడేల్ను వచ్చి ఆగింది. అందులోంచి రాధాసుందరి దిగింది.

చూసేవాళ్ళు కళ్ళు పత్తికాయల్లా చేసుకుని మంత్రముగ్ధుల్లా నిలబడి ఉన్నారు.

రాధాసుందరి దర్జాగా ఇంట్లోకి ప్రవేశించింది. ఆవిడ్ని చూడగానే కుటుంబం రాధా అంటూ వచ్చి కౌగిలించేసుకున్నాడు.

''ఏమ్మా... ఎక్కడికెళ్ళావు. ఏమై పోయావోనని పోలీసు రిపోర్ట్ ఇచ్చాను'' అన్నాడు ఇంటిగలాయన.

''అవును రాధా... చెప్పకుండా వెళ్తే మేం ఎంత గాభరాపడ్డామో తెల్సా'' అన్నాడు కుటుంబం.

రాధాసుందరి దర్పంగా నవ్వింది.

''అదే... మీకు నా విలువ తెలియాలనే కొన్నాళ్ళు కనబడకూడదని వెళ్ళాను. మా ఫ్రెండు అచ్చమాంబ యాత్రాస్పెషల్ బస్సు వేసిందిగా. డబ్బులు తర్వాత ఇవ్వొచ్చులెమ్మంది. హాయిగా నాలుగు ఊళ్ళు చూసి వచ్చాను'' అంది తేలిగ్గా.

''చెప్పి వెళ్ళాల్సింది...'' సణిగాడు కుటుంబం.

వార్త తెలిసి వచ్చిన బావమరిది మాట్లాడకుండా కూర్చున్నాడు. నోరు విప్పలేదు. రాధాసుందరిని చూసి వెళ్ళిపోయాడు.

''ఇంత మాత్రానికే హడిలి పోలీసు రిపోర్ట్ ఇస్తారా'' అని భర్తనే ఎదురు సాధించింది రాధాసుందరి.

''నేను ఇవ్వలేదు మీ తమ్ముడే ఇచ్చాడు. అది కూడా నిన్ను నేను హత్య చేశానని అభియోగంతో ఇచ్చాడు'' అనలేకపోయాడు కుటుంబం.

''మేం ముందే అనుకున్నాం ఆవిడే ఎక్కడికో వెళ్ళి ఉంటుందని...'' అన్నాడు ఇంతకు ముందే కుటుంబం రాధాసుందరిని హత్యచేసి ఉంటాడని బల్లగుద్ది వాదించిన పెద్దమనిషి.

''నేను చెప్పలా... ఆయన మంచాడండీ. ఆవిడ ఎటుపోయిందోనని'' అన్నాడు ఇంకొకాయన.

శరత్‌కి వాళ్ళందరినీ చూస్తే నీరసం వచ్చేసింది. ఏం మనుషులు. నిమిషాలమీద మాటలు ఎట్లా మార్చేశారు.

రాధాసుందరిని చూస్తే ఆశ్చర్యం వేసింది. ఏమాత్రం తొణక్కుండా, బెణక్కుండా నవ్వుతూ కబుర్లు చెప్తోంది. ఆవిడ అక్కడ హాయిగా యాత్రలు చేస్తుంటే ఇక్కడ కుటుంబం ఎంత రంపపుకోత అనుభవించాడు పాపం.

కుటుంబాన్ని చూస్తుంటే జాలేసింది. అతని స్థానంలో తనని ఊహించుకుని హడిలిపోయాడు. ఏం సంసారాలు. యాభై ఏళ్ళొస్తున్నా కొట్టుకు చస్తూ, ఒకళ్ళనొకళ్ళు ద్వేషించుకుంటూ, ఒకరిమీద ఒకళ్ళు పంతం పడుతూ, ఒకళ్ళనొకళ్ళు గెలవాలని అహర్నిశలూ ప్రయత్నిస్తూ, ఆరాటపడుతూ, నిరంతర పోరాటం సలుపుతూ... ఏం జీవితం.

సంసారంలో శాంతి అనేది లభించదా?

ఎన్ని ఏళ్ళొచ్చినా, సంసారం మొదలుపెట్టి దశాబ్దాలు గడిచినా రాతలూ మారవు, బుద్ధులూ మారవు. ఇంకెందుకు ఈ జంజాటం.

అసలే ఆడవాళ్ళంటే భయపడే శరత్‌కి ఈ సంఘటనవల్ల ఆ భయం పెరిగింది.

''నువ్వీ మధ్య అదోలా ఉంటున్నావేం'' ఆప్యాయంగా అడిగాడు గుర్నాధం.

అతనంత ప్రేమగా అడిగితే శరత్ కళ్ళల్లో నీళ్ళు తిరిగినట్లయింది. ఆ క్షణంలో గుర్నాధం పరమ ఆప్తుడిలా తోచాడు.

''గుర్నాధం... మా ఆవిడ చెప్పానుగా... నన్ను పూచిక పుల్లంత లెఖ్ఖ కూడా చెయ్యటం లేదు. ఆవిడకి నేను తన అవసరాలు తీర్చే యంత్రాన్ని మాత్రమే. మా మధ్య ప్రేమాభిమానాలు లేవు. ఉన్నదల్లా అవసరాల అనుబంధం... నాకేంటో బతుకుమీద ఆశపోయింది అసలు'' అన్నాడు.

''ఏడిసినట్లుంది. ఏ భార్య అయినా భర్తంటే తన అవసరాలన్నీ తీర్చే యంత్రంగానే చూస్తుంది. ఇందులో మీ ఆవిడ గొప్పేమీ లేదు. ఇంక భార్యాభర్తల బంధమే కాదు ఏ బంధం అయినా ఆర్థిక సూత్రాల మీద బంధింపబడ్డదే''

"ప్రేమగా ఒకరికోసం ఒకరు బతికే వాళ్ళెంత మంది లేరు"

"ఉంటే వాళ్ళ అదృష్టం వాళ్ళది. మనమేం చెయ్యలేం"

"మా అమ్మంటే గిట్టదు ఆవిడకి"

"అత్తంటే ఎవరికీ గిట్టదు. ఇందులో ఆవిడ గొప్పతనం ఏముంది"

"ఎవర్నడిగినా ఇదే అంటున్నారు"

"జీవితంపట్ల అందరికీ అవగాహన ఉంటుంది కాబట్టి అటూ ఇటూగా అవే అభిప్రాయాలుంటాయి వాళ్ళకి"

"సరే... యిప్పుడు ఇంకా నా గురించి నువ్వు అడిగి మాత్రం ఏం ప్రయోజనం. నీ ఖర్మ నోరుమూసుకోమంటావు. అంతేగా..."

గుర్నాధం జాలిగా చూశాడు.

"శరత్... నువ్వు నాకు ఆత్మీయుడివి. నువ్వు సుఖంగా ఉండటం నాకు కావాలి. నువ్వు చిన్నచిన్న సమస్యలను పెద్దవిగా చేసుకుని లేనిపోని బాధలు పడుతున్నావు. అసలు నన్నడిగితే ఈ వివాహబంధాన్ని రద్దు చేయాలంటాను. ఒక జీవితకాలం తప్పనిసరిగా కలిసి ఉండాలి. ఈ బంధం సహజ సంబంధం కాదు. అంటే అన్నా చెల్లెళ్ళలాగానో, అక్కా తమ్ముళ్ళలాగానో మన పుట్టుకతో ఏర్పడ్డది కాదు. మనం ఎరగని మనిషిని పెళ్ళి పేరుతో మన సహచరులుగా తప్పనిసరిగా అంగీకరించి తీరాలి. ఏ మాధుర్యమూ, అనుభూతులూ లేకుండా ప్రేమ శూన్యమై నిస్సారంగా గడుపుతున్నారు చాలామంది భార్యాభర్తలు. కారణం ఏమిటంటే ఒకళ్ళకోసం ఒకళ్ళు చిన్న చిన్న త్యాగాలక్కూడా సిద్ధపడకపోవటం. శుభ్రంగా ఏళ్ళొచ్చి, స్వార్థం పెరిగి, నా కోసం నేను, నా సుఖం నాది అనుకుని బతికే ఈ మనుషులు ఒకళ్ళని చూస్తే ఒకళ్ళకి పడక కొట్టుకు చస్తున్నారు. వాళ్ళ సంగతి వదిలెయ్యి. నీ సంగతి ఆలోచిస్తే నీ భార్య మారదు. ఆవిడ కోసం నువ్వేమారాలి" అన్నాడు.

"నన్ను ఆవిడ ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నట్లు ఫీలవుతే చాలు మనసులో ఏదో దిగులు"

"ఎక్స్‌ప్లాయిటేషన్ ఏముంది. నీ స్వార్థం నీది... ఆవిడ స్వార్థం ఆవిడది"

"నాది స్వార్థమా..." శరత్ ఆశ్చర్యపోయాడు.

"అవును... స్వార్థంకాక మరేంటి. నీకు నీ సంసారం కావాలి. నీ పెళ్ళాం కావాలి. రాత్రి అవుతే ఆ అనుభవం కావాలి. ఇవేవీ అక్ఖర్లేకపోతే ఆవిడ్ని యిదేంటని నిలదీసి అడిగి ఐసాపైసా తేల్చుకునేవాడివి. కానీ నీకు యివన్నీ కావాలి. కాబట్టి ఆ సంగతి బయటపెట్టకుండా నిన్ను నువ్వు మభ్యపరచుకుంటున్నావు. ఆవిడ విడిపోయినా ఆవిడకాకుంటే యింకో ఆవిడనన్నా చేసుకోవాలి, నీ శారీరక సుఖాలకోసం. మళ్లీ ఇంకెలాంటిది వస్తుందోనని నీకు భయం. అందుకని ఈవిడతోనే సరిపుచ్చుకుపోతుంటావు. నీ అంతరంగంలో భావం ఇదే అయినా నీ మనసుని నువ్వు మోసం చేసుకుంటూ నీ స్వార్థానికి మెతకదనం, మంచితనం అని రంగులు పులుముకుంటున్నావు. మీ ఆవిడ బయటపడుతోంది. నువ్వు బయటపడటంలేదు, అంతే"

"చాలా ఘోరంగా ఉందీ వివరణ"

"నిజం ఎప్పుడూ చేదుగానే ఉంటుంది. నువ్వే కాదు నేనూ నీ స్థితిలోనే ఉన్నాను కాబట్టి యింత చక్కగా నీ మనస్తత్వాన్ని ఎనలైజ్ చెయ్యగలిగాను. నేను మా ఆవిడతో పోట్లాడుతున్నప్పుడు నాకెంత అసహ్యం వేస్తుందో తెలుసా. ఆవిడ మొహం మళ్లీ చూడబుద్ధి కాదు. పరమ అసహ్యంగా అనిపిస్తుంది. మళ్ళీ అదే మనిషిని అదే రాత్రి తమకంతో కౌగిలించుకుంటున్నప్పుడు అప్పుడు ఆ కోరిక తప్ప మరేం ఉండదు. కానీ ఆ తర్వాత ఛీ నేనేనా అంత ఆత్మగౌరవాన్ని చంపుకుని ప్రవర్తించింది అనిపిస్తుంది. ఈ వివాహబంధం అనేది లేకుండా పోయిందనుకో, అప్పుడు కానీ ఈ మానసిక వ్యభిచారం నుంచి మనుషులు బయటపడరు. మనకి శారీరక సుఖం అవసరం అన్నది మన పెళ్ళాలకి తెలుసు. కాబట్టి మనల్ని ఆ బలహీనతతో నొక్కేస్తారు. నువ్వు ఋషి పుంగవుడిలా ఆ కోర్కెలు చంపుకో. వాళ్ళు నీకు బానిసలు అవుతారు"

"చచ్చినా కారు... మనకేదో శారీరక బలహీనత ఏర్పడిందనుకుంటారు. ఆడవాళ్ళ సంగతి నాకు బాగా తెల్సు. వాళ్లకి మంచి ఆలోచనలురావు"

''బాబోయ్... అయితే మనం ఇట్లా మానవ మాత్రులలాగా ఉండటమే మంచిది''

''అవును...''

గుర్నాథం ఉన్నట్లుండి నవ్వటం మొదలు పెట్టాడు.

''ఏంటి నవ్వుతున్నావు''

''ఏం లేదు. మన పెళ్లాలేనయం. పోట్లా డ్తూనో ఏడుస్తూనో అసలు కాపరాలంటూ చేస్తు న్నారు. అదే మన ముకుందం లేడూ అతని పెళ్లాం అయితే వెనకింటాయనతో లేచిపో యింది తెల్సా''

''ఛీ... అంతపని చేసిందంటే నేను నమ్మ ను''

''నువ్వు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం... ఏం జరిగిందంటే మన ముకుందం బొంబాయి వెళ్లి రెండేళ్ళు అదేదో కోర్స్ చదివా డు తెల్సుగా''

''ముకుందానికి బోలెడు ఆశలున్నాయి. కా రు కొనాలనీ, పెద్ద బంగళా కట్టించాలనీ...

తన భార్యనీ, తల్లినీ వదిలి బొంబాయి వెళ్ళాడు. ముకుందం భార్య ఒక మోస్తరుగా ఉంటుంది. పెద్ద అందగత్తె కాదు. ముకుందం భార్య అంటే పడి చస్తాడు. ఆవిడ్ని సుఖపెట్టా లని నానా తిప్పలూ పడుతుంటాడు.

ముకుందం బొంబాయిలో ఉండటం చూసి విసుగెత్తిపోయిందో ఏమిటో ఈ మహాతల్లి... ఎట్లా అయిందో ఎనకింటోడితో పరిచయం పెరిగి చివరికి వాడితో పారిపోయింది. మళ్ళీ వచ్చిందిటలే''

''ఏమో... మనకనవసరం అయిన విషయా లు మనం మాట్లాడకూడదు''

''అది కాదు శరత్...''

''ఇంకేం చెప్పకు... ఇట్లాంటి విషయాలు నాకసహ్యం. నాతో ఇట్లాంటివి మాట్లాడకు''

''సరే... నాదేంపోయింది. నేనూ మాట్లాడ ను'' ఇద్దరూ లేచారు.

★ ★ ★

చెల్లెలు సంసారం చూసిన కొద్దీ రాజేశ్వరికి తాము కూడా విడిగా ఉంటే బాగుండునన్న కోరిక బలపడింది.

రామ్‌గోపాల్, వనిత ఇద్దరూ అలంకరణలు అంటే ఇష్టం ఉన్నవాళ్లే. ఇల్లు నీట్‌గా సర్దు కుంటారు. ఉన్నంతలో గొప్పగొప్ప షోపీస్‌లు తెచ్చి ఇల్లు సర్దారు.

వాళ్లని చూసి రాజేశ్వరి కూడా ఇంట్లో కొన్ని అలంకరణలు చేసింది. మంచి కర్టెన్లు, సోఫా సెట్లు, షర్బత్ సెట్‌లూ, టీ కప్పులూ కొన్నది. కొత్త కొత్త సామాన్ల మధ్య ముసలి అత్తగారు రోతగా అనిపిస్తున్నది.

కొత్త ఫ్రెండ్స్ కూడా ఏర్పడ్డారు. రామ్‌గోపాల్ తనకి తెలిసిన వాళ్లందరి ఇళ్ళకీ భార్యని వెంటబెట్టుకు వెళతాడు. వనిత మళ్లీ వాళ్ళి ంటికి వెళ్లేటప్పుడు రాజేశ్వరిని కూడా తనతో తీసుకు వెళ్ళింది. వాళ్ళందరి గొప్పనీ చూసి రాజేశ్వరి అబ్బురపడింది. వెంటనే వాళ్ళతో పరిచయం పెంచుకుని ఆప్యాయంగా మాట్లా డి తన యింటికి రమ్మని ఆహ్వానించింది.

వాళ్ళందరి ముందూ నీరుకావి చీరెతో, నగలూ నట్రాలూ లేని బోసి మొహంతో శాంత మ్మ తిరుగుతుంటే చిన్నతనంగా అనిపిస్తోంది రాజేశ్వరికి. వాళ్లవి చాలామటుకు విడికాపురా లు. ఒకళ్లో యిద్దరో అత్తగారితో కలిసి ఉంటు న్నా, ఆ అత్తగార్లు బోలెడు దర్జాగా ఉంటారు. పనిమనిషిలాంటి శాంతమ్మని చూపించుకోవా లంటేనే సిగ్గుగా ఉంది.

ప్రవీణ్ పెద్ద వాడైపోయాడు. వాడి పనులు వాడు చేసుకుంటాడు. ఒక పనిమనిషిని పెట్టు కుంటే చాకిరీ చేసిపారేస్తుంది. వంట తను చేసుకోలేకపోదు. ఇంక ఈ అత్తగారెందుకూ, తిండి దండక్కి కాకపోతే.

రాజేశ్వరి ఆలోచనకు తల్లితండ్రులు ఆనందించి తమ సంపూర్ణ సహకారం ఆవిడకి ఎల్లప్పుడూ ఉంటుందని అభయం ఇచ్చారు.

రాజేశ్వరి శరత్‌ని అప్పుల చక్రంలో బిగించింది. మార్వాడీ దగ్గర అప్పు, బట్టల కొట్లో అప్పు...

శరత్ అప్పు చెయ్యటానికి ఎప్పటికప్పుడు కొత్తగా, భయంగా అనిపించి వణికిపోతాడు.

ఆ బలహీనత కనిపెట్టి రాజేశ్వరి మరీ ఏడిపించేస్తున్నది.

''నాకు అప్పులంటే భయం... ''అన్నాడు

ఒకసారి ధైర్యం చేసి.

"ఎందుకు భయం... అయినా వాళ్లకి ఎప్పుడిచ్చినా ఫర్వాలేదు. అడగరు. ఏమీ అనుకోరు" అంది

"మనం తీరుస్తున్నాం కాబట్టి అడగటం లేదు. రేపేదైనా రోగం వచ్చి మూలపడితే..." అన్నాడు శరత్.

"మీకేం చేతకాదు. మీరు వట్టి అసమర్థులు. పిరికివాళ్లు. మీ పిరికితనానికి ముందు జాగ్రత్త అనే ముసుగువేస్తున్నారు..." అంది రాజేశ్వరి తేలిగ్గా చూస్తూ.

ఆమె మాటలకి మనస్సు చివుక్కుమంది.

ఆవిడ తన మాట వినదు. తనే ఆవిడ మాట వినాలి. తప్పదు. అప్పు చేస్తున్నప్పుడల్లా తన మీద తనకే జాలి. రాజేశ్వరి మీద కోపం.

దేనికి ఈ అప్పులు, తిండికా కనీసావసరాలైన బట్టా గూడూ కోసమా కాదు. గొప్పలకి, సుఖాలకి, కొత్త చీరెలకి... కొత్తరకాల నగలకి.

రాజేశ్వరి ఎప్పుడు మారుతుంది. మనిషికి కావల్సినవేమిటో ఎప్పుడు తెలుసుకుంటుంది.



"మీ అమ్మని వేరే ఉంచుతానని ఎప్పట్నుంచో అంటున్నారు. ఎప్పుడు చేస్తారావని" నిలదీసింది రాజేశ్వరి.

శరత్ అనుకోని ఈ దాడికి హడిలిపోయాడు.

"ఆవిడెక్కడికి వెళ్తుంది" అన్నాడు నీరసంగా.

"అదంతా నాకు తెలీదు. ఆవిడ నన్ను చూస్తే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటుంది. నేను కాస్త మంచి చీరె కట్టినా, సినిమాకో షికారుకో వెళ్ళినా చచ్చేట్లు ఏడుస్తుంది. నాకావిడతో పడదు. ఈ ఇంట్లో నేనో ఆవిడో ఏవరో ఒకళ్లమే ఉండాలి"

"ఏం చెయ్యమంటావు"

"మీ అక్కని పిల్చి మాట్లాడండి. ఆడపిల్లలూ మగపిల్లలూ అంతా సమానమేగా. ఆవిడ మాత్రం ఏ బాధ్యతా లేకుండా ఎలా ఉండాలి. రేపొద్దున్న నాకు మా అమ్మకి చేయాల్సిన అవసరం వచ్చిందనుకోండి. ఆనందంగా చేస్తాను"

రాజేశ్వరి శరత్‌ని బలవంతం చేసి అక్క భానుమతికి ఉత్తరం రాయించింది.

భానుమతి ఊరునుంచి వచ్చింది.

"ఇంకా పొలం అమ్మిన డబ్బులో భాగం ఇస్తారేమోననుకొని వచ్చాను. అమ్మని మా ఇంటికి ఎలా తీసుకెళ్లను. మా అత్తగారూ, ఆడపడుచులూ ఊరుకోరు" అంది.

నిజానికి భానుమతి అత్తగారింటివాళ్ళు అంత దుర్మార్గులేం కారు. భానుమతి తల్చుకుంటే వాళ్లని ఒప్పించగలిగి ఉండేది. కానీ ఎందుకో ఆమె ఈ బాధ్యత తననెత్తిన వేసుకోదల్చుకోలేదు. బహుశా ఒకసారి తీసుకెళితే ఇంక శాంతమ్మ పోయేదాకా ఆవిడ ఖర్చంతా తనే భరించాల్సి వస్తుందనో ఏమో... తల్లి తన బిడ్డలు పదిమందికైనా భోజనం పెడ్తుంది కానీ పదిమంది పిల్లలు చేరి కూడా ఒక్క తల్లికి భోజనం పెట్టరనే సామెత ఉందిట...

"మీ ఫ్రెండ్ జలజ వాళ్ళమ్మని తన దగ్గరే ఉంచుకోలేదూ. మీరు తల్చుకుంటే మీ వాళ్ళేం అంటారు" అంది రాజేశ్వరి.

"జలజ వాళ్ళమ్మని తన దగ్గరే ఉంచుకుందంటే... వాళ్ళమ్మకి బోలెడు డబ్బుంది, నగలున్నాయి" అంది భానుమతి నోరుజారి.

మళ్ళీ తన మాటలు ఎలా ధ్వనిస్తాయో అర్థమై సర్దుకుంది. "అంటే... ఆ డబ్బుకి ఆశపడి జలజ అత్తగారు కూడా ఆవిడ వాళ్ళతో ఉంటే అభ్యంతరం చెప్పలేదు" అంది.

"మీకు డబ్బుకి ఏం ఇబ్బంది ఉండదు. మేం నెలనెలా కొంత డబ్బిస్తాం" అంది రాజేశ్వరి.

భానుమతి ఒప్పుకోలేదు. పెద్ద పోట్లాట వేసుకుని వెళ్ళిపోయింది.

"మీ వాళ్ళందరూ ఇంతే... ఏ సాయం చెయ్యరు. అదే మావాళ్ళు చూడండి... ఎన్ని చేస్తున్నారో" అంది రాజేశ్వరి భానుమతి వెళ్ళాక.

శాంతమ్మకి కూతురి దగ్గరికి కూడా వెళ్ళేమార్గం లేదని తెలిశాక ఆవిడని గడ్డిపోచంత విలువ కూడా లేకుండా మాట్లాడ్తోంది రాజేశ్వరి.

ఎందుకు ఆవిడతో పోట్లాడుతుందో, ఏ విషయంమీద రాజేశ్వరికి కోపం వస్తుందో తెలీదు. అంత భయభక్తుల్లో ఉంచింది అత్తనీ, భర్తనీ.

ఎట్లాగయినా శాంతమ్మని ఇక్కడ్నుంచి తరమాలి... అంతే. "మా నాన్నకి డబ్బెప్పుడిస్తారు" అంది ఒకరోజు.

"ఏ డబ్బు"

"ఏ డబ్బా. కట్నం డబ్బు తిరిగి ఇస్తామన్నారుగా"

"ఇప్పుడు నావల్ల కాదు"

"అయితే ఆవిడ్ని వేరే ఉంచండి"

"దానికీ దీనికీ సంబంధం ఏంటి"

"ఉంది... ఉందంటే... ఉందంతే" ఉన్మాదంగా అరిచింది రాజేశ్వరి.

ఎందుకోగానీ శరత్‌కి కూడా పిచ్చికోపం వచ్చింది.

"ఉంటే ఉంది. అసలు నువ్వెందుకిలా చేస్తున్నావు. లోకంలో కోట్లాదిమందికన్నా నువ్వెంతో సుఖంగా వున్నావు. అది నీకు తెలియటం లేదు. ఎంత శాంతంగా ఉన్నా అన్నీ అమర్చిపెడ్తున్నా ఇంకా గోల చేస్తున్నావు. ఒక్కసారి ఆత్మవిమర్శచేసుకో" అన్నాడు.

ఈ భాషకు రాజేశ్వరి అదిరిపడింది.

వెంటనే తోకతొక్కిన తాచులా లేచింది.

"ఏమిటి మీరనేది. నేను జగడాలమారినా... అవును నేను అన్నిటికీ పోట్లాడ్తాను. మీ తల్లిగారు శాంతమూర్తులు. అంత శాంతమూర్తి నాలాంటిదానిచేత మాటలుపడ్తూ ఇక్కడ ఉండటం దేనికి పొమ్మనండి"

"ఇప్పుడు ఉన్నపాటున పొమ్మంటే ఎలా. ఆవిడకి మాత్రం ఎవరున్నారు. ఎక్కడికి వెళ్తుంది"

"లోకంలో ఎంతోమందికి ఎవరూ లేరు. వాళ్ళల్లో ఈవిడా ఒక్కత్తి"

శరత్ వెర్రికోపంతో రాజేశ్వరి చెంపమీద ఒక్కటి కొట్టాడు. రాజేశ్వరి కెవ్వున కేకవేసి ఏడవటం మొదలుపెట్టింది. తల్లి ఏడవటంతో ప్రవీణ్ తనూ ఏడుస్తున్నాడు.

శాంతమ్మ హడిలిపోయింది. ఏం జరుగుతున్నదోనని భయంతో వణికిపోతోంది.

సుబ్బాయమ్మా, భర్తా పరుగెత్తుకొచ్చారు.

రాజేశ్వరి ఏడుస్తూ కేకలు పెడ్తోంది. కేకలకి చుట్టుపక్కలవాళ్ళు చేరారు. తన తెలివితో ఆ సంఘటన తనకి అనుకూలంగా మార్చుకుంది రాజేశ్వరి.

భర్తా, అత్తగారూ కలిసి తనను చిత్రహింసలు పెడ్తున్నట్లు, కట్నం డబ్బుకోసం వేధిస్తున్నట్లు చెప్తోంది అందరికీ ఏడుస్తూ.

శాంతమ్మా, శరత్ సిగ్గుతో చచ్చిపోయారు.

రాజేశ్వరికి క్రొత్తగా పరిచయమైన మిసెస్ పరాత్పరం ఆవిడ్ని చూసిపోవటానికని వచ్చిందల్లా ఈ సీన్‌ని చూసి మహదానందపడింది. ఆవిడకి ఉపన్యాసాలంటే మహా అభిమానం.

"ఇట్లాంటి కిరాతకుల్ని ఊరికే వదలకూడదండీ. జైల్లో పడేసి చితకకొట్టించాలి" అంది కసిగా శాంతమ్మవైపు చూస్తూ.

శాంతమ్మ దిక్కుతోచక నిలబడివుంది.

ఎవరో ఫోన్ చేసినట్లున్నారు రంగమ్మా, సూర్యనారాయణా వచ్చేశారు ఆటోలో.

"అయ్యో తల్లీ... ఏం జరిగిందే" రంగమ్మ తనూ ఏడవటం మొదలుపెట్టింది.

శరత్‌కి రాజేశ్వరిని చూస్తే రాక్షసిని చూసినట్లనిపిస్తోంది. ఆమెమీద కోపం, ద్వేషం... ఆవేశాన్ని ఆపుకోలేకపోయాడు.

"ఆవిడ చెప్పేదంతా అబద్ధం. తనే మా అమ్మగారంటే పడక ఇట్లా మాట్లాడ్తోంది" అన్నాడు ఆవేశంగా.

సూర్యనారాయణ ఇంకా ఆవేశంగా మాట్లాడాడు.

"ఏంటయ్యా అబద్ధం. నా బిడ్డ ఎంత సర్దుకుపోతున్నా నువ్వే రోజుకో రగడ సృష్టిస్తున్నావు. ఇప్పుడు కొట్టావు. కట్నం కోసం వేధిస్తున్నావు. నీ తల్లి నీకు లేనిపోని ఆలోచనలు

చెప్పి మీరిద్దరూ కొట్టుకుచచ్చేట్లు చేసి, చూసి ఆనందిస్తోంది. నువ్వు వేరే కాపురం పెడితే గానీ కుదరదు అంతే'' అన్నాడు.

''అవును. ఆవిడనుంచి రాజేశ్వరికి రక్షణ కల్పిస్తేగాని సమస్య పరిష్కారం కాదు'' అంది మిసెస్ పరాత్పరం.

తన ప్రమేయం లేకుండానే తన కుటుంబ విషయాలు బహిరంగంగా చర్చించబడి వీధిలో నిర్ణయాలు జరుగుతున్నాయి. ఛీ... ఈ పరిస్థితి రాజేశ్వరికి ఎలా బాగుంది.

''నాకు తెలియకడుగుతాను. ఏదో దురుద్దేశం లేనిది మీ అమ్మని విడిగా ఉంచటానికి అంత పట్టుపడ్తావా'' అన్నాడు సూర్యనారాయణ.

''సరేనండీ... సరే... ముందు మీరంతా వెళ్ళండి'' అన్నాడు శరత్.

''వెళ్తాం. కానీ అమ్మాయి ఏ అఘాయిత్యం చేసుకున్నా దానికి నీదే బాధ్యత. గుర్తుంచుకో'' ఉరిమిచూసి నిష్క్రమించాడు సూర్యనారాయణ.

అందరూ వెళ్లాక శాంతమ్మ తన బట్టలు సర్దుకుంది.

''వెళుతున్నాను'' అంది శరత్‌తో.

''ఎక్కడికమ్మా''

''ఏ గుళ్ళోనో తలదాచుకుంటాను''

''వద్దమ్మా. నామాట విను. ఈ సమస్యకి నేను ఏదో పరిష్కారం ఆలోచిస్తాను'' అన్నాడు శరత్.

వంటింట్లోంచి దబ్బున చప్పుడు వినబడింది. మళ్ళీ ఏమైందా అని గుండెలు అదురుతుండగా వంటింట్లోకి పరుగెత్తాడు.

కిరసనాయిల్ డబ్బా నేలమీద పడివుంది.

ఎదురుగా రాజేశ్వరి...

కిరసనాయిల్ ఒళ్ళంతా దిమ్మరించుకున్నట్లుంది.

చేతిలో అగ్గిపెట్టె...

''ఆవిడ వెళ్తానంటే ఆపుతారేం... చెప్పండి...'' గర్జించింది.

శరత్ నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

''ఆవిడ్ని వేరే కాపరం పెట్టుకోమంటారా లేదా... చెప్పండి. లేకపోతే నేను అంటించేసుకుంటాను'' అరిచింది గట్టిగా.

''వద్దమ్మా వద్దు. ఈ ఘోరం చెయ్యకు. నేను మీ ఇద్దరికీ అడ్డురానమ్మా. పిల్లాడి మొహం చూసైనా ఈ పనిమాను'' బతిమాలింది శాంతమ్మ.

''ఆ విషయం ఆయన్ని చెప్పమనండి''

''చెప్తాడమ్మా. శరత్ చెప్పరా నాన్నా. శరత్ గొడవలెందుకురా చెప్పు'' అన్నది శాంతమ్మ ఏడుస్తూ.

''రాజేశ్వరీ. నీ ఇష్టప్రకారమే చేస్తాను'' అన్న శరత్ మాటలకి రాజేశ్వరి మెత్తబడలేదు.

''అట్లా చెప్తేకాదు. పిల్లవాడిమీద ప్రమాణం చేసిచెప్పండి'' అన్నది.

చివరికి ప్రవీణ్‌ని తీసుకువచ్చి శాంతమ్మని వేరే ఇల్లు చూసి ఉంచుతానని వాడి తలమీద చెయ్యివేసి చెప్పేంతవరకూ రాజేశ్వరి శాంతించలేదు.

ఆ తర్వాతే బాత్‌రూమ్‌లోకి వెళ్లి స్నానం చేసింది.

''ఏంటయ్యా. కిరసనాయిల్ వాసన...'' అంది సుబ్బాయమ్మ. మళ్లీ వచ్చి.

''ఏంలేదు. నా బతుకు కాలిపోయి వాసనకొడ్తోంది. అంతే'' కసిగా అన్నాడు శరత్.

''అయ్యో... అదేంటి నాయనా అంత విసుగు. ఆ పిల్ల ఏదన్నా అఘాయిత్యం తలపెట్టిందేమోనని...'' అంది సుబ్బాయమ్మ.

''ఇంకా ఏ అఘాయిత్యమూ చెయ్యలేదు. మీరు వెళ్లిరండి''

శరత్ మాటలకి సుబ్బాయమ్మ వెళ్ళలేదు.

ఇంతలో ఆవిడ మొగుడు వచ్చాడు. ఆయనంటే శరత్‌కి పెద్ద సదభిప్రాయం లేకపోయినా దురభిప్రాయం మాత్రంలేదు.

''శరత్... మళ్ళీ ఏదన్నా గొడవా'' అన్నాడు.

''ఏంలేదండీ. అదే గొడవ. వేరే కాపరానికి ఒప్పుకుని ఒట్టేసుకుని చెప్పాక ఊరుకుంది లెండి''

సుబ్బాయమ్మ భర్త మాట్లాడలేదు కొంచెంసేపు.

''ఏంచేస్తాం శరత్. ఇద్దరు ఆడవాళ్లు చేర్తేనే పోట్లాట. రెండు కత్తులు ఒక ఒరలో యిముడ్తా

యికానీ, రెండు సిగలు ఒకచోట కలవ్వు అంటారు. అంతే... ఆ ఆడవాళ్లు అత్తా కోడళ్ళు యితే ఇక చెప్పక్కర్లేదు.

"కానీ మా అమ్మ ఎంత సర్దుకుపోయినా మా ఆవిడకి పడటంలేదు. కారణం తెలీదు"

"కారణం ఏమిటంటే ఆవిడ అత్తగారు కావటమే"

"మీరే చెప్పండి. నన్నింతవాణ్ని చేసిన మా అమ్మగార్ని ఆవిడ ఖర్మానికి ఆవిడని వదిలెయ్యటం ధర్మమా. నేను పనికొస్తానుగానీ మా అమ్మ పనికిరాదా. ఆ తల్లే లేంది ఈ కొడుకుండేవాడు కాడన్న ఆలోచన ఆవిడకి రాదా. ఈ వయసులో ఆవిడ్ని ఒంటరిగా ఉంచటం ధర్మమా..." ఆవేదనగా అన్నాడు శరత్.

"ఒకతరానికి ఇంకోతరం ఎప్పుడూ పడదు. చరిత్ర పునరావృతమవుతూనే ఉంటుంది.... కొన్నాళ్ళకి వీళ్ళ కోడళ్లు వస్తే వాళ్ళకి వీళ్ళని చూసి చిరాకేస్తుంది"

శరత్ ఇంకేం మాట్లాడలేదు.

"శరత్ నువ్వెంత బాధపడినా ప్రయోజనంలేదు. నువ్వు మీ ఆవిడముందు గెలవలేవు" అన్నాడాయన.

ఆ తర్వాత ఆయన బోలెడు విషయాలు చెప్పాడు. రాజేశ్వరి శాంతమ్మని పంపించెయ్యటానికిముందే పథకం వేసిందట. అందరితో సంప్రదించి ఈ గొడవ లేవదీసిందిట.

శరత్ కట్నం పుచ్చుకున్నట్లు రుజువు చెయ్యగలరు. చెక్కు ఇచ్చారు కాబట్టి ఆ డబ్బు తిరిగి ఇవ్వమని డిమాండ్ చేస్తారు. రెండోది కొంతమంది అబద్ధపు సాక్ష్యాలు చెప్పేవాళ్ళని కూడా రాజేశ్వరి సేకరించింది. వాళ్ళు శరత్ రాజేశ్వరిని హింసిస్తున్నట్లు, శాంతమ్మ కోడంత్రికం పెడ్తున్నట్లు సాక్ష్యం చెప్తారు. కేసుపెట్టి శరత్‌ని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించగలరు తల్చుకుంటే.

"శరత్, ఆ అమ్మాయి మంచి పట్టుదల మనిషి. తనమాటే నెగ్గాలనే రకం. ఎంతకైనా తెగిస్తుంది. నీకు ఇట్లాంటమ్మాయి దొరకటం దురదృష్టమే. ఏం చేస్తాం. మనమనుకున్న ముక్కలు రాలేదని పేక విసిరేసిపోంకదా. వచ్చిన ముక్కలతోనే ఆడాలి. మనమాట ఎంత మాత్రం చెల్లదని తెలిసి మాట్లాడి ఏం ప్రయోజనం, వాళ్ళమాటే వింటే సరిపోతుంది" అన్నాడాయన.

రాజేశ్వరి స్నానం ముగించి వచ్చి గుమ్మందగ్గర నిలబడివింటోంది.

శరత్ ఆమెవైపు చూశాడు.

ఎందుకో గుండెల్లోంచి వణుకు పుట్టుకొచ్చింది.

"విన్నారుగా. ఇంక దాచాల్సిన అవసరంలేదు. ఈ ఇంట్లో నామాటే చెల్లాలి. లేకుంటే ఊరుకోను. అంటించుకుని చస్తాను. ఊరికే చస్తాననుకుంటున్నారేమో. మీరు నన్ను వేధిస్తున్నారనీ, నా చావుకి మీరే కారణమనీ పోలీసులకి ఉత్తరం రాసిపెట్టి మరీ చస్తాను. నేను చచ్చాక కూడా మిమ్మల్ని సుఖపడనివ్వను" అంది క్రూరంగా చూస్తూ.

"రేపే ఏదో ఏర్పాటుచేస్తాను. ఒక్కరోజు గడువివ్వు" అన్నాడు శరత్ ప్రాధేయపూర్వకంగా.

"సరే" రాజేశ్వరి విసవిసా బెడ్‌రూమ్‌లోకి నడిచింది.

★ ★ ★

"మీ ఆవిడ నయం మా ఆవిడకన్నా" గుర్నాథం చచ్చేట్లు నవ్వటం మొదలుపెట్టాడు, శరత్ చెప్పిందివిని.

శరత్ కోపంగా చూసి

"జోక్స్ వెయ్యకు" అన్నాడు.

"జోక్ కాదు. పచ్చినిజం. మీ ఆవిడ కనీసం ఒక ఆశయంకోసం పోరాడుతోంది. అత్తగార్ని శత్రువుగా భావించి ఆవిణ్ని తరిమికొట్టాలని కిరసనాయిల్ అస్త్రం ప్రయోగించింది. కానీ మా ఆవిడేం చేస్తుందో తెల్సా. నేను తను కొనమన్న చీర కొనకపోయినా చాలు చచ్చిపోతానని బెదిరిస్తుంది. మొన్నొకరోజు ఉన్నట్లుండి బంగారు గాజులు కావాలంది. డబ్బు లేదన్నాను. అంతే కిరసనాయిల్ నెత్తిన పోసుకుంది. చుట్టుపక్కల వాళ్లంతా పరుగెత్తుకొచ్చి నన్నూ ఆవిడ్నీ కలిపితిట్టారు. చివరికి తలో అయిదువందలూ అప్పిచ్చి ఆ గండం గట్టెక్కించారు. నమ్మినా నమ్మకపోయినా ఇది మొన్న గురువారంనాడు జరిగింది"

"ఇంత జరిగినా నాకు చెప్పలేదేం" ఆశ్చ

ర్యంగా అన్నాడు శరత్.

"ఇది నీకు ఇంత జరిగింది అని లెక్కగా ఉందేమో. కానీ నాకు మాత్రం రోజూ దినచర్యలో భాగాలే ఈ బెదిరింపులూ, సవాళ్ళూ" నవ్వాడు గుర్నాధం.

"నువ్వు ఎట్లా భరించగలుగుతున్నావు"

"నేను ఆవిణ్ణి బొత్తిగా కేర్ చెయ్యను. అట్లా నడిపించుకోగలుగుతున్నాను జీవితశకటం. నేను ఎడ్డెం అంటే తను తెడ్డెం అంటుంది. ఇంటికి మా బంధువు లెవరన్నా వస్తే భోజనం పెట్టదు. నేను వాళ్ళకి హెూటల్లో పెట్టిస్తాను. అట్లా ప్రతి సమస్యకీ ఏదో ఒక ఆల్టర్నేటివ్ వెతుక్కుంటేసరి"

శరత్ సానుభూతిగా చూశాడు.

"ఇంతకీ నా సమస్యకి ఏంటి పరిష్కారం. నాకు దిక్కుతోచటంలేదు" అన్నాడు.

"ఏముంది. ఎటూ ఆవిడకి మాట ఇచ్చేశావు కాబట్టి మీ అమ్మగార్ని విడిగా ఉంచటమే పరిష్కారం"

"అదే ఎక్కడ..."

"మన భూపతి తెల్సుగా. వాళ్ళ అమ్మకీ వాడి పెళ్ళానికీ కూడా పడదు. అందుకని ఆవిణ్ణి హయత్‌నగర్ అవతల అదేదో చిన్న పల్లెలాంటి కాలనీ... అక్కడ చిన్నగది తీసుకుని తల్లి ఉంటోంది. నెలకి రెండు వందలిస్తాడు. ఆవిడ చచ్చినట్లు దాంట్లోనే అన్ని అవసరాలూ గడుపుకోవాలి. లేకుంటే చావాలి. అంతే గానీ వాణ్ణి పైసా ఎక్కువ అడక్కూడదు. వాడి పెళ్ళాం ఇట్లాంటి షరతులన్నీ పెట్టింది. ఆ ముసలావిడ డబ్బుచాలక, ఒంటరితనం వేధిస్తుంటే బాధపడ్తోంది" అన్నాడు గుర్నాధం.

శరత్ వింటున్నాడు. తను ముసలితనం రాకముందే చస్తే బాగుండుననిపించింది అతనికి.

"శరత్ నువ్వు భూపతితో మాట్లాడి వాళ్ళమ్మగారి గదిలోనే మీ అమ్మగార్ని కూడా ఉండనిస్తారేమో అడుగు. ఖర్చులు చెరిసగం పెట్టుకోవచ్చు. పనులు కూడా చెరికాస్తా చేసుకోవచ్చు" అన్నాడు గుర్నాధం.

"నిజంగానా... నువ్వు భూపతితో మాట్లాడటానికి తోడురా. ఈ ఏర్పాటు బాగుందనిపిస్తోంది నాకు" అన్నాడు శరత్.

తర్వాత పనులు వేగంగా జరిగిపోయాయి.

శాంతమ్మ భూపతి తల్లి రుక్మిణమ్మ గదిలో చేరిపోయింది. శరత్ నెలకి రెండువందలు శాంతమ్మకి ఇచ్చేందుకు ఒప్పందం కుదిరింది. ఒక్కొక్కసారి ఆలోచిస్తే తనమీద తనకే ఆశ్చర్యం వేస్తుంది శరత్‌కి.

గుర్నాధం మాటలు పచ్చినిజాలు అని రుజువైపోయాయి. భార్య తన తల్లిని తరిమేసింది. తనతో సామరస్యంగా ఉండదు. తనూ ఆమెని ఎంతో ద్వేషిస్తున్నాడు.

అయినా తను సంసారసుఖం ఆమెనుంచి పొందుతూనే ఉన్నాడు. ఎట్లాగ తన మనస్సు అంగీకరిస్తున్నది. గుర్నాధం అన్నట్లుగా మరో స్త్రీ అందుబాటులో లేదు కాబట్టి ఎవరో ఒకరులే అని సొంత భార్యతోనే సరిపెట్టుకుంటున్నాడా...

నిజానికి రాజేశ్వరి చేసిన పనులకి ఇంకెవరన్నా అయితే మళ్ళీ ఆమె మొహం చూసేవాడు కాదు. కానీ తన దినచర్యలో ఏమార్పూ లేదు. మామూలుగానే తింటున్నాడు. తిరుగుతున్నాడు. రాజేశ్వరితో మామూలుగా గడుపుతున్నాడు.

"గుర్నాధం నువ్వు చెప్తే అప్పుడు నమ్మలేదు కానీ ఇప్పుడు నిజమేనన్పిస్తోందయ్యా" అన్నాడు ఒకరోజు.

అప్పుడు ఆఫీసుకి ఇంకా ఎవరూ రాలేదు. గుర్నాధం శరత్ ఇద్దరే ఉన్నారు.

గుర్నాధం శరత్‌వైపు సీరియస్‌గా చూశాడు.

"నేను బోలెడు నిజాలు చెప్పాను. అందులో ఏ నిజం గురించి నువ్వు చెప్తున్నది" అన్నాడు.

"అదేనయ్యా. పెళ్ళాం మనల్ని ఎంత బాధించినా మళ్ళీ మనం ఆవిడతో మామూలుగా ప్రవర్తిస్తుంటాం అన్నావే ఆ విషయం నేను చెప్పేది"

గుర్నాధం నవ్వాడు.

"అదేనయ్యా మరి వివాహబంధంలోని మహత్తర, పవిత్రమైన బంధనం. మన మొహాలికి అంతే" అన్నాడు.

ఇదా మహత్తర, పవిత్రబంధం అంటే.

పొద్దున్న కుక్కలకన్నా హీనంగా పోట్లాడు

కుని రాత్రికి కలవటమేనా పవిత్ర మహత్తర బంధం.

భగవంతుడా... ఈ బంధం ఇంత భయంక రంగా ఉంటుందని ముందే తెలిస్తే ఇందులో ఎంతమాత్రం చిక్కుకునే వాడినికాను... శరత్ బాధగా అనుకున్నాడు.

గుర్నాధం శరత్ మొహంలో మార్పుల్ని గమనిస్తున్నాడు.

''రెండయ్యా'' అన్నాడు.

''ఏమిటి'' అన్నాడు శరత్ ఉలిక్కిపడి.

''మనిషికి కావల్సినవి రెండు... ఒకటి తిండి రెండోది సెక్స్. అంతే... తిండికోసం మనిషి నానాతిప్పలూ పడతాడు. సెక్స్‌కోసం ఎంత హీనానికైనా దిగజారుతాడు. ఉదాహర ణకి మన ముకుందం సంగతే చూడు. అతను ఇంకా ఇంకా సంపాదించాలని నానాతిప్పలూ పడ్డాడు. ఇప్పుడు ఉద్యోగం కూడా గొప్పది సంపాదించాడు. అతను ఇలా ఉంటే అతని భార్య సంగతి తెల్సుగా... నిన్న రాత్రి ము కుందం తన భార్యని వెనకింటాయనతో రెడ్ హాండెడ్‌గా పట్టుకున్నాడట. ఆ తర్వాత ఉరే సుకుని చచ్చిపోయాడు'' అన్నాడు గుర్నాధం.

శరత్ గుర్నాధంవైపు ఆందోళనగా చూశా డు.

''గుర్నాధం ఏంటి నువ్వనేది. ముకుందం చచ్చిపోయాడా. మరింత నెమ్మదిగా చె ప్తావేం...'' అన్నాడు.

''ఎలా చెప్తే ఏంఉంది. ముకుందం చచ్చి పోయాడు. శవాన్ని చూడ్డానికి వస్తావా'' గు ర్నాధం అడిగాడు.

''నేను రాను నాకు భయం'' అన్నాడు శరత్.

''భయందేనికి. బతికున్నవాళ్ళకి భయప డాలిగానీ చచ్చిన వాళ్ళని చూసి భయప డకు'' అన్నాడు గుర్నాధం.

శరత్ ముకుందం శవాన్ని చూసి చలించి పోయాడు. నాలుక బయటికొచ్చి, కళ్ళుపొడు చుకుని భయంకరంగా ఉన్న ఆ కళేబరం అతని గుండెల్ని పిండేసింది.

దుష్టులూ, దొంగలూ, ద్రోహులూ, వ్యభిచా రులూ నిర్లజ్జగా నిర్భీతిగా బతుకుతుంటే ఏ తప్పూచేయని ముకుందం ఎందుకు చచ్చిపో యాడు. ముకుందం పెళ్లాన్ని చూస్తే చంపేద్దా మన్నంత కోపం వచ్చింది.

బంగారంలాంటి మనిషికి ద్రోహంచేసి పొట్టనపెట్టుకున్న ఆ రాక్షసి మొహం కూడా చూడలేక ఆవేశాన్ని అణచుకుని బయటికి నడిచాడు.

★ ★ ★

రోజులు దొర్లిపోతున్నాయి.

శాంతమ్మ, రుక్మిణమ్మతో కలిసిపోయి బాగానే ఉంటోంది. డబ్బు చాలటంలేదని ఆ ముసలివయస్సులో వాళ్ళిద్దరూ శరీరశ్రమకి పూనుకున్నారు. అక్కడ ఒకాయన వీళ్ళతో అప్పడాలు ఒత్తించి మార్కెట్‌లో అమ్ముతున్నా డు. నెలకి నూటయాభై ఇస్తున్నాడు.

రుక్మిణమ్మ ఇంటాయన ఏదో బిజినెస్ చేస్తు న్నాడు. ఒక్కడే ఉంటాడు. భార్య ఇంకో ఊర్లో ఉద్యోగం. పిల్లలు ఆవిడ దగ్గరే ఉంటారు. ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వస్తుందిట.

శాంతమ్మకి ఒంట్లో బాగాలేదు ఈమధ్య. రాజేశ్వరి శాంతమ్మ రావటానికి ఎంతమాత్రం ఒప్పుకోలేదు. అందుకని శరత్ శలవుపెట్టి నాలుగు రోజులుండి శాంతమ్మని చూసుకున్నా డు.

సెక్షన్లో కొత్తగా ఒకమ్మాయి వచ్చింది. ఆమె పేరు కమలిని. మనిషి అందగత్తేగానీ, అందంకన్నా ఎక్కువగా మేకప్పు ఆమెకి ఆకర్ష ణని తెచ్చిపెడ్తోంది. బ్యూటీక్లినిక్‌లో ట్రెయి నింగ్‌పొంది వచ్చిందని చెప్పుకున్నారు ఆఫీ సులో చాలామంది.

కమలిని రాగానే ఆఫీసులో స్టయిల్‌గా ఉండే ఒకరిద్దరితో తప్ప మరెవ్వరితో మాట్లాడ లేదు. మెల్లమెల్లగా ఇంక తప్పదు అనుకుందో ఏమో కాస్త కాస్త మాట్లాడటం మొదలుపె ట్టింది అందరితో.

ఆమెకి పనినేర్పే బాధ్యత శరత్‌ది.

సాదాసీదాగా, ఏ ప్రత్యేకతలూ లేకుండా నగటు మనిషిలా ఉన్న శరత్‌ని చూస్తే కమలి నికి పెద్దగా లక్ష్యపెట్టాల్సిన మనిషిలా కని పించలేదు. అయినా పనినేర్పిస్తున్నాడు కాబ ట్టి కొంచెం బాగానే మాట్లాడ్తోంది. నవ్వుతూ కబుర్లు చెపుతోంది.

కమలిని బుర్ర మహాచురుకైనది. క్లిష్టమైన ఫైళ్ళ గురించి శరత్ ఒక్కసారి చెప్పగానే అర్థం చేసుకుంది. డ్రాఫ్టింగ్, కరెస్పాండెన్స్ వగైరా చెప్పకుండానే పాతఫైళ్ళు చూసేసుకుని అర్థం చేసుకుని పుటప్ చేసేసింది.

ఒకసారి ఆమెకి ఒక ఫైల్‌లో ఇంపార్టెంట్ డ్రాఫ్ట్ ఒకటి రాయడం ఎలాగో చెప్పాల్సివచ్చింది.

"ఆ అమ్మాయికి కొత్తకదూ. శరత్ నువ్వే పుటప్ చెయ్యడమో లేకుంటే దగ్గరుండి ఎట్లా రాయాలో నేర్పించటమో చెయ్యవయ్యా. హెడ్డాఫీసుకి కాపీ పోతుంది. జాగ్రత్తగా ఉండేట్లు చూడు. నేను అన్నీ పర్సనల్‌గా చూసుకోలేక కానీ లేకపోతే నేనే నేర్పించి ఉండేవాడిని" అన్నాడు ఆఫీసర్.

సరేనని తలవూపి బయటికి వచ్చాడు శరత్. లంచ్‌టైమ్ అవుతోంది అప్పుడు.

"పొద్దున్న అన్నం తినిరాలేదయ్యా శరత్. హొటల్లో భోంచేద్దామనుకుంటున్నాను. కాస్త కంపెనీ ఇవ్వాలి" అన్నాడు గుర్నాథం ఇంతలో.

"సరే వస్తాను" అని చెప్పాడు.

"కమలినిగారూ... ఈ ఫైలు ఇక్కడ పెడ్తున్నాను. దీనికి లెటర్ రాయాలి. నేను వచ్చి మీకు చెప్తాను. కొంచెం బయటికి వెళ్తున్నాను. లంచ్‌టైమ్ కాగానే వస్తాను అప్పుడు చెప్తాను" అన్నాడు ఫైలు కమలిని టేబుల్‌మీద పెడ్తూ.

కమలిని సరేనని తల ఊపింది.

గుర్నాథం, శరత్ కలిసి బయటికి వచ్చారు.

"పొద్దున్నే వంటకాలేదా" అడిగాడు శరత్.

"అసలు వంట చేస్తేగా"

"అదేంటి... మీ ఆవిడ ఎక్కడికన్నా వెళ్ళారా"

"వెళ్తే నాకేం. నాకు వంటొచ్చు. హాయిగా వండుకునేవాణ్ణి. ఇద్దరమూ కొట్టుకుచచ్చాం. ఆవిడకి కోపమొచ్చి వంటచెయ్యలేదు"

శరత్ విని ఊరుకున్నాడు.

గుర్నాథంకీ శరత్‌కీ అరమరికలు లేవు. ఇద్దరూ అన్ని విషయాలూ చెప్పుకుంటారు. అయినాసరే శరత్‌కి ఎవరినన్నా స్వతంత్రించి వ్యక్తిగత విషయాలు అడగటం ఇష్టం ఉండదు. వాళ్ళంతటవాళ్ళు చెప్తే మాత్రం వింటాడు. ఒక్కొక్కసారి మాత్రం అనుకోకుండా పర్సనల్ వ్యవహారాల గురించి కూడా అడిగేసి ఆ తర్వాత ఎందుకు అడిగానా, అడక్కుండా ఉండాల్సింది అని బాధ పడ్డరోజులు కూడా ఉన్నాయి.

మా ఆవిడ్తో చచ్చిపోతున్నానయ్యా శరత్. మా చెల్లెలికి ఒంట్లో బాగుండలేదుట. ఈ ఊళ్ళో డాక్టర్ దగ్గర చూపించుకోవటానికి వస్తానంది. నిన్న ఆ ఉత్తరం వచ్చిన దగ్గర్నుంచి మా ఆవిడ ఒకటే నస. ఆవిడ రావడం ఈవిడకి ఇష్టంలేదు. అసలు అత్తగారింటి తరఫున పిట్టపురుగు లేకుండా మొగుడొక్కడే అలా గాల్లో తేల్తూ తన దగ్గరికి వస్తే అప్పుడు పెళ్ళిచేసుకోవాలని ఉంటుంది ఈ ఆడవాళ్ళకి. నేనేం చెయ్యాలిప్పుడు చెప్పు. అటు చూస్తే చెల్లెలు, ఇటు చూస్తే ఈవిడ" గుర్నాథం బాధపడ్తూ చెప్పాడు.

"అందుకని అన్నం మానేస్తావా. ఈ చాకిరీ చెయ్యటానికైనా ఓపిక ఉండాలి, కాబట్టి తినాలి, తిండిమీద కోపం ఉండకూడదని నాకు చెప్పే మనిషివి నువ్వు మానేస్తే ఎలా?"

"చెప్పటం వేరూ, చెయ్యటం వేరూనయ్యా"

"బాగానే ఉంది. మరి నువ్వు ఇట్లా హొటల్లో తినేస్తున్నావు. పాపం ఆవిడ..."

"ఏం ఫర్వాలేదు. నేను ఆఫీసుకి రాగానే శుభ్రంగా వండుకుని మెక్కి ఉంటుంది. మనం ఇంట్లో ఉన్నంతసేపే వీళ్ళ మొఖాలు మాడి ఉండేది. మనం ఇంట్లోంచి కాలు బయటపెట్టగానే శుభ్రంగా నాలుగూ వండుకుని తిని, ఎదురింటి పుల్లమ్మనో, పక్కింటి వెంకమ్మనో పిల్చి కబుర్లు పెట్టుకుని కూర్చుంటారు"

"అంతే..."

"అసలు వీళ్ళని తల్చుకుంటే ఒక్కోసారి నవ్వొస్తుంది. ఎంతో తెలివిగా ఉంటారా, ఒక్క చిన్న విషయం కూడా బుర్రబద్దలు కొట్టుకున్నా బోధపడదు ఈ ఆడవాళ్ళకి. లేకపోతే అర్థం అయినా కానట్లు నటిస్తుంటారా... ఉదాహరణకి మా ఆవిడ ఉంది చూడు మావైపు వాళ్ళొస్తే పడదు. తను మాత్రం పుట్టింటికి ఎడాపెడా పోతుంటుంది. ఈమధ్యదాకా

బాగానే ఉండేది. కానీ అర్నెల్లక్రితం మా బావమరిది ఒకడిది పెళ్ళయింది. పెళ్లికాగానే తమ్ముడ్నీ, పెళ్ళాన్నీ చూసి మా ఆవిడ తెగము రిసిపోయి వాళ్ళతో రాసుకు, పూసుకు తిరుగుదాం అని చూసింది. కానీ మా బావమరిది పెళ్ళాం కూడా మా ఆవిడకి తీసిపోయిన ఘటంకాదు. నాలుగురోజులు చూసి మా ఆవిడ్ని ఊరికే పుట్టింటికి వచ్చిపోవటం తప్ప వేరే పనిలేదా అని మొహాన్నే అడిగింది. ఈవిడెంత కలుపుగోలుగా తిరిగినా ఆవిడ మూతి బిగించుకు కూర్చుంటుంది. మన బుద్ధులే అవతలివాళ్ళకూ ఉంటే మనకు మళ్ళీ కొరుకుడు పడదుగా. మా ఆవిడకి కోపంవచ్చి యుద్ధం చేసింది మరదలితో. ఆ యుద్ధంలో మా అత్తగారూ, మామగారూ తటస్థులయ్యారు. మా బావమరిది మాత్రం భార్య పక్షంవహించి హెూరాహెూరీ పోట్లాడాడు. పెళ్ళయి కాపరానికి వెళ్లినవాళ్ళు ఎప్పుడో ఒకసారి రావాలిగానీ రోజూ వచ్చిపోవటం బాగుండదని నొక్కి వక్కాణించాడు. మా ఆవిడ నిస్సహాయురాలై తిరోగమించింది. ఇప్పుడు ఏ ఏడాదికో ఓసారి పోతుందిగానీ రోజూపోదు ఇదివరకటిలా''

''ఒకే ఊళ్ళో ఉంటేనే ఈ బాధలు. పొరుగూర్లో ఉంటే ఫర్వాలేదనుకుంటాను కదూ''

''అదీ అంతే. ఇప్పుడు సిటీబస్సుకీ, ఆటోలకీ పెట్టే ఛార్జీలు అప్పుడు రైళ్ళకి పెడతారు''

''అంతేలే''

''ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే తనని తన మరదలు రావొద్దని అన్నదని గింజుకుని, గింజుకుని చచ్చింది మా ఆవిడ. మరి ఆ సంఘటన కలిగించే జ్ఞానోదయంతో మా వాళ్ళతో తను బాగా ఉండొచ్చుగా. ఊహూ... అది పనికిరాదు. మనకొక నీతి ఇంకోళ్ళకి ఇంకో నీతి''

''పుట్టింటివాళ్ళని చూస్తే మొహం చేటంతవుతుంది వీళ్ళకి. అత్తింటివాళ్ళని చూస్తే ఆవగింజంత. ఏంటో ఈ ఆడవాళ్ళు ఎప్పుడు మారతారో ఏమిటో...''

ఇద్దరూ జనరల్‌గా ఆడవాళ్ళని తిట్టుకుంటూ నడుస్తున్నారు. ''శరత్... నువ్వు ఆ కమలినికి వర్క్ నేర్పించటం నాకు నచ్చలేదయ్యా'' అన్నాడు గుర్నాథం.

''ఏం''

''ఈ ఆడాళ్ళని నమ్మటానికి లేదు. ఆఫీసులో నీకన్నా సీనియర్ని. నాకు నీకన్నా బోలెడు విషయాలు తెల్సు. ఈ ఆడవాళ్ళతో వ్యవహారం అంటేనే తలనెప్పి వ్యవహారం. నువ్వు అమాయకుడివని తెలిస్తే చెవులు పట్టి ఆడిస్తారు. నువ్వు రాకముందు ఈ ఆఫీసులో సుందరి అనే ఆవిడ ఉండేది. ఆవిడకి నేను నీలాగే వర్క్ నేర్పాను. శుభ్రంగా నేర్చుకుంది. వచ్చిన పని కూడా రానట్లు పోజుపెట్టి ఏడుపు మొహంతో అయ్యో ఇది రావటంలేదండీ అనేది. పోన్లే పాపం అని నేనే చేసేవాణ్ణి. ఆవిడ తెలివిగా నాచేత పనంతా చేయిస్తోందని నాకు తెలీనేలేదు. అంత బాగా మాట్లాడేది. మనం మగాళ్ళం ఉత్త వెధవలమయ్యా. ఆడాళ్ళ ముందు మనమెందుకూ పనికిరాం. ఎవత్తె అన్నా వచ్చి ఇకిలిస్తూ మాట్లాడిందనుకో పొంగిపోతాం. ఆవిడ మనసులో ఏముందో మనకు కనిపించదు. చిరునవ్వు మెరుస్తుంటే చాలు మురిసిపోతాం. అట్లాగే సుందరిని నేను నా స్నేహితురాలనుకునేవాణ్ణి. ఎట్లాంటి దురుద్దేశం లేకుండా కేవలం స్నేహితురాలిగా, ఆత్మీయురాలిగా మాత్రం భావించాను. నేనంత నిష్కల్మషంగా ఉన్నా సుందరి మాత్రం నన్ను పూర్తిగా ఎక్స్‌ప్లాయిట్ చేసి చాకిరీ చేయించుకుంది. ఆవిడ పెళ్లికి నేనూ వెళ్లాను. అందరితో నవ్వుకుంటూ తుళ్ళుకుంటూ మాట్లాడిన మనిషి నన్ను మామూలుగా పలకరించి ఊరుకుంది. ముభావంగా ఉంది. ఒకప్పుడు నాతో క్లోజ్‌గా ఉండి, పనంతా చేయించుకున్న విషయం బయటికి వచ్చి తన మొగుడు అపార్థం చేసుకుంటాడని భయం కాబోలు. వీళ్ళేం చేస్తారంటే మనని దోపిడీచేసి చచ్చే చాకిరీ చేయించుకుంటారు. కానీ ఆ చాకిరీ మనం చేసిన సంగతి మళ్లీ ఎవరికీ తెలియకూడదని వాళ్ళ ఉద్దేశం. తెలిస్తే లోకం మనకీ వాళ్ళకీ ఏదన్నా సంబంధం ఉందని అనుకుంటుందని భయం. అందుకని మనల్ని మధ్యలో వెర్రాళ్ళని చేస్తారు. మళ్ళీ అంత లోకం అంటేనూ, మొగుడంటేనూ భయపడి చచ్చేవాళ్లు మనతో మాట్లాడకుండా ఉండొచ్చుగా. ఊహూ అది పనికిరాదు. వాళ్ళకి అవసరం ఉన్నప్పుడు నవ్వుకుంటూ మాట్లాడి అవసరం తీరగానే మొహం చాటేస్తా

రు. నాకు మాత్రం ఆడాళ్ళంటే చచ్చే అసహ్యం. వాళ్ళేం అడిగినా చెయ్యను'' అన్నాడు గుర్నాధం.

''నిజమేలే... కానీ మరి ఆఫీసర్ అడిగితే కాదనలేకపోయాను''

''అయితే మాత్రం నాకు కుదరదు పొమ్మంటే ఆయనేం చేస్తాడు. ఆయనే కూర్చుని ఓపిగ్గా నేర్చుకునేవాడు. మనకెందుకొచ్చిన గొడవ. నానాహైరానాపడి పైగా మాటలనిపించుకోవటం నాకు నచ్చదు''

''అవున్లే. ఆఫీసరు నిజంగానే నేర్చుకుంటాడు. బోలెడు ఓపిక ఉంది ఆయనకి. అసలు ఇంటికెళ్ళాలన్న ధ్యాసే ఉన్నట్లు కనిపించదు. ఎప్పుడూ ఆఫీసులోనే ఉంటాడు. రాత్రి పదింటిదాకా ఉంటాడులావుంది''

గుర్నాధం పగలబడి నవ్వాడు.

''ఏం చేస్తాడు మరి. ఇంటికెళ్తాడనుకో పెళ్ళాం గరిట తిరగేసికొడ్తుంది. ఆవిడముందు మీ ఆవిడా, మా ఆవిడా కూడా పనికిరారు. మహా పవర్‌ఫుల్ మనిషి. ఒకసారి చూశాను కూడా. గయ్యాళిగంప. ఆవిడ బాధ పడలేక ఈ మహానుభావుడు ఇక్కడేపడి ఏడుస్తుంటాడు'' అన్నాడు.

ఆ తర్వాత ఆఫీసర్ చరిత్ర అంతా చెప్పుకొచ్చాడు గుర్నాధం. ఆఫీసర్‌కి బి.ఎ. కాగానే పెళ్ళయింది. అప్పటికి ఇంకా ఉద్యోగం రాలేదు. మనిషి మహాతెలివైనవాడు. అతని తెలివికి ఐ.ఎ.యస్.ఆఫీసరైపోతాడని అతని మామగారు ఊహించి పిల్చిపిల్లనిచ్చి పెళ్ళిచేశాడు. తను ఒక కలెక్టరు భార్య కాబోతున్నందుకు ఆయన భార్యామణి చాలా సంతోషించి ఎట్లాంటి చీరెలు కట్టాలో, ఏవిధమైన ఫోజులు పెట్టాలో ముందే ఊహించి రెడీగా ఉంది.

ఆఫీసర్‌గారు మూడుసార్లు కట్టినా ఐ.ఎ.యస్.పాస్ కాలేకపోయారు. అంతే... అత్తగారింట్లో ఆయన పరువు మూడువంతులు తగ్గిపోయింది.

''పోన్లేవయ్యా. ఏం చేస్తాం. వేరే ఉద్యోగాలు ప్రయత్నించు'' అన్నారు ఆయన మామగారు.

ఆయనకి ఆఫీసర్ ఉద్యోగాలేవీ రాలేదు. చివరికి ఈ ఆఫీసులో అప్పర్ డివిజన్ క్లర్క్‌గా చేరారు.

ఆఫీసులో చేరాక నానాతంటాలూపడి ఆఫీసర్ అయ్యారు. దానికి ఆయన చాలా కష్టపడ్డాడు. ఆఫీసు పరీక్షలకి చచ్చేట్లు చదివాడు. ఆఫీసులో చచ్చే చాకిరీ చేశాడు. క్వాలిఫికేషన్లూ, మెరిట్ రెండూ ఉండటంచేత త్వరలోనే ఆఫీసరయ్యాడు. కానీ పెళ్ళాం దృష్టిలో మాత్రం ఆయన విలువ పెరగలేదు.

కలెక్టరు పెళ్ళాన్ని కావల్సినదాన్ని... ఏంటో... ఇట్లా'' అనుకుంటూ బాధపడ్తుంటుంది. అదేదో తన తప్పే అయినట్లు ఆఫీసర్‌గారు తలవంచుకుంటుంటారు.

ఆయనకి ఇంటికన్నా గుడిపదిలం అన్నట్లు ఇంట్లోకన్నా ఆఫీసులోనే బాగుంటుంది. ఇక్కడే ఉండిపోతాడు.

ఇంటికి వెళ్ళగానే హాయైన వాతావరణం, ఆహ్లాదకరమైన పరిస్థితులు ఉన్నాయంటే ఎవరైనా ఎప్పుడెప్పుడు ఇంటికెళ్లిపోదామా అనుకుని ఉబలాటంగా ఉంటారు. ఇంటికెళ్ళగానే సాధింపులూ, పోట్లాటలూ మూతివిరుపులుంటే ఎవరూ ఇంటికి తొందరగా పోవాలని అనుకోరు. ఎక్కడో కొంతమంది నిజంగా పనిపట్ల శ్రద్ధ ఉన్నవాళ్లు ఆఫీసునే పట్టుకుని ఆదివారాలు కూడా వేళ్ళాడొచ్చు కానీ ఆఫీసర్‌గారిలాంటి మనుషులు మాత్రం ఇంట్లో బాగాలేకే ఆఫీసులో ఉంటారు చాలాసేపు.

ఆఫీసర్‌గారికి ఒకవిధంగా భార్య అట్లాంటి గయ్యాళి కావడం కలిసివచ్చింది. ఆయన అందుకే అహర్నిశలూ ఆఫీసు పనికోసమే పాటుపడి మంచి పేరు సంపాదించగలిగాడు.

ఈర్ష్యపడేవాళ్లు ఈర్ష్య పడుతూనే ఉంటారు కానీ శరత్, గుర్నాధం మాత్రం ఆయన్ని చూసి జాలి పడుతుంటారు.

ముఖ్యంగా ఒకసారి శరత్ శలవు పెట్టుకుందామని లీవ్‌లెటర్ తీసుకుని ఆయన ఇంటికి వెళ్ళాడు. అసలు ఆఫీసుకి ఇన్స్‌పెక్షన్ వాళ్ళు వస్తున్నారు. సెలవు మంజూరు కాకుండా ఉంటే మళ్ళీ పేచీ పెడ్తారు. సెలవు పెట్టకుండానే ఇంట్లో ఉండిపోయాడని రిమార్క్‌లు రాస్తారు. సెలవు మంజూరు చేయాల్సిన ఆఫీసర్‌గారు సెలవు మీదున్నారు. ఇన్‌ఛార్జి ఆయనకి లీవ్‌లు శాంక్షన్ చెయ్యటమంటే భయం. అందుకని గుర్నాధం శరత్‌కి ఒక సలహా ఇచ్చాడు. ఆఫీసర్ ఇంటికి వెళ్ళి

సెలవు శాంక్షన్ చేయించుకురమ్మని అన్నాడు.

శరత్ ఆఫీసర్‌గారింటికి వెళ్ళేసరికి ఆయన ఒక చిన్నపాపని ఎత్తుకుని ఆడిస్తున్నాడు. ఆయన్ని శరత్ అంత సంతోషంగా ఎప్పుడూ చూడలేదు. మహదానందంగా ఉన్నాడాయన. తనూ ఒక చిన్నపిల్లడిలాగా మారిపోయినట్లు కనిపిస్తున్నాడు.

శరత్‌ని చూసి ఆప్యాయంగా పిల్చి కూర్చో పెట్టి వచ్చినపని అడిగాడు.

శరత్ శలవు పెడ్తున్నది రాజేశ్వరి చుట్టాల పెళ్ళికోసం కానీ ఆ సంగతి ఆయనకి చెప్పలేదు.

''ఎందుకయ్యా శలవు'' అన్నాడాయన మంజూరుచేసి.

''మా అమ్మగారికి ఒంట్లో బాగాలేదండీ. డాక్టర్‌కి చూపించటానికని'' అన్నాడు శరత్ కళ్లు వాల్చుకుని. ఇట్లా చెప్పమని రాజేశ్వరి సలహా ఇచ్చింది.

ఆఫీసర్‌గారు ఆ మాటకి కదిలిపోయినట్లు కన్పించారు. ''శరత్! ఎంతమంచివాడివయ్యా. తల్లికి సేవచేసుకునే అదృష్టం నీకు కలిగింది. దాన్ని పోగొట్టుకోకు. తల్లిదండ్రులంటే ప్రత్యక్షదైవాలయ్యా. వాళ్ళని బాగా చూసుకుంటే చాలు, ఏ పుణ్యక్షేత్రాలూ పోనక్కర్లేదు'' అన్నాడు.

శరత్‌కి యిబ్బందిగా ఉంది. ఆయన మొహం చూడాలంటే సిగ్గుగా ఉంది.

''తాతయ్యా'' ఆ పాప పిల్చింది.

''ఆ... ఏంటమ్మా'' ఆయన ఆ పాపని గుండెకి హత్తుకున్నాడు.

ఆయనలో ఎవరో తెలియని మనిషి కనిపిస్తున్నాడు శరత్‌కి. ''ఈ పాప ఎవరో తెలుసా శరత్. నా మనవరాలు కాదు. మా అమ్మ. మా అమ్మే మళ్ళా పుట్టిందయ్యా'' ఆయన కళ్ళల్లో తడి. పోయిన పెన్నిధి మళ్ళీ దొరికినట్లు ఆ పాపని పొదివి పట్టుకున్నాడు.

ఆ అమ్మాయి ఆయన కూతురు కూతురు. ఆ పిల్ల వచ్చిందనే ఆయన శలవు పెట్టుకున్నాడట.

తర్వాత శరత్‌కి తెలిసిందేమిటంటే, ఆఫీసర్‌గారి తల్లికి సీరియస్‌గా ఉన్నా ఆయన గానీ, భార్యగానీ ఏమీ చెయ్యలేదుట. ఆయన్ని తల్లికి ఏ సేవా చెయ్యనివ్వకుండా పెళ్ళాం అడ్డుపడి హోరాహోరీ పోట్లాడిందిట. దాంతో ఆయన తల్లికి ఏమీ చెయ్యలేని తనయుడిగా మిగిలిపోయాడట. తల్లి పోయాక ఈ మనవరాలు పుట్టిందట. తన తల్లే తనని క్షమించి మళ్ళీ పుట్టిందని ఆయన అభిప్రాయమట.

ఆ కథ విన్నాక శరత్‌కి ఆయనమీద ప్రేమ రెట్టింపయింది. యిప్పుడు కమలినికి ఆయనే పని నేర్పుకుంటాడులే అని గుర్నాథం అనగానే అదే గుర్తుకువచ్చి అదోలా అయిపోయింది అతని మనసు.

'బాబోయ్ ఆడవాళ్ళు' అనుకున్నాడు.

గుర్నాథం అనుభవాలు వింటే ఆడవాళ్ళకి సాయం చెయ్యటం శుద్ధ దండగనిపించింది. కమలిని కూడా తననో వాజమ్మకింద జమకట్టి పనంతా చేయించుకుంటుందేమోనని భయంవేసింది.

సెక్షన్‌కి వెళ్ళగానే కమలిని సీట్‌వైపు చూశాడు. కమలిని సీట్లోలేదు. ఫైలుమాత్రం టేబుల్ మీద ఉంది.

''నువ్వు చేస్తావని ఆవిడ ఎక్కడికో చెక్కేసి ఉంటుంది'' అన్నాడు గుర్నాథం

అవతల ఆఫీసర్‌కి మాట యిచ్చాడు. చెయ్యక తప్పదు. శరత్ ఫైలు తెరిచాడు.

లోపల లెటర్ అప్పటికే రాసేసి ఉంది. కమలిని తనే స్వయంగా రాసినట్లుంది. ఏం రాసిందోనని చూశాడు శరత్.

చాలా చక్కటి భాషలో వివరంగా ఉంది ఆ లెటర్. అసలు తను కూడా అంత బాగా రాయలేడేమో అనిపించింది. యింకా విచిత్రం ఏంటంటే అది ఆఫీసర్ చూసేసి సంతకం కూడా పెట్టేసి, టైప్‌చేసిన కాపీ డిస్పాచ్ అయిపోయింది కూడా.

ఫైల్ మళ్ళీ సర్దేసి తనసీట్లో వచ్చి కూర్చున్నాడు.

''గుర్నాథం! పాపం ఆవిడే రాసేసుకుందయ్యా. యింకా విచిత్రం ఏమిటంటే ఎంతో బాగా రాసింది కూడా''

''ఆఫీసరే రాసుకున్నాడేమో'' అన్నాడు గుర్నాథం.

''అట్లాగనిపించటం లేదు''

"ఏమోలే... అయినా ఆవిడే రాసినా ఆశ్చర్యం లేదు. ఈ ఆడవాళ్ళు ఉన్నారు చూశావూ... ఆ బుర్రలోకి ఎక్కని విషయం ఉండదు. యిన్నాళ్ళూ యిళ్ళల్లోనే పడుండి ఆ బుర్రలు పదునెక్కలేదుగానీ లేకుంటే అమ్మో... వాళ్ళముందు మనం బలాదూర్" అన్నాడు గుర్నాథం.

ఆ తర్వాత శరత్‌కి తెలిసిన విషయం ఏమిటంటే కమలినికి సడన్‌గా కడుపునెప్పి వచ్చిందిట. ఆఫీసర్ దగ్గరికి సెలవు చీటీ పట్టుకెళ్ళిందిట యింటికెళ్ళిపోదామని. తన దగ్గరున్న ఫైలు యింపార్టెంటని ఆఫీసర్‌గారు అనగానే వెంటనే రాసి అప్రూవ్ చేయించి అప్పటికప్పుడు టైపిస్టుదగ్గర టైప్ చేయించి డిస్పాచ్ చేసి యింటికెళ్ళిపోయిందిట.

శరత్ మనసులో కమలినిపట్ల సదభిప్రాయం ఏర్పడింది. ఆ అమ్మాయిలో రెండు గుణాలు అతనికి బాగా నచ్చాయి. ఒకటి పని నేర్చుకోవటంలో చురుకుదనం. కొంతమంది నెలలూ, ఏళ్ళూ గడిచిపోయినా నేర్చుకోలేనిది ఆ అమ్మాయి చేరిన కొద్ది రోజులకే నేర్చేసుకుంది.

రెండోది... పనిపట్ల ఉన్న శ్రద్ధ. కడుపునెప్పితో బాధపడ్తూ, సగంపూట శలవు పెట్టి కూడా అర్జెంటు పనిమీద ఉన్న శ్రద్ధతో, ఆ పని చూశాకే యింటికి వెళ్ళిందంటే, పనిపట్ల ఎంత శ్రద్ధ ఉందో తెలుస్తోంది. ఒంట్లో శుభ్రంగా ఉన్నా, ఏంటో నీరసంగా ఉందని పనెగ్గొట్టి తిరిగే రకాలు ఎంతమందో. వాళ్ళందరూ కమలినిని చూసి బుద్ధి తెచ్చుకోవాలన్పించింది.

శరత్ ఆలోచిస్తుంటే కమలిని గురించేనని అర్థంచేసుకున్న గుర్నాథం తన ఉపన్యాసం మళ్ళీ మొదలుపెట్టాడు.

"యిదేం గొప్ప కాదు శరత్ వాళ్ళకి. యింకా గొప్పగొప్ప పనులు చేసి పడేశారు, పడేస్తున్నారు. అదేదో దేశంలో ఎవరో రాణి రోజుకో మగాడ్ని స్వయంగా చంపేదిట. అంతకన్నా గొప్పావిడ యింకెవరో ఉందిట, రోజూ మగాడి రక్తం గ్లాసులో పోసుకుని తాగేదిట"

"బాబోయ్... నిజమేనా"

"పచ్చినిజం... మొన్ననే ఒక పత్రికలో చదివాను. అంతేకాదు అంతకన్నా ఘోరాలు చేసినవాళ్ళు చరిత్రలో చాలామంది ఉన్నారు. ఏ పని చెయ్యటానికైనా ఆడవాళ్ళే తగును. ఎన్ని యుద్ధాలు, మారణ హోమాలూ జరగలేదు ఆడవాళ్ళకోసం. రామాయణం, భారతం అన్నీ ఆడవాళ్ళకోసం జరిగిన యుద్ధాలేగా. మనవాళ్ళు ఆ పురాణాలన్నీ ఎందుకు రాసిపెట్టారంటావ్. ఆడాళ్ళతో జాగ్రత్త బాబూ అని చెప్పేందుకే నాయనా"

గుర్నాథం మాటలకి శరత్ ఎప్పుడూ ఆశ్చర్యపోతూనే ఉంటాడు. తనకి తెలియని విషయాలు ఎన్నో గుర్నాథంకి తెలుసు. గుర్నాథం లేకుంటే తను అంధకారంలో మగ్గిపోయేవాడు. తన మనసులో భావాలన్నీ గుర్నాథంకి చెప్పుకుని రిలీఫ్ పొందుతుంటాడు. గుర్నాథమే లేకుంటే తను ఒక నడిచే శవంలా ఉండి ఉండేవాడు.

కమలిని కడుపునెప్పి మర్నాడు కూడా తగ్గలేదుట. ఆఫీసుకి రాలేదు. ఆ తర్వాత వచ్చాక కూడా కొద్దిగా నీరసంగానే కన్పించింది. అయినా పనంతా చేసేసుకుంది.

వద్దనుకుంటూనే ఆ అమ్మాయిపట్ల అభిమానం పెంచుకున్నాడు శరత్. ఆ అమ్మాయి ఆప్యాయంగా, నవ్వుతూ మాట్లాడుతుంటే బిగదీసుకుని కూర్చోలేకపోయాడు.

గుర్నాథం వద్దువద్దని గట్టిగా చెపుతున్నా మందలిస్తున్నా ఆ అమ్మాయితో బాగా మాట్లాడుతున్నాడు శరత్.

కమలిని ఆకర్షణ అంతా నవ్వులో ఉంది. నవ్వేప్పుడు ఆ పెదిమలు అందంగా సాగి, పళ్ళు ముత్యాల్లా మెరిసి, మొహం చాలా అందంగా కనిపిస్తుంటుంది. ఆ అమ్మాయి నవ్వుతుంటే ఒక్కోసారి శరత్ కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయి, కమలిని తనకేసి చూడగానే తుళ్ళిపడి తల తిప్పేసుకున్న సంఘటనలు కూడా రెండు మూడుసార్లు జరిగాయి.

కమలిని పెళ్ళి జరిగింది. పెళ్ళికి గుర్నాథం పోలేదు కానీ శరత్ మాత్రం వెళ్ళి మనస్ఫూర్తిగా ఆశీర్వదించి, తను తెచ్చిన కానుక అందించి వచ్చాడు.

కమలిని భర్త వేరే ఊళ్ళో పనిచేస్తున్నాడు. అతనికి హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ కాదుట. కమలిని అతను ఉన్న ఊరుకి ట్రాన్స్‌ఫర్‌కోసం

ప్రయత్నిస్తున్నానని చెప్పింది.

పెళ్ళయిన కొత్తల్లో యింకా కొన్ని ఆకర్షణలు నింపుకొన్న కమలిని కొద్దిరోజులుగా దిగులుగా, డల్‌గా ఉంటోంది. ఆవిడ యిక్కడ, భర్త మరోచోట ఉంటే దిగులుకాక మరేంటి పాపం అనుకుని ఆమాటే గుర్నాథంతో అన్నాడు శరత్.

''ఆవిడ మొగుడు బాగానే ఉన్నాడయ్యా. మొన్న వచ్చినప్పుడు చూశానుగా. ఈవిడే యిట్లా ఉంది. మొగుడ్ని సతాయించే అవకాశం ఎప్పుడా అని ఏడుపేమో'' అన్నాడు గుర్నాథం తేలిగ్గా.

శరత్‌కి ఆ మాటలు నచ్చకపోయినా గుర్నాథంకి ఎదురుచెప్పటం యిష్టంలేక మౌనంగా ఉండిపోయాడు. అతనికి నిజం చెప్పాలంటే కమలిని అట్లా దిగులుగా ఉండటం అస్సలు బాగాలేదు. నవ్వినప్పుడు కమలిని ఎంత అందంగా ఉండేది. యిప్పుడూ నవ్వుతుంది గానీ పేలవంగా ఉంటుంది ఆ నవ్వు. కమలిని మళ్ళీ అంత హాయిగా, ఆనందంగా నవ్వే రోజు ఎప్పుడు వస్తుందో అనిపించింది.

ఆ రోజు సెక్షన్లో అంతా లంచ్ టైమ్‌లో ఎక్కడికో వెళ్ళారు. శరత్, కమలిని యిద్దరే ఉన్నారు.

''శరత్‌గారూ! మిమ్మల్ని ఒకటి అడుగుతాను, ఏమీ అనుకోరుగా'' అంది కమలిని.

''అడగండి''

''మీకు రాఘవ అనే ఫ్రెండ్ ఉన్నాడటగా. బొంబాయిలో ఉన్నాడన్నారు''

''అవును''

''ఆయన బావగారు మన హెడ్డాఫీసులో అడ్మినిస్ట్రేషన్ డిపార్ట్‌మెంట్‌లో పెద్దాఫీసరుట. ఆయన తల్చుకుంటే నాకు ట్రాన్స్‌ఫర్ ఒక్కవారంలో అయిపోతుంది. ప్లీజ్... మీరు రాఘవ ద్వారా ఆ సాయం చేసిపెట్టరూ. మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను'' అన్నది కమలిని.

''తప్పకుండా చేస్తానండీ. ఆయన నాకు పరిచయం లేకగానీ లేకుంటే యిప్పుడే వెళ్ళి వచ్చి ఉండేవాడిని. మా రాఘవ చేత ఉత్తరం రాయిస్తాను'' అన్నాడు శరత్.

''అంటే యింకా చాలా రోజులు పడ్తుందండీ'' అన్నది కమలిని బేలగా చూస్తూ.

''అయితే యివాళే రాఘవతో ఫోన్లో మాట్లాడి ఆయనకి ఫోన్ చేసి చెప్పమంటానండీ. అట్లా అయితే యివాళే అయిపోతుంది ఆ పని'' అన్నాడు శరత్.

''థాంక్సండీ'' అంది కమలిని. ఆమె కళ్ళు మెరుస్తున్నాయి.

''థాంక్స్ ఎందుకండీ. యిదేమంత పెద్దసాయమనీ'' అన్నాడు శరత్ నవ్వుతూ.

కమలిని మందహాసం చేసింది.

మళ్ళీ అదే నవ్వు. మొహాన్ని కాంతివంతం చేసి ఆకర్షణీయంగా కనబడేట్లు చేసేనవ్వు.

శరత్ ముగ్ధుడై చూశాడు.

కమలిని సంతోషంగా ఉండటంకన్నా తనకు కావల్సిందేంలేదు అనిపించింది ఆ క్షణంలో. ఆ ఉత్సాహంలో ట్రంక్‌కాల్ చెయ్యటంకోసం గుర్నాథం దగ్గర అప్పుచేసి మరీ ట్రంక్‌కాల్ చేశాడు. రాఘవతో మాట్లాడి కమలిని తనకు బాగా ఆత్మీయురాలనీ, ఆవిడ్ని ఎట్లాగైనా ట్రాన్స్‌ఫర్ అయేట్లు చూడమనీ అన్నాడు. రాఘవ ఆ రోజే తన బావగారితో మాట్లాడ్తానని మాట యిచ్చాడు.

రాఘవ అన్నప్రకారం వాళ్ళ బావగారిని అడిగినట్లున్నాడు. మూడోరోజుకల్లా కమలినికి ఆర్డర్లు వచ్చేశాయి.

కమలిని ఆనందం చెప్పటానికి వీల్లేదు.

కమలిని రిలీవ్ అయ్యేరోజు పెద్దపార్టీ యిచ్చారు ఆఫీసువాళ్ళు. కమలినికి ఏదన్నా ప్రెజంటేషన్ యివ్వాలని ప్రెజంటేషన్ కొనుక్కురమ్మని గుర్నాథాన్ని, శరత్‌నీ పంపారు.

ఒక యిత్తడి పూలకుండీ శరత్‌ని బాగా ఆకర్షించింది. కమలినికి గులాబీలు చాలా యిష్టంట. ఆ అమ్మాయిదగ్గర రకరకాల గులాబీలు కుండీల్లో ఉన్నాయందోసారి.

ఈ యిత్తడి పూలకుండీ చక్కని డిజైన్‌తో చాలా అందంగా మెరుస్తోంది. ఆ కుండీలో మంచి మంచి గులాబీలు ఉంచితే ఎంతో బావుంటుంది.

దాని ఖరీదు రెండొందలు అన్నాడు షాపతను. సెక్షన్లో వాళ్ళు నూట యాభైలో ఏమన్నా తెమ్మన్నారు. మిగిలిన యాభై తన జేబులోవి

వేసుకుని రెండొందల రూపాయలు పెట్టి ఆ కుండీ కొని పాక్ చేయించాడు.

"ఎందుకయ్యా... మళ్ళీ డబ్బు యిమ్మంటే మన సెక్షన్ వాళ్ళు ననపెడ్తారు. నూటయా భైలో చూడు చాలు" అన్నాడు గుర్నాథం.

యిది నాకు చాలా నచ్చిందయ్యా. కమలిని కి యిదే యివ్వాలని ఉంది నాకు. వాళ్ళని నేను ఎక్స్ట్రా డబ్బు అడగను. ఎట్లాగో నేనే సర్దేసుకుంటాను" అన్నాడు శరత్.

గుర్నాథం వింతగా చూసి ఊరుకున్నాడు. సెక్షన్లోకి అడుగుపెడ్తున్నారు. కమలిని, యింకో యిద్దరు ఆడవాళ్ళు కూర్చుని ఏదో మాట్లాడ్తు న్నారు. శరత్ పేరు కూడా ఆ మాటల్లో వినబ డ్తోంది. సెక్షన్లో యింకెవ్వరూ లేరు. కమలిని వీళ్ళురావటం గమనించలేదు.

"మొత్తానికి ఆ శరత్ ట్రాన్స్ఫర్ చేయించా డన్నమాట" పక్కసెక్షన్లో పనిచేస్తున్న కుముద వల్లి అడుగుతోంది.

"అవునే... మన హెడ్డాఫీసు రాధాకృష్ణగారు మీకు తెలుసుగా అన్నాను. అంతే ఫోన్లమీద ఫోన్లు చేసి నిమిషాల్లో చేయించిపెట్టాడు" అంది కమలిని.

"ఏమోనే! నాకైతే ఈ మగాళ్ళసాయం తీసు కోవటం యిష్టముండదు. మళ్ళీ వెర్రివేషాలు వేస్తే" అంది కుముదవల్లి.

"వేస్తే ఊరుకుంటాం ఏంటి. అయినా ఈ శరత్ కూడా ఏం తక్కువవాడు కాదులే. మన ల్ని అదేపనిగా దేభ్యం మొహంవేసుకుని చూ స్తుంటాడు. ఏదో ట్రాన్స్ఫర్కోసం అనిగానీ లేకుంటే వాడితో ఎవడు మాట్లాడ్తాడు?"

"అంతేలే... పని ఉంటే తప్పదు. వసుదేవు డంతటివాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాడనీ"

"మనం ఈ పిచ్చివెధవల్ని కేర్ చెయ్యక్కర్లే దు. ఏదో మాట్లాడ్తుండాలిగానీ వాళ్ళనోకంట కనిపెట్టే ఉండాలి. శరత్ అస్తమానూ చొంగకా రుస్తూ ఆత్రంగా చూస్తుంటాడు. ఏమాత్రం సందిచ్చినా వెధవ వేషాలు వేసేవాడే... అయినా వాడినని ఏంలాభంలే. మొగబుద్ధే అంత. అందమైన ఆడది కనిపిస్తే చాలు ఎగబడి చూస్తుంటారు" కమలిని తను అంద గత్తెననే విషయం ఇన్డైరెక్ట్గా చెప్పింది.

అంతా పగలబడి నవ్వుతున్నారు.

శరత్ మొహం పాలిపోయింది. మనిషి జ్వరంవచ్చిన వాడిలా అయిపోయాడు. చేతు లు వణుకుతున్నాయి.

గుర్నాథం అతని పరిస్థితి గమనించి చేత్తో పట్టుకుని బయటికి తీసుకొచ్చాడు. దగ్గర్లో ఉన్న హోటల్కి తీసుకెళ్ళాడు.

చేతిలోని పూలకుండీ తనని వెక్కిరిస్తున్న ట్లు అన్పించింది శరత్కి. ఆపుకోలేని దుఃఖం వచ్చింది... కమలిని దృష్టిలో తను దేభ్యం మొహం వేసుకుని, చొంగకారుస్తూ వీలైతే వెధ వవేషాలు వేద్దామని చూసే దౌర్భాగ్యుడా?

అవమానంతో, దుఃఖంతో అతనిమొహం ఎర్రబడింది. కమలినిని తల్చుకుంటేనే అస హ్యం వేసింది.

యింత కల్మషం మనసులో పెట్టుకుని తనతో నవ్వుతూ ఎట్లా మాట్లాడగలిగింది. అవ సరానికి మాట్లాడి, అవసరం తీరగానే యింత ఘోరమైన కామెంట్స్ చెయ్యటం ఆడవాళ్ళకే చెల్లుతుంది.

నిజమే... తను ఒక్కోసారి కమలినిని తదే కంగా చూసేవాడు. అది కామంతోనా... ఎంత మాత్రం కాదు. అందమైన పుష్పాల్ని చిన్నారి పిల్లల్ని, రమణీయమైన ప్రకృతిని చూసి ఆనందించినట్లు కమలినిని చూసి ఆనందించాడు. స్వచ్ఛమైన మనసుతో, నిష్క ల్మషంగా ఆమెని ఒక స్నేహితురాలిగా భావించాడు. ఆమె తన భర్తతో కలిసి సంతో షంగా కాపరం చెయ్యాలని నిండుమనసుతో కోరుకుని ఆమెకి ట్రాన్స్ఫర్ అయ్యేందుకు సాయంచేశాడు. యింతా చేస్తే తను ఎవరి కోసం చేశాడో ఆ వ్యక్తే తనని చౌకబారుగా చులకన చేసింది.

కళ్ళమీద చేతులు ఉంచుకుని అలాగే కూర్చుండిపోయాడు. గుర్నాథం ఓదార్పుగా అతని చెయ్యి తట్టాడు.

"శరత్ నేను ముందే చెప్పినా నువ్వు విన కుండా ఓవర్స్పీడ్లో పోయావు. చూడు నేను చెప్పినట్లు అక్షరాలా జరిగింది. దీనికి నువ్వు బాధపడకు. నువ్వేకాదు నీ స్థానంలో ఎవరున్నా కమలిని యిట్లాగే మాట్లాడేది. అందువల్ల ను వ్వు ఆవిడ ప్రత్యేకంగా నిన్నే అన్నదని బాధప డకు. మర్చిపో" అన్నాడు గుర్నాథం.

గుర్నాథం చెయ్యిపట్టుకుని అట్లాగే ఉండి పోయాడు శరత్.

గుర్నాథం... నువ్వు నన్ను అర్థంచేసుకు న్నావు. నువ్వు తప్ప నాకెవ్వరూ లేరనిపిస్తుంది ఒక్కోసారి'' అన్నాడు ఆర్తిగా గుర్నాథం చెయ్యి పట్టుకుని.

గుర్నాథం టీ తెప్పించాడు.

''గుర్నాథం నువ్వు చెప్తూనే ఉన్నా నేను అతిగా ప్రవర్తించాను. ఆ కమలినిని తల్చు కుంటేనే అసహ్యం వేస్తున్నది. నేనింక ఆఫీసు కి రాను. ఈ ప్రెజంటేషన్ నువ్వే తీసుకెళ్ళు. రేపటికి యింక ఆవిడ ఎట్లాగూ వెళ్ళిపో తుంది. ఆవిడ మొహం యింక చూడక్కర్లే నందుకు ఆనందంగా ఉంది'' అన్నాడు శరత్.

''అంత డెలికేట్‌గా ఉండకు. ఆవిడ చూ డు మనసులో అంత కుళ్ళు పెట్టుకుని ఎంత బాగా మాట్లాడ్తోందో. ఆవిడమాత్రం యాక్షన్ నువ్వు చెయ్యలేవా. అదీ ఒక్క రోజు, రోజెక్కడ యింకోగంట... అంతేగా...''

శరత్ తల అడ్డంగా ఊపాడు.

''శరత్... పిచ్చిగా ప్రవర్తించకు. నువ్వు ఆవిడ మాటలకి బాధపడ్తే నేను ఊరుకోను. నువ్వు బాధపడాల్సింది నీ తెలివితక్కువ తనా నికి. యువతల అనుభవజ్ఞుడిని నేను చెప్తూనే వున్నా వినకుండా ఆవిడ శ్రేయోభిలాషిని అంటూ పెద్దగా ఆలోచించి పెద్ద టోకరా తిన్నావు. యిప్పుడన్నా నామాట విను. వీళ్ళకి విలువనిచ్చి కుమిలిపోతూ కూర్చుంటే నీ అంత పిచ్చాడు యింకెవడూ ఉండడు'' అన్నాడు గుర్నాథం.

గుర్నాథం యింకా చాలా చాలా మాట్లాడి, బుజ్జగించి శరత్‌ని ఓదార్చాడు.

కొంచెంసేపుండి యిద్దరూ ఆఫీసుకి తిరిగి వచ్చారు. అప్పటికి సెక్షన్లో అంతా తిరిగి వచ్చా రు.

''రండయ్యా... మీకోసమే ఎదురుచూస్తు న్నాం'' అన్నాడు ఆఫీసర్.

కమలిని ఏ జంకూ లేకుండా నవ్వుతూ మాట్లాడ్తోంది శరత్‌తో. శరత్ తనే ఏదో తప్పుచే సినవాడిలా ఆమెని వీలైనంత తప్పించుకుని తిరిగాడు. ఎంత ప్రయత్నించినా పెదాలమీది కి చిరునవ్వుని రప్పించలేకపోయాడు. నవ్వు తూ, తుళ్ళుతూ తిరుగుతున్న కమలినిని చూ స్తే ఆశ్చర్యం, విషాదం కలిగాయి.

'ఎంతటి నయవంచన... మనసులో ఒకటి, పైకి ఒకటి. అమ్మో... ఆడదంటేనే భయవే స్తోంది' అనుకున్నాడు.

ఆ కొద్దిసేపట్లోనే కమలిని శరత్ గురించి చేసిన కామెంట్స్ అందరికీ తెలిసి పోయినట్లు న్నాయి. కొద్దిగా వెటకారం, నవ్వు మిళితంచేసి చూస్తున్నారు.

శరత్‌కి భూమి కుంగిపోతే బాగుంటుందని పించింది.

కమలిని ఎందుకిట్లా మాట్లాడాలి. తనని అన్యాయంగా ఎందుకు అందరి దృష్టిలో వెధ వని చేయాలి. ఒక మంచి మిత్రుడిగా అనుకోక ఒక జులాయి వెధవగా అందరూ అనుకునేట్లు ఎందుకు చేయాలి.

ఇది మిత్రద్రోహమే కాదు. ఆత్మద్రోహం కూడా. గుర్నాథం అన్న మాటలు అక్షరసత్యా లు. ఆడది దేనికైనా తగును.

''ఉంటాను శరత్‌గారూ. మీరు చేసిన సాయానికి థాంక్స్'' అంది కమలిని, శరత్ గుర్నాథం యిద్దరే ఉండగా వచ్చి.

శరత్ ఏం మాట్లాడలేదు.

కమలినిని ఎన్నో అనాలని, శుభ్రంగా దులి పెయ్యాలనీ ఎంతో అనుకున్నాడు, కానీ ఆమె ఎదురుగా ఉన్నా ఏమీ మాట్లాడలేకపోయాడు. పోన్లే, ఎందుకొచ్చిన గొడవ అన్నట్లు ఊరికే ఉండిపోయాడు.

శరత్ మౌనంగా ఉండిపోయినా గుర్నాథం మాత్రం ఊరుకోలేదు.

''ఇంకేమైనా పన్లుంటే చెప్పండి. మా శరత్ చేస్తాడు. యిందాక మీరు కుముదవల్లితో శర త్‌ని పొగుడ్తుంటే నేను విన్నాన్లెండి'' అన్నాడు.

కమలిని మొహం తెల్లబడి, అక్కడ్నుంచి మౌనంగా వెళ్ళిపోయింది.

కానీ ఊరికే వెళ్ళిపోలేదు. శరత్‌మీద చేతనై నంత బురదచల్లి మరీ వెళ్ళింది.

ఆఫీసులో కొందరు మహానుభావులున్నారు. వాళ్ళకి ఏదన్నా చెప్తే నిమిషంలో ప్రచారం

చేసేస్తారు. కమలిని అట్లాంటి వాళ్ళు ఒకరిద్ద రికి శరత్ తనతో అసభ్యంగా ప్రవర్తించబోతే బుద్ధిచెప్పానని చెప్పి వెళ్ళింది.

అంతే... శరత్ కమలినికి సాయంచేసినట్లు చేసి ఆమెతో అసభ్యంగా ప్రవర్తించబోయాడ న్న వార్త నిమిషాలమీద పాకిపోయింది.

ఆ మర్నాడే కొంతమంది శరత్‌ని ఆవి షయం గురించి నవ్వుతూ అడిగారు. వేళాకో ళాలు చేశారు.

తనమీద జరుగుతున్న ప్రచారం సంగతీ, దాన్ని కమలిని స్వయంగా చెప్పి వెళ్ళిన సంగతీ తెలుసుకుని శరత్ మనసు విలవిలలా డింది.

కమలిని ఊరువెళ్ళి మరీ ఆవిడ చెంపలు వాయించి రావాలనిపించింది.

మనిషి చిక్కిపోయాడు.

కమలిని చేసిన ద్రోహాన్ని మర్చిపోవటానికి అతనికి నెలపైగా పట్టింది. గుర్నాథం తీరిక ఉన్నప్పుడల్లా బోధలు చేసి అతన్ని తిరిగి మామూలు మనిషిని చేశాడు.

కమలిని సీట్లో కమల అనే ఆవిడ వచ్చింది.



ఇంట్లో ఎవరూ లేరు.

రాజేశ్వరి కొడుకుని తీసుకుని పుట్టింటికి వెళ్ళింది. శరత్ ఒక్కడే కూర్చుని ఆఫీసు ఫై ళ్ళు చూసుకుంటున్నాడు.

ఇంతలో తలుపు చప్పుడయింది.

లేచి వెళ్ళి తీశాడు.

ఎదురుగా కాషాయబట్టలు, పెరిగిన గడ్డంతో ఎవరో సన్యాసి.

"ఏం కావాలి" అడిగాడు శరత్. ఎవరో సన్యాసి చందాలడగడానికి వచ్చాడు కాబోలు అనుకున్నాడు.

"శరత్! నేను నీ మామయ్యాని" అందా ఆకారం.

గోవిందయ్య మామ...

"మామయ్యా..." అన్నాడు శరత్ ఆశ్చ ర్యంగా.

"ఇదేంటి మామయ్యా..." అన్నాడు ఏమ నాలో తోచక.

"ముందు లోపలికి రానీ" అన్నాడు గోవింద య్య. శరత్ పక్కకు తప్పుకుని గోవిందయ్యకి దారి యిచ్చాడు.

"కూర్చో మామయ్యా" అన్నాడు.

"కూర్చుంటానులే. యింట్లో ఎవరూ లేరా. అమ్మాయి ఉంటే నేను వచ్చినట్లు చెప్పకు" అన్నాడు గోవిందయ్య.

"లేదు మామయ్యా"

"అక్కయ్య అట్లాగే విడిగా ఉంటోందా"

"ఆ..." శరత్ తలవంచుకున్నాడు.

గోవిందయ్య నిట్టూర్చాడు.

"శరత్... నన్ను చూస్తే ఆశ్చర్యంగా ఉందా?" అన్నాడు.

శరత్ తల ఊపాడు.

"ఎందుకిట్లాగయ్యానని అనుకుంటున్నావు కదూ. ఏం చెయ్యమంటావు. మావాడికి పెళ్ళి చేశాను. కోడలూ, కొడుకూ కూడా మా యింట్లోనే ఉంటారు. నీకు తెలుసుగా. అన్ని చాకిరీలు నేనే చెయ్యాలి. ఆవిడ కాలుమీద కాలేసుకుని దర్జాగా కూర్చుని ఆర్డర్లు వేస్తుంటే నేను అమ లుపరుస్తూ ఉండాలి. మా కోడలు కూడా అత్తకు తీసిపోని మనిషే. మావాడు నాలాంటి వాడు కాదు. మొదట్నుంచీ చాకిరీ చేసేమని షిని నేనే కాబట్టి అందరికీ నేనే చెయ్యాల్సివ చ్చింది. నేనూ పెద్దవాడినైపోతున్నాను. యిది వరకటి బలంలేదు. చేయించుకునే మనుషు లు రోజురోజుకీ పెరుగుతుంటే చేసేవాడిని నేనొక్కడ్నే..." గోవిందయ్య ఆగాడు.

శరత్ వింటున్నాడు.

"శరత్ నాకు నా కాపరంలో ఏ అర్థమూ

కనిపించలేదు. ఎందుకు నేనావిడ భర్తగా ఉండాలి. ఆవిడ నాకేంయిచ్చింది. రోగం, రోగం అంటూ నీరసపడిపోతున్నట్లు నటిస్తూ యింటెడు చాకిరీ నాచేత చేయించింది. అది చాలక నలుగుర్లోనూ నేనొక తెలివితక్కువవాడ్నని ప్రచారంచేసి నా పరువు తీసింది. యింట్లో పెళ్ళామే లెక్కచెయ్యంది నన్ను యింకెవళ్ళు లెక్కచేస్తారు. పనికిమాలినవెధవ కింద నన్ను జనం జమకట్టారు. నాకు యిన్నాళ్ళకి జ్ఞానోదయం అయింది. నన్ను ప్రేమించని మనిషికి, నామీద గౌరవంలేని మనిషికి, నన్ను అన్నివిధాలా దోపిడీ చేస్తున్న మనిషికి నేనెందుకు లొంగిఉండాలి. అందుకే చెప్పకుండా యింట్లోంచి పారిపొయ్యాను'' అన్నాడు గోవిందయ్య.

శరత్ నిట్టూర్చాడు.

''శరత్... నేను బాగా ఆలోచించుకునే బైరాగుల్లో కలిశాను. పోయేముందు నిన్నొక్కసారి చూసిపోదామని వచ్చానంతే. నీకు అమృతగుళికల్లాంటి మాటలు నాలుగు చెవినవేస్తాను. విన్నావంటే బాగుపడిపోతావ్. నీ కాపరం ఎలా ఉందో నాకు తెలుసు. నువ్వు మంచితనానికి పోయినంతకాలం నీ మంచితనాన్ని అసమర్థతగా తీసుకుని పెళ్ళాం నిన్ను ఆడిస్తుంటుంది. అనుభవాన్ని మించిన జ్ఞానం మరోటిలేదు. బోలెడు అనుభవంతో చెప్తున్నాను విను. ఆ అమ్మాయి మాట విని తల్లిని దూరంచేసుకున్నావు. జీవితంలో ఏదైనా సంపాదించగలవు కానీ కన్నతల్లిని సంపాదించగలవా. అన్నింటికీ తల ఊపుతూ ఉంటే పెళ్ళాం చెవులు పట్టుకుని ఆడిస్తుంది. యిప్పటికైనా కళ్ళు తెరు. నీపెళ్ళాంముందు ధైర్యంగా నిలబడు. ఒక్కసారి తీక్షణంగా ఆవిడవైపు చూడు. దెబ్బకి దడుసుకుని దార్లోకి వస్తుంది. ఈ పని నేను ఎందుకు చెయ్యలేదని నీ అనుమానం కదూ. ఏది అయినా మరీ ముదరిపోకముందే చెయ్యాలి. యిప్పుడు మా ఆవిడ ముందు నేనేం చేసినా చెల్లదు. నీ పెళ్ళాం అంతదాకా రాలేదు. కాబట్టి నువ్వుకాస్త అదుపు చేసుకుని దార్లో పెట్టుకోవచ్చు. యిది చెప్పటానికే వచ్చాను... వస్తా'' గోవిందయ్య లేచాడు.

శరత్ మౌనంగా చూస్తున్నాడు.

''మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావు మామయ్యా'' అన్నాడు.

''ఇక కనిపించను''

''అదేంటి మామయ్యా...''

''అంతే శరత్. నేను తొందరపడి ఈ నిర్ణయం తీసుకోలేదు. ఎంతో ఆలోచించి జీవితంమీదా, సంసారంమీదా పూర్తి విరక్తి కలిగాక ఈ మార్గం ఎన్నుకున్నాను. నువ్వూ నాలాంటి బాధితుడివేనని లోలోపల సానుభూతి ఉండబట్టి ఒకసారి చూసి నీకు హితబోధ చేద్దామనిపించి యిట్లా వచ్చాను. యింక నాకు ఏ బంధాలూ లేవు. హిమాలయాకి వెళ్ళిపోతాను. జై పరమేశ్వరా...'' గోవిందయ్య ముందుకి కదిలాడు.

శరత్‌కి చెప్పలేనంత బాధగా ఉంది.

తనని ఎత్తుకుని ముద్దుచేసిన మామయ్యా... అత్తయ్యకి బెదురుతూ కూడా తనకి చాక్లెట్లు, బిస్కట్లూ కొనియిచ్చిన మామయ్యా... ఆప్యాయతనూ అనురాగాన్ని పంచియిచ్చిన మామయ్యా..., ఆఖరికి వైరాగ్యంలో కూడా తనని గుర్తుచేసుకుని తనకి నాలుగు ముక్కలు చెప్పిపోదామని వచ్చిన మామయ్యా...

గంగిగోవులాంటి మామయ్యా...

ఇట్లా హిమాలయాలకు పోవలసిందేనా.

ఈ అన్యాయాన్ని అడ్డుకునే మార్గం లేదా.

లేదుగాక లేదు అనిపించింది అతనికి.

దీనికి పరిష్కారం ఒకటే. అత్తయ్య మనసు మారటం. కానీ ఆ కర్కోటకురాలి హృదయం మారదు.

''మామయ్యా... ఒక్కనిమిషం'' అన్నాడు శరత్.

గోవిందయ్య ఏమిటన్నట్లు చూశాడు.

శరత్ యింట్లోకివెళ్ళి బీరువా తెరిచాడు. రాజేశ్వరి చీరె కొనుక్కుందామని పెట్టుకున్న రెండువందలు కనిపించాయి. తీసుకుని బయటికి వచ్చాడు.

''మామయ్యా... ఈ డబ్బు ఉంచు'' అన్నాడు.

''వద్దు శరత్'' అన్నాడు గోవిందయ్య.

''కాదు... ఉండనీ. ఏ అవసరానికన్నా పనికి వస్తుంది. మామయ్యా! నీకేదన్నా కావలిస్తే నాకు రాయి. నేను ఉన్నానని మర్చిపోకు'' అన్నాడు శరత్.

''సరేలే... నువ్వు కూడా నేను చెప్పింది మర్చిపోకు'' అన్నాడు గోవిందయ్య.

''ఒక్కమాట మామయ్యా. నువ్వు మాయింటికి వచ్చిన సంగతి అత్తయ్యకి చెప్పొచ్చా''

''వద్దు... నీకేం తెలీదను''

''సరే''

గోవిందయ్య కనుమరుగయిందాకా చూస్తూ నిలబడిపోయాడు శరత్.

గుండెల్లో ఏదో బాధ.

ఎందుకిలా జరిగిందని ఆవేదన.

భారమైన మనసుతో యింట్లోకి నడిచాడు.

రాజేశ్వరి సాయంత్రం నాలుగింటికి మళ్ళీ యింటికి వచ్చింది.

వాళ్ళ అమ్మగారింటిపక్కన ఉండే ఆవిడ కలకత్తాపోయి కొన్ని చీరెలు తెచ్చింది. వాటిలో ఒక చీరె రెండువందల రూపాయలది రాజేశ్వరిని బాగా ఆకర్షించింది. అది తను తీసుకుంటున్నట్టు ఆవిడకి చెప్పి, చీరె రేపు తీసుకుని డబ్బు యిస్తానంటూ చెప్పి వచ్చింది.

యింటికి వచ్చాక బీరువా తెరిచి చూస్తే ఆ రెండు వందలూ కనిపించలేదు.

ఏమయ్యిందీ అర్థంకాలేదు రాజేశ్వరికి.

''డబ్బేమన్నా తీశారా'' అన్నది నేరుగా వచ్చి శరత్‌తో.

గోవిందయ్య హితబోధ అంతా గాలిలోకి ఎగిరి శరత్ తడబడ్డాడు.

''అవును'' అన్నాడు చివరికి ఎలాగో.

''ఏం చేశారు''

''అదే... ఒక ఫ్రెండ్ కావాలంటే...''

''ఎవరా ఫ్రెండ్. మళ్ళీ ఎప్పుడిస్తాడు''

శరత్ సమాధానం చెప్పలేదు.

''పొద్దున్న నేను వెళ్ళేప్పుడు ఉన్నాయి. నేను వెళ్ళాక ఆ ఫ్రెండ్ వచ్చాడా''

''అవును''

''మీకు ఎప్పుడు తెలిసివస్తుంది. అవతల నేను ఒక చీరెని బేరమాడి డబ్బు యిస్తానని చెప్పివచ్చాను. మీరేమో ఆ డబ్బు కాస్తా ఫ్రెండ్‌కిచ్చి కూర్చున్నారు. మరిప్పుడు నేనేం చెయ్యాలి'' రాజేశ్వరి అరిచింది.

''అతనికి చాలా అవసరం పడింది''

''ఏమిటా అవసరం'' రాజేశ్వరి రెట్టించింది. శరత్ మాట్లాడలేదు.

''అర్థమైంది. ఆ డబ్బుకాస్తా ఆ ముసలావిడకే యిచ్చి ఉంటారు. ఏమిటో ఆవిడకి ఎంత డబ్బూ చాలదు. ఎంతసేపూ కొడుకుని దోచి కూతురికి పెట్టాలని ఆవిడ ఉద్దేశం. ఈ డబ్బు పట్టుకుపోయి మీ అక్కయ్యకి శుభ్రంగా చీరె కొనేస్తుంది. నేను మాట పోగొట్టుకుని పండక్కి కొత్త చీరె లేకుండా ఉసూరుమనాలి'' అరిచింది రాజేశ్వరి.

అటుచేసి, యిటుచేసి రాజేశ్వరి తన తల్లి మీదికి తెస్తుందని శరత్ ఊహించలేదు.

''ఆవిడకి యివ్వలేదు'' అన్నాడు.

''యివ్వలేదా. మరి ఎవరికి యిచ్చారు. చెప్పరేం'' అన్నది.

''చెప్పను'' అన్నాడు చివరికి ధైర్యంచేసి.

''చెప్పక్కర్లేదు... శుభ్రంగా తేటతెల్లంగా కనిపిస్తోంటే యింక చెప్పటం దేనికి. అంతా ఆవిడకే యిచ్చి నన్నూ నా పిల్లాడ్నీ బికారుల్ని చెయ్యండి. పెళ్ళాన్ని బాగా చూసుకోవటం చేతకానివాళ్ళు పెళ్ళెందుకు చేసుకున్నారు... ఛీ'' రాజేశ్వరి విసవిసా లోపలకి వెళ్ళిపోయింది.

శరత్ మళ్ళీ ఆఫీసుకాగితాలు చూసుకోవటం మొదలుపెట్టాడు.

పెరట్లోకి వెళ్ళిన రాజేశ్వరి పక్క వాటాలోకి తొంగిచూసింది.

సుబ్బాయమ్మ వంటింట్లో అరిటికాయలు తరుగుతోంది. ''పిన్నిగారూ... ఇందాక మా అత్తగారుగానీ వచ్చిందా'' అంది గుసగుసగా.

సుబ్బాయమ్మ గబగబా లేచి వచ్చింది.

''వచ్చావా తల్లీ... మీ అత్తగారు రాలేదుకానీ ఎవరో బైరాగి వచ్చాడమ్మా. కాషాయబట్టలు కట్టుకుని, జడలు పెంచుకుని ఉన్నాడు. వాడిని మీ ఆయన లోపలకి తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు. ఆ తర్వాత ఏదో మాట్లాడుకున్నారు.

ఎంత విందామని చూసినా వినబళ్ళేదు'' అంది సుబ్బాయమ్మ.

ఆ బైరాగి ఎవరై ఉంటారో రాజేశ్వరికి అర్థం కాలేదు.

అతనెందుకొచ్చాడు. చూడబోతే అతనికే డబ్బు ఇచ్చినట్లు కనిపిస్తోంది. అతనెవరు.

ఎందుకోగానీ రాజేశ్వరికి కొంచెం భయంవేసింది. శరత్ స్నేహితుల్లో బైరాగులెవరూ లేరు. మరి స్నేహితుడికి డబ్బిచ్చానని ఎందుకు చెప్పాడు.

''పిన్నిగారూ... నాకేం అర్థం కావటంలేదు. బీరువాలో రెండు వందలు మాయమైనాయి. ఆయన్ని అడిగితే ఆ డబ్బు ఫ్రెండ్‌కిచ్చానన్నారు. ఫ్రెండ్ పేరు చెప్పి మా అత్తగారికి ఇచ్చారేమో అనుకున్నాను. ఈ బైరాగి ఎవరో ఏమిటో? నాకంతా అనుమానంగా ఉంది'' అంది.

''నువ్వేం గాభరా పడకమ్మాయ్. నేననుకోవటం వాడెవడో మీ ఆయనకి తెలిసినవాడే సన్యాసుల్లో కలిసిపోయినట్లున్నాడు. ఆయనకి అది నీకు చెప్పటం ఇష్టం లేక ఊరుకున్నట్లున్నాడు. ఇందులో నువ్వు భయపడాల్సింది ఏంలేదు. హాయిగా ఆవిషయం మర్చిపోయి ఊరుకో. తెలిసినవాడు వచ్చి డబ్బిమ్మని అడిగితే మీ ఆయన మంచి మనిషి కాబట్టి కాదనలేక ఇచ్చి ఉంటాడు'' అంది సుబ్బాయమ్మ.

రాజేశ్వరికి కూడా అదే అనిపించింది. భర్త ఎవరికన్నా వేరే వాళ్ళకి డబ్బిస్తే రాజేశ్వరికి పెద్ద బాధలేదు. ఏదో అరిచి, గొడవచేసి మళ్ళీ ఇవ్వకుండా చేసుకోవచ్చు. అత్తగారికి ఇస్తేనే భయపడాలి. ఎందుకంటే అది తన శాసన ధిక్కారం అవుతుంది. అతనిలో తిరుగుబాటు చెలరేగుతోందనటానికి అది తార్కాణం అవుతుంది. తన అధికారం కొనసాగగలిగినంత కాలం ఒక రెండు మూడొందలు అతను దానధర్మాలు, అప్పులు ఇచ్చుకున్నా తనకేం కష్టం?

ఇట్లా ఆలోచించుకుని రాజేశ్వరి ఇంక ఆ విషయం ఎత్తలేదు.

బతుకు జీవుడా అని శరత్ నిట్టూర్చాడు. అప్పటికప్పుడు రాజేశ్వరి మీద తిరుగుబాటు ప్రకటించకపోయినా శరత్‌లో కొద్ది సంచలనం కలిగించాడు గోవిందయ్య.

గోవిందయ్యనీ, అతని మాటల్నీ శరత్ మర్చిపోలేకపోయాడు. అతనికి ఆత్మీయుడు గోవిందయ్య.

చిన్నప్పట్నుంచీ మేనమామ అనే అభిమానం, ప్రేమ ఉన్నాయి. పెద్దయ్యాక అతని పరిస్థితికి జాలిపడేవాడు. ఆ తర్వాత పెళ్ళయి తనూ దాదాపు అదే పరిస్థితిలో నివసించటం మొదలుపెట్టాక అతనిమీద సానుభూతి ఆప్యాయత పెరిగాయి. కష్టాలు అనుభవించేవాళ్ళకి తమలాగే కష్టపడే జీవులపట్ల కలిగే ఆర్ద్రతా భావం అతనిలో గోవిందయ్య మీద ఏర్పడింది.

ఆఖరికి సన్యాసుల్లో కలిసిపోతూ కూడా తన మీద ప్రేమతో తనకి బోధ చెయ్యటానికి వచ్చిన గోవిందయ్య మీద అతనికి ప్రేమ పెల్లుబుకుతోంది.

అతని మాటలు తూ.చా. తప్పకుండా పాటించాలని ఉంది.

రాజేశ్వరిని రెండు చెంపలూ వాయించి ఫో నీ దిక్కున్న చోట చెప్పుకో అందామనిపించింది.

అయినా ఎందుకోగానీ రాజేశ్వరికి ఎదురు చెప్పలేకపోతున్నాడు.

★ ★ ★

ఆరోజు పొద్దున్న లేచి కాఫీ తాగుతున్నాడు శరత్. ఇంతలో సామ్రాజ్యమ్మ, ఇద్దరు పిల్లలు ఆటో దిగారు.

సామ్రాజ్యమ్మ శుభ్రమైన చీరెకట్టుకుని తల నిండా పూలు పెట్టుకుని మొహాన అర్ధరూపాయంత బొట్టుపెట్టుకుని కళకళలాడిపోతోంది.

శరత్‌ని చూసి దిగులుగా మొహం పెట్టేసింది.

గోవిందయ్య తన దగ్గరికి వచ్చిన విషయం ఆవిడకి తెలిసిపోయిందేమోనని కంగారుపడ్డాడు శరత్.

బయటికి మాత్రం ఏం ఎరగనట్లు మొహం పెట్టి ''ఏం అత్తయ్యా... కులాసానా... ఇదేనా రావటం'' అన్నాడు.

సామ్రాజ్యమ్మ రానికన్నీళ్ళు తుడుచుకుంది.

''ఏం కులాసాలే నాయనా... నా ఖర్మ కాలింది''అంది లోపలికి వస్తూ.

రాజేశ్వరి వీళ్ళను చూసి ఎన్నాళ్ళుంటారో నని భయపడ్తూ పైకి నవ్వుతూ ఆహ్వా నించింది.

గోవిందయ్య కనిపించటం లేదని చె ప్పింది సామ్రాజ్యమ్మ.

"ఎటుపోయారో ఏమో నాయనా. కొన్నాళ్ళ నుంచీ ఆయన వాలకం అదోలా ఉంది. పిచ్చి చూపులు చూస్తుండేవారు. ఎప్పుడో హైదరా బాద్‌కి తెచ్చి డాక్టర్‌కి చూపిద్దామనుకుంటూనే ఉన్నాను. ఇంతలోనే మాయమయ్యారు. నన్ను నడిసముద్రంలో వదిలి నా దేవుడు వెళ్ళిపో యాడు నాయనా" సామ్రాజ్యమ్మ శోకాలు పె ట్టింది.

"పొద్దున్నే ఏమిటీ శోకాలు" రాజేశ్వరి కసు రుకుంది.

సామ్రాజ్యమ్మ తెల్లబోయింది.

మాటలు అనటమే కానీ పడటం చేతకాని మనిషి కావటం చేత ఒక్క నిమిషం బిక్క మొహం వేసి అంతలోనే తేరుకుంది.

"ఎవరి ఇల్లు కాలితే వాడేడుస్తాడు. ఆయన ఎట్లా ఉన్నారోనని దిగులుతో నేను ఏడుస్తుంటే నీ ఏడుపేంటి" అంది.

"అంతగా ఆయన్ని గురించి దిగులుపడే వాళ్లయితే ఆయన ఎందుకు పారిపోతాడు" అంది రాజేశ్వరి.

సామ్రాజ్యమ్మ అవమానంతో దహించుకుపో తూ శరత్‌వైపు చూసింది. అతను తన్ను రక్షించేట్లు కనిపించలేదు. ఇక్కడ తను ఇంకొ న్ని రోజులుండాలి. పని గడుపుకుపోవటం ముఖ్యంకానీ పోట్లాడుకోవటం కాదు.

వెంటనే తెల్లజండా ఎత్తింది.

"అవును తల్లీ, నేనే పాపిష్టిదాన్ని. ఆయన మహానుభావుడు. నువ్వన్నదే నిజం. పోనీ" అంది విరక్తిగా.

"ముందు కాళ్ళు కడుక్కుని కాఫీ తాగు అత్తయ్యా" అన్నాడు శరత్.

"అలాగే నాయనా" అంటూ సామ్రాజ్యమ్మ బాత్‌రూమ్ వైపు నడిచింది.

తీరిగ్గా భోజనాలు చేసి వక్కపొడి నముల్తూ సామ్రాజ్యమ్మ తను వచ్చిన పని బయటపె ట్టింది.

గోవిందయ్య కనిపించటం లేదు. పోలీస్ రిపోర్ట్ ఇచ్చారు. టి.వి.లో చెప్పించారు. లాభంలేదు.

ప్రస్తుతం జరగాల్సింది ఏమిటంటే... గో విందయ్య గవర్నమెంట్ ఉద్యోగం చేశాడు. కాబట్టి ఏడాదిపాటు మనిషి కనిపించకుండా పోతే అతను చచ్చినట్లే లెఖ్ఖకట్టి పెళ్ళానికి పెన్షనూ, గ్రాట్యుటీ ఇస్తారు. ఆ వ్యవహారం చూడటానికి సామ్రాజ్యమ్మ స్వయంగా బయ ల్దేరి వచ్చింది.

శరత్‌కి ఏం చెప్పాలో తోచలేదు. మొగుడు ఎటుపోయాడో, ఏమై పోయాడోనన్న బాధలేదు. వాడి పెన్షనూ గ్రాట్యుటీ కావాలి. అంతే.

గోవిందయ్య ఉన్నన్నాళ్ళూ చాకిరీ చేశాడు. సంపాదించి పోశాడు.

ఆ తర్వాత కూడా వాళ్ళకి ఉపయోగవడ్తు న్నాడు. సామ్రాజ్యమ్మ ఈ పెన్షనూ, గ్రాట్యుటీ అండగా చేసుకుని కొడుకుల్నీ కోడళ్ళనీ ఆడించేస్తుంది.

ఇక్కడ కూడా ఆవిడదే గెలుపు.

గోవిందయ్య అన్నివిధాలా పరాజితుడే. "కా స్త నువ్వు పూనుకుని పనిచేసి పెట్టాలి నాయనా" అంది సామ్రాజ్యమ్మ.

"సరే" అన్నాడు శరత్.

రాజేశ్వరి కూడా సామ్రాజ్యమ్మకి కావల్సిన వివరాలన్నీ ఆ ఆఫీసులో తొందరగా కనుక్కో మని పోరింది.

అవన్నీ కనుక్కునిగానీ సామ్రాజ్యమ్మపోదని తెలుసు. గోవిందయ్య కథ అలా ముగిసిపో యింది. బతికుండీ చచ్చినవాడిగా రికార్డుల్లో మిగిలిపోయాడు.

★ ★ ★

రాజేశ్వరికి జ్వరం వచ్చింది.

ముందు మామూలు జ్వరం అనుకుంది.

మూడురోజులైనా తగ్గకపోయేసరికి డాక్టర్ని సంప్రదిస్తే ఆయన ఏవో మందులిచ్చాడు. వారం గడిచినా తగ్గలేదు. ఆ తర్వాత ఏవో పరీక్షలు చేయించి టైఫాయిడ్ అని తేల్చాడు.

రాజేశ్వరి తల్లీ, తండ్రీ వచ్చి గోలచేశారు. "అయ్యో... ఏ గాలిసోకిందో. ఎవరి దిష్టి తగి లిందో, బంగారంలాంటి పిల్ల పూచికపుల్లలా అయిపోయింది. నాయన్నాయన... ఆ తిరు

పతి వెంకన్నకి జుట్టు ఇస్తానని మొక్కుకో తండ్రీ. వెంటనే తగ్గిపోతుంది'' అంటూ లబ లబలాడింది అత్తగారు.

అతను అట్లాగే మొక్కుకున్నదాకా ఆవిడ కదల్లేదు.

స్నానంచేసి తడిబట్టలతో వచ్చి వెంకటేశ్వ రస్వామికి మొక్కాడు శరత్.

''దేవుడా. రాజేశ్వరికి తగ్గిపోయి మామూలు మనిషైతే నీ దగ్గరకి వచ్చి తలనీలాలు సమ ర్పించుకుంటాను స్వామీ'' అని మొక్కుకున్నా డు.

రంగమ్మగారు అప్పటికి శాంతించింది.

''ఇక భయంలేదు నాయనా తగ్గిపోతుంది'' అంది. అక్కడితో అయిపోలేదు.

''పిల్ల నీరసించిపోతోంది. మంచి తిండీ, టానిక్‌లూ వడాలి. మీ అమ్మగారికి పంపే రెండువందలూ ఒక్క నెల్లాళ్లు ఇవ్వకపోతే కుదురుతుందా బాబూ. అహా... ఇది మీ ఇంటి వ్యవహారం నాకు అనవసరం అనుకో. అయినా ఊరికే అడుగుతున్నాను'' అన్నారు సూర్యనా రాయణ.

''కుదరకేం చేస్తుంది నాన్నగారూ. ఈ రెణ్ణె ళ్ళూ ఆవిడ్ని ఏదోలా సర్దుకోమంటేసరి'' అన్నది రాజేశ్వరి.

అందరూ కలిసి శరత్ ముందరికాళ్ళకి బంధంవేశారు. శాంతమ్మకి రెణ్ణెల్లపాటు డబ్బు పంపక్కర్లేదని తేల్చారు.

రాజేశ్వరి మరో పదిరోజుల్లో కోలుకుంది.

నెల తిరిగేసరికి తిరుపతి ప్రయాణం పె ట్టింది.

''ఇప్పుడు డబ్బులేదు. బోలెడు ఖర్చయిపో యింది. ఇంక ప్రయాణానికి ఎక్కడిది?'' అన్నాడు శరత్.

''మీ బుర్రకి అంతకన్నా ఆలోచన రాదని నాకు తెల్సు. ఎల్టీసీ పెట్టి యాత్ర చేద్దాం'' అన్నది రాజేశ్వరి ఈసడింపుగా చూస్తూ.

తోడల్లుడు, మరదలూ కూడా అక్కడే ఉన్నా రు. వాళ్ళముందు తనని తీసిపారెయ్యటం రాజేశ్వరికి సరదా అని తెలిసినా శరత్ చిన్న బుచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

''సరే'' అన్నాడు.

శాంతమ్మ తిరపతి వెళ్ళాలని ఎంత తాపత్ర యపడుతోందో అతనికి తెలుసు. ఎల్.టి.సి. పెట్టుకుని వెళితే ఆవిడకి కూడా టిక్కెట్ల డబ్బిస్తారు. తమ ఖర్చులేదు కాబట్టి రాజేశ్వరి ఆవిడ రావటానికి అభ్యంతరం చెప్పకపోవ చ్చు.

ఈ వంకతో అయినా తల్లికి తిరుపతి చూ పించవచ్చు.

''సరే. అలాగే వెళ్దాం. మా అమ్మకి కూడా ఎప్పట్నుంచో తిరపతి చూడాలని ఉంది'' అన్నాడు.

''ఆవిడ్ని తర్వాత పంపిద్దాంలెండి'' అంది రాజేశ్వరి.

''అదేంటి. మనతోపాటు తీసుకెళ్దాం. టిక్కె ట్లకి ఆఫీసువాళ్లే డబ్బిస్తారుగా''

''మా అమ్మకి కూడా తిరపతి ప్రయాణం ఎప్పట్నుంచో వాయిదా పడిపోతోంది. మీ అమ్మ గారి పేరుతో ఆవిడ వస్తుంది మనతో'' అంది రాజేశ్వరి.

''అల్లాంటివి నాకు భయం. ఒకళ్ళ పేరుతో మరొకళ్ళు రావటం తప్పు''

''మీరు సరే. మీ చేతకానితనానికి ఏవో రూల్సు చెప్పి నన్ను ఒప్పించాలని చూడ కండి. మా అమ్మ వస్తుంది మనతో అంతే'' ఖచ్చితంగా అంది రాజేశ్వరి.

తోడల్లుడు చచ్చేట్లు నవ్వుతున్నాడు.

''అన్నయ్యగారూ మనం పట్టుపడతామని భయమా. ఏం పర్వాలేదండీ. మన అత్తయ్యా గారు తెలివిగలవారు. ఏ టి.సి. అయినా నీ పేరేంటని నిద్రలో లేపి అడిగినా శాంతమ్మ అనే చెప్తారు తిరపతి వెళ్లి తిరిగి వచ్చేంతవ రకూ'' అన్నాడు.

అత్తగారు ఆయనవంక ప్రశంసాపూర్వ కంగా ఒకచూపు పారేసి, శరత్‌వైపు పనికిమా లిన వాడిని చూసినట్లు చూసింది.

''అబ్బ... ఈయన్తో చచ్చిపోతున్నాననుకో. అన్నిటికీ అనుమానాలే. అన్నీ భయాలే. అంద రూ చేస్తున్న పనులకి కూడా అంగారకగ్రహానికి ఒంటరిగా పోయినట్లు భయపడ్తారు'' రాజే శ్వరి విసుక్కుంది.

వాళ్ళంతా తనని వెధవని చూసినట్లు చూసి నవ్వుతుంటే లోలోపల అవమానంతో

ఒళ్ళు దహించుకుపోయింది.

కానీ నోరు మెదపాలంటే భయం.

ఏమన్నా అంటే ఏం జరుగుతుందో తెలుసు.

అంతా కలసి అరిచి గోలచేసి తనని నోరు మూయిస్తారు. తోడల్లుడు రామగోపాల్‌కీ తనకీ తేడా ఉంది. తన మరదలు అతనికి కాస్త గౌరవం ఇస్తుంది. అతనికి కావల్సినవన్నీ అమరుస్తుంటుంది.

అతను కూడా తనలాగా సంకోచించే మనస్తత్వం ఉన్న మనిషి కాదు. ఏవి కావాలన్నా నేరుగా అడుగుతుంటాడు.

తన దగ్గర డబాయించి మాట్లాడే అత్తగారు అతన్ని మాత్రం ఏమీ అనదు.

అతను హాస్యాలు పట్టిస్తుంటే నవ్వుతుంది. విసుక్కుంటే భయపడుతుంది.

తన పెళ్ళానికే తనంటే లెక్కలేదు. ప్రేమ లేదు. ఉంటే ఒక్కనాటికీ ఇట్లా నలుగురిలో అలుసుచేసి ఉండేదికాదు.

ఒంటరిగా ఉన్నప్పుడు ఆవిడ తనని తన్నినా పర్వాలేదు. కానీ నలుగురిలో ఇలా చులకన చెయ్యకుండా ఉంటే బాగుండునన్పించింది.

రామగోపాల్ తన తల్లితండ్రుల్ని యాత్రలకి తీసుకెళ్ళాడు. వాళ్ళు ఈ ఊరు వచ్చినప్పుడల్లా రాచమర్యాదలు చేస్తాడు. మరి అదేమనిషి తనని మాత్రం తల్లికి బదులుగా అత్తగార్ని యాత్రలకి తీసుకెళ్ళమంటున్నాడు. తనకో రూలు, ఇతర్లకో రూలూనా.

ఏమైనా ఇక గొడవపెట్టి నెగ్గలేనని తెల్సుకాబట్టి వెంటనే ఒప్పేసుకుని మర్నాడే ఆఫీసులో తిరపతి వెళ్తున్నట్లు చెప్పి అడ్వాన్స్ డ్రా చేశాడు.

రైల్లో ఎక్కి కూర్చున్నాక కూడా అదోమాదిరి భావం మనసుని పీకుతూనే ఉంది.

తప్పు చేస్తున్న భయం ఒకపక్క...

తల్లికి ఆవిడ ఏకైక కోరిక అయిన తిరపతి యాత్ర కూడా తీర్చలేని అసమర్థుడిని అనే బాధ మరోపక్క.

అత్తగారు ఖుషీగా కబుర్లు చెపుతోంది రాజేశ్వరితో. అపరాధ భావంతో మనసంతా బరువెక్కిపోయి నిద్రలో శాంతికోసం ప్రయత్నిస్తూ కళ్ళు మూసుకున్నాడు శరత్.

తిరపతి కొండ ఎక్కారు. తలనీలాలు సమర్పించాడు. దర్శనం అయింది.

"ప్రవీణ్‌కి ఏమన్నా కొనిపెట్టండి. తిరపతి నుంచి తెచ్చుకున్నామని గుర్తుగా ఉంటుంది" అంది రాజేశ్వరి.

ప్రవీణ్, శరత్ కలిసి షాపులవైపు నడుస్తున్నారు. ఇంతలో ఒక ఆకారం శరత్‌నే తేరిపార చూస్తూ వెనకేవస్తోంది.

ఎవరో శరత్ పోల్చుకోలేకపోయాడు.

గుండుతో ఉన్న ఆకారం మరి.

అతను కూడా శరత్‌ని పోల్చటానికి ప్రయత్నిస్తున్నట్లున్నాడు.

"మీ పేరు శరత్‌కదూ" అన్నాడు.

"అవును. మీరు"

"ఒరి శరత్, గుర్తుపట్టలేదా. నేను వీరాంజనేయుడ్ని" అన్నాడతను.

శరత్‌కి గుర్తుకొచ్చింది.

వీరాంజనేయులు శరత్‌కి చిన్నప్పుడు క్లాస్‌మేట్. క్లాస్‌లో ఫస్ట్ వచ్చేవాడు. బుద్ధిమంతుడని పేరు.

అతని పక్కన స్లీవ్‌లెస్ బ్లౌజ్, బాబ్డ్‌హెయిర్‌తో అత్యంత ఆధునికంగా ఉన్న యువతిని చూసి శరత్ ఎవరన్నట్లు చూశాడు.

"డార్లింగ్, నేను చెప్తుంటానే శరత్ అని ఇతనే శరత్. ఈమె నా ఫ్రెండ్ టింకూ" అన్నాడు వీరాంజనేయులు.

ఆమె షేక్‌హాండ్ ఇవ్వబోయి శరత్‌ని చూసి ఆగి చేతులు జోడించింది.

శరత్ ప్రతి నమస్కారం చేసి ఇబ్బందిగా మొహం పెట్టాడు.

"శరత్ నిన్ను చూస్తే ఎంత ఆనందంగా ఉందో తెలుసా. మళ్ళీ మన బాల్యం గుర్తుకొస్తోంది. ఈరోజు నువ్వు నాతో కనీసం ఓ గంటన్నా గడపాలి. ఏం చేస్తున్నావు. పిల్లలెందరు. వీడు నీ కొడుకా" అన్నాడు వీరాంజనేయులు.

"వీడు నా కొడుకు ప్రవీణ్. ఒక్కడే. మా ఆవిడ కాటేజ్‌లో ఉంది. రా... పరిచయం చేస్తాను. రండమ్మా" అన్నాడు శరత్.

మళ్ళీ అంతా వెనక్కుతిరిగి శరత్ కాటేజ్‌లో కి వెళ్లారు. టింకూనీ, వీరాంజనేయుల్నీ చూసి రాజేశ్వరి ఆశ్చర్యపోయింది. రంగమ్మ ఆశ్చర్యా నికీ తక్కువలేదు. అధునాతనంగా ఉన్న ఆ జంట శరత్‌కెలా పరిచయమో అర్థంకాక తబ్బిబ్బయ్యారు ఇద్దరూ.

పరిచయాలు అయ్యాయి.

రాజేశ్వరితో వీరాంజనేయులు చాలా చొర వగా మాట్లాడి అన్ని వివరాలూ అడుగుతున్నా డు.

"మేమిద్దరం ఒకగంట అలా తిరిగొస్తామ మ్మా. చాలారోజులకి కలుసుకున్నాంకదా. మరి మీ పర్మిషన్ లభిస్తే వెళ్తాం" అన్నాడు.

"అదేంటండీ. నా పర్మిషనేంటి..."

"అంతేలెండి. ఇంతకీ ఒప్పుకున్నట్లేకదా. మీరు కాస్త విశ్రాంతి తీసుకోండి. టింకూ, నువ్వు మాతో వస్తావా కాటేజ్‌కి వెళ్లి రెస్ట్ తీసు కుంటావా?" అన్నాడు వీరాంజనేయులు.

"నేను కాటేజ్‌కి వెళ్లిపోతాను" అంది టింకు.

"ఓ.కే. బయల్దేరు... శుభస్య శీఘ్రం"

టింకూ నవ్వేసి వెళ్ళిపోయింది.

"బాబూ ప్రవీణ్, నీకేం బొమ్మ కావాలో చెప్పు. తెచ్చిస్తాం"

"నేను మళ్ళీ డాడీతో వెళ్లి తెచ్చుకుంటాను అంకుల్" అన్నాడు ప్రవీణ్.

"వెరీగుడ్, రాజీపడే మనస్తత్వం కాదన్న మాట నీది. బాగుపడిపోతావ్" నవ్వేసి అందరి కీ వెళ్ళొస్తామని చెప్పి శరత్ చెయ్యి పట్టుకుని బయటకు వచ్చాడు వీరాంజనేయులు.

"శరత్, నిన్నోమాట అడగనా?" అన్నాడు.

"అడుగు"

"మీ ఆవిడ్నీ అత్తగార్నీ తెచ్చావు. మీ అమ్మగారేరీ"

"నా ఖర్మ... మా ఆవిడకి మా అమ్మని చూస్తే గిట్టదు" శరత్ తన కష్టాలన్నీ వీరాంజ నేయులుకి చెప్పుకున్నాడు.

మనసులోంచి బాధ కాస్త తీరినట్లయింది.

"ఏంచెయ్యలేక అల్లాగే సర్దుకుపోతున్నాను వీరూ. ఈ వయసులో అమ్మకి విశ్రాంతి ఇవ్వా ల్సిందిపోయి ఆవిడచేత శ్రమ చేయిస్తున్నాను. నెలరోజులైంది ఆవిడ్ని చూసి!" అన్నాడు.

వీరాంజనేయులు శరత్ చెయ్యి నొక్కాడు సానుభూతిగా.

"నిన్ను చూస్తేనే నేను అనుకున్నాను" అన్నాడు.

"నా సంగతి సరే. నీ సంగతేంటి. అసలు పెళ్ళయిందాలేదా. ఈవిడ ఈ టింకూగారు ఎవరు..." అన్నాడు శరత్.

వీరాంజనేయులు నవ్వాడు.

"నేనూ నీలాంటి కేసేగురూ. మా ఆవిడ నన్ను అస్తమానం కాల్చుకుని తింటుంది. ఇద్ద రు పిల్లలున్నారు. కానీ వాళ్ళు వాళ్ళ అమ్మ పక్షమే. నీకు తెల్సుగా నేనెంత బుద్ధిమంతుడ్నో బుద్ధిగా సంపాదించిన డబ్బంతా మా ఆవిడ చేతిలోపోసి ఏ దురలవాట్లూ లేకుండా ఉండే వాడిని. అయినా ఆవిడ ప్రతిదానికీ సాధించి రాచిరంపాన పెట్టింది. ఆవిడ బాధ పడలేక ఒకనాడు మా ఫ్రెండొకడు నాటకం వేస్తుంటే మనశ్శాంతి కోసం వెళ్ళాను..." వీరాంజనేయు లు తన కథ చెప్పుకొచ్చాడు.

నాటకం చూద్దామని వెళ్ళిన వీరాంజనేయు లు ఆ నాటకం వేయిస్తున్నది తన స్నేహితుడే కావటంవల్ల గ్రీన్‌రూమ్‌లో కూర్చుని నటీనటు లు మేకప్ వేసుకుంటుంటే చూస్తున్నాడు.

ఇంతలో ఒక నటుడు రాలేదని తెలిసింది. ఏంచెయ్యాలో తోచక చివరికి వీరాంజనేయు ల్ని శరణుజొచ్చాడు ఆ నాటకం వేయిస్తున్న మిత్రుడు.

"చిన్న పోర్షనే. ఎక్కువ డైలాగ్‌లు లేవు. ప్రాంప్టింగ్ కూడా ఉంటుంది. ప్లీజ్... వేసె య్యి" అన్నాడు.

వీరాంజనేయులికి కూడా సరదాగా అని పించింది. వెంటనే స్క్రిప్ట్ ఒకసారి చదివి తన పోర్షన్ అర్థం చేసుకుని మేకప్ వేసుకుని తయారయ్యాడు.

అది చాలా చిన్నపాత్రే అయినా వీరాంజనే యులు తనకు చేతనైనట్లు చక్కగా పోషించి రక్తికట్టించాడు.

నటనలో అతనికి ఆనందం, శాంతి కని పించాయి. తన టెన్షన్ అంతా రిలీవైపోయిన ట్లు అనిపించింది.

ఆ మిత్రుడ్నే బతిమాలుకుని మరో రెండు నాటకాల్లో వేషం సంపాదించాడు.

మొదటిరోజు పెళ్ళాన్ని అదరగొట్టాలని మేకప్ తియ్యకుండానే ఇంటికి వెళ్ళాడు.

వీరాంజనేయులు భార్య అతను నాటకంలో వేషం వేసి వస్తున్నాడని తెలిసి హడలిపోయింది.

అతనికి ఇట్లాంటి ఆసక్తులేవీ లేవు కాబట్టి ఆమెకి ఒక్కసారిగా విభ్రాంతి కలిగింది.

ఆమెని హడలగొట్టకలిగిన తన నటనమీద అతనికి ప్రేమ, అభిమానం పెరిగిపోయాయి.

వీరాంజనేయులు భార్యకి అతన్ని చూస్తే భయంవేస్తోంది. ఆమె చుట్టాల్లో నాటకాల కోసం ఆస్తంతా హారతికర్పూరం చేసి, కుటుంబాన్ని పట్టించుకోకుండా తిరిగిన మనుషులెంతమందో ఉన్నారు. వాళ్ళతో పోల్చుకుని భయపడ్తూ ఏడుస్తుంటుంది.

ఆమె భయపడ్తున్నకొద్దీ వీరాంజనేయులుకి సరదా పెరిగిపోతోంది.

నాటకాల్లో అనుభవం సంపాదించాక సినిమాల్లో వేషాలకోసం ప్రయత్నించాడు.

ఈమధ్యనే ఒక డైరెక్టరు అతనికి తను తీయబోయే చిత్రంలో విలన్ వేషం ఇచ్చాడు. మరో రెండురోజుల్లో షూటింగ్ ఉంది. గుండుతో నటించాలని చెప్పాడు. ఎట్లాగూ గుండు చేయించుకునేటప్పుడు తిరపతి వచ్చి చేయించుకుంటే పుణ్యమూ, పురుషార్థమూ అని ఇలా వచ్చాడు. అదీగాక సినిమాలో వేషం దొరికితే తలనీలాలు సమర్పిస్తానని మొక్కు ఉందిట. ఇట్లా గుండువేషం ద్వారా ఆ వెంకన్నే వీలుకల్పించాడు అన్నాడు.

టింకూ అతనికి నాటకాలు వేసేటప్పుడే పరిచయం. ఆవిడ కూడా కొన్ని నాటకాల్లో నటించిందిట. తిరపతి చూస్తానని సరదాపడ్తే ఇద్దరూ కలిసివచ్చారుట.

''టింకూతో తిరుగుతుంటే మా ఆవిడ మొహం చూడాలి. ఏడుపు మొహం పెట్టుకుని తననెక్కడ వదిలేస్తానో అని బెదురుచూపులు చూస్తుంటుంది. నన్ను ఈసడించి పారేసి, పురుగుకన్నా హీనంగా చూసిన ఆవిడే మళ్ళీ నన్ను మంచి చేసుకోవాలని రకరకాలుగా ప్రయత్నిస్తోంది. కానీ లాభంలేదు. నా మనస్సు విరిగిపోయింది ఆవిడంటే. ఏదో పిల్లలకోసం కలిసి కాపురం చేస్తున్నాం అంతే'' అన్నాడు వీరాంజనేయులు.

శరత్ వింటున్నాడు. ఏం మాట్లాడాలో అర్థం కావటంలేదు.

వీరాంజనేయులుకి కూడా బహుశా తనలో ఇంత నటనాశక్తి ఉందని తెలిసి ఉండదు. అతని వేదనా భరితమైన జీవితంలోంచి ఆ అద్భుతనటన పుట్టుకొచ్చి ఉంటుంది. లేకుంటే నాటకాలు కనీసం చూసి ఎరగని వీరాంజనేయులు నటించడం ఏమిటి... అదీ సినిమాలవాళ్ళని కూడా ఆకర్షించేంత బాగా నటించాడంటే...

''అదృష్టవంతుడివి గురూ. నలుగురిలో గుర్తింపు పొందుతున్నావు. అటు పెళ్లాన్ని కూడా అదుపులోకి తెచ్చుకున్నావు'' నవ్వాడు శరత్.

''ఏం అదృష్టం గురూ. ఒక్కొక్కసారి ఒంటరితనం నన్ను చుట్టుముడుతూనే ఉంటుంది. నాకు మంచి ఉద్యోగం ఉంది, నలుగురిలో గుర్తింపు ఉంది. టింకూలాంటి ఫ్రెండ్స్ ఉన్నారు... కానీ మనసున మనసై అని పాడినట్లు నన్ను నన్నుగా ప్రేమించి అభిమానించే భార్య లేదు. ఉన్నదల్లా ఒక రాక్షసి. అది గుర్తుకొచ్చినప్పుడల్లా అదోమాదిరి ఒంటరితనంగా అనిపిస్తుంది. ఏంటో సుఖంలేని బతుకు. ఏం చేస్తాం... సర్దుకుపోవాలి'' నిట్టూర్చాడు వీరాంజనేయులు.

''ఇంక వెళ్తాను. మా ఆవిడ ఎదురు చూస్తుంటుంది'' అన్నాడు శరత్.

''ఏం భయపడ్తావు శరత్. ఎన్నాళ్ళు ఈ బతుకు. నాతో రారాదూ. నాటకాల్లో వేయిస్తాను. మీ ఆవిడ్ని ఒక్కసారి షాక్‌చెయ్యి వేషాలువేసి'' అన్నాడు వీరాంజనేయులు.

శరత్ నవ్వాడు.

''అది అందరికీ లభించేది కాదు వీరూ. కళ అన్నది దైవదత్తమైనది. ప్రతీవాళ్ళనీ అది వరించదు. నీలో నిద్రాణమై ఉన్న కళ బహుశా నీ నిరాశవల్ల జాగృతమై ఉంటుంది. అంతే కానీ ప్రతీవాళ్ళూ నటులు కాలేరు. నాకు ఆ ఆశ కూడా లేదు'' అన్నాడు.

''సర్లే నీ ఇష్టం. కానీ ఏదన్నా కావాలంటే మాత్రం నాకు రాయి. తప్పకుండా చేస్తాను.

నువ్వూ నాలాగే భార్యా బాధితుడివని తెలిశాక నీమీద జాలీ, ప్రేమా రెట్టింపయ్యాయి'' నవ్వాడు వీరాంజనేయులు.

అంటే తనకు గోవిందయ్యమీద ఉన్నట్లన్నమాట. శరత్‌కి కూడా నవ్వొచ్చింది.

''శరత్... ప్రతీవాళ్ళకీ ఏదో ఒక బలహీనత ఉంటుంది. కానీ ఆ బలహీనత ఇతర్లకి అపకారం చేసేంత ఉండకూడదు. నీ బలహీనత నీ భార్య. ఆవిడకి ఎదురు చెప్పలేని నీ అశక్తతవల్ల పెద్దవయసులో ఒంటరిగా మీ అమ్మగారు ఎంత బాధపడ్తున్నారో ఆలోచించు. చెట్టంత కొడుకువి నువ్వుండి కూడా ఆవిడ ఈ వయసులో కష్టం చేసుకు బతికే ఖర్మ పట్టించకు. మీ ఆవిడతో గయ్యిన పోట్లాడి మీ అమ్మగార్ని తెచ్చుకుని చివరి రోజుల్లోనైనా ఆవిడ్ని ప్రశాంతంగా ఉండనియ్యి'' అన్నాడు వీరాంజనేయులు.

శరత్ తల ఊపాడు.

''మరి మన పాతస్నేహితులు ఎలా ఉన్నారో తెలుసా. అందర్నీ కలుసుకోవాలని ఉంటుందిగానీ బిజీలైఫ్. వాళ్ళెవళ్ళన్నా కలుస్తే నా అడ్రస్ ఇవ్వు''

''సరే''

''అన్నట్లు మర్చిపోయాను. మన క్లాస్‌లో సునీల్ అని ఉండేవాడు చూడు గుర్తుందా''

''లేకేం. ఎర్రగా సన్నగా ఉండేవాడు. వాడేనా''

''అవును. వాడు చిన్నప్పుడు కాఫీ తాగటానికి కూడా భయపడేవాడా. ఇప్పుడు పచ్చితాగుబోతు''

''అదేంటి పాపం''

''అంతే. వాడూ మనలాగా భార్యాబాధితుడన్నమాట. పెళ్ళాం వాడ్ని నానాతిట్లూ తిడ్తుంటే భరించలేక, ఒంటరితనంతో బాధపడ్తూ తాగుడుని శరణు జొచ్చినట్లున్నాడు. ఇప్పుడు నువ్వు చూస్తే గుర్తుపట్టలేవు. కళ్ళు ఉబ్బి, పొట్ట వచ్చి తాగుబోతు ఆకారం పూర్తిగా వచ్చేసి భయంకరంగా ఉన్నాడు. అయినా అదేంపని చెప్పు వాడి ఒళ్ళే పాడవుతుందిగానీ ఆవిడకేం. అమధ్య డాక్టర్లు తాగుడు తగ్గించకపోతే ప్రాణానికే ప్రమాదం అన్నా తగ్గించలేదు. ఏమన్నా అంటే నాకు బతకాలని లేదు, ఎవరికోసం బతకాలని అంటాడు''

''ఏమిటో ఒక పురుషుడి విజయం వెనక ఒక స్త్రీ ఉంటుందంటారు. అది ఎంత నిజమో కానీ పురుషుడి పరాజయం వెనకమాత్రం తప్పకుండా ఒక స్త్రీ ఉంటుంది'' నిరాశగా అన్నాడు శరత్.

''అంతే''

ఇద్దరూ పదినిమిషాలు అయ్యాక లేచారు.

రాఘవ అడ్రస్ తీసుకున్నాడు వీరాంజనేయులు. వీరాంజనేయులు ఉన్నట్లుండి శరత్‌ని కౌగిలించుకున్నాడు.

''శరత్. నన్ను మర్చిపోవుకదూ. నిన్ను చూస్తే మనస్సుకి ఎంత శాంతిగా అనిపించిందో తెల్సా'' అన్నాడు.

శరత్ చలించిపోయాడు.

''ఊరుకో వీరూ. నేనెందుకు మర్చిపోతాను. ఇంకా నువ్వే మర్చిపోవచ్చు, పెద్ద సినిమా యాక్టర్‌వి కూడా కాబోతున్నావు. నేను నీకు మాటిమాటికీ ఉత్తరాలు రాసి ఫోన్లు చెయ్యలేకపోవచ్చు. కానీ ఒంటరితనంలో ఎప్పుడైనా మనసులో మన స్నేహం జ్ఞప్తికి వచ్చినప్పుడు మాత్రం ఎంతో సంతోషంగా ఉంటుంది'' అన్నాడు.

వీరాంజనేయులు తృప్తిగా నిట్టూర్చాడు.

''చాలు శరత్. ఈ ఆనందం చాలు. నాకోసం ఆలోచించే మనిషి ఒకడున్నాడనే ఆలోచన చాలు'' అన్నాడు. అతని కళ్ళల్లో తడి స్పష్టంగా కనిపిస్తోంది.

శరత్ కాటేజ్‌దాకా వచ్చాడు వీరాంజనేయులు.

''ఉంటాను శరత్'' అన్నాడు.

అతను తన కాటేజ్‌వైపు వెళ్ళిపోతుంటే చూస్తూ నిలబడ్డాడు శరత్.

ఏమిటో ఈ జీవితం...

తను నడుద్దామనుకున్న తోవలో నడవనివ్వదు విధి. రాజేశ్వరి అతన్ని లోపలకు రాగానే నిలవేసింది.

''ఎవరండీ అతను. ఆవిడెవరుట అసలు. ఇద్దరూ భార్యాభర్తలూ కాదు, బంధువులూ కాదు. జల్సా చెయ్యటానికి వచ్చినట్లున్నారు'' అన్నది రాజేశ్వరి కోపంగా చూస్తూ.

''అవును. బంధువులు కారు. ఫ్రెండ్స్‌మని

చెప్పారుగా'' అన్నాడు శరత్.

''అవ్వ... అదేంపని బాబూ. ఆడామొగా ఇద్దరే ఇట్లా వస్తారా. పైగా నాటకాల్లో వేషాలేస్తారుట. పెళ్ళాంతో రాకుండా ఇట్లా అడ్డమైన వాళ్ళనీ వేసుకుని వస్తాడా'' అన్నది రంగమ్మ.

శరత్‌కి ఒళ్ళు మండిపోయింది.

భగవంతుడి ముందుకి వియ్యపురాలి పేరుతో ఛార్జీలు గవర్నమెంటునుంచి పుచ్చుకుని రావటం అపచారంకాదా.

అల్లుడిమీద అధికారం చెలాయించటం అపరాచంకాదా.

తల్లికీ కొడుకుకీ కాకుండా చేసి తన కూతుర్ని మాత్రమే ఇంటికి సర్వాధికారిణిని చెయ్యటం అపచారం కాదా.

ఏది అపచారం కాదు.

ఆవిడ మొహం చూడాలనిపించలేదు.

పోయి కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

''ఆయనెవరసలు. ఈ పేరున్న ఫ్రెండ్ గురించి నాకెప్పుడూ చెప్పలేదేం'' అంది రాజేశ్వరి.

అసలు ఏ ఫ్రెండ్ గురించి చెప్పనిచ్చింది రాజేశ్వరి.

తన జీవితంలో భార్యతో కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకున్న రోజులేవీ.

తన ఫ్రెండ్స్ గురించీ, బాల్యం గురించీ నెమరువేసుకుని భార్యతో ఆ అనుభవాల అనుభూతులను గుర్తుచేసుకునే అవకాశం రాజేశ్వరి తనకు ఇచ్చిందా.

ఎంతసేపూ సినిమాలూ, చీరెలూ, నగలూ వాళ్ళ భర్త గురించీ వీళ్ళమొగుళ్ల గురించీ గొప్పలు, చివరికి తనని ఒక చవటని చేసి నిరూపించి నిష్క్రమించటం. అంతకన్నా గుర్తుపెట్టుకునే జ్ఞాపకాలేవీ జీవితంలో.

''డాడీ... పద మనం అలా తిరిగొద్దాం'' అన్నాడు ప్రవీణ్.

''కాస్సేపు రెస్ట్ తీసుకుని వెళ్దాం'' అన్నాడు శరత్.

''అదుగో. అదే వద్దన్నది. పిల్లాడు వెళ్దాం అని సరదాపడ్తే వాడ్ని కాదనటానికి మీకు నోరెలా వచ్చింది'' అంది రాజేశ్వరి.

ప్రవీణ్ తల్లివంక ప్రేమగా చూసి తండ్రి వైపు ఒక నిర్లక్ష్యపుచూపు పారేశాడు.

''పద వెళ్దాం'' అన్నాడు శరత్ ఆ చూపు భరించలేక.



తిరపతినుంచి వచ్చి ఆఫీసులో జాయిన్ అయ్యాడు. వెళ్లగానే భయంకరమైన వార్త.

గుర్నాధం ఒళ్ళుకాలి హాస్పటల్‌లో ఉన్నాడుట. కిరసనాయిల్ పోసుకుని అంటించుకున్నాడని కొందరు... ప్రమాదవశాత్తూ కాలిందని మరికొందరు.

జాయినింగ్ రిపోర్ట్ ఇచ్చి హాస్పటల్‌కి వెళ్ళాడు. గుర్నాధం అన్నయ్య, ఇంకా కొంతమంది బంధువులు ఉన్నారు వరండాలో. గుర్నాధం చచ్చిపోయాడు.

మొన్న రాత్రి గుర్నాధం భార్య ఫ్రిజ్ కొనమని పేచీపెట్టిందిట.

''డబ్బులు లేవు. వీలున్నప్పుడు కొంటాను'' అన్నాడుట గుర్నాధం.

''వీల్లేదు. ఇప్పుడే కావాలి'' అని కూర్చుందిట ఆవిడ.

అసలు సంగతేమిటంటే గుర్నాధం తల్లికి ఏవో పెన్షను ఎరియర్స్ ఆరువేలదాకా అందిందిట. ముసలావిడ ఆ డబ్బేం చేసుకుంటుంది నెలనెలా పెన్షన్ వచ్చివడ్తోంది చాలు అని గుర్నాధం భార్య అభిప్రాయం.

ఆవిడకి ఏదన్నా అవసరం వస్తే నువ్విస్తావా. నేనిస్తానా? ముసలితనంలో అనారోగ్యంవల్ల ఎక్కడి డబ్బూ మరిదులకీ ఆస్పత్రులకే చాలటంలేదు. నేను ఏమన్నా ఇవ్వాల్సింది పోయి పైపెచ్చు ఆవిడ్నే ఎట్లా అడగను. నాకు

సిగ్గులేదూ'' అన్నాడుట గుర్నాథం.

"అదంతా నాకు తెలీదు. ముందు ఆ డబ్బు తీసుకోండి. వీలువెంబడి మీ దగ్గర డబ్బు వచ్చినప్పుడు తిరిగి ఇచ్చేద్దురుగాని'' అన్నదావిడ.

ఒకసారి ఆ డబ్బు తీసుకుంటే పెళ్ళాం తిరిగి ఇవ్వనివ్వదని గుర్నాథంకి తెలుసు కాబట్టి ఒప్పుకోలేదు.

భార్య చచ్చిపోతానని బెదిరించి కిరసనాయిల్ డబ్బా తీసుకుందిట.

అంతే....

ఆవిడ ఊహించనివిధంగా గుర్నాథం ఆ కిరసనాయిల్ కాస్తా తన నెత్తిన పోసుకుని అంటించేసుకున్నాడు.

ఆవిడ కేకలువిని నలుగురూ పరుగెత్తుకు వచ్చి హాస్పటల్లో చేర్పించారు.

అంతా విన్న శరత్ కోపంతో కంపించిపోయాడు.

"ఏమిటీ ఘోరం. ఫ్రిజ్ కోసం భర్తని బలితీసుకుందా. ఛీ... రాక్షసి'' అనేశాడు బిగ్గరగా.

గుర్నాథం అన్న శరత్‌వైపు చూశాడు.

"మీరేకదూ శరత్ అంటే'' అన్నాడు.

"అవును''

"గుర్నాథం మీ పేరే కలవరించేవాడు. ఒళ్ళంతా కాలి ఎంత బాధపడ్డాడనుకున్నారు. తనకి మీరు బాగా ఆత్మీయులనుకుంటాను. ఎన్నిసార్లు అడిగాడో తెలుసాండీ. మీరు ఊర్నించి ఎప్పుడొస్తారా అని ఎదురుచూస్తున్నాను'' అన్నాడు ఏడుస్తూ.

శరత్ కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

గుర్నాథం... తన బాధల్లో, తన స్పందనల్లో పాలువంచుకున్న గుర్నాథం... మన బతుకింతే ఇట్లా గడిచిపోవాల్సిందే శరత్... పిరికివాళ్ళమైనందుకు పెళ్ళాం చేతిలో కీలుబొమ్మలం కావల్సిందే అంటూ నవ్వే గుర్నాథం.

తను నిరాశగా కూర్చున్నప్పుడు తన మనసుని తేలికపర్చటానికి జోక్స్ వేసే గుర్నాథం.

బతుకుని తేలిగ్గా తీసుకునే గుర్నాథం. ఎందుకిట్లా చేశాడు.

ఎందుకంటే... మనిషి దాంపత్యజీవితానికి చాలా ఇంపార్టెన్స్ ఇస్తాడు కనక.

ఆ బంధానికి ఎంతో విలువ ఇస్తాడు కనక. ఆ ప్రాముఖ్యతా, ఆ విలువా ప్రతిమనిషీ ఇస్తాడు. మినిస్టరైనా, మిడిల్‌క్లాస్ మనిషైనా, సినిమాస్టారైనా, గుడిసెవాలా అయినా ఎవరైనా కోరుకునేది సంసారం శాంతంగా సాగిపోవాలనే.

ఆ శాంతి, సుఖం ఇంట్లో దొరకకపోతే ఒక్కొక్కళ్లు ఒక్కొక్కలాగా రియాక్ట్ అవుతారు.

మనిషి ఏదన్నా భరించగలడుగాని తన జీవితభాగస్వామితో తనకు పడకపోతే భరించలేడు.

గుర్నాథం ఏనాటినుంచో ఆవేదన పడ్తూనే ఉన్నాడు. మనసులో ఏడుస్తూ పైకి నవ్వుతున్నాడు.

తల్లి డబ్బు తీసుకురమ్మని పెళ్ళాం కిరసనాయిల్ డబ్బా తియ్యగానే గుర్నాథం ఎమోషనల్‌గా ఫీలయ్యిఉంటాడు.

భార్యకి బుద్ధిచెప్పాలనే తీవ్ర తాపత్రయం...

తల్లికి ఏమీ చెయ్యలేకపోయానన్న అశాంతి...

సంసారంలో లేని శాంతి...

పెళ్ళయిన దగ్గర్నుంచీ మొదలైన దాంపత్య యుద్ధం...

అన్నీ కలిసి అతన్ని ఆత్మహత్యకి ప్రేరేపించి ఉంటాయి. కోపంలో క్షణికావేశంలో చేసిఉండడు ఆపని.

బహుశా ఆ క్షణంలో కాకపోయినా ఏదో ఒకరోజు ఆపనే చేసిఉండేవాడు.

గుర్నాథం అంత్యక్రియలు జరుగుతున్నంతసేపూ శరత్ తీవ్రంగా బాధపడ్తూనే ఉన్నాడు.

ఏమిటి ఈ బతుకు.

బహుశా గుర్నాథం బదులు అతని భార్యగానీ చచ్చివుంటే.

ఆవిడ ఫ్రిజ్ కొనలేదని పంతంగా ఒళ్ళు అంటించుకుంటే, మహిళా సంఘాలన్నీ ఏకమయ్యి గుర్నాథాన్ని ఏకివుండేవి. గోలగోల, గొడవ గొడవ అయ్యిండేది. గుర్నాథాన్ని పోలీసులు పట్టుకుపోయి చావదన్ని ఉండేవాళ్ళు. పేపర్లలో గుర్నాథం ఘాతుకాన్ని చెరిగేసి

ఉండేవాళ్ళు. ధర్నాలూ, ఘెరావ్‌లూ జరిగేవి. గుర్నాథం ఉద్యోగం ఊడి జైల్లో ఊచలు లెక్క బెడ్తుండేవాడు.

కానీ మరి ఇప్పుడు అవేం జరగలేదు. ఒక స్త్రీకి అన్యాయం జరిగితే అంత గొడవ. మరి అంతకన్నా ఘోరమైన అన్యాయం ఒక పురుషుడికి జరిగితే ఎవరూ నోరు మెదపరేం.

ఇంటికి ఎట్లా తిరిగి వచ్చాడో శరత్‌కే తెలీదు. అంతగా చలించిపోయాడతను ఆ సంఘటనతో. రాజేశ్వరి తలుపుతీసి అతని మొహంచూసి ఆశ్చర్యపోయింది.

"అలా ఉన్నారేం" అని అడిగి అతన్ని ఓదార్చి ఉంటే ఏం జరిగిఉండేదో.

కానీ రాజేశ్వరి అడగలేదు.

అతనే చెప్తాడులే అనుకుని ఊరుకుంది.

శరత్‌కి ఆ రాత్రి జ్వరం వచ్చింది.

ప్రయాణం బడలిక, ఆపైన ఈ ఘోరమైన సంఘటన అతన్ని తీవ్రమైన ఆందోళనకి గురిచేశాయి.

జ్వరంలో అమ్మా అమ్మా అని కలవరించాడు.

అతన్ని పట్టిపీడిస్తున్న ఒంటరితనం ఆ కలవరింతలలో వ్యక్తమైపోయింది.

అతని మనస్సంతా బాధగా ఉంది. ఒంట్లో బాగాలేదు.

తల్లి ఒడిలో తలదాచుకుని ఏడవాలనిపించింది ఎందుకో.

అంత బాధలోనూ అతనికి నవ్వువచ్చింది.

భర్త సరిగ్గా చూసుకోకపోతే ఆ భార్య తన తల్లి ఒళ్ళో తలదాచుకుని బావురుమంటుంది.

కానీ 'నా పెళ్ళాం నన్ను సరిగ్గా చూసుకోదమ్మా' అని తల్లి ఒడిలో తలదాచుకుని దుఃఖించే మగవాళ్ళు ఎంతమంది.

ఒకవేళ ఎవడైనా అలా చేసినా వాడ్ని అమ్మకూచిఅనో, చేతకాని వెధవ అనో అంటారు అందరూ.

ఏమిటీ భేదం... బాధ ఎవరికైనా ఒకటే, అయినప్పుడు దాన్ని బయటపెట్టుకునే హక్కు ఆడవాళ్ళకి మాత్రమే ఉండి, మగవాళ్ళకి లేకపోవటం ఏమిటి.

శరత్ అమ్మా, అమ్మా... అని కలవరించటం సుబ్బాయమ్మకి వినబడింది.

"రాజేశ్వరీ... పోనీ మీ అత్తగార్ని పిలిపించరాదూ" అంది.

"ఊరుకోండి పిన్నిగారూ... ఆవిడ వచ్చిన దగ్గర్నుంచి ఇంక ఏదో ఒక గొడవ. ఇదేమంత జ్వరం. ప్రయాణబడలిక- అంతే" అని తీసిపారేసింది రాజేశ్వరి.

"గుర్నాథం లేడూ మీ ఆయన ఫ్రెండు..."

"అవును..."

"అతను పొయ్యాడట తెల్సా. కిరసనాయిల్ పోసుకుని అంటించుకున్నాడట. మా మరిది తమ్ముడు మీ ఆయన ఆఫీసేగా. ఇందాక ఏదో పనిమీద మా ఇంటికి వచ్చినప్పుడు చెప్పాడు"

"అట్లాగా" రాజేశ్వరి ఆశ్చర్యపోయింది.

"అవును... దడుపు జ్వరం లాగుంది మీ ఆయనకి"

"మా నాన్నగార్ని అడిగి మంత్రం వేసేవాళ్ళుంటే కనుక్కుంటాను" అంది రాజేశ్వరి.

మంత్రం వెయ్యకుండానే మర్నాటికి శరత్ జ్వరం తగ్గింది. ఒక్కరోజు విశ్రాంతి తీసుకుని మళ్ళీ మర్నాడే ఆఫీసుకి వెళ్ళాడు.

తల్లిని చూడాలని ఉంది.

ఈ నెలా, కిందటి నెలా కూడా ఆవిడకి డబ్బివ్వలేదు.

ఎట్లా బతుకుతున్నదో. ఏ అవస్థలు పడుతోందో. వెళ్ళాలంటే ఒక పూట ప్రయాణం సరిపోతుంది.

రేపు వెళ్ళాలి అనుకుంటూ పనులు చూసుకున్నాడు. ఈమధ్య ప్రయాణం, ఆ తర్వాత జ్వరం... వీట్లికి సెలవు పెట్టటంవల్ల పని పెండింగ్‌లో వుంది.

తలెత్తకుండా పని చేసుకోవాలి అనుకున్నాడు కానీ చెయ్యలేకపోయాడు.

గుర్నాథం పక్కనే కూర్చుని నవ్వుతున్నట్లే అనిపిస్తోంది. పనిలో ఏకాగ్రత కుదర్లేదు.

అట్లాగే ఏవో రెండు ఫైల్సు చూశాడు.

లంచ్ చెయ్యబుద్ధి కాలేదు.

సీట్లోంచి కదలలేదు.

లంచవర్ దాటిపోతుండగా వెంకట్రావు వచ్చి పలకరించాడు.

''శరత్ లంచ్ చెయ్యలేదేం'' అన్నాడు.

''ఏంటో చెయ్యబుద్ధి కావటం లేదు. గుర్నాథం గుర్తుకొస్తున్నాడు''

''ఏం చేస్తాం... పద... నేనూ వస్తాను. కాంటీన్‌కి వెళ్దాం'' అన్నాడు వెంకట్రావు.

ఇద్దరూ కాంటీన్‌కి వెళ్ళారు. వెంకట్రావు ఇడ్లీ ప్లేట్లు తీసుకుని వచ్చాడు.

టైమ్ గడిచిపోవటంవల్ల కాబోలు కాంటీన్లో ఎక్కువ మందిలేరు.

''గుర్నాథం అట్లా చేసి ఉండాల్సింది కాదు'' అన్నాడు వెంకట్రావు.

''అవుననుకో... కానీ మనిషి ఎమోషనల్ అయిపోయినప్పుడు తననితాను కంట్రోల్ చేసుకోలేడు'' అన్నాడు శరత్.

''కానీ ఫలితం ఏమిటి. తనే నానాయాతనా పడి నరకం అనుభవించి చచ్చిపోయాడు కానీ ఆవిడకేం ఆవిడ హాయిగా ఉంది'' అన్నాడు వెంకట్రావు.

''ఏం హాయిలే!''

''ఏం ఆవిడకేం తక్కువ. పెన్షన్ వస్తుంది. గ్రాట్యుటీ, ఇన్సూరెన్స్‌లు లక్షల్లో వస్తాయి. ఆ తర్వాత ఆవిడకి ఉద్యోగం కూడా ఇస్తున్నారు''

శరత్ ఆశ్చర్యంగా చూశాడు.

''అవును... ఆవిడ నిన్న కంపాషనేట్ గ్రాండ్స్ మీద ఉద్యోగం కోసం అప్లికేషన్ పంపించింది. మొగుడ్ని కొట్టి మొగసాలకెక్కారసి సామెత వినలేదూ. అట్లాగే మొగుడ్ని చంపి వాడి పెన్షనూ, ఉద్యోగం పుచ్చుకుంటోంది మహాతల్లి''

శరత్ ఆలోచిస్తున్నాడు.

ఏముంది... గుర్నాథం మట్టిలో కలిసిపోయాడు. ఆవిడ మాత్రం పశ్చాత్తాపం లేకుండా హాయిగా తిరుగుతోంది.

''వెంకట్రావ్... మనుమలింత దారుణంగా ప్రవర్తించగలరని నేను అనుకోలేదు. స్త్రీ ఎంతో సుకుమారంగా ఆలోచిస్తుందని అంటారే. నాకు తెలిసిన స్త్రీలు తొంభై తొమ్మిది శాతం మంది కటువుగా కఠోరంగా ప్రవర్తిస్తున్నారు. వాళ్ళని ఇదేంటని అడిగే వాడు కూడా లేడు. కోమలత్వం కరుణ ఈ స్త్రీ జాతిలో లవలేశమైనా లేదనిపిస్తోంది. అవన్నీ కవుల వర్ణనల్లోనే, నిజజీవితంలో కాదు'' అన్నాడు శరత్.

వెంకట్రావు నవ్వేశాడు.

''నిజమేలే... అది సరేగానీ అసలు సంగతి చెప్పటం మర్చిపోయాను. మీ అమ్మగారికి ఒంట్లో బాగుండటం లేదుట. మొన్న భూపతి ఫోన్ చేసి చెప్పమన్నాడు'' అన్నాడు.

''అలాగా... నేను రేపు వెళ్తున్నాను. చాలా రోజులైంది అమ్మని చూసి''

ఇద్దరూ లేచారు.

''మా అమ్మకి వంట్లో బాగా లేదుట'' అన్నాడు శరత్ రాజేశ్వరితో.

''ఏమిటి రోగం'' అంది రాజేశ్వరి.

శరత్ ఆమెని మర్యాదగా మాట్లాడు అని అందామనుకుని అంతలోనే ఊరుకున్నాడు.

''రేపు వెళ్ళి చూడాలి. ఆఫీసునుంచి వెళ్తాను. లేటైతే భయపడకు''

''అట్లాగే'' అంది క్లుప్తంగా రాజేశ్వరి.

అసలు వెళ్ళొద్దని డబాయిద్దామనుకుంది గానీ, గుర్నాథం ఒళ్ళుకాలి చచ్చిపోయినందుకు శరత్ బాధలో ఉన్నాడని అనుకుని ఊరుకుంది. ఎందుకో శరత్‌ని చూస్తే కొద్దిగా భయం కలుగుతోంది కూడా.

మర్నాడు శరత్ తొందరగా బయల్దేరి ఆఫీసుకి వెళ్ళాడు. గబగబా పనులన్నీ చూసుకుని నాలుగు గంటలకంతా ఆఫీసునుంచి బయల్దేరాడు.

కోఠీవెళ్లి అక్కడ్నుంచి మరో బస్సు ఎక్కి దాదాపు గంటపైన ప్రయాణం చేసి ఆపైన కాలినడక నడిచి శాంతమ్మ ఉండే ఇల్లు చేరుకునేసరికి ఒళ్లు హూనమైపోయింది.

శాంతమ్మ ఇంట్లోలేదు.

రుక్మిణమ్మ మాత్రం అప్పడాలు వత్తుతోంది.

''రా బాబూ'' అంది ఆప్యాయంగా. శరత్ అక్కడ ఉన్న చిన్న స్టూల్ మీద కూర్చున్నాడు.

''అమ్మ లేదాండీ'' అన్నాడు.

''లేదు బాబూ... డాక్టరు దగ్గరికి వెళ్లింది. కొద్దిగా గుండె దడ, నెప్పి వస్తోంది నెల రోజుల్నుంచీ'' అంది రుక్మిణమ్మ.

''నాకు తెలీలేదు... రాలేదు''

''అవున్నాయనా... బోలెడు దూరం... ఎవరన్నా చెపితేగానీ కబురు ఎలా తెలుస్తుంది''

అంది ఆవిడ.

లోపలకు వెళ్లి మంచి నీళ్ళు తీసుకువచ్చింది.

''ఇప్పుడే వచ్చేస్తుందనుకుంటాను బాబూ... చాలాసేపైంది వెళ్ళి'' అంది.

శరత్ నీళ్ళందుకుని తాగాడు.

ప్రాణం కొద్దిగా శాంతించినట్లు అనిపించింది.

''మా ఆవిడకి ఒళ్ళు బాగా లేక బోలెడు ఖర్చయింది. ఈ నెలా కిందటినెలా డబ్బు పంపలేకపోయాను. అమ్మ ఎంత యిబ్బంది పడుతోందో'' అన్నాడు తలవంచుకుని.

''ఫర్వాలేదు బాబూ... మాకో పెద్ద ఆర్డరు దొరికింది. డబ్బుకి పెద్ద కటకట లేదుగానీ ఈ అప్పడాలు ఒత్తడంవల్లే అమ్మకి శ్రమెక్కువ అయిందనుకుంటాను'' అంది రుక్మిణమ్మ.

శరత్ తలెత్తలేదు. తను పంపే డబ్బే చాలదు. ఆ డబ్బు కూడా పంపటం మానేస్తే... తల్లి డబ్బు కోసం ఈ వయసులో అప్పడాలు ఒత్తి ఒత్తి... అనారోగ్యంతో బాధపడుతూ... అయినా సరే అప్పడాలు ఒత్తుతూ... ఛీ... తనేం కొడుకు. తనలాంటి వాడు ఉండి కూడా ప్రయోజనం ఏమిటి.

ఇంతలో శాంతమ్మ వచ్చింది. శుష్కించిపోయి, కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని దిగులుగా, వార్థక్యం, ఒంటరితనం చుట్టుముట్టగా నిస్సహాయంగా చూస్తూ వస్తున్న తల్లిని చూడగానే కడుపులో దేవినట్లు అయింది.

''అమ్మా'' అన్నాడు.

శాంతమ్మ కొడుకుని దగ్గరికి తీసుకుంది.

''ఏం నాన్నా అలా ఉన్నావు. చిక్కిపోయావు. ఒంట్లో బాగుండటం లేదా'' అంది ఆప్యాయంగా చూస్తూ.

శరత్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

''నాకేమమ్మా బాగానే ఉన్నాను. నీకు బాగుండటం లేదుట కదా. డాక్టరేమన్నాడు'' అన్నాడు.

శాంతమ్మ చిరునవ్వు నవ్వింది.

''ఏముంది నాన్నా... ఏవో వార్థక్యపు రోగాలు. నాలుగు రోజులు రెస్ట్ తీసుకోమన్నాడు... అంతే''

''అమ్మా... నాతోరా. మనింట్లో పది రోజులుండు. నీకు కాస్త నెమ్మది చిక్కాక మళ్లీ రావచ్చు''

శాంతమ్మ కంగారుగా చూసింది.

''శరత్... నాకే రెస్టూ అక్కర్లేదు. ఏదో మాటవరసకి అన్నాను కానీ మరేం లేదు. నాకోసం నువ్వు బాధపడకు. నేను బాగానే ఉన్నాను'' అంది.

''నువ్వెలా ఉన్నావో కనిపిస్తూనే ఉన్నావమ్మా. పద బయల్దేరుదాం...''

''వద్దు శరత్... అనవసరంగా నీ భార్యతో గొడవపెట్టుకోకు. నేను రావటం ఆవిడకి ఇష్టం ఉండదు'' అంది.

నీరసంగా పడుకుంది ఆ తర్వాత.

శరత్ ఆవిడ చేతిలోని ప్రిస్క్రిప్షన్ తీసి చూశాడు. ఇ.సి.జి. తీయించమని ఉంది.

బి.పి. బాగా ఉంది.

పూర్తి విశ్రాంతి అవసరం అని రాశాడు.

''డాక్టరు ఎక్కడ ఉంటాడమ్మా'' అన్నాడు.

''బాగా దూరం ఎందుకూ'' అంది శాంతమ్మ.

''నేను మాట్లాడి వస్తాను''

గుర్తులు కనుక్కుని లేచాడు శరత్.

డాక్టర్ క్లినిక్ కట్టేసి బయల్దేరుతున్నాడు.

శరత్ తనని పరిచయం చేసుకుని శాంతమ్మ అనారోగ్యం ఏమిటని అడిగాడు.

''బి.పి. చాలా ఎక్కువ ఉంది. హార్ట్ కూడా వీక్‌గా ఉంది. ఆవిడలో ఏమాత్రం సత్తువ లేదు. ఇంకా ఏమేం కంప్లయింట్స్ ఉన్నాయో కూడా తెలీదు. ఎందుకంటే డబ్బులేదని ఆవిడ ఏ పరీక్షలు చేయించలేదు. మీరుండేది ఎక్కడ'' డాక్టర్ అడిగాడు.

''నేను చిక్కడపల్లిలో ఉంటున్నాను''

''ఈ ఊరేనా... మరి మీ అమ్మగారు ఇక్కడ ఒక్కరే'' అతను సందేహంగా చూశాడు.

శరత్ మాట్లాడలేదు.

ఇట్లాంటి సన్నివేశాలు ఎదుర్కొన్నప్పుడల్లా రాజేశ్వరిని నమిలి మింగెయ్యాలన్నంత కోపం వస్తుంది. వచ్చిన కోపం వచ్చినట్లే చల్లారిపోతుంది.

"ఇల్లు కుదరక... మా అమ్మగారు ఇక్కడ ఉంటానంటే..." నీళ్ళు నములుతూ అన్నాడు.

"అవున్లెండి... పోతే మీ అమ్మగారికి ఈ టెస్ట్‌లన్నీ చేయించండి. చెస్ట్‌పెయిన్ బాగా ఉంది అంటున్నారు. హార్ట్ ఎటాక్ లాంటిది రాకుండా చూసుకోవాలి. కొన్నాళ్ళు బెడ్‌రెస్ట్ అవసరం. మంచి ఆరోగ్యకరమైన ఆహారం ఇవ్వండి" డాక్టర్ గబగబా చెప్పాడు.

శరత్ తల ఊపాడు.

"స్పెషలిస్ట్‌కి కూడా చూపించండి" ఆయన ఇద్దరు డాక్టర్ల పేర్లు రాసి ఇచ్చాడు.

తల ఊపి బయటికి వచ్చాడు శరత్.

"ఆవిడ పరిస్థితి ఏం బాగా లేదు. గాభరాపడకండి గానీ తొందరగా స్పెషలిస్ట్‌కి చూపించండి" అన్నాడు డాక్టర్.

"అలాగే డాక్టర్" అనేసి ముందుకి నడిచాడు. శాంతమ్మ నీరసంగా మూలుగుతోంది.

"శరత్... కాఫీతాగు" అంది అంత నీరసంలో కూడా లేస్తూ.

"వద్దమ్మా... నువ్వు బయల్దేరు. ఈ టెస్ట్‌లన్నీ చేయించుకుని వద్దువుగానీ" అన్నాడు శరత్.

"వద్దుశరత్, అనవసరంగా డబ్బు ఖర్చు చెయ్యకు, పెద్దదాన్ని నేను ఉంటేనేం పోతేనేం. నా మూలంగా అమ్మాయితో గొడవ పడకు" అంది శాంతమ్మ.

శరత్‌కి కళ్ళ నీళ్లు తిరిగాయి.

తను అంత బాధ పడ్తూ కూడా కొడుకు కాపరంలో కలతలు రాకూడదని కోరుకుంటున్న ఆవిడ్ని చూస్తే మనసు కలుక్కుమంటోంది.

శరత్‌కి ఇప్పుడు తనకేం కావాలో అర్థమైంది. తనకు ప్రేమకావాలి. రవ్వంత సానుభూతి కావాలి. వాత్సల్యం కావాలి. ఆప్యాయత కావాలి.

అవేవీ భార్య దగ్గర దొరకవు. ఆవిడ ఇవ్వగలిగిందల్లా ద్వేషం, వెటకారం, వెక్కిరింపు ఈసడింపు, నలుగుర్లో చులకన.

తనకు శాంతినీ ప్రేమనీ ఇచ్చే తల్లిని తను వదులుకోలేడు. రాజేశ్వరి ఎంత గొడవ అయినా చెయ్యనీ తల్లిని తనతోనే ఉంచుకుంటాడు.

నీ దిక్కున్న చోట చెప్పుకో పో అని అరుస్తాడు. ఇప్పుడు ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించినా తను బెదరడు గాక బెదరడు.

'చస్తే చావు' అంటాడు.

అంతే...

ఈ నిర్ణయం తీసుకోగానే మనసు తేలికపడ్డట్లయింది.

"అమ్మా... లే... లేచి బయల్దేరు మరి" అన్నాడు.

"శరత్... నువ్వు తొందరపడినా నేను పడలేను. కావాలంటే ఒక పనిచెయ్యి. కోడల్ని అడిగి ఆవిడకి ఇష్టమో కాదో కనుక్కుని రేపురా. నువ్వొక్కడివే కాదు. ఆ అమ్మాయిని కూడా తీసుకుని వస్తేనే నేను నమ్ముతాను" అంది శాంతమ్మ.

"అలాక్కాదు... ఆవిడ ఈ జన్మకి మారదు. మనమే మారాలి. ఆవిడ ఏమన్నా వినకుండా ఉంటేసరి" అన్నాడు శరత్.

"శరత్... ఏ తల్లి అయినా తన బిడ్డ సుఖంగా ఉంటే చాలనుకుంటుంది. ఈ చివరి కాలంలో నువ్వు శాంతిగా ఉండటమే నాకు కావాలి. నా గురించి నువ్వు సాఫీగా సాగిపోతున్న సంసారంలో గొడవలు తెచ్చుకోకు. నాదేముంది ఇవాళ ఉంటాను రేపు పోతాను" అంది శాంతమ్మ.

హు... సాఫీగా సాగిపోతున్న సంసారం... నిరాశగా నవ్వుకున్నాడు శరత్.

సంసారం సాఫీగా సాగిపోవాలంటే ఒకరు పులి అయితే ఒకరు లేడి కావాలి. తనను అవతలి వ్యక్తి నమిలి మింగేస్తున్నా నోరుమూసుకుని పడుండగలగాలి. అప్పుడే ఆ సంసారం సాఫీగా సాగిపోతుంది. ఎదురు తిరిగి నోరు విప్పితే రచ్చకెక్కుతుంది. అంతేగా.

నిజమే తల్లి అన్నట్లు ఆవిడ ఇవాళ ఉంటుంది రేపు ఉండదు. ఇవాళో రేపో అన్నట్లుంది ఆవిడ పరిస్థితి. మరి ఈ చివరి కాలంలో కూడా ఆవిడ్ని తను చూడకపోతే ఎట్లాగ.

కొడుకు ఉండి ఏం ప్రయోజనం.

తన బాధ్యత ఇప్పటికైనా గ్రహించాలి.

అంతే... రాజేశ్వరిని ఎట్లాగైనా నచ్చచెప్పి ఇక్కడికి తీసుకురావాలి.

"సరేనమ్మా... రేపు వస్తాను. సిద్దంగా ఉండు" అని చెప్పి ఇంటికి వచ్చాడు.

★ ★ ★

"ఆ ముసలావిడ మాత్రం ఇక్కడికి రావటానికి వీల్లేదు" అంది రాజేశ్వరి.

ఆమె ఖండితంగా మాట్లాడినా శరత్ తగ్గలేదు.

"ఆవిడ వచ్చి తీరుతుంది అంతే. నువ్వే వచ్చి ఆవిడ్ని ఇక్కడికి తీసుకురావాలి" అన్నాడు.

రాజేశ్వరి ఏడుపు ప్రారంభించింది.

శరత్ లొంగలేదు.

ప్రవీణ్ అంతా చూస్తున్నాడు. వాడికి నాయనమ్మంటే రోత. ఎప్పుడూ దిగులుగా ఏదోగా ఉంటుంది. అదే అమ్మమ్మ అయితే స్టైలుగా ఉంటుంది. నవ్వుతుంటుంది. అమ్మమ్మ వస్తే అమ్మకి సంతోషం. నాయనమ్మ వస్తే అమ్మకి ఇష్టం లేదని తెల్సు వాడికి. అదేగాక రోగిష్టి వాళ్ళొచ్చి ఇల్లంతా మందులూ మాకుల వాసనగొట్టి, వాళ్ళమూలుగులూ ముక్కులూ ఇంటి అప్పియరెన్స్ చెడగొడ్తాయని వాడి చిన్న బుర్రకి కూడ అర్థమైపోయింది.

"డాడీ... నానమ్మ వస్తే బాగుండదు. వద్దు డాడీ" అన్నాడు.

శరత్ చాచి లెంపకాయ కొట్టాడు వాడ్ని.

వాడు ఏడుస్తూ వెళ్ళిపోయాడు.

"అమ్మో... ఈయనకి ఏ దెయ్యమో పట్టుకుంది బాబోయ్" రాజేశ్వరి శోకాలు ప్రారంభించింది.

సుబ్బాయమ్మా... ఆవిడ భర్తా పరుగెత్తుకుంటూ వచ్చారు.

"ఏమయిందయ్యా... ఏమయింది" అడిగాడాయన.

"ఏం లేదు" అన్నాడు శరత్.

"ఏం లేకపోవటమేంటి బాబాయ్‌గారూ. ఈ ఇంట్లో మేమే చాలీచాలక చస్తున్నాం. పిల్లాడికి పరీక్షలు కూడా దగ్గరపడ్తున్నాయి. ఇట్లాంటి టైమ్‌లో ఆవిడ్ని అదే వాళ్ళమ్మని తీసుకుని వస్తానంటున్నారు. నేనసలే మొన్ననే టైఫాయిడ్ వచ్చి కోలుకుంటున్నాను. ఆవిడకి సేవలు చెయ్యగలనా చెప్పండి. నాలుగు రోజు లాగమంటే ఆయన వీల్లేదని 'అంటున్నారు" రాజేశ్వరి వెక్కుతూ అంది.

"అవున్లే అమ్మాయ్" అంటూ రాజేశ్వరిని ఓదార్చి శరత్ చెయ్యిపట్టుకుని ముందు గదిలోకి తెచ్చాడు ఆయన.

"ఏం శరత్.. ఏం చేద్దాం మరి" అన్నాడు.

"ఏం చెయ్యను... ఆవిడ చెప్పేవి ఒక్కటే అసలు కారణాలు కావు"

"ఆవిడకి మీ అమ్మ రావటం ఇష్టంలేదు. అదీ అసలు కారణం. నాకర్థమైంది. కానీ ఇందులో కొత్తేముంది. ఎప్పుడూ ఉన్నదేగా"

"అవును... ఎప్పుడూ ఉన్నదే. కానీ మా అమ్మకి ఎన్నడూ లేనిది గుండెనెప్పి పట్టుకుంది. హార్ట్‌ఎటాక్ లాంటిదొస్తే ఆ మారుమూల ఉంటే చూసేందుకు డాక్టర్ కూడా లేడు. పరీక్షలు చేయించాలన్నా ఇక్కడికి రావల్సిందే. నేను ఆవిడ్ని తీసుకురావటానికే నిశ్చయించుకున్నాను"

"వద్దు శరత్ ఆపని చెయ్యకు. చేసి మీ అమ్మకి ఎప్పుడో వచ్చే హార్ట్ ఎటాక్ ఇప్పుడే తెప్పించకు"

శరత్ ఆయనవైపు అర్థం కానట్లు చూశాడు.

"అవును శరత్... నేనూ ఒక తల్లికి బిడ్డనే. కొడుకుగా నీ ఆవేదన అర్థం చేసుకోగలను. కానీ ఒక్క విషయం ఆలోచించు. నువ్వు మీ అమ్మగార్ని ఇక్కడికి తెచ్చినా ఈవిడ ఆవిడ్ని సుఖంగా బతకనిస్తుందనుకున్నావా. సాధించి సాధించి ఆవిడ్ని చంపేస్తుంది. నీ బతుకు నరకం చేస్తుంది. మీ అమ్మగారు నరకం అనుభవించేట్లు చేస్తుంది. అన్నివిధాలా మృదువుగా ఉండే ఆడవాళ్ళు కూడా అత్తగారి విషయంలో కరోడాలుగా మారటం కళ్ళారా చూశాను. ఇంక మీ ఆవిడా మా ఆవిడా లాంటి సహజ కరోడాలు ఇంకెంత క్రూరంగా ప్రవర్తించగలరో ఊహించు. ఆపైన నీ ఇష్టం" అనేసి ఊరుకున్నాడాయన.

శరత్ ఆలోచించాడు.

ఆయన మాటల్లో నిజం ఉందనిపించింది. తల్లిని తెచ్చినా లాభం లేదు. ఆవిడకి మందు

లు ఇప్పించగలడు. సేవ చెయ్యగలడు. కానీ రాజేశ్వరి నోటికి కళ్లెం వెయ్యలేడు. తన తల్లిని రాజేశ్వరి ఇష్టం వచ్చినట్లు తిట్టిపోస్తుంది. రాజేశ్వరి నోటికి హద్దు, అదుపులేదు. అమిత క్రూరురాలు. ఏం చేసినా ఆశ్చర్యపోనఖ్ఖర్లేదు.

తల్లిని తెచ్చి ఏం లాభం. ఆవిడ ముందు తనూ రాజేశ్వరీ ప్రతిదానికీ గొడవ పడ్తుంటే ఆవిడ మనసు ఇంకాస్త క్షోభించి ఎప్పుడో పోయే ప్రాణం ఇప్పుడే గుటుక్కుమనవచ్చు.

"ఏం చెయ్యమంటారు" నీరసంగా అడిగాడు.

"నువ్వే నాలుగు రోజులు శలవు పెట్టుకుని ఆవిడ దగ్గర ఉండు. రోజూ ఊళ్లోకి వచ్చి పోయి ఆవిడకి కావల్సిన టెస్టులన్నీ చేయించు. స్పెషలిస్టుకి చూపించు. కావాలంటే ఆస్పత్రిలో చేర్పించు అన్నాడాయన.

అదే నయం అనిపించింది శరత్‌కి.

రాజేశ్వరి ఇంకా వెక్కుతూనే ఉంది. సుబ్బాయమ్మ ఆవిడ్ని ఓదారుస్తోంది. శరత్ పాంట్, షర్ట్ వేసుకుని బయల్దేరాడు.

"ఎక్కడికీ... భోజనం చేసి వెళ్ళు బాబూ" అన్నాడాయన.

"వద్దండీ... కడుపు నిండిపోయింది" అని బయటకు నడిచాడు. వెంకట్రావు యింటికి వెళ్ళి అయిదువందలు అప్పు తీసుకున్నాడు.

ఆటోలో కోఠీదాకా వెళ్ళి అక్కడ్నుంచి బస్సెక్కి తల్లిదగ్గరికి చేరుకునేసరికి పొద్దున పదయ్యింది.



శాంతమ్మ పడుకునే ఉంది. ఇవాళ పొద్దున్నే లేచి అప్పడాలు వత్తుదామని ప్రయత్నించి చేతకాక పడిపోయిందిట. రుక్మిణమ్మ, యింటివాళ్లు కలిసి సాయంపట్టి లేపి పడుకోబెట్టారుట.

ఇంటాయన శరత్ వెళ్లేసరికి బయల్దేరుతున్నాడు. "వచ్చారా... మీకు ఫోన్ చేద్దామని అనుకుని వస్తున్నాను. ఆవిడ పరిస్థితి ఏం బాగా లేదండీ... మీరు ఉండి కూడా ఆవిడకి లేనట్లే ఉంది. మనం పెద్ద వాళ్లమై ప్రయోజకులైనామంటే దానికి కారణం మన తల్లి తండ్రులే కదండీ... వీళ్ళని వాళ్ళ దారికి వదిలి మనం మన సుఖం చూసుకుంటే రేప్పొద్దున్న మన పిల్లలూ మనకంతే చేస్తారు. ఇవన్నీ మీకు నేను చెప్పాలిటండీ" అంటూ చివాట్లు పెట్టాడు.

"మా అమ్మని తీసుకెళ్లటానికే వచ్చానండీ" అన్నాడు శరత్.

"అలాగా... పోన్లెండి... ఇప్పటికైనా కాస్త విశ్రాంతి ఇవ్వండి ఆవిడకి. కీళ్ళు అరిగిపోయి ఇంకేం చాకిరీ చేస్తారు ఆ పెద్దావిడ" అని ఇంట్లోకి వెళ్ళాడాయన.

శాంతమ్మ శరత్‌తో రానని పేచీపెట్టింది.

"వద్దురా... ఆ అమ్మాయికి యిష్టంలేనప్పుడు నేనెందుకు రావటం. నా తిప్పలు నేను పడ్తాను" అంది.

"సరేనమ్మా... ఇవాళ మాత్రం నాతోరా. ఆ పరీక్షలు నాలుగు చేయించి సాయంత్రంకి ఇక్కడ దింపుతాను" అన్నాడు శరత్.

"ఎందుకు డబ్బు ఖర్చు పోనీ" అంది శాంతమ్మ.

"ఇంక నువ్వేం మాట్లాడటానికి వీల్లేదు. రావల్సిందే" అంటూ ఆవిడ్ని లేపి కూర్చోబెట్టాడు.

వెళ్తూ వెళ్తూ డాక్టర్ దగ్గరికి కూడా వెళ్ళారు.

"మీరు చెప్పిన టెస్ట్‌లన్నీ చేయిస్తానండీ" అన్నాడు.

"మంచిదండీ... ఆలస్యం చెయ్యకండి. తాతారావుగారని హార్ట్ స్పెషలిస్ట్ రాధా నర్సింగ్ హోమ్‌లో ఉంటారు. అన్ని పరీక్షలూ అక్కడే చేస్తారు. మీకు ఫీజులో కన్సెషన్ ఇవ్వమని లెటర్ రాసిస్తాను. నాకు బాగా తెల్సినవాళ్ళే. తక్కువ ఖర్చులోనే అయిపోతుందిలెండి" అన్నాడాయన.

"థాంక్సండీ" అని లెటరూ అడ్రసూ తీసుకున్నాడు. చాలాసేపు నిలబడితేగానీ బస్సు రాలేదు.

శాంతమ్మకి కూర్చునేందుకు సీటు దొరికింది.

శరత్ నిలబడే ప్రయాణం చేశాడు. కోఠీ నుంచి ఆటోలో రాధా నర్సింగ్ హోమ్‌కి వెళ్ళి తాతారావుగారి గురించి వాకబు చేశారు. ఆయన ఊరెళ్ళారుట. రేపు పొద్దున్న వస్తారని చెప్పారు.

"మీరు ఈ లోపల ఈ టెస్ట్‌లన్నీ చేయించండి. ఆయన రాగానే రిపోర్ట్‌లతో సహా సిద్ధంగా ఉంటే ఆయన వెంటనే ట్రీట్‌మెంట్ మొదలుపెడ్తారు" అంది రిసెప్షనిస్టు.

ఆవిడలేచి శరత్‌ని తీసుకుని ఇంకొక డాక్టర్‌తో మాట్లాడింది. ఆయన తాతారావుగారికి అసిస్టెంట్‌ట.

ఆయన శాంతమ్మని పరీక్షించి ఇదివరకు డాక్టర్ రాసిన టెస్ట్‌లే చేయించమన్నాడు.

ఎక్స్‌రే, ఇ.సి.జి తీయించారు.

"బ్లడ్‌టెస్ట్‌కి రేపు పొద్దున్న రండి" అన్నారు వాళ్ళు.

"సరే" అని బయటకు వచ్చారు. శరత్ ఆటో ఇంటికి మాట్లాడ్తుంటే శాంతమ్మ ఒప్పుకోలేదు.

"శరత్ ఇంటికి వెళ్ళిపోతాను. నీ ఇంటికి ఎందుకు" అంది. శరత్ వినిపించుకోలేదు.

అతని మనసులో ఇందాక డాక్టర్ చెప్పిన మాటలే మెదులుతున్నాయి.

"ఆవిడ పరిస్థితి ఏం బాగాలేదు. ఆవిడ ఏమాత్రం శ్రమకి కూడా తట్టుకునే స్థితిలోలేరు. పూర్తి రెస్ట్ అవసరం"

తల్లి మళ్ళీ అక్కడికి వెళ్తే చేసిపెట్టేవాళ్ళెవరు. రుక్మిణమ్మ కూడా ఇవాళో రేపో అనేట్లుంది.

ఇంటాయన పట్టించుకునే అవకాశం లేదు.

అక్కడికి వెళ్ళగానే తల్లి మళ్ళీ తన పని తను చేసుకోవాల్సిందే. అంతేకాకుండా అప్పడాలు ముందేసుకుని కూర్చుంటుంది.

ఇప్పుడు అతను రాజేశ్వరిని ఎంత మాత్రం లెఖ్ఖ చేసే స్థితిలో లేదు. ఆమె అరిచి గొడవ

చేస్తే మెడపట్టి బయటకు గెంటెయ్యాలని కృతనిశ్చయంతో ఉన్నాడు.

శాంతమ్మ చెప్పినా వినిపించుకోదల్చుకోలేదు.

ఆటో వచ్చి ఆగగానే రాజేశ్వరి బయటకు వచ్చి చూసి గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది.

శాంతమ్మ లోపలికి వచ్చింది.

"బాగున్నావామ్మా" అంది రాజేశ్వరితో.

"నేనెలా ఉంటే ఏంలెండి. మీరు బాగున్నారుగా చాలు" అంది రాజేశ్వరి మూతి తిప్పి.

లోపలికి వెళ్ళి మంచం మీద వాలిపోయి ఏడవటం మొదలుపెట్టింది.

శాంతమ్మ ఏం చెయ్యాలో తోచక బిక్కచచ్చిపోయింది. సుబ్బాయమ్మ పెరట్లోకి వచ్చింది.

"ఏంటి వదినగారూ... ఒంట్లో బాగా లేదుటగా" అంది.

"అవునండీ... డాక్టరుకి చూపించుకుందామనీ..."

"అలాగా... ఆ పిల్లకి కూడా మొన్న టైఫాయిడ్ వచ్చి తగ్గింది" అంది సుబ్బాయమ్మ, నీరసంగా ఉన్న పిల్లతో చాకిరీ చేయించుకుందుకు వచ్చావా అన్నట్లు చూస్తూ.

"అయ్యో... నాకు తెలీదండీ" అంది శాంతమ్మ నొచ్చుకుంటూ.

"మీకెలా తెలుస్తుందిలెండి బోలెడు దూరంకదా" సుబ్బాయమ్మ చూపులు శాంతమ్మని ఇబ్బంది పెడ్తున్నాయి. భరించలేక లోపలికి వచ్చింది.

ఈ లోపల రాజేశ్వరి నర్సింగ్‌హోమ్ వాళ్ళ కాగితాలూ, బిల్లులూ అన్నీ తీసి చూసేసింది.

"పొయ్యింది పొయ్యింది... అంతా ఆవిడ మొహానే పొయ్యింది. నేనూ నా పిల్లాడూ మట్టి కొట్టుకుపోతాం" కసిగా అరిచింది.

"పోండి..." తనూ అరిచాడు శరత్.

"ఇప్పుడు ఇంత ఖర్చు చెయ్యకపోతేనేం. గవర్నమెంటు హాస్పిటల్లో చూపించుకుంటే సరిపోదా" గట్టిగా అరిచింది రాజేశ్వరి.

"ఎందుకు చూపించుకోవాలి మొన్న నీకు జ్వరం వచ్చినప్పుడు నువ్వు అదే హాస్పిటల్లో చూపించావా" అరిచాడు **శరత్**.

"ఇప్పుడీవిడ్ని ఇక్కడికెందుకు తెచ్చినట్లు"

"డాక్టర్ లేడు. రేపు వస్తాడు. ఆయనకి చూపించాక ఫర్వాలేదంటే అప్పుడు వెళ్తుంది ఆవిడ. లేకపోతే ఎన్నాళ్ళయినా ఇక్కడే ఉంటుంది"

"నేను ఇంతమందికి చాకిరీ చెయ్యలేను"

"చెయ్యక్ఖర్లేదు. నా తల్లికి నేను చేసుకోగలను"

"ఆఫీసుకి పోతే ఎవరు చూస్తారు"

"పోను... శలవ పారేస్తాను"

రాజేశ్వరికి మాటలు దొరకలేదు.

"అసలు డాక్టర్ లేనప్పుడు మీరు టెస్ట్‌లు చేయించడం దేనికి. ఆయనవచ్చి ఇంకో టెస్ట్‌లు చేయించండి ఇవి కాదు చేయించాల్సింది అంటే ఏం చేస్తారు"

"నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను. మనిద్దరి మధ్యా గొప్ప సామరస్యం ఏడిస్తే అప్పుడు నువ్వా ప్రశ్న అడగొచ్చు. ఇప్పుడు నీకా హక్కు లేదు"

రాజేశ్వరి గోలగా ఏడుస్తోంది. శాంతమ్మ వంటింట్లో కూర్చుండిపోయింది.

తను ఎటువంటి నిస్సహాయ స్థితిలో ఉందో ఆవిడకి కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

డాక్టర్లు చెప్పటమే కాదు, తన ఆరోగ్యం తనకే తెలుస్తోంది.

ఎవరో ఒకరు చెయ్యాల్సిందే కానీ తను తన పని కూడా చేసుకునే స్థితిలో లేదు.

కనీసం వంట చేసుకోవాలి. అంట్లు తోముకోవాలి, బట్టలు ఉతుక్కోవాలి. ఇల్లు శుభ్రంగా ఉంచుకోవాలి.

రుక్మిణమ్మ సాయం ఉంటుంది. కానీ తను కూడా చెయ్యాల్సిందే. ఆపైన బతకటం కోసం ఏదో ఒక పని చెయ్యాలి.

కాళ్ళూ చేతులూ ఆడుతుంటేనే పరిస్థితి ఇంత కనాకష్టంగా ఉంది. ఇంక ఖర్మకాలి ఇంకా దిగనాసిల్లిపోతే తన ఆరోగ్యం... అప్పుడేంటి దిక్కు.

శాంతమ్మకి ఏం పాలు పోవటం లేదు.

"ఆ భగవంతుడు నన్నెందుకు తీసుకుపోయ్యాడు కాదు" అని కళ్ళల్లోంచి నీళ్ళు కా

రాయి.

ఎట్లా తెలిసిందో కానీ సూర్యనారాయణగారూ రంగమ్మా పరుగుపరుగున వచ్చేశారు. రాజేశ్వరి తల్లిని కావిలించుకుని ఏడవటం మొదలు పెట్టింది.

వదిలిందనుకున్న శని మళ్ళీ పట్టుకుందే మిటా అన్నట్లు వాళ్ళు శాంతమ్మవైపు ఒకసారి చూశారు.

శాంతమ్మ తలవంచుకుంది.

''ఏంటయ్యా ఇది. మొన్ననే జ్వరపడి లేచిన పిల్లను ఇట్లా ఏడిపిస్తున్నావ్'' అన్నాడు సూర్యనారాయణ.

''నువ్వసలు బయటకి నడవ్వయ్యా... మీ అలుసు చూసుకునే ఆవిడ ఇలా చేస్తోంది. మీరు ఇన్నాళ్ళూ చేసిన నిర్వాకం చాలు. ఇక మా బతుకు మమ్మల్ని బతకనీ'' అన్నాడు శరత్.

నోట్లో నాలుక లేనట్లుండే శరత్ ఇంతమాట అంటాడని ఏంత మాత్రమూ ఊహించని సూర్యనారాయణ మాటలు దక్కి నిల్చుండిపోయాడు.

తెలివైన వాడు కావటంవల్ల వెంటనే తేరుకున్నాడు. ''అపార్థం చేసుకోకు నాయనా. ఏదో పెద్ద వాళ్ళం. మీరు కీచులాడుకుంటుంటే చూడలేక ఏదో ఒకటి మాట్లాడ్తాం'' అన్నాడు.

శరత్ మొహం తిప్పేసుకుని ఎటో చూస్తున్నాడు.

''ఆవిడ ఒక్కక్షణం కూడా ఇక్కడుండటానికి వీల్లేదు. ఆవిడో, నేనో ఎవరో ఒకరే ఉండాలి ఇంట్లో'' అంది రాజేశ్వరి బయటకి నడుస్తూ.

''మహారాజులా వెళ్ళు. పీడ వదిలిందనుకుంటాను'' అన్నాడు శరత్.

ప్రవీణ్ స్కూల్‌నుంచి వచ్చి ఈ గోలంతా చూసి ఏడవటం మొదలుపెట్టాడు.

''నానమ్మ దెయ్యం మళ్ళీ వచ్చిందే'' అన్నాడు ఏడుస్తూనే వాళ్ళ అమ్మమ్మతో.

శాంతమ్మ ఉలిక్కిపడి చూసింది.

గొడవల్లోనే చీకటిపడింది. పెరట్లోకి వెళ్ళిన శాంతమ్మ మళ్ళీ ఇంట్లోకి రాలేదు.

శరత్ సూర్యనారాయణగారితో, రంగమ్మతో, రాజేశ్వరితో యుద్ధం చేస్తూ ఆవిడ పెరట్లోకి వెళ్ళటం చూశాడు.

బాత్‌రూమ్‌కి వెళ్ళింది కాబోలనుకున్నాడు.

పావుగంటయినా తిరిగి రాకపోయేసరికి అనుమానం వచ్చి వెతికాడు.

ఆవిడ కన్పించలేదు. అయిదు నిమిషాల్లోనే ఆవిడ కనిపించటం లేదన్న వార్త అందరికీ తెలిసింది.

''ఎక్కడికిపోయి ఉంటుంది. ఈ పోరంతా భరించలేక తిరిగి వెళ్ళిపోయిందేమో'' అన్నారు చుట్టుపక్కలవాళ్ళు.

సుబ్బాయమ్మ భర్తని ఆ ప్రాంతాల్లో వెతకమని తను బయల్దేరి బస్‌స్టాండ్‌కి వెళ్ళాడు.

కోఠీకి వెళితేగానీ శాంతమ్మకి బస్సు లేదు. ఆవిడ బస్సులో చేరుకునే లోపల తను ఆటోలో వెళ్తే ఆవిడ్ని బస్ స్టాప్‌లో కలుసుకోవచ్చు. ఇట్లా అనుకుని వెంటనే ఆటో ఎక్కాడు.

శాంతమ్మ కోఠీ బస్‌స్టాప్‌లో కూడా లేదు.

ఇంకొక పావుగంట గడిచాకగానీ బస్సురాలేదు. వెళ్ళాలో వద్దో తెలియలేదు శరత్‌కి.

సరే ఏదైతే అదేలే అనుకుని బస్ ఎక్కాడు. అక్కడికి చేరేసరికి రాత్రి తొమ్మిదయింది.

శాంతమ్మ ఇంట్లోనే ఉంది.

ఆవిడ్ని చూడగానే అమ్మయ్య అని నిట్టూర్చాడు. వచ్చేశావేంటమ్మా అని శరత్ అడగలేదు.

ఆ పరిస్థితిలో మానవమాత్రుడెవడైనా అక్కడ ఉండలేక వచ్చేస్తాడు మరి.

ఒక మూల రుక్మిణమ్మ మూలుగుతోంది. ఆవిడకి జ్వరం వచ్చిందిట.

శరత్ ఆ రాత్రికి అక్కడే ఉండిపోవటానికి నిశ్చయించుకున్నాడు. పొద్దున్నే లేచి నర్సింగ్ హోమ్‌కి వెళితేసరి. మళ్ళీ ఈ రాత్రి తను ఇంటికి వెళ్ళినా మళ్ళీ పొద్దున్నే తిరిగి రావాలి.

శాంతమ్మ ప్రశాంతంగా కూర్చుని కబుర్లు చెపుతోంది.

''అదేం అరిచినా నువ్వు పట్టించుకోకమ్మా. విసిగిపోయి ఊరుకుంటుంది. నువ్వు మాత్రం ఇక్కడికి వచ్చెయ్యకు మళ్ళీ. అది ఆవిడకి మొగుడి ఇల్లు అయితే నీకు కొడుకు ఇల్లు. నీ కొడుకు ఇంట్లో నీకూ అధికారం ఉంటుంది. అంతే'' అన్నాడు.

శాంతమ్మ నవ్వి ఊరుకుంది.

"పొద్దుట్నుంచీ ఏం తినలేదు శరత్ నువ్వు. పద భోజనం చెయ్యి" అంటూ లేచి కంచంలో అన్నం వడ్డించింది.

"నువ్వు తినమ్మా... చాల్తుందా ఇద్దరికీ" అన్నాడు.

"చాల్తుంది. ఇద్దరికనే వండింది రుక్మిణమ్మ. ఇంతలో తను భోజనం మానింది, జ్వరం వచ్చిందిగా" అంది శాంతమ్మ.

"మందు వేసుకున్నారా" అన్నాడు శరత్.

"ఆఁ" అంది రుక్మిణమ్మ నీరసంగా.

తల్లి అన్నం కలిపి ముద్దలు చేసి పెడుతుంటే తృప్తిగా తిన్నాడు శరత్.

ఎన్నాళ్ళయింది తల్లి పెడితే భోజనం చేసి, తాను పుట్టింది తల్లి రక్తం పంచుకుని.

ఈ శరీరం ఆవిడ ప్రసాదించిందే. తన కోసం ఎంత కష్టపడింది. తను సుఖంగా ఉండాలనేగదా ఈ మారుమూలకి వచ్చి నిరుపేదగా జీవితం గడుపుతోంది.

ఆవిడకి తనేం యివ్వగలిగాడు. తనకన్నా గుర్నాథం ఎంత నయం.

అతని తల్లికి పెన్షన్ వస్తుంది. ఒకమాదిరిగా సరిపోతూనే ఉండేది. ఆ తర్వాత పెన్షన్ ఎరియర్స్ ఆవిడకే ఉంచాలని పెళ్ళాంతో హోరాహోరీ పోట్లాడి వీరమరణం పొందాడు.

యిప్పుడు పోతూ కూడా తల్లికోసం చచ్చినా పర్వాలేదని సూచించాడు.

పాపం గుర్నాథం... తనతో ఏం చెప్పాలనుకున్నాడో... తనని చూడాలని తపించిపోయాడట.

ఏం చెప్పి ఉండేవాడు.

"జీవితంలో ఆడదాన్ని మాత్రం నమ్మకు. దాన్ని చెప్పుకింద తేలులా ఉంచితేనే అణగిమణిగి పడుంటుంది. కాలు తీశావో కుట్టి చంపేస్తుంది" అని చెప్పుండేవాడేమో. కానీ, అతని భార్యకన్నా రాజేశ్వరి నాలుగాకులు ఎక్కువే చదివింది.

ఆ ఆలోచనలతోనే నిద్రపట్టింది.

హఠాత్తుగా ఏదో కేకలాంటిది వినబడి మెలకువ వచ్చింది.

శాంతమ్మ కిందపడి తన్నుకుంటోంది.

"అయ్యో అయ్యో" అని కేకలు వేస్తోంది రుక్మిణమ్మ.

శరత్‌గుండె పగిలిపోయినట్లయింది.

"ఏమయింది... అమ్మా అమ్మా" అంటూ ఆవిడ్ని పొదివిపట్టుకున్నాడు.

"అయ్యో... పురుగులమందు తాగేసినట్లుందయ్యా. వెళ్ళు వెళ్ళి ఆటో తీసుకురా. హాస్పటల్‌కి వెళ్దాం" అంది రుక్మిణమ్మ ఏడుస్తూ.

"ఇప్పుడు ఆటోలెక్కడ దొరుకుతాయి" అన్నాడు శరత్, గాభరాపడ్తూ.

"ఏదో ఒకటి. చూడు బాబూ. ఆ మూల యింట్లోవాళ్ళకి కారు ఉంది. వాళ్ళేమన్నా సాయంచేస్తారేమో" అంది రుక్మిణమ్మ.

శరత్ ఆ యింటికి పరుగెత్తాడు.

వాళ్ళు నిద్రపోతున్నారు. లేపి తన పరిస్థితి వివరించి సాయంచెయ్యమని చేతులు పట్టుకుని బతిమాలాడు.

"సరే... రండి" అని ఆయన కారు తీసుకుని బయల్దేరాడు. బయటికి రాగానే వర్షం ప్రారంభమైంది. రుక్మిణమ్మ ఏడుస్తూ ముందు కాంపౌండ్‌లో నిల్చుని ఉంది. చుట్టుపక్కల యిళ్ళవాళ్ళు కొందరు చేరారు.

ఇంటాయన అయోమయంగా చూస్తున్నాడు.

జల్లు పడుతూనే ఉంది.

రుక్మిణమ్మ జ్వరంలోనే తడుస్తూ శాంతమ్మని కారులోకి చేర్చటంలో సాయపడింది.

పట్టుకుందామని ప్రయత్నించినా శాంతమ్మ కాళ్ళూ చేతులూ స్వాధీనంలోకి రావటం లేదు. నోట్లోంచి నురగలు వస్తున్నాయి.

కారు దిల్‌సుక్‌నగర్ చేరేలోపలే శాంతమ్మ ప్రాణంపోయింది.

శరత్ 'అమ్మా' అంటూ అరిచి ఆవిడమీద వాలిపోయాడు.

★ ★ ★

శరత్ నిశ్చేష్టుడై చూస్తున్నాడు.

శాంతమ్మ వైద్యం గురించి జరిగిన గొడవలో వెయ్యోవంతుకూడా అంత్యక్రియల గురించి

జరగలేదు.

అందరూ పూనుకుని అంత్యక్రియలు జరిపించేశారు.

రాజేశ్వరి శాంతమ్మ ఆత్మహత్య చేసుకుంటుందని మాత్రం ఊహించలేదు. గుండె జబ్బు ఎక్కువై చస్తుందిలే ముసల్ది, అనుకుందిగానీ ఆవిడ మృత్యువుకోసం ఆగకుండా తనే మృత్యువుని చేరుకుంటుందని మాత్రం అనుకోలేదు.

అంత కఠినురాలికి, గయ్యాళికి కూడా ఒక్క క్షణం భయం వేసింది. భర్త దీనికి ఎలా ప్రతిస్పందిస్తాడో అని భయపడింది.

ఏ కేసూ, లేకండా దహనం జరిగిపోయింది. మూలనున్న ముసలమ్మ ఎట్లా చస్తే ఎవరిక్కావాలి. గుండెనెప్పి ఎక్కువై చచ్చిపోయింది కాబోలనుకున్నారు తెలియని వాళ్ళు. తెల్సిన వాళ్ళు ఆవిడ చావుకి పెద్ద ప్రాముఖ్యత యివ్వలేదు.

శరత్ మౌనంగా తల్లి కర్మకాండలన్నీ చేశాడు. అతని మనసులో ఎట్లాంటి భావాలు రూపుదిద్దుకుంటున్నాయో ఎవరూ ఊహించలేదు.

శరత్ తల్లి చావుకి ఎంతగా చలించిపోయాడంటే - తనుకూడా ఆత్మహత్య చేసుకుందామా అనుకున్నాడో దశలో. కాని మనసులో పగ, ప్రతీకారం.

పిడికిళ్ళు బిగించి ఆలోచిస్తున్నాడు.

రాజేశ్వరి. ఛీ... అదొక రాక్షసి, పెళ్ళి పేరుతో తననొక జీవితకాలపు బానిసగా బంధించి, నిరంతరక్షోభకి గురిచేసిన పాతకి.

తననొక వెర్రివెధవని చేసి ఆడించింది. లేకుంటే తను ఈనాడు తన మనస్సుముందు అపరాధిలా నిలబడాల్సిన అవసరం ఉండేది కాదు.

పన్నెండేళ్ళుగా అనుభవించిన బానిసత్వం తాలూకు భయంకరమైన అనుభవాలు ఒకపెట్టు...

రాజేశ్వరి తనకు తల్లి చావుతో మిగిల్చిన అంతులేని క్షోభ మరొకపెట్టు...

తనేం చెయ్యలేని వెర్రివాడిననేగా అదంత ఎగిరెగిరిపడింది.

చెయ్యాలి. యింతకి యింత చెయ్యాలి. దానికి తగిన బుద్ధిచెప్పాలి.

తను చచ్చి లాభంలేదు. దానికి బుద్ధిరాదు. పైగా గుర్నాథం భార్యకిచ్చినట్లు పెన్షనూ, యితర బెనిఫిట్లూ యిస్తారు. రాజేశ్వరి బి.ఎ. పాసయింది కాబట్టి ఉద్యోగం కూడా దొరుకుతుంది. శుభ్రంగా బతుకుతుంది. తను చస్తే ఆవిడకి మరింత ఉపయోగపడటమే తప్ప ప్రయోజనం లేదు.

సహనానికి హద్దు ఎక్కడుందో నిర్ణయించటం కష్టం. ఒక మనిషి ఎంత కష్టాన్నైనా భరించేవ్యక్తి కావచ్చు. కానీ అదేవ్యక్తి ఒక్కోసారి చిన్న కష్టాన్నే భరించలేకపోతాడు. ఎన్ని మాటలన్నా పడే వ్యక్తులు కూడా ఒక్కోసారి చిన్నమాటకి తీవ్రంగా రియాక్ట్ అవుతారు.

శరత్ విషయంలో అంతే జరిగింది.

తల్లి ఆత్మహత్యచేసుకోగానే అతనికి భరించలేని కోపం, ఆవేదన కలిగాయి. మనస్సులోంచి దయ, జాలి, క్షమ అన్నీ దూరమయ్యాయి. యిదివరకు మనిషి అయితే పోన్లే అని రాజేశ్వరిని ఈ సంఘటనకు కూడా క్షమించేవాడే. కానీ యిప్పుడు క్షమించలేకపోయాడు.

అందుకు కారణం ఒకటి కాదు.

అంతవరకూ చూసిన ఆడవాళ్ళు, గుర్నాథం చావు, గోవిందయ్య పలాయనం, తల్లి మరణం అన్నీ కలిసి అతన్ని ఉక్కిరిబిక్కిరి చేశాయి.

ఛీ... ఏం ఆడవాళ్ళు.

విలాసిని... తనను ఎంత ఆడించింది. రోజుకో ఆట ఆడింది.

కమలిని... ఆవిడేం తక్కువ తింది.

వీళ్ళకందరికీ తనొక పిచ్చివెధవలా కనిపించి ఉంటాడు. ఒకేసారి అందరికీ బుద్ధిచెప్పాలి.

అతని మనసులో ఆ కసి ఓ రూపుదిద్దుకోవటానికి రెండ్రోజులు పట్టింది.

ముందుగా విలాసిని మొగుడి అడ్రస్ సంపాదించి అతనికి ఉత్తరం రాశాడు.

"మీ భార్య విలాసిని శీలం ఏమాత్రం మంచిది కాదని చెప్పటానికి విచారిస్తున్నాను.

మీకన్నా ముందే ఆవిడ్ని రంగరాజు, మధు, శరత్ అనే వ్యక్తులు వాడుకున్నారని చెప్పాలంటే సిగ్గుగా ఉన్నా తప్పదు. గంగిగోవు లాంటి మీరు ఒక వేశ్యతో తీసిపోని స్త్రీతో కాపరంచేయటం ఎంత ఘోరం''

ఆ ఉత్తరం పోస్ట్‌చేసి విలాసిని భర్త సుబ్బారావుకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. అతను తప్పకుండా వస్తాడని తెలుసు. ఎందుకంటే దాన్ని చదవగానే సుబ్బారావు ముందు విలాసినిని చావగొడ్తాడు. ఆమె లబోదిబోమని తనేపాపం ఎరగననీ, కావాలంటే శరత్‌నే అడగమనీ అంటుంది. అలా అంటుందనటానికి కారణం, తనకి ఎట్లాగూ విలాసినితో శారీరక సంబంధంలేదు. మధుకీ, రంగరాజుకీ ఉంటే ఉండొచ్చు. వాళ్ళని అడుగుతే వాళ్ళు నిజమేననవచ్చు. రంగరాజు, మధులాంటి వ్యక్తులు విలాసినితో గడపకపోయినా గొప్పకో లేక ప్రతీకారానికో 'అవును గడిపాం, పో' అని చెప్పేరకాలు. శరత్ మంచివాడని విలాసినికి బాగా తెల్సు కాబట్టి అతను భర్తకి నచ్చచెప్పి పరిస్థితి చక్కబెడతాడనే ఆశిస్తుంది. పైగా శరత్‌ని చూస్తే ఎవరికైనా మంచి అభిప్రాయమే కలుగుతుంది కూడా.



మర్నాడే శరత్ కమలిని భర్తకి కూడా ఉత్తరం రాశాడు.

''మీ భార్య కమలినికి ట్రాన్స్‌ఫర్ ఎట్లా అయిందో తెలుసా. ఆవిడ ఆఫీసులోనే పనిచేస్తున్న శరత్‌తో అక్రమసంబంధం పెట్టుకుని అతనిద్వారా పై ఆఫీసరుకు రికమెండ్ చేయించుకోవటంవల్లనే. ఆపై ఆఫీసరు కూడా ఆవిడతో పూర్తిగా సంతృప్తి పొందటంవల్లనే''

''ఓ శ్రేయోభిలాషి'' అనే సంతకంతో రాసిన ఈ ఉత్తరం. కమలిని సంసారంలో బాంబ్ పేలుస్తుందని శరత్‌కి తెలుసు.

ఎట్లాంటివాళ్ళైనా తన జీవితభాగస్వామికి యింకోళ్ళతో సంబంధం ఉందని ఉత్తరం వస్తే దాన్ని ఆకాశరామన్న ఉత్తరం అని తొందరగా తీసిపారెయ్యలేరు. దాని లోతులు తెలుసుకుని నిజమేంటో తెలుసుకోవాలనే బయల్దేరుతారు, తప్పదు.

మూడోరోజునే సుబ్బారావు ఊడిపడ్డాడు. ''శరత్ అంటే మీరే కదూ'' అంటూ!

''అవును... మీరెవరో జ్ఞాపకం రావటంలేదు'' నటించాడు శరత్.

అతను అదోలా నవ్వాడు. చుట్టూ చూసి... ''ఒకసారి మీతో మాట్లాడాలి కాన్ఫిడెన్షియల్... ప్లీజ్... బయటికి వస్తారా'' అన్నాడతను.

''పదండి'' అన్నాడు శరత్.

యిద్దరూ ఒక రెస్టారెంట్‌కి వెళ్ళి ఎవరూ లేనిచోట కూర్చున్నారు.

సుబ్బారావు శరత్‌వైపు చూశాడు.

మనిషి మంచివాడిలా అనిపించాడు. ఆకాశరామన్న ఉత్తరం నమ్మబుద్ధికాలేదు. అయినా గానీ ఎందుకో వదిలిపెట్టబుద్ధి కూడా కాలేదు.

విలాసినిని అతను ఆ ఉత్తరం వచ్చిన దగ్గర్నుంచీ కాల్చుకు తిన్నాడు. విలాసిని భరించలేక శరత్ అడ్రస్ యిచ్చి, తనేపాపం ఎరగననీ, కావాలంటే ఆ పేర్లలోని శరత్ అనే అతన్ని అడగొచ్చనీ చెప్పింది.

సుబ్బారావు తెలివిగా అట్నుంచి నరుక్కువద్దామనుకున్నాడు.

''శరత్‌గారూ... నేను విలాసిని భర్తని. మీ ఇద్దరికీ ఉన్న సంబంధం గురించి మొన్ననే తెలిసింది. మీరు యిట్లా ప్రవర్తించటం నాకేం నచ్చలేదు. విలాసినికూడా మీతో అక్రమ సంబంధం పెట్టుకున్నందుకు పశ్చాత్తాపపడ్తోంది. యింకనైనా ఆవిడ్ని కలుసుకోవటం మానేస్తారా''

సుబ్బారావు ఈ మాటలు అనేసి శరత్‌మొహంకేసి ఆసక్తిగా చూస్తున్నాడు.

శరత్ ఆశ్చర్యపోలేదు. సుబ్బారావు ఎలా ఎలా మాట్లాడవచ్చో ముందే ఊహించుకుని

సిద్ధంగానే ఉన్నాడు.

"అదే మంచిదండీ... నాకూ ఈమధ్య యిట్లాంటివంటే అసహ్యం పుట్టింది. ఏదో అనుకుంటాంగానీ ఈ సంబంధాలు కూడా కొన్నాళ్ళయితే థ్రిల్ యివ్వటం మానేస్తాయి. మొన్నే మా అమ్మగారు పోయారండీ. అందుకే విలాసినిని కలుసుకోలేదు ఈమధ్య. విలాసిని పశ్చాత్తాప పడటం నాకూ ఆనందంగా ఉందండీ. తన భర్త ఒక చవటవెధవని యిది వరకు బాధపడ్తూ ఉండేది. యిప్పటికైనా కళ్ళు తెరిచినందుకు సంతోషం. నేను ఆమె దారికి అడ్డురానని చెప్పండి" అన్నాడు.

సుబ్బారావు మిన్ను విరిగి మీదపడ్డట్లు చూశాడు. పాలిపోయిన అతని మొహాన్ని చూస్తుంటే శరత్‌కి పట్టరాని ఆనందం కలిగింది. యింక వెళ్ళి విలాసిని నడుం విరక్కొడతాడు వీడు.

శరత్ గుండు అతనేదో కర్మచేశాడని చెప్తూనే ఉంది. నిజమే! తల్లిపోయి కొద్దిరోజులే అయినట్లుంది. ఆ దుఃఖంలో ఉన్నవాడు అబద్ధం ఎలా చెప్పగలడు?

సర్వశక్తులూ ఉడిగిపోయినవాడిలా లేచాడు సుబ్బారావు. వెళ్ళొస్తానని కూడా చెప్పలేదు. పిచ్చిచూపులు చూసుకుంటూ వెళ్ళిపోయాడు.

అవతలి వ్యక్తిని వెధవని చేసి ఆడించడంలోగల ఆనందాన్ని జీవితంలో మొదటిసారిగా అనుభవించాడు శరత్.

తృప్తిగా లేచాడు.

కమలిని భర్త కూడా దాదాపు యిదే స్థితిలో ఉండిఉంటాడు. కాకపోతే వేరే ఊరునుంచి రావాలి అతను.

మర్నాడు ఇన్సూరెన్స్ ఆఫీసుకి వెళ్ళి తన పాలసీ ముగించమనీ, సరండర్ చేసేస్తున్నాననీ అడిగాడు. ఆ డబ్బు పదివేలు ఉంది.

అలాగే ఎకౌంట్ క్లోజ్‌చేసి డబ్బిస్తామని చెప్పారు వారు. 'అమ్మయ్య' అనుకుని బయటకు వచ్చాడు.

ఆఫీసుకి వెళ్ళి ఆఫీసర్ని కలుసుకున్నాడు.

"నాకు గల్ఫ్‌లో మంచి ఉద్యోగం వచ్చిందండీ. ఇక్కడ రిజైన్ చెయ్యాలనుకుంటున్నాను. కాస్త మీరు రిజిగ్నేషన్ తొందరగా యాక్సెప్ట్ చేసి హెడ్డాఫీసుకి పంపించాలి. యింకోవిషయం... కొన్ని కారణాలవల్ల నేను ఈ సంగతి ఎవరికీ చెప్పదల్చుకోలేదు. మీరు కాస్త కోపరేట్ చెయ్యండి. నా రాజీనామా సంగతి రహస్యంగా ఉంచండి" అన్నాడు ప్రాధేయపడ్తూ.

"అట్లాగా. సరేలే. నేను చెయ్యాల్సింది చేస్తాను" అన్నాడాయన.

రాజీనామా రాసేసి యిచ్చాడు.

ఆయన దానిమీద వెంటనే యాక్షన్ తీసుకుని హెడ్డాఫీసుకి కూడా పంపించేశాడు. యింకదాన్ని తిరిగి తీసుకోవటం బ్రహ్మకైనా కుదరదు.

"కాస్త సీట్లో పని క్లియర్ చేసిపో నాయనా. అట్లాగే అందులో పనేంటో కూడా ఎవరికన్నా నేర్పించిపో" అన్నాడు ఆఫీసర్.

అట్లాగేనని రాజీనామా చేశాక కూడా పదిరోజులు వరసగా ఆఫీసుకి వెళ్ళాడు.

రాజేశ్వరికి ఎంతమాత్రం అనుమానం రాలేదు. ఇంత జరుగుతున్నా శరత్ కోపాన్ని చల్లార్చుకుని ఎప్పటిలాగే మామూలుగా ఉంటున్నాడు కాబోలు అనుకుంది.

శరత్ తనతో శారీరక సంబంధం పెట్టుకోడంలేదు. తల్లిపోయి శ్మశాన వైరాగ్యంలో ఉన్నాడు లెమ్మనుకుంది.

ఇన్సూరెన్స్ డబ్బులు త్వరగానే చేతికొచ్చాయి.

రెండువేలు తనదగ్గర పెట్టుకుని మిగిలిన ఎనిమిది వేలూ తీసుకుని తల్లి ఇన్నాళ్లూ ఉన్న యింటికి నడిచాడు.

గదిలో దీపం మినుకుమినుకుమంటోంది.

రుక్మిణమ్మ ఒక్కత్తే కూర్చుని అప్పడాలు వత్తుకుంటోంది.

ఆవిడలో అతనికి తన తల్లి కనిపించింది. మొన్నమొన్నటిదాకా ఆవిడకూడా యిలాగే అందరూ ఉండికూడా ఏ దిక్కూలేనిదాన్లాగా ఈ గదిలోనే ఒంట్లో ఓపికున్నా లేకపోయినా అప్పడాలు వత్తుతూ, వంట చేసుకుంటూ వుంది.

"అమ్మా" అంటూ ఏడ్చాడు బావురుమని.

తల్లి పోయాక మొట్టమొదటిసారిగా అతని కంట్లోంచి నీళ్ళు కారాయి.

రుక్మిణమ్మ తలెత్తి చూసింది.

"బాబూ... నువ్వా... రా... ఏడవకు నాయనా! ఏడిస్తే పోయిన వాళ్ళు తిరిగొస్తారా..." అంటూ ఓదార్చింది.

ఆవిడ ఒళ్ళో తలదాచుకుని కరువుతీరా ఏడ్చాడు.

ఆవిడ కాఫీ పెట్టి యిచ్చింది.

వద్దనకుండా తాగాడు. అమృతంలా అనిపించింది.

"మీ అమ్మ సామాను తీసుకెళ్ళటానికి వచ్చావా బాబూ. అంతా సర్దిపెట్టే ఉంచాను" అంది రుక్మిణమ్మ.

శాంతమ్మ తాలూకు నాలుగు పాత్రలూ, ఒక బిందె, కంచం, చెంబు వగైరా అన్నీ ఒక గోతాంలోవేసి ఉంచిందావిడ.

"అవి నాకొద్దమ్మా. మీకు కావల్సినవి ఉంచుకుని మిగతావి ఎవరన్నా అవసరం ఉన్నవాళ్ళకి యివ్వండి" అన్నాడు.

ఆవిడ ఏం మాట్లాడాలో తెలీక మౌనంగా ఉంది. శరత్ జేబులోంచి డబ్బుతీశాడు.

"ఈ డబ్బు ఉంచండి. ఏదన్నా అవసరం వస్తే వాడుకుందురుగానీ" అన్నాడు.

అంతడబ్బు శరత్ తనకివ్వబోవటం చూసి ఆవిడ నివ్వెరపోయింది.

"అదేంటిబాబూ. యింత డబ్బు..."

"కాదనకుండా తీసుకోండి. మీలో మా అమ్మే కనిపిస్తోంది"

"వద్దుబాబూ"

"మీరలా అంటే మా అమ్మ నన్ను క్షమించదనుకుంటాను"

"అంతమాట అనకు. కానీ మనమూ మధ్యతరగతి మనుషులం. ఈ డబ్బు నీకేఅవసరానికన్నా పనికొస్తుందేమో"

"అవసరాలదేముంది లెండి. తీసుకోండి" అన్నాడు.

ఆవిడ తీసుకుంది.

"ఈ మారుమూలల్లో డబ్బు ఉంచుకోవటం కూడా ప్రమాదమే. బాంక్‌లో వేసుకుని అవసరానికి వాడుకోండి"

"సరేబాబూ" అందావిడ.

రుక్మిణమ్మ శరత్‌ని ఏమాత్రం అనుమానించలేదు. అతను ఏమేం చేశాడో, చెయ్యబోతున్నాడో ఆవిడకి తెలీదు.

శరత్ మనసులో చెలరేగుతున్న దుమారాన్ని ఎవరూ గుర్తించలేక పోయారు. రాజేశ్వరి కూడా అట్లాగే అనుకుంది. ఆవిడ బంధువుల్లో చాలామంది మగవాళ్ళు తమ భార్య తన తల్లితోనో, తండ్రితోనో గొడవపడి చివరికాలంలో వాళ్ళకి సేవచెయ్యకుండా, వాళ్ళ పొడ గిట్టకుండా అరిచి గోలచేసినా నోర్మూసుకుని ఊరుకున్నవాళ్ళే ఉన్నారు. పోయినవాళ్ళు ఎట్లాగూ పోయారు, ఉన్న భార్యతో గొడవపడి అనవసరంగా సంసారం పాడుజేసుకోవటం ఎందుకని సర్దుకుపోయిన వాళ్ళే ఎక్కువ. అందుకే శరత్ మానసిక ఘర్షణని రాజేశ్వరి ఊహించలేదు.

శరత్ లోగడ తన మామగారు అప్పులు తీసుకోమని ప్రోత్సహించి పరిచయం చేసిన వడ్డీ వ్యాపారి కిషన్‌చంద్ దగ్గరికి వెళ్ళాడు.

"నాకో పదివేలు కావాలి" అన్నాడు. కిషన్‌చంద్ మహదానందంతో అతన్ని కూర్చోబెట్టి పత్రాలు రాయించి, వేలిముద్రలు వేయించీ, సంతకాలు పెట్టించీ పదివేలు యిచ్చాడు.

అక్కడ్నుంచి బయల్దేరి రాంగోపాల్ పరిచయం చేసిన బట్టల వ్యాపారి కొట్టుకి వెళ్ళాడు.

దుప్పట్లు, తువ్వాళ్ళు, లుంగీలు రెండు పట్టుచీరెలు నాలుగు మామూలు చీరెలూ తీసుకున్నాడు.

ఎనిమిది వేలయ్యింది బిల్లు.

"మాకు ఎరియర్స్ రావాలి. రాగానే యిస్తాను. అవి వస్తాయని ధైర్యంగా తీసుకుంటున్నాను" అన్నాడు నవ్వుతూ.

"తీసుకోండి సార్. మీకు మా షాపు ఎప్పుడూ స్వాగతం పలుకుతుంది" అన్నాడు షాపతను నవ్వుతూ.

ఒక సంచీ కొని రెండు లుంగీలూ, ఒక తువాలూ ఒక దుప్పటీ అందులో పెట్టి రైల్వే క్లోక్‌రూమ్‌లో పెట్టివచ్చాడు.

పట్టుచీరెలు వెంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళి అమ్మవారికి ఒకటి యిచ్చాడు. శివుడి గుడికివెళ్ళి పార్వతీదేవికి మరోటి యిచ్చి తన తల్లి యిచ్చినట్లు పద్దులో వేసుకోమని దేవుళ్ళ

ని ప్రార్థించాడు.

ఇప్పుడతనికి చాలా తృప్తిగా ఉంది.

అటుపైన రాఘవకి ఉత్తరం రాశాడు.

తను పొందిన అనుభవాలూ, దుఃఖాలూ, శాంతమ్మ మరణం, ఆవిడ చావు తనలో రేపిన కల్లోలం... అన్నీ రాశాడు.

ఇప్పుడు పిల్లవాడిమీద కూడా ఏమాత్రం ప్రేమా లేదతనికి. రాజేశ్వరి వాడ్ని మొదట్నుంచీ తన పక్షం చేసుకుంది. మనుమల్నీ బంధాల్నీ చూస్తేనే విరక్తి కలుగుతోంది. ఏముంది. పెంచి, పెద్దవాడ్ని చేసినా వాడు తనకు ఒరగబెట్టేది ఏముంది. రేపొద్దున వాడూ రాజేశ్వరిలాంటి మరో స్త్రీకి భర్తఅయి తల్లిని ఏడిపించడమేగా జీవితం. ఓ మంచి రోజు చూసి మాయమైపోయాడు శరత్.

రాఘవ శరత్ ఉత్తరం చదవగానే కంగారుపడి బయల్దేరి వచ్చాడు. అతను వచ్చేసరికే శరత్ మాయమయిపోయాడు.

శరత్ కోరుకున్నట్లే పరిస్థితి ఘోరంగా తయారయింది.

మార్వాడీ, బట్టల కొట్టతను అంతా కలసి యింటికొచ్చి గొడవ గొడవచేశారు.

రాజేశ్వరి ఒక్కసారిగా తారుమారయిన పరిస్థితులు చూసి తల్లడిల్లిపోయింది. ఆవిడకి ఎవరూ సానుభూతి చూపించకపోగా మొగుడ్ని పీక్కుతిన్న రాక్షసి అన్నట్లు చూడటం మొదలుపెట్టారు.

తల్లీ, తండ్రీకూడా సాధించటం మొదలుపెట్టారు.

పెన్షనుగానీ, యిన్సూరెన్స్‌గానీ రావని తెలిసిపోయింది.

ఆస్తంటూ చిల్లిగవ్వలేదు. ఎలా బతకాలి?

రాఘవచూస్తూ ఊరుకోలేక పోయాడు.

శరత్ తెంపుకున్నట్లు అతను బంధాలు తెంపుకోలేదు కాబట్టి స్నేహితుడి సంసారం గురించి తాపత్రయపడ్డాడు.

శరత్ ఆఫీసుకివెళ్ళి రాజీనామా తిరిగి పరిశీలించేమార్గంగానీ, తిరస్కరించే మార్గంగానీ ఉందేమోనని కనుక్కున్నాడు. లాభం లేదన్నారు వాళ్ళు.

శరత్ కక్షతో ఎంత ప్లాన్డ్‌గా రాజేశ్వరిమీద పగసాధించాడో రాఘవకి అర్థమైంది.

రాజేశ్వరిమీద అతనికీ సానుభూతి లేదు. కానీ ఆ కుటుంబానికి ఏదో ఒక దారి చూపించాలి. అది మిత్రుడిగా తన ధర్మం. రాజేశ్వరికోసం కాదు. శరత్ బిడ్డకోసం. శరత్ ఒకానొక సమయంలో తీవ్ర మానసిక ఘర్షణకిలోనై తనేం చేస్తున్నాడో కూడా తనకే తెలీని సమయంలో అట్లా ప్రవర్తించాడు. యింకా పసివాడే అయిన కొడుకు గురించి అతను ఆలోచించలేదు. వాడ్ని కూడా శత్రువుగానే పరిగణించాడు.

ప్రవీణ్‌ని స్కూల్ కూడా మాన్పించారు డబ్బులేక. రాఘవ ఫీజుకట్టి మళ్ళీ వాడ్ని స్కూల్లో చేర్పించాడు.

తనకి తెలిసిన ప్రైవేట్ కంపెనీలో రాజేశ్వరికి ఉద్యోగం యిప్పించాడు.

ఆ కుటుంబం కాస్త దారిలో పడిందని నమ్మకం చిక్కాక తిరిగి వెళ్ళాడు.

అప్పటికే అతనికి శిరీషతో పరిచయం ఉంది.

శిరీష ప్రవర్తన, స్నేహగుణం, అందంగా నవ్వేమొహం అన్నీ అతనికి చాలా బాగా నచ్చాయి.

అతని బాధ్యతలు కూడా తీరాయి.

శిరీషని అడిగి ఆమె అంగీకారం పొంది పెళ్ళిచేసుకున్నాడు.

పెళ్ళికాగానే హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వచ్చేశాడు. యిద్దరూ మంచి యిల్లు అద్దెకి తీసుకుని హాయిగా గడిపేస్తున్నారు. యిద్దరిదీ చాలా అన్యోన్యమైన జంట.

ఈమధ్య రాఘవ టూర్‌మీద ఢిల్లీవెళ్ళాడు. అక్కడ రోడ్డుమీద గడ్డంపెంచుకుని తిరుగుతున్న మనిషిని చూసి శరత్ కాదుకదా అని అనుమానించి వెంబడించాడు.

ఆ మనిషి పార్క్‌లో సెటిల్ అయి వచ్చికమీద పడుకుని కనిపించాడు.

రాఘవ దగ్గరికి వెళ్ళి పలకరించాడు.

అతను శరతే. రాఘవతో బాగానే మాట్లాడాడు. కానీ హైదరాబాద్‌కి తిరిగి రమ్మంటే మాత్రం ఒప్పుకోలేదు.

చివరికి రాఘవ ఎంతో నచ్చచెప్పాక సరేన

న్నాడు. కానీ తన సంగతి ఎవరికీ చెప్పొద్దన్నాడు. తను తిరిగి రాజేశ్వరి మొహంగానీ, యింటి మొహంగానీ చూసేది లేదన్నాడు.

అతని నరనరాల్లో స్త్రీద్వేషం నిండిపోయి ఉంది.

★ ★ ★

శరత్ గతం గుర్తుచేసుకున్న శిరీష ఏవేవో ఆలోచించుకుంటూ అలాగే నిద్రపోయింది.

★ ★ ★

శిరీష స్నానంచేసి గులాబీరంగు చీరె, జాకెట్టుతో నీట్‌గా ముస్తాబయ్యింది.

శరత్‌రాగానే భోజనం చేసేస్తామన్నాడు రాఘవ. శరత్ వస్తాడా రాడా...

డైనింగ్ టేబుల్‌మీద వంటకాలన్నీ సర్ది, ముందుగదిలో కూర్చుని పేపర్ చదువుతోంది.

పదకొండు గంటలవుతుండగా యింటి ముందు ఆటో ఆగింది. ముందుగా రాఘవ దిగాడు. అతని వెనక చేతిలో చిన్న బాగ్‌తో శరత్.

శరత్ శిరీష ఊహించినంత దిగులుగా లేడు. మామూలుగా ఉన్నాడు. అందంగానే ఉన్నాడు కానీ మొహంలో నీలినీడలు దగ్గరకొస్తే కన్పిస్తాయి. కళ్ళల్లో విషాదఛాయలు మేమున్నాం అన్నట్లు తొంగిచూస్తున్నాయి.

రాఘవ శిరీషని పరిచయం చేశాడు.

శిరీష నమస్కరిస్తే శరత్ తిరిగి ప్రతినమస్కారం చెయ్యలేదు.

ఒక్కసారి పరిచయంగా చిన్నగా నవ్వి గదిలోకి వెళ్ళిపోయాడు రాఘవ వెంట.

"ఈ గది నీది. మాగజైన్స్, నవల్స్, టూ ఇన్ వన్ కూడా ఉన్నాయి. యింకేమన్నా కావాలన్నా మొహమాటపడకుండా అడుగు. శిరీష యింట్లోనే ఉంటుంది యింకోవారందాకా. నాకు ఆఫీసులో ఇన్‌స్పెక్షన్ ఉంది, లీవ్ దొరకదు. నీకోసం శలవుపెట్టలేకపోయానని బాధగా ఉంది" అన్నాడు రాఘవ.

"నాగురించి ఆలోచించకు. నాకిప్పటికే బోలెడు సిగ్గుగా ఉంది. మీకు అనవసరంగా యిబ్బంది. నా దారిన నన్ను పోనియ్యరాదూ" అన్నాడు శరత్.

"చాల్లే ఊరుకో" అన్నాడు రాఘవ. భోజనాలదగ్గర చాలా మొహమాటంగా ఉన్నాడు శరత్!

రాఘవ అతను తింటున్నంతసేపూ జాగ్రత్తగా చూస్తూ, మారు వడ్డిస్తూ, కొసరికొసరి తినిపిస్తున్నాడు.

నిర్లక్ష్యంగా ఉన్న వేషధారణ, దేనిమీదా ఆసక్తి లేనట్లున్న చూపులు, నిర్లిప్తంగా ఉన్న మొహం... బాబోయ్... యితన్ని ఎట్లా భరించాలి. అనుకుంది శిరీష.

రాఘవ ఆఫీసుకి వెళ్ళిపోతే యింక తను గడపాలి యితనితో. ఆడవాళ్ళంటే బొత్తిగా గౌరవంలేని అతనితో ఈ యింట్లో ఒక్కతే ఎలా ఉండాలి. యివేవీ ఆలోచించడేం రాఘవ.

భోజనం అయ్యాక శరత్ తనగదిలోకి వెళ్ళిపోయాడు. ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు.

శిరీష తను కూడా భోంచేసి బెడ్‌రూమ్‌లోకి వచ్చింది.

"శిరీషా" పిలిచాడు రాఘవ.

"చెప్పండి"

"శరత్ అంటే నాకెంత అభిమానమో నీకు తెల్సుగా. శరత్ యిట్లా మోడులా, అందరూ ఉన్నా ఒంటరిగా, పిచ్చివాడిలా బతకటం నేను సహించలేకుండా ఉన్నాను. నువ్వే ఏదో ఒకటి చేసి అతన్ని మళ్ళీ మామూలు మనిషిని చెయ్యాలి"

శిరీష నవ్వేసింది.

"నేనేం చెయ్యగలను చెప్పండి. అదేదో మీరే చెయ్యాలి. పైగా అతనికి ఆడవాళ్ళంటే అసలు గిట్టదు లాగుంది. నన్ను చూస్తేనే చేదుమందుని చూసినట్లు మొహం పెడ్తున్నాడు"

రాఘవ కూడా నవ్వాడు.

"నిజమే శిరీషా. కానీ నువ్వు తల్చుకుంటే తప్పకుండా సాధిస్తావు. నువ్వు మీ మహిళా సమాజం తరపున ఉపన్యాసాలిచ్చి ఎంతో మందిని మార్చావుగా. మరి అదే ప్రయత్నం యిక్కడ కూడా చేసి యితన్ని మార్చి స్త్రీని గౌరవించేట్లు చెయ్యొచ్చుగా"

"సరేలెండి. నేనసలు ఆ సమాజం సభ్యురాలినని తెలిస్తే అతను నాతో అసలు మాట్లాడడు. అయినా మీరు అడిగారు కాబట్టి ప్రయత్నిస్తాను" అన్నది శిరీష.

రాఘవ శిరీష చేతులు పట్టుకుని ఊపేశాడు. "థాంక్యూ శిరీషా. థాంక్యూ" అన్నాడు.

శిరీష 'జాగృతనారి' అనే సమాజ సభ్యురాలు. కొందరు స్త్రీలు తమను భర్తలు హింసిస్తున్నట్లు ఆ సమాజంలో మొరపెట్టుకుంటే వీళ్ళు వెళ్ళి ఆ భర్తల్ని సామ, దాన, భేద, దండోపాయాలుపయోగించి మార్చారు.

ఆవిధంగా శిరీషకి ఎంతోమంది ఆడవాళ్ళ గురించి తెలిసింది. స్త్రీ సమస్యలమీద మంచి అవగాహన ఉంది.

రాఘవ యింతవరకూ శిరీషని యిది చెయ్యి, అది వద్దు అంటూ శాసించింది లేదు. భార్యా, భర్తల్లాగాకన్నా మంచి స్నేహితుల్లాగానే మసులుకుంటుంటారు వాళ్ళు.

తను యిన్నాళ్ళూ మహిళలకోసం కృషిచేసింది. వారి భర్తలు కొందర్ని మార్చగలిగింది.

వాళ్ళు అజ్ఞానంతో, మూర్ఖత్వంతో స్త్రీని గౌరవించి ఆదరించలేని స్థితిలో ఉన్నవాళ్ళు. వాళ్ళకి స్త్రీ విలువ ఏమిటో తెలియవరచటం తనకు కష్టం కాలేదు. వాళ్ళ అభిప్రాయాలు తప్పని చెప్పి, భార్యని గౌరవించటం, ప్రేమించటం నేర్పగలిగింది. వాళ్ళల్లోని మానవత్వాన్ని తట్టి లేపగలిగింది. కానీ శరత్ విషయం అలా కాదు.

మనుమల్లో కొన్ని అభిప్రాయాలూ, నమ్మకాలూ ఉంటాయి. తాము నమ్మిందే నిజం అని ప్రతివారూ గాఢంగా అనుకుంటారు. ఈ నమ్మకాలు రెండు రకాలుగా, ఏర్పడుతుంటాయి. ఏవన్నా చూసి లేకపోతే విని ఒక నమ్మకం ఏర్పరచుకోపటమో, తనకు స్వయంగా అనుభవమవగానే ఆ నమ్మకం కుదిరిపోవటమో జరుగుతూవుంటుంది. తన అనుభవాలవల్ల ఏర్పడిన నమ్మకాన్ని పోగొట్టటం చాలా కష్టం. అవి ఆ మనిషి హృదయంలో గాఢముద్రవేసుకుని ఉంటాయి. వాటిని మరోలా అన్వయించుకోలేరు. ఆ నమ్మకం నిజమని చెప్పేందుకు బలమైన వాదం ఉంటుంది గనుక ఆ ఆర్గ్యుమెంట్‌తో అవతలివాళ్ళని సులభంగా ఓడించగలరు.

శరత్ ఆడవాళ్ళని ద్వేషించటంలో అతని తప్పులేదు. అతనికి ఎదురైన ఆడవాళ్ళు ఎవరికి ఎదురైనా వాళ్ళూ అట్లాగే స్త్రీ ద్వేషులవకతప్పదు.

మర్నాడు రాఘవ తను ఆఫీసుకి వెళ్ళేలోపలే శరత్‌చేత అన్నిపనులూ పూర్తిచేయించాడు. శరత్, అతనూ కలిసి భోజనం చేశారు. రాఘవ వెళ్ళిపోయాడు.

శిరీష ఆదివారాలు రాఘవ బట్టలన్నీ ఉతుకుతుంది. శిరీష ఎక్కడికన్నా వెళ్ళేపనుంటే రాఘవే బట్టలన్నీ ఉతికి ఇస్త్రీ చేసేస్తాడు.

ఇవాళ శలవుమీదే ఉండడంతో ఆ శలవు వృధా కాకుండా ఇంటిపనులన్నీ చేసుకోవాలనుకుంది శిరీష. బకెట్లో పొడివేసి బట్టలు నానబెట్టింది. ఆ తర్వాత ఇల్లంతా మళ్ళీ తుడిచి శుభ్రం చేసింది. ఇంట్లో బట్టలు ఉతకటానికీ, అంట్లు తోమటానికీ పనిమనిషి ఉంది. కానీ ఎందుకో రెండ్రోజుల్నుంచీ రావటంలేదు.

అంట్లు తోముకుని బట్టలు ఉతుక్కుని మళ్ళీ స్నానంచేసి బాత్‌రూమ్‌లోంచి వచ్చింది. భోంచేసి తీరిగ్గా కూర్చున్నాక మళ్ళీ శరత్ ఏం చేస్తున్నాడోనని చూసింది.

అతను గదిలో లేడు.

శిరీష గుండె ఝల్లుమంది.

"శిరీషా శరత్ చాలా డిప్రెషన్‌లో ఉన్నాడు. ఉండుండి ఆత్మహత్య చేసుకున్నా, మళ్ళీ పారిపోయినా ఆశ్చర్యంలేదు. నిన్ను శలవు పెట్టుకుని ఉండమంటున్నది పూర్తిగా అతన్ని కనిపెట్టి ఉండమనటానికే. ఆపని నేనే చెయ్యాలి కానీ నాకు శలవు దొరక్క నీకప్పగిస్తున్నాను. మనిద్దరం ఒక్కటే. నా ప్రాణస్నేహితుడు నీకూ ప్రాణస్నేహితుడే. చిన్నపిల్లాడ్ని కనిపెట్టినట్లు చూస్తుండు. జాగ్రత్త సుమా" అన్న రాఘవ మాటలు గుర్తుకొచ్చాయి.

"శరత్‌గారూ" పిలిచింది.

"జవాబు లేదు.

ఇల్లంతా వెతికింది. అతను కనిపించలేదు.

ఎక్కడికి వెళ్ళిఉంటాడు.

గబగబా తాళం పెట్టి బస్‌స్టాండ్‌దాకా వెళ్ళి చూసింది.

శరత్ అయిపులేడు.

శిరీషకి ఏడుపు వచ్చేస్తున్నది. ఇప్పుడేం చెయ్యాలి.

వెంటనే బయల్దేరి మళ్ళీ ఇంటికి వెళ్ళింది.

"పిన్నిగారూ" పిల్చింది, పక్కింటామెను.

''ఏంటి శిరీషా''

''మా ఇంటికి వచ్చారు చూడండి మావారి ఫ్రెండ్- ఆయన ఎక్కడికన్నా వెళ్తుంటే చూశారా'' అంది.

''అదేంటి శిరీషా ఎక్కడికి వెళ్ళాడూ. ఇందాకటిదాకా డాబామీద కూర్చుని ఉన్నాడే'' అంది పిన్నిగారు.

''అరే... డాబామీద ఉన్నాడన్నమాట. తను ఆమాటే తోచక ఇల్లంతా వెతికి భయపడ్తోంది'' శిరీషకి నవ్వు వచ్చింది.

''శిరీషా... అతనికి మతిస్థిమితం లేదా ఏమిటి. ఇందాక నేను బట్టలు ఆరెయ్యటానికి మా డాబామీదికి వెళ్తే అతను మీ డాబామీద కూర్చుని కనిపించాడు. ఎండలో కూర్చుని శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. తనలోతను నవ్వుకుంటున్నాడు కూడా'' అంది పిన్నిగారు.

ఆవిడకి ఏ సమాధానమూ చెప్పకుండా ఊరుకుంది శిరీష.

''అతనికి పెళ్ళయిందా. ఏం ఉద్యోగం చేస్తున్నాడు. ఎన్నాళ్ళుంటాడు'' ఆవిడ మళ్ళీ అడిగింది.

''పెళ్లయింధి. ప్రస్తుతం ఉద్యోగం చెయ్యటంలేదు. వెళ్తాను పిన్నిగారూ. చాలా పనుంది'' అనేసి డాబామీదికి నడిచింది శిరీష.

అక్కడ శరత్ మోకాళ్ళలో తలదాచుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

''ఇక్కడ కూర్చున్నారా. ఎండగా ఉంది. లోపలికి వెళ్దాంరండి'' మృదువుగా అంది శిరీష.

అతను ఉలిక్కిపడి శిరీషవంక చూశాడు.

ఒక్కసారి అయోమయంగా పరిసరాలవంక చూసి లేచాడు.

శిరీష మెట్లుదిగి వచ్చింది.

''మంచినీళ్ళు తాగుతారా''

అతను తల ఊపాడు.

''టిఫినేం చెయ్యమంటారు''

''ఏమీ వద్దు''

అతను మంచినీళ్ళు తాగేసి లోపలికి వెళ్ళిపోయాడు.

అతని మనసులో ఇంకా ఏం ఆలోచనలుండి ఉంటాయి. చెయ్యాల్సిందంతా చేసేశాడు. తన కుటుంబంమీద ప్రేమ, అభిమానం ఏవీ ఉన్నట్లు లేవు.

మధ్యాహ్నం శిరీష పకోడీలు చేసి ప్లేట్‌లో వేసి పట్టుకెళ్లింది.

''వద్దు''

''తీసుకోండి. ప్లీజ్... చల్లారిపోతాయి. తొందరగా తినండి'' లాలనగా అంది శిరీష.

అతనింకేం మాట్లాడకుండా తిన్నాడు.

నాలుగవుతుండగా శిరీష స్నేహితురాలు సుజాత వచ్చింది.

''శిరీషా... లీవ్‌లో ఉన్నావటకదా. మీ ఆఫీసుకి వెళ్లివస్తున్నాను'' అంటూ హడావుడిగా లోపలికి వచ్చింది సుజాత.

శరత్ ముందుగదిలో కూర్చుని నవల చదువుతున్నాడు.

సుజాతని చూసి లేవబోయాడు.

''లేవకండి... కూర్చోండి... నేను లోపలికి వెళ్తాను...'' అని లోపలికి వచ్చింది.

శిరీష సుజాతను చూసి సంతోషపడింది.

''రా....రా... ఊరక రారు మహాత్ములు'' నవ్వింది.

''ఊరికే రాలేదు. ఇదుగో మన సంఘం పెట్టి అయిదేళ్ళయిందిగా... యానివర్సరీకి నువ్వు తప్పకుండా రావాలని మన ప్రెసిడెంట్ గారు నన్ను గుర్తు చెయ్యమని పంపారు. నువ్వీమధ్య మన జాగృతనారివైపే రావటంలేదు. మర్చిపోయావా ఏంటి కొంపదీసి. అవునూ... ఆ ముందుగదిలో ఉన్నది ఎవరు అతిథి దేవుడా?'' అంది సుజాత.

''అవును. ఆయన మావారి ఫ్రెండ్. యానివర్సరీకి తప్పకుండా వస్తాను. ఏవో పనుల్లో ఉండి ఈమధ్య రావటం కుదర్లేదు'' అంది శిరీష.

సుజాత పకోడీలు తింటూ కబుర్లు చెప్తోంది. సుజాతకి ఇంకా పెళ్ళికాలేదు. అసలు చేసుకోవాలన్న ఆలోచన కూడా లేదు.

''ఏముంది పెళ్ళంటే... ఆ చేసుకున్నవాడికి వంట చెయ్యటం, వాడికి కట్నం ఇవ్వటం, ఆ ఇచ్చిన కట్నం చాల్లేదని వాడు తంతే పడటం... స్వేచ్ఛ కోల్పోయి వాడు చెప్పినట్లు

ఆడటం ఇంతేగా... నాకు పెళ్ళి అక్కర్లేదు'' అంటుంది. సుజాత తల్లిదండ్రులకి ముగ్గురు ఆడపిల్లలు. సుజాత మూడోది. పెద్దవాళ్ళిద్దరికీ పెళ్ళిళ్లయి భర్తలతో బుద్ధిగా కాపరాలు చేసుకుంటున్నారు. పండగలకీ పబ్బాలకీ ఆ అల్లుళ్ళు వచ్చి తిని తిట్టిపోతుంటారు. సుజాత అక్కలిద్దరూ భర్తలచేత ఆడపాదడపా తన్నులు తింటుంటారు. తిట్లు పడ్తుంటారు. వాళ్ళని చూసిన సుజాతకి పెళ్ళంటేనే రోత పుట్టింది.

''అందరూ అట్లాంటివాళ్లే ఉండరు. ఎన్నాళ్ళని పెళ్ళి మానుకుంటావు'' అంటుంది శిరీష.

''కోటిమందిలో ఒక్క మంచి మగవాడుంటాడు. అంతే. మనకలాంటివాడు దొరుకుతాడని గ్యారంటీ ఏముంది. నాకొద్దు బాబూ పెళ్లి'' సుజాత నవ్వేస్తుంది.

''అందరికీ పెళ్ళయ్యాక కలిగే జ్ఞానం నాకు ముందే కలిగి పెళ్ళి మానేస్తున్నాను'' అంటుంది సరదాగా.

పెళ్లి మానుకున్నందుకు ఎన్నడూ బాధపడ్డట్లే ఉండదు సుజాత. హాయిగా గడిపేస్తుంటుంది.

''సర్లేవే! ఎట్లా ఉంటే సుఖంగా ఉంటుందనుకుంటే అట్లాగే ఉండటం మంచిది. అయినా **నీకు** నచ్చినవాడు ఎప్పుడో ఒకప్పుడు తటస్థపడకపోడు'' అంటూ ఉంటుంది శిరీష.



పనిమనిషి రావటం లేదెందుకనో అని ఆలోచిస్తుండగానే వెంకమ్మ వచ్చేసింది.

''అమ్మగారూ... ఆఫీసుకెళ్ళలేదా'' అంది.

''లేదు. ఈ వారమంతా శెలవుపెట్టాను. వెంకమ్మా నువ్వు రావటంలేదేం ఒంట్లో బాగుండలేదా'' అంది శిరీష ఆప్యాయంగా.

జవాబుగా వెంకమ్మ ఏడవటం మొదలుపెట్టింది.

''మళ్ళీ ఏమన్నా గొడవా...?'' అంది శిరీష.

''మీ దగ్గర దాచుకున్న డబ్బు తెమ్మని మా ఆయన చావగొట్టాడు, ఎదవ చచ్చినోడు. చంపేశాడమ్మగారూ'' ఏడుస్తూనే చెప్పింది.

''ఊరుకో వెంకమ్మా. నేను మీ ఆయన్తో మాట్లాడ్తే ఊరుకుంటాడులే. అయినా నిన్ను మళ్ళీ కొడితే ఎందుకు ఊరుకున్నావు. నేను చెప్పినట్లు శుభ్రంగా పోలీసు రిపోర్ట్ ఇవ్వాల్సింది'' అన్నది శిరీష.

శరత్‌కి ఆ మాటలు విని అర్థమైందేమిటంటే... వెంకమ్మ మొగుడు తాగుబోతు. వెంకమ్మకి డబ్బు ఇవ్వడు సరికదా ఏదన్నా ఉంటే ఎత్తుకుపోతుంటాడు. ఆడపిల్ల పెళ్ళికని డబ్బు దాచుకుంటే అది కూడా తీసుకుపోయాడు. అదేమంటే కొడతాడు. ఒకసారి శిరీష వెళ్లి అతనితో మాట్లాడివచ్చింది. వెంకమ్మని కొడితే ఊరుకోననీ, పోలీస్ రిపోర్ట్ ఇస్తాననీ చెప్పింది. ఆ తర్వాత అతను వెంకమ్మని కొట్టలేదు. ఈమధ్య వెంకమ్మచేత బ్యాంక్ అకౌంట్ తెరిపించి శిరీష ఆమె డబ్బు అందులో కట్టిస్తోంది. ఆ డబ్బు కావాలని మొగుడు కొట్టాడట ఇప్పుడు.

''ఏమన్నా అంటే పోవే నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటానంటాడు. వాడికి ఈ వయసులో కూడా పెళ్ళికి ఉబలాటంగా ఉంది. పిల్ల పెళ్లి చెయ్యాల్సిన వయసులో తను చేసుకోవాలనుకుంటున్నాడు. వాడ్ని చంపినా మారడమ్మగారూ. బాగా సుఖం మరిగాడు'' వెంకమ్మ ఏడుస్తోంది.

''ఏడవకు వెంకమ్మా. నేను చూస్తానన్నాగా. నువ్వు ఇంటికెళ్లి హాయిగా తినిపడుకో. నీరసంగా కనిపిస్తున్నావు. విశ్రాంతి తీసుకో. డబ్బేమైనా కావాలా'' అడిగింది శిరీష.

''వద్దమ్మగారూ. మీ సంఘం వాళ్ళంతా వచ్చి మావాడ్ని నాలుగు తిట్టండమ్మగారూ.

నన్ను చూస్తే వాడికి బొత్తిగా లెఖ్కలేకుండా ఉంది'' అంది వెంకమ్మ.

''అట్లాగేలే'' అంది శిరీష.

★ ★ ★

వెంకమ్మ వెళ్ళిపోయాక శిరీష ఆలోచిస్తూకూర్చుంది.

ఎంత చేతగాని వెధవకైనా పెళ్ళాన్ని చూడగానే ఎక్కడలేని వీరత్వం పుట్టుకొస్తుందా? బయట పైసాకి పనికిరానివాడు కూడా ఇంట్లోకొచ్చేసరికి పెళ్ళాం ఎంత సమర్థురాలైనా అవిడ్ని తీసిపారేసి మాట్లాడ్తాడేం?

జాగృతనారిలో చేరాక తను ఎన్నో జీవితాల గురించి తెలుసుకుంది. అన్నింట్లోనూ పురుషాధిక్యమే! ఏంటో... ఆడవాళ్ళ బతుకులు ఎప్పుడు మారతాయో...

ఇల్లు, ఆఫీసు, పొద్దంతా సరిపోయే పనిలో మునిగివుండే తను ఒక మహిళా సమాజంలో చేరి ఉద్యమాలు నడిపించగలనని శిరీష ఎప్పుడూ అనుకోలేదు.

తమ ఇంటిపక్కనే ఓ దంపతులు వచ్చిచేరారు. భర్తకి ముప్పైఅయిదుదాకా ఉంటాయి. భార్యకి ముప్పయిఉండొచ్చు. వారికి ఒక పాప.

ఓ రోజు రాత్రి శిరీష, రాఘవ మంచి నిద్రలో ఉండగా పక్కింట్లోంచి ఏడుపు వినిపించింది. ఆ తర్వాత కెవ్వున కేక. అర్ధరాత్రి నిశ్శబ్దంలో ఆ కేక భయంకరంగా వినిపించి శిరీష ఉలిక్కిపడింది.

''ఎవరో ఏడుస్తున్నారండీ. గట్టిగా అరిచారు కూడా'' అంది. రాఘవ కళ్ళు నలుముకుంటూ లేచాడు.

శిరీషకి ఎవరేడుస్తున్నారో, ఎందుకు ఏడుస్తున్నారో అర్థంకాలేదు. బహుశా ఏదో చావుకబురు వచ్చిందేమో అనుకుంటూ ఉండగానే బండబూతులు వినిపించాయి. ఆ తర్వాత గుభీగుభీమని చప్పుడు. అప్పటికి ఏం జరుగుతున్నదో ఊహించగలిగి కిటికీలోంచి తొంగిచూసింది.

పక్కింటి భర్త భార్య జుట్టుపట్టుకుని మొరటుగాలాగి కొడ్తుండడం శిరీష కళ్ళారాచూసి ఆవేశం పట్టలేకపోయింది. గభాల్న బయటికి వెళ్ళబోయింది. రాఘవ ఆమె ఏం చెయ్యబోతున్నదో గ్రహించి చెయ్యిపట్టి ఆపాడు.

''వదలండీ. నేను వెళ్ళి ఆయన్ని ఆపి చివాట్లు పెడ్తాను'' అంది శిరీష.

''ఆగు శిరీషా. నేను చెప్పేది విను. భార్యాభర్తలు అన్నాక లక్షాతొంభై ఉంటాయి. మనం కలగజేసుకోవటం బాగుండదు''

''అయితే మాత్రం. భార్యని ఇట్లా గొడ్డులా బాదటం బాగుందా'' కోపంగా అంది శిరీష.

''నిజమే. కానీ సంగతేంటో పూర్తిగా తెలియకుండా మనం మధ్యలో దూరితే బాగుండదు. సాధారణంగా భార్యాభర్తల తగువులు ఎలా ఉంటాయంటే కుక్కల్లా పోట్లాడుకుని కూడా మళ్ళీ వెంటనే కలిసిపోయి, మధ్యలో మనలాంటి వాళ్ళెవరైనా సర్దిచెప్పబోతే వాళ్ళను పట్టుకుని తిట్టిపోస్తారు. వాళ్ళూ వాళ్ళు బాగానే ఉంటారు. కానీ మధ్యలో మనం ఫూల్స్ అవుతాం'' అన్నాడు రాఘవ.

''మీరు చెప్పేది అర్థం లేకుండా ఉంది. ఆ దెబ్బలకి ఆ అమ్మాయి చచ్చి ఊరుకుంటే అప్పుడేం చేస్తారు. ఎంత కోపంఉన్నా ఇంత పాశవికంగా ప్రవర్తిస్తుంటే ఎట్లా ఊరుకోవడం'' అంది శిరీష.

''కొంచెం ఓపికపట్టు. అతను ఇట్లాగే కొడుతుంటే నేనూ వస్తాను. ఇద్దరం వెళ్లి అడుగుదాం'' అన్నాడు రాఘవ.

శిరీష మాట్లాడలేదు.

అయిదునిమిషాల్లో గొడవ సర్దుమణిగిపోయింది.

''నేను చెప్పలా'' అన్నాడు రాఘవ.

మళ్ళీ మర్నాడు అదే జరిగింది... ఆ మూడోనాడు కూడా...

ఇంక శిరీష ఊరుకోలేదు... ఆ పక్కింట్లో కొత్తగా వచ్చిన ఆవిడతో కొద్దిగా పరిచయం ఉంది. మర్నాడు శలవు పెట్టుకుని ఆవిడ కోసం ఇంట్లోనే ఉండిపోయింది శిరీష. ఆవిడ మొగుడు ఆఫీసుకు వెళ్ళాక వాళ్లింటికి వెళ్లింది.

ఆవిడ పేరు జ్యోతి. ఆప్యాయంగా పలకరించి కూర్చోబెట్టింది శిరీషని. వాళ్ళ పాప స్కూల్‌కి వెళ్లింది.

శిరీష స్నేహంగా, ఆత్మీయంగా మాట్లాడుతుంటే జ్యోతికి తోబుట్టువుని చూసినట్లే అనిపించింది.

"జ్యోతీ. నిన్నోమాట అడిగితే ఏం అనుకోగూడదు" అంది శిరీష.

"అడుగు ఏమిటది?" అంది జ్యోతి.

"రోజూ మీవారు నిన్ను కొడ్తూనే ఉన్నారు. నాకు వినబడ్తూ ఉంటుంది. వచ్చి ఆయన్ని కొట్టేద్దామా అన్నంత కోపం వస్తుంది నాకు. ఎట్లాగో తమాయించుకుని ఊరుకుంటున్నాను. నిన్ను అడిగి ఎందుకు కొడ్తున్నాడో తెలుసుకుని అతనికి బుద్ధి చెప్దాం అనుకుంటున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే చెప్పు" అంది శిరీష.

జ్యోతి వెక్కివెక్కి ఏడ్చింది.

"నాకెవ్వరూ సాయం చెయ్యరు. ఆఖరికి నా తల్లితండ్రులే నీ ఖర్మ నీది అని వదిలేశారు. నేనెవరో తెలీకపోయినా సహృదయంతో ముందుకొచ్చావు. చాలు శిరీషా" అంది ఏడుస్తూనే.

"పిచ్చిపిల్లా... ఊరుకో. ఏడ్చి సాధించగలిగింది ఏమీలేదు. ఇంతకీ అతను ఎందుకిలా చేస్తున్నాడు, కట్నం చాలలేదనా? అతనికేమన్నా దురలవాట్లున్నాయా? లేక శాడిస్టా..."

"అదేదీ కాదు. నేను ఆయనకి విడాకులివ్వాలిట" అంది జ్యోతి ఏడుస్తూ.

శిరీషకి ఏం మాట్లాడాలో తెలియలేదు. తర్వాత ఆమె చెప్పిన కథ విని ఇంతటి దుర్మార్గులుంటారా అని బాధ పడింది.

జ్యోతి తల్లితండ్రులకి ముగ్గురు ఆడపిల్లలు. ఇద్దరు మగపిల్లలు. బీదకుటుంబం. జ్యోతి తల్లికి ఒక అక్క, ఒక తమ్ముడూ ఉన్నారు. జ్యోతి పెద్దమ్మకి పిల్లల్లేరు. అందుకని ఆవిడ తన తమ్ముడి కొడుకుని అంటే జ్యోతి భర్త ఓంప్రకాష్‌ని దగ్గరుంచుకుంది. అంతేకాదు ఓంప్రకాష్‌ని తన చెల్లెలు కూతురు జ్యోతికిచ్చి పెళ్లి చేయాలనుకుంది. అట్లా అయితే ఆస్తిని తన సొంత చెల్లెలు కూతురూ, తమ్ముడి కొడుకూ మాత్రమే అనుభవిస్తారని ఆవిడ ఆశ.

జ్యోతి అదృష్టానికి అందరూ మురిసిపోయారు. ప్రకాష్ అందంగా ఉంటాడు. బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు.

మార్కెట్లో అతని రేటు యాభైవేలు ఉంది. ప్రకాష్ తల్లికి డబ్బంటే ప్రాణం. మామూలుగా అయితే పైసా కట్నం ఇవ్వలేని జ్యోతిని తన కోడలిగా చచ్చినా అంగీకరించేది కాదు. కానీ ఆడపడుచు మాటకాదంటే, ఆవిడ ఆస్తి దక్కదేమోనని ఈ పెళ్ళికి అంగీకరించేసింది. ఆవిడకి బంధుప్రీతి కాదుకదా అసలు ఏ ప్రీతీ, మొహమాటాలూ, సెంటిమెంట్లూ లేవు. డబ్బే సర్వస్వం. ఆ తల్లికితగ్గ తనయుడు ప్రకాష్.

దత్తత తీసుకున్న అత్త పరలోకానికి పోయాక ఇప్పుడు ప్రకాష్‌కి అడ్డులేదు. పెళ్ళయిన ఏడాదికల్లా పాప పుట్టింది.

ప్రకాష్‌కి జ్యోతి నచ్చలేదు. అంతకన్నా గొప్ప అందంగా ఉన్న అమ్మాయి దొరికివుండేదనీ, తన ఖర్మకొద్దీ జ్యోతి దొరికిందనీ అనుకుని ఆమెని సాధించటం మొదలుపెట్టాడు. ఆ తర్వాత చావగొట్టటం, నిత్య కార్యక్రమంగా మిగిలింది. అతనికి తల్లినుండి పూర్తి వత్తాసు లభించింది. మేనమామ కాబట్టి ఏమన్నా వింటాడేమోనని అతని తండ్రి దగ్గర గోడు వెళ్ళబోసుకుంది జ్యోతి. కానీ ఆయనేం పట్టించుకోలేదు.

"మొగుడికి కోపం వచ్చి ఒక దెబ్బ వేసినంతమాత్రాన అందరికీ చెప్పుకుని ఏడుస్తావా" అని తిట్టింది అత్తగారు.

"మరీ అఘాయిత్యం మనిషిరా. ఏం చేస్తావో, ఎలా పడ్తావో ఏడుపుగొట్టు మనిషి" అని కొడుక్కి ఎక్కించింది ఇంకాస్త.

ప్రకాష్ ఆవిడ మాటల్తో మరీ ముదిరిపోయాడు. జ్యోతి పరిస్థితి ఇంకాస్త దిగజారిపోయింది. తల్లిదండ్రులకి చెప్పుకున్నా ఫలితం లేకపోగా వాళ్ళు జ్యోతినే నిందించారు.

"నీకు అసలు పెళ్లి చెయ్యటం మావల్ల అయ్యేదేనా. ఏదో పెద్దమ్మ పుణ్యమాని ఒక ఇంటిదానివయ్యావు. ప్రకాష్‌లాంటివాడ్ని అల్లుడిగా తేవటం వచ్చే జన్మలో కూడా మాకు చేతకాదు. దొరికిన అదృష్టానికి ఆనందపడక ఇట్లా ఏడుస్తావేం. మొగుడన్నాక తిడుతుంటాడు, కొడుతుంటాడు. ఎదురుతిరిగి పోట్లాడ్తుంటే ఇంకాస్త పేట్రేగిపోతాడు. ఏదో సర్దుకుపోతుండాలి. మరీ నువ్విలా పేచీలు పెట్టి,

పితూరీలు చెప్తుంటే మాకు చెడ్డపేరు వస్తుంది'' అంది తల్లి. తండ్రి వంతపాడాడు.

వాళ్ళ బాధ వాళ్ళది. ఇప్పుడు ప్రకాష్‌తో ఏం మాట్లాడినా మీ పిల్లని మీరు తీసుకు పొండి అనగలడు. జ్యోతిని ఇంటికి తెచ్చి పోషించే స్తోమత వాళ్ళకి లేదు. ఒకవేళ జ్యోతి తన బతుకు తను బతికినా పెద్దపిల్ల కాపరం చెయ్యటంలేదంటే తర్వాత పిల్లలకి పెళ్ళికాదు. ఆ సాకుతో కట్నం ఎక్కువ లాగుదామని చూస్తారు కూడా. అసలు పెళ్లి ఖర్చుకే డబ్బు లేకుంటే కట్నం... కట్నంకే డబ్బు లేదంటే ఇంకాస్త ఎక్కువ కట్నం... ఇవన్నీ ఆలోచించే వాళ్ళు జ్యోతి బాధ్యత వదిలించుకున్నారు.

అత్త, మామలు పట్టించుకోరని తెలిసిపోయాక ప్రకాష్‌కి ఇంక అడ్డులేకుండా పోయింది. ఏడుస్తున్న పెళ్ళాన్ని చూస్తే ఏదో పైశాచిక ఆనందం అతనికి.

ప్రకాష్‌కీ, జ్యోతికీ పడటంలేదని తెలియగానే ప్రకాష్‌కి వరస అయ్యేకూతురు ఉన్నవాళ్ళంతా అతని ఉత్సాహాన్ని ఇనుమడింపజేశారు.

''అసలు నీకూ దానికీ పెళ్ళేమిట్రా. నీ ముందు దిష్టిబొమ్మలా ఉంటుంది అది. ఏదో ఖర్మగాలి చేసుకున్నావు. అంతమాత్రాన దానికే కట్టుబడుండాలని లేదు. మిమ్మల్ని విడిపొమ్మని నేను అనను. కానీ విడిపోదల్చుకుంటే మాత్రం సంకోచించకుండా చెప్పు. మా అమ్మాయిని ఇచ్చి చేస్తాం'' అంటూ మాట్లాడారు.

వాళ్ళ అమ్మాయిలు అందాల బొమ్మలు. చదువుకున్నారు. స్టయిల్‌గా ఉంటారు. వాళ్ళని చేసుకుంటే తన స్టేటస్‌కి తగ్గట్లు ఉంటారని ప్రకాష్ అభిప్రాయం. కొత్త భార్యతో కొత్త సంసారం ఊహించుకుని ఆనందపడిపోవటం మొదలుపెట్టాడు. విడాకులు తీసుకోకపోయినా పెళ్లి చేసుకునేవాడే కానీ జైల్లో కూర్చోవాల్సి వస్తుందని భయపడ్డాడు. ''నాకు విడాకులు ఇవ్వు. నేను మళ్ళీ పెళ్లి చేసుకుంటానని'' నటం మొదలుపెట్టాడు. ఆపైన తిట్లు తన్నులు సరేసరి.

జ్యోతి విడాకులకి ఒప్పుకోవటంలేదు. ఒంటరిబతుకు ఇష్టంలేదు. చావో బతుకో ఇక్కడే అన్నట్లు మొండికేసింది. అది చూసి ప్రకాష్‌కి మరీ విసుగుపుట్టి తన హింసని మరింత పెంచాడు. జ్యోతి ఇప్పటివరకూ సహిస్తోంది. కానీ ఆమె సహనం హద్దులు దాటిపోయేట్లుంది ప్రకాష్ ప్రవర్తన.

కళ్ళల్లో నీళ్లు నింపుకుని జ్యోతి ఇదంతా వివరిస్తుంటే శిరీష రక్తం మరిగిపోయింది.

ఎంత దుర్మార్గుడు. ఆస్తికోసమని పెళ్ళాడి, ఆస్తి చిక్కగానే భార్య అంటే రోతపడి... ఛీ... ఛీ అనుకుంది.

''నువ్వేం బాధపడకు జ్యోతీ. మనమేం ఆటబొమ్మలమా. ఇష్టం ఉన్నప్పుడు ఆడుకుని మోజు తీరగానే అక్కర్లేదని విసిరేస్తే పోయేందుకు. నాకు వీలైనంత సాయం చేస్తాను. నీ హక్కుని నువ్వు రక్షించుకునేట్లు చేస్తాను'' అంది శిరీష.

''అనవసరంగా నా గురించి హైరానపడకు. ఈ దురదృష్టవంతురాల్ని ఎవరూ రక్షించలేరు'' అంది జ్యోతి.

''భర్త బాగా ప్రవర్తించకపోతే నా ఖర్మ ఇంతే అని సరిపెట్టుకునేరోజులుపోయాయి జ్యోతీ. ఇప్పుడు భార్యతో బాగా ఉండకపోతే అది వాడి ఖర్మ. దండం దశగుణం భవేత్ అన్నారు. ఇట్లాంటివాళ్లకి దండోపాయమే మంచిది. నువ్వు మాత్రం నీరసపడిపోయి మన కార్యక్రమం నీళ్లు కార్చెయ్యకు. మన ప్రయత్నాలు తెలిసి అతను నిన్ను మంచి చేసుకుందామని చూస్తే లొంగిపోకు. మంచిగా ఉన్నట్లే ఉండి ముంచేస్తారు ఈ మొగాళ్లు'' అంది శిరీష.

''సరే నీ ఇష్టం'' అంది జ్యోతి.

శిరీష అక్కడ్నుంచి కదిలి తన స్నేహితురాలు విజయ ఇంటికి వెళ్లింది. విజయ తన బంధుమిత్రుల్లో కొందరికి ఇట్లాంటి విషయాల్లో సాయం చేసింది. జ్యోతి విషయంలో ఏం చేస్తే బాగుంటుందోనని సలహా అడుగుదామనుకుంది.

విజయతో కలిసి 'జాగృత నారి' సెక్రటరీ లీలావతి వద్దకు వెళ్లింది. జ్యోతి కథవిని తప్పకుండా ఆమెకి సాయం చేస్తామని మాట ఇచ్చిందామె.

లీలావతీ మరో ఇద్దరూ కలిసి ప్రకాష్‌ని కలుసుకుని మాట్లాడారు. ప్రకాష్ మొదట్లో మొండిగా మాట్లాడినా వాళ్ళు కీలెరిగి వాత పెట్టినట్లు మాట్లాడేసరికి తగ్గివచ్చాడు.

"మర్యాదగా ఆమెతో మంచిగా ఉంటావా ఉండు. లేకపోతే ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించి బుద్ధివచ్చేట్లు చేస్తాం. అంత ఇష్టంలేని వాడివి పెళ్ళెందుకు చేసుకున్నావు. అప్పుడేమో డబ్బుకోసం రంభలా కనిపించినపిల్ల నాలుగు డబ్బులు చేతబడగానే తీసిపోయినట్లు కనిపిస్తోందా. డబ్బు కోసం పెళ్లి చేసుకున్న నిన్ను చూసి ఆ అమ్మాయి రోతపడాలి అసలు. సిగ్గులేదుటయ్యా. పెళ్లి చేసుకున్నది బుద్ధిగా కాపరం చెయ్యటానికిగానీ, అంతకన్నా అందగత్తె ఇంకో ఆవిడ కనిపించగానే విడాకులు పుచ్చుకుని ఆవిడ్ని చేసుకోవటానికా" అంటూ చీవాట్లు పెట్టింది లీలావతి.

"పిచ్చివేషాలు వేశావంటే నీ ఉద్యోగం ఊడగొట్టించి జైల్లో ఊచలు లెక్కపెట్టేట్లు చేస్తాను జాగ్రత్త. పెళ్ళాన్ని కొడతావుటయ్యా. సిగ్గులేదూ. అన్నం తింటున్నావా, గడ్డి తింటున్నావా. ఇంకోసారి ఆ పిల్లమీద చెయ్యెత్తావంటే పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయి. ఆ అమ్మాయిని బాగా చూసుకుంటానని మాట ఇస్తేగానీ ఊరుకోం" అంటూ అరిచింది ఆవిడతో వచ్చిన రాజ్యలక్ష్మి అన్నావిడ.

ప్రకాష్ ఎంత మొండిఘటం అయినా వాళ్ళ వాదంలో ఉన్న బలానికీ, న్యాయానికీ దిగిరాక తప్పిందికాదు.

వాళ్ళు కోరినట్లు ఒప్పుకున్నాడు. అయినా వాళ్ళు సంతృప్తి పడకుండా జ్యోతిని ఇంక హింసించననీ, ప్రేమగా ఉంటాననీ కాయితం రాసిచ్చాకే కదిలారు.

"ఆ అమ్మాయికేం జరిగినా నీదే బాధ్యత" అని హెచ్చరించి మరీ కదిలారు.

ఆ తర్వాత ప్రకాష్ ప్రతాపం తగ్గిపోయింది. జ్యోతిని బాగా చూసుకుంటున్నాడు.

"అతను ఇంత తొందరగా మారిపోతాడనుకోలేదండీ. నాకు చాలా సంతోషంగా ఉంది" రాఘవతో అంది శిరీష.

"ఎందుకు మారడు. ఇంతకన్నా మంచి అవకాశాలు ఉన్నాయంటే మనిషి దీన్ని లక్ష్య పెట్టడు. ఇంతకన్నా గతిలేదు అనుకుంటే సరిపెట్టుకుంటాడు. జ్యోతిని ఆదుకునేవాళ్ళు ఎవరూ లేరని ఆమెని సతాయించాడు. కానీ ఇప్పుడు మీరంతా అతన్ని హడలగొట్టి దార్లో పెట్టినట్లున్నారు" నవ్వాడు రాఘవ.

తాము చేసినపనికి తనకే నవ్వు వచ్చింది శిరీషకి. ఆ తర్వాత జాగృతనారి ఆఫీసుకి తరచుగా వెళ్ళి వాళ్ళ కార్యక్రమాల్లో మరింత చురుకుగా పాల్గొనసాగింది.

★ ★ ★

మధ్యాహ్నం ఏమన్నా పుస్తకాలు ఇమ్మని శిరీషని అడిగాడు శరత్. ఆవిడ వంటింట్లో ఏదో పనిచేసుకుంటోంది.

"మా రూమ్‌లో రాక్‌లో ఉన్నాయండీ. ఏమనుకోకుండా మీరే సెలక్ట్ చేసుకుని తీసుకోండి" అంది.

ఆ పుస్తకాల్లో ఎక్కువభాగం మహిళల కోసం ప్రత్యేకంగా రాసినవే.

కాసేపయ్యాక శిరీష వచ్చింది.

"ఏమండీ... బుక్స్ తీసుకున్నట్లు లేదే..." అంది.

"వద్దులెండి. అవి చూస్తే అసలు పుస్తకాలు చదవాలనే కోరికే నశించింది" అన్నాడతను సీరియస్‌గా.

శిరీష నవ్వేసింది.

"అవునులెండి. మీ టేస్ట్‌కి కుదరాలిగా. మీకేం కావాలో చెప్పండి. తెచ్చిపెడతాను" అంది.

"నేను తెచ్చుకుంటాన్లెండి. ఎక్కడికి వెళ్ళాలో చెప్పండి"

"ఈ పేటకి మీరు కొత్తగదా. మీరు చెప్తే నేను తెస్తాను"

"ఏమిటండీ ఇది. వచ్చినప్పట్నించీ చూస్తున్నాను. నన్ను ఎక్కడికీ పోనియ్యరేం. పారిపోతానని భయమా. ఇలా నన్నో ఖైదీలా చూస్తే నిజంగా పారిపోతాను" అన్నాడు కోపంగా.

శిరీష మృదువుగా చెప్పింది. ఆమె పెదవులమీద అదే అందమైన చిరునవ్వు.

"శరత్‌గారూ... మనిషిని మమకారంతో బంధించగలం కానీ సంకెళ్ళతో కాదు. మిమ్మల్ని ఖైదీలా చూస్తున్నామనుకుంటే మా దురదృష్టం... మీ ఆరోగ్యం గురించి కలవరంతో మిమ్మల్ని బయటికి పోనియ్యటంలేదు. మీరు ఎక్కడికన్నా వెళ్తే తోడు తీసుకుని వెళ్ళండి. మీకు తెలుసో లేదో మీరు చాలా నీరసంగా

ఉన్నారు''

శరత్ మాట్లాడలేకపోయాడు.

ఆమెని అర్థం చేసుకోలేకపోయాడాతను...

రాఘవ, ఆమె ఇద్దరూ చాలా అన్యోన్యంగా ఉంటున్నారు. తను గమనించినంతవరకూ వాళ్ళు ఒకళ్ళకోసం ఒకళ్లు ప్రాణం అయినా ఇచ్చేస్తారు. మరి ఆమె అన్నట్లుగానే ఉంది. మమకారంతో, ప్రేమతో ఒకరి మనసు ఒకరు జయించగలరు కానీ దౌర్జన్యంతోనో, హింసించ డంతోనో కాదు.

ఒక భార్య భర్తని చీటికి మాటికీ నొప్పిస్తూ అతని ప్రేమని పొందలేదు.

ఒక భర్త దౌర్జన్యంతో భార్యని భయపెట్టగల డేమో... భయాన్ని తప్ప అతను భక్తితో కూడిన ప్రేమని పొందలేడు భార్య దగ్గర్నుంచి...

శిరీష మామూలు మనిషి కాదని మాత్రం శరత్‌కి అనిపించింది. చీరెలూ, నగలూ అని గొడవ చెయ్యదుట. అట్లాగని ఆమె దగ్గర తక్కువ బట్టలు లేవు. ఆమె కోసం శరత్‌కొంటే, శరత్‌కోసం ఆమె కొంటుందిట.

శిరీష తను వచ్చినందుకు సంతోషిస్తుంది తప్ప గొడవ చెయ్యదని నచ్చచెప్పి మరీ తనని ఇక్కడికి తెచ్చాడు రాఘవ. అట్లాకాక ఇంకెట్లా చెప్తాడు... భార్య గయ్యాళి అని తన నోటితో ఎవడూ చెప్పుకోడుగా. వాళ్ళు తన కోసం గొడవ పడటం తను సహించలేడు. ఎవరైనా ఎన్నాళ్ళు ని ఓపిక నటిస్తారు. రేపో ఎల్లుండో శిరీష సహనం మానేసి శుభ్రంగా పోట్లాడుతుంది కాబో లు... అంతే... ఆడవాళ్ళంతా ఇంతే. అందులో అసలే ఆడవాళ్ళూ హక్కులూ అంటూ తిరిగే శిరీష... బాబోయ్... ఇన్నాళ్ళూ తిన్నా తినకపో యినా ఎన్ని బాధలు శారీరకంగా పడ్డా తను మానసికంగా మాత్రం శాంతిగానే ఉన్నాడు. ఎందుకంటే అన్నిటికన్నా తనకు అసహ్యం కలిగించేదీ, భరించలేనిదీ పోట్లాటలు. ఎవ రైనా అరుచుకుంటూ, పోట్లాడుకుంటూ ఉంటే తనకు చాలా భయం వేస్తుంది కూడా. ఇంట్లోంచి వెళ్ళాక ఇన్నాళ్ళూ భార్యాభర్తలు కొట్టుకుచావటం చూడక హాయిగా ఉంది. ఆ సీన్స్ మళ్ళీ చూడాలా ఖర్మ...

శరత్ ఏవేవో ఆలోచించుకుంటూ ఉండ గానే రాఘవ వచ్చేశాడు.

''ఎట్లా ఉన్నావు'' ఆత్మీయంగా అడిగాడు.

''బాగానే ఉన్నాను'' నవ్వాడు శరత్.

రాఘవ లోపలికి వెళ్ళాడు.

శిరీష అప్పటికి ఆరిన పాంట్లు, షర్టులు ఇస్త్రీ చేస్తోంది.

''ఏంటి ఇన్నీ ఉతికావా... ఉతికినదానివి ఊరుకోక పైగా ఇస్త్రీనా'' కసిరినట్లు అన్నాడు.

''మరేం ఫర్వాలేదు'' అంది శిరీష ఇస్త్రీ చేస్తూనే.

''నీకెన్నిసార్లు చెప్పినా ఇంతే. సెలవుపెట్టి ఇంట్లో ఉన్నప్పుడైనా కాస్త రెస్ట్ తీసుకోకూడదూ. ఏదో ఒకటి చేస్తూనే ఉంటావు'' అన్నాడు రాఘవ.

''మీరు తక్కువా. మొన్న నేను ఆదివా రంనాడు బయటికి వెళ్ళానోలేదో నా బట్టలన్నీ ఉతికెయ్యలేదూ''

''దెబ్బకి దెబ్బా''

''అవును... మీరు కాళ్ళు చేతులు కడుక్కో రండి. స్నానం చేస్తారా. వేడినీళ్ళు పెట్టనా''

''నేను పెట్టుకుంటాలే. నువ్వు ఈ పని కాగానే అన్నం పెట్టు చాలు''

శిరీష ఇస్త్రీ పూర్తిచేసి, అన్నం వడ్డించే లోపల రాఘవ స్నానం పూర్తి అయింది.

శరత్ ఇవన్నీ వింటూ అదోలా ఫీలయ్యాడు. డైనింగ్ టేబుల్‌మీద అన్నీ అమర్చి రాఘవకి కొసరి, కొసరి తినిపిస్తోంది శిరీష.

రాఘవ ఏవో కబుర్లు చెప్తున్నాడు.

అతను వేస్తున్న జోక్స్‌కి ఆమె పొట్ట చెక్కల య్యేట్లు నవ్వుతోంది.

శరత్ గది గుమ్మంలోంచి డైనింగ్ హాల్‌లోకి ప్రవేశం ఉంది.

గది గుమ్మంలో నిలబడి అప్రయత్నంగా వాళ్ళనే చూస్తూ ఉండిపోయాడు శరత్.

శిరీష లేతాకుపచ్చ చీరె కట్టుకుని ఉంది. రాఘవ లుంగీ, బనీను వేసుకుని ఉన్నాడు. యిద్దరూ అరమరికలు లేకుండా ఒకళ్లనొకళ్ళు పూర్తిగా అర్థంచేసుకున్న మనుషుల్లా, మనసు విప్పి హాయిగా మాట్లాడుకుంటున్నారు.

ఆ దృశ్యం అపూర్వంగా కనిపించింది శర త్‌కి.

ఇలా ఇంత అందంగా జీవించేవాళ్ళు

కూడా ఉన్నారా అనుకున్నాడు. అట్లాగే చూస్తూ ఉండిపోవాలనిపించింది. రాఘవ తింటున్న వాడల్లా తలెత్తి శరత్‌ని చూశాడు.

"రా శరత్. అక్కడే నిలబడిపొయ్యావేం" అన్నాడు.

శరత్ తడబడ్డాడు.

"అబ్బే ఏంలేదు... మంచినీళ్ళు కావాలని..."

శిరీష వెంటనే జగ్గులోంచి నీళ్ళు వంచి శరత్‌కి అందించింది.

"రండి... కూర్చోండి" అంది కుర్చీ జరుపుతూ.

ఆ తర్వాత రాఘవ శరత్‌కి వింతలు, విశేషాలు చెప్పటం మొదలుపెట్టాడు.

తను యిక్కడికి యిప్పుడు రాకుండాఉంటే బాగుండేదనిపించింది శరత్‌కి.

వాళ్ళు ఇద్దరూ హాయిగా మాట్లాడుకుంటుంటే పానకంలో పుడకలా వచ్చాడు తను.

వాళ్ళిద్దరూ ఎంత ప్రేమగా ఉన్నారు. పెళ్ళయి రెండునెలలు కాగానే ఒకళ్ళంటే ఒకళ్ళకి బోర్ కొట్టేస్తున్న ఈరోజుల్లో సుఖమయ సంసారం గురించి తెలుసుకోవాలంటే ఇలాంటి జంటల్ని చూస్తేచాలు...

శాంతి, సుఖం ఎక్కడున్నాయో అర్థమైంది. యింకోళ్ళని ప్రేమించి గౌరవించటంలో శాంతి, అర్థంచేసుకుని బతకటంలో సుఖం ఉన్నాయి.

సుఖం కారుల్లో, చీరెల్లో, మేడల్లో, ఒడల్లో లేదు, కేవలం మనిషి హృదయంలో ఉంది.

చిన్న చిరునవ్వుతో అవతలి మనిషికి ఎంతైనా సందేశాన్ని యివ్వవచ్చు. అరవిరిసిన పెదవులచాటున దాగిన అందాల నవ్వుతో... అర్థంచేసుకుని మాట్లాడే మాటలతో... అరమరికలు లేని హృదయంతో... ప్రేమను యిచ్చిపుచ్చుకోవటంలో ఉంది సుఖమనేది.

ఆనందమో, విషాదమో తెలీని భావం గుండెల్లో నిండిపోయింది. ఆ భావాన్ని అట్లాగే వదిలవర్చుకోవాలనిపించింది.

రాఘవ భోజనం ముగించి లేచాడు.

"పద... హాయిగా ఆరుబయట కూర్చుందాం" అన్నాడు.

బయట కుర్చీలు వేసి ఉంచింది శిరీష. ఇద్దరూ కూర్చున్నారు. శిరీష లోపలగదిలో ఉంది.

"రాఘవా" చిన్నగా పిల్చాడు శరత్.

"ఊ..."

"మీ ఆవిడ నీతో పోట్లాడదా"

"పోట్లాడుతుంది..."

శరత్ ఉలిక్కిపడ్డాడు.

"దేనికి..." అడిగాడు శరత్.

"చాలావాట్లికి. అన్నం సరిగ్గా తినకపోతే, శ్రమ ఎక్కువచేస్తే, మంచిబట్టలు కొనుక్కోకపోతే..."

"వేళాకోళం కాదు. నిజంచెప్పు. ఉదాహరణకి నేను వచ్చాను యిప్పుడు. ఆనిడకి శ్రమ, అదీగాక నీతరపు మనిషిని. విసుక్కోదా"

"శిరీష చాలా మంచిది. నీ సమస్య నాకన్నా తనే బాగా అవగాహన చేసుకుంది. నిన్ను రమ్మని చెప్పమని నన్ను బలవంతం చేసింది కూడా"

"ఏమో... నాకైతే కొంచెం భయంగానే ఉంది. నామూలంగా మీమధ్య గొడవలొస్తాయేమోనని. ఆవిడనలే మహిళాసమాజం మనిషి. యిందాక మీ పనిమనిషి వస్తే మొగుడిమీద పోలీస్ రిపోర్ట్ యిమ్మని చెప్పిందావిడ"

"మహిళా సమాజం అనగానే పురుషులమీద విరుచుకుపడే ఆడపులులు కారులే" అంటూ రాఘవ విరగబడి నవ్వటం మొదలుపెట్టాడు.

శరత్ అతని నవ్వుకి చిన్నబుచ్చుకున్నాడు.

"శరత్... వెంకమ్మ మొగుడు సామాన్యుడు కాదు. ఆమె కష్టం చేసి తెచ్చిందంతా జల్సాచేస్తాడు. ఏమన్నా అంటే చచ్చేట్లు కొడ్తాడు. పిల్లి అయినా గదిలో పెట్టి కొడితే కళ్ళు పీకుదామని చూస్తుందే! మరి అబల అని చిన్నచూపు చూస్తే ఊరుకోకుండా తగిన బుద్ధి చెప్పొద్దా! శిరీష మంచిసలహానే యిచ్చింది" అన్నాడు రాఘవ.

"మీ ఆవిడ సంగతి కాదుగానీ నాకు ఈ మహిళోద్ధరణ సంస్థలూ, సమాజాలూ, వీటి మీద ఏమీ సద్భావన లేదు. వీళ్ళకేం తక్కువ

యింది? మొగుళ్లని సతాయించి పైగా వాడి మీదే రిపోర్ట్ యిస్తే దానికి వీళ్ళ సపోర్టా!

"లేదు శరత్. నువ్వు అసలు విషయం తెలీకుండా మాట్లాడ్తున్నావు. ఆడవాళ్ళు కొంత మంది ఎంతెంత కష్టాలు పడ్తున్నారో నీకు తెలీదు"

"నువ్వు చెప్తావుకానీ మా ఆవిడ చేసింది గుర్తుతెచ్చుకో. మాటిమాటికీ పోలీస్ రిపోర్ట్ యిస్తానని బెదిరించేదికాదూ" అన్నాడు శరత్.

"మనం విద్యుచ్ఛక్తి సాయంతో లైట్లు వెలిగించుకుంటున్నాం. రకరకాల ఉపయోగాలు పొందుతున్నాం. ఎవడికన్నా కరెంట్ షాక్ కొట్టి చచ్చాడనుకో యింక ఊళ్ళో అసలు కరెంట్ అంటూ ఉండకూడదంటే ఎలా? అట్లాగే ఆడవాళ్ళకి అబలలు కదా అని కొన్ని సదుపాయాలూ, రక్షణలూ యిస్తారు. కొందరు దాన్ని దుర్వినియోగం చేస్తే అందర్నీ ద్వేషించాలా?" అన్నాడు రాఘవ.

"అయితేమాత్రం - అన్నింట్లో సమానహక్కులు కావాలంటూ మళ్ళీ ఈ ప్రత్యేక హక్కులూ, రిజర్వేషన్లూ దేనికి ఈ ఆడవాళ్ళకి" ఆవేశంగా అన్నాడు శరత్.

"యివన్నీ ఉన్నా కూడా వాళ్ళకి పూర్తి రక్షణ, న్యాయం చేకూరటంలేదు శరత్! ఇదీ లేకపోతే మన మగాళ్ళు మరీ విజృంభించేస్తారు. నువ్వు యిప్పుడుకాదు ఎప్పుడైనా తీరిగ్గా కూర్చుని ఆలోచించు నీకే బోధపడ్తుంది" అన్నాడు రాఘవ.

ఆ తర్వాత టాపిక్ మార్చాడు.

"శరత్! పొద్దున్న నువ్వు డాబామీద ఉంటే శిరీష వెళ్ళి వీధంతా వెతికి వచ్చిందిటకదా. యిందాక చెప్తుంటే నాకు భలే నవ్వు వచ్చింది. అంత ఎండలో డాబామీదికి వెళ్తావని అనుకోలేదుట..."

శరత్ కూడా నవ్వాడు.

"అవును. పాపం ఆవిడ చాలా కంగారుపడినట్లున్నారు" అన్నాడు.

"చెప్పి వెళ్ళాల్సింది"

"అదికాదు రాఘవా. నువ్వు యింట్లో లేవు. ఆవిడ స్నానం చేస్తున్నారు. అందుకని... బాగుండదేమోనని నేను పైకి వచ్చాను"

"నువ్వు నీ గదిలో ఉండటానికేం! లేనిపోని శంకలు పెట్టుకోకు శరత్! మా యింట్లో నీకు ఫ్రీగా లేదంటే నాకు బాగుండదుమరి"

"బాగుంది రాఘవా. నీకైనా మంచి భార్య దొరికింది. నాకదే సంతోషం" అన్నాడు శరత్.

★ ★ ★

మర్నాడు రాఘవ పొద్దున్నే వెళ్లిపోయాడు. శిరీష వంట మొదలుపెట్టి శరత్‌కోసం వేడినీళ్ళు పెట్టింది.

డైనింగ్‌హాల్లో హీటర్ పెట్టారు. హీటర్‌కి వైర్ కనెక్ట్‌చేసిఉంది ప్లగ్‌లో పెట్టటానికి.

శరత్‌కి రాఘవ అన్నిపనులూ దగ్గరుండి చూసుకున్నాడుమొన్న. నిన్న శిరీష తనే వేడినీళ్ళు తీసుకెళ్ళి బాత్‌రూంలో పెట్టి తర్వాత శరత్‌ని పిలిచింది.

ఆమెచేత ఈ పనులన్నీ చేయించుకోవటం బాగుండదు. నీళ్ళు పెట్టుకోవటానికి కూడా సాయందేనికి. తనే చేసేసుకుంటే పోతుంది అనుకున్నాడు శరత్.

"వేడి నీళ్ళు నాకోసమేనాండీ" అన్నాడు.

"అవునండీ" అన్నది శిరీష తల వంచుకుని పనిచేసుకుంటూనే.

శరత్ వెంటనే బాత్‌రూంలోకి వెళ్ళి బకెట్ తెచ్చుకుని హీటర్‌దగ్గరకు వచ్చాడు.

అతను అలవాటులేని పనిచెయ్యటం చేత కాక ధనాల్న బకెట్‌ని హీటర్‌కేసి కొట్టాడు పొరపాటున.

అంతే... హీటర్‌ని కనెక్ట్‌చేసిన వైర్ ఊడి వేళ్ళాడటం మొదలుపెట్టింది. శరత్ ఏంచేయాలో కూడా అర్థంకాక చూస్తున్నాడు. యింతలోనే శిరీష వంటగదిలోంచి ఈ తతంగం అంతా చూస్తున్నదల్లా వచ్చి గభాల్న స్విచ్ ఆపేసింది.

వైర్ అటూ యిటూ తిరగటం చూస్తే శిరీషకి గుండెలు దడదడలాడాయి.

తను రావటం కాస్త లేటయితే - అసలే అయోమయంలో ఉన్న శరత్ ఆ వైర్ ఊగకుండా పట్టుకుందామని ప్రయత్నించటం చూసి భయం భయంగా అనిపించింది.

"థాంక్యూ" అన్నాడు శరత్.

"థాంక్స్ దేనికండీ. ఈమాత్రం ఎవరైనా

చేస్తారు''

''సమయానికి తోచాలికదండీ. నామటుకు నాకు ఏం చెయ్యాలో అర్థంకాలేదు. ఆ గాభరాలో వైర్‌ను పట్టుకోబోయానుకూడా''

''నేను చూస్తూనే ఉన్నాలెండి అదంతా. అయినా మీరెందుకండీ ఈ పని చెయ్యటం. నేను పెట్టేదాన్నిగా ఆ నీళ్ళు''

''అవుననుకోండి... మీకు శ్రమ యివ్వటం దేనికని...''

''బాగుందండీ. మీకేదన్నా అయితే మీ ఫ్రెండ్ నన్ను చంపేస్తారు. మీరేం చెయ్యొద్దు మహానుభావా. బుద్ధిగా చెప్పినట్లు వినండి చాలు''

''అలాగేలెండి. కానీ ఒక్కమాట. మా ఫ్రెండ్ చంపకపోతే నాకేం అయినా ఫర్వాలేదన్నమాట''

శిరీష గట్టిగా నవ్వింది. ''మాటవరసకి ఏదో చెప్తుంటారండీ. అన్నింటికీ అర్థాలు తీస్తుంటే కష్టం'' నవ్వుతూ అంది.

''తియ్యనులెండి. సరే స్నానం చేసివస్తాను''

''మహారాజులా చేసిరండి''

శిరీష నవ్వుతూ మాట్లాడుతుంటే శరత్‌కి మళ్ళీ మాట్లాడాలనిపించింది.

''యింతకీ యివాళ కూర ఏంచేస్తున్నారు'' అన్నాడు.

''వంకాయ కూరండీ''

''అబ్బా... వంకాయా''

''అవును. మీరు తినరా?''

''తింటాన్లెండి'' అన్నాడు శరత్.

''తింటానండీ అనటానికీ, తింటాన్లెండి అనటానికీ చాలా భేదం ఉంది తెలుసాండీ''

''మాటవరసకి ఏదో అంటామండీ. అన్నింటికీ మీరిలా అర్థాలు తీస్తే ఎలాగండీ'' నవ్వు రాకుండా పెదిమలు బిగించిపెట్టి అన్నాడు శరత్.

''మంచివాళ్ళే. మాటలు బాగానే అప్పజెప్తున్నారు'' శిరీష నవ్వి వంటగదిలోకి వెళ్ళిపోయింది.

భోజనం చేసేముందు టేబుల్‌మీద ఉన్న వంటకాలు ఒకసారి చూశాడు. శిరీష మూతలు తీసి వడ్డిస్తోంది.

వంకాయ కూరతోపాటు బెండకాయల వేపుడు కూడా ఉంది. ''మీరు వంకాయ తినరేమోనని బెండకాయ కూడా వేయించాను'' అంది శిరీష. తను స్నానంచేసి వచ్చేలోపల చేసేసినట్లుంది.

మనకోసం అని ఎవరైనా చిన్నపని చేస్తే ఎంత సంతోషంగా ఉంటుందికదా అనిపించింది శరత్‌కి. ఈ చిన్నవిషయం గమనించలేక ప్రపంచంలో ఎంతోమంది పరమ స్వార్థంగా బతుకుతూ ఎవళ్ళకీ ఏమీ చెయ్యకుండా అంతా తమకిమాత్రమే చేసుకుంటూ ఎంత నిస్సారమైన, నిరర్థకమైన బతుకు బతుకుతున్నారో అనిపించింది. ఒకళ్ళ ఫీలింగ్స్‌ని గమనిస్తూ వాటికి అనుగుణంగా నడుచుకోకపోతే మానెయ్యనీ, కానీ పనికట్టుకుని ఇంకోళ్ళ ఫీలింగ్స్ హర్ట్‌చేద్దామని చూసే మహానుభావులకి వాళ్ళు ఎంత పోగొట్టుకుంటున్నారో అర్థంకాదు.

ఈ చిన్న సూత్రం తెలీకే ఎంతమంది నిరర్థకమైన కాపరాలు చేస్తున్నారో అనిపించింది. ధుమధుమలూ, సాధింపులూ, వేధింపులూ, తిట్లూ, తన్నులూ... వీటికోసమేనా భగవంతుడు మనకీ బ్రతుకు యిచ్చింది. దేవుడు ప్రసాదించిన అమూల్యవరం మానవ జీవితం. సుఖమయం, శాంతిమయం చేసుకుంటున్నది ఎంతమంది. అపార్థాలు, అనవసర తగాదాలతో ఎంతకాలాన్నీ ఆరోగ్యాన్నీ పాడుచేసుకుంటున్నారు.

కడుపు నిండిపోయినట్లనిపించింది శరత్‌కి. అన్నం తినబుద్ధికాలేదు.

''అదేంటండీ... మీకోసం బెండకాయ చేస్తే అదికూడా తినటంలేదు. కొంపదీసి మీకు అదీ పడదా'' అడిగింది శిరీష.

''లేదండీ... తింటాను'' అని తినటం మొదలుపెట్టాడు.

శరత్ వచ్చి రెండురోజులైంది. ఈ రెండురోజుల్లోనూ అతను శిరీషతో మాట్లాడింది పెద్దగా లేదు. అవసరమైనవి మటుకు అడుగుతున్నాడు.

మధ్యాహ్నం టీ పెడుతుంటే వంటగదిలోకి వచ్చాడు. అతని మొహం వాడిపోయినట్లు

ఉంది. కళ్ళు ఎర్రబడి ఉన్నాయి.

"అలా ఉన్నారేం. ఒంట్లో బాగాలేదా" అంది శిరీష.

"అవును. కొద్దిగా జ్వరం వచ్చింది" అన్నాడు శరత్.

శిరీష గబగబా తమ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి థర్మామీటర్ తెచ్చి యిచ్చింది.

"జ్వరం ఎంతుందో చూడండి" అంది.

"వద్దు... ఏదో మామూలు జ్వరమే. అదే తగ్గిపోతుంది"

"సర్లెండి. యిదొకపనా ఏంటి వద్దని అనేందుకు. ముందు నోరు తెరవండి" అని గద్దించి థర్మామీటర్ నోట్లో పెట్టబోయింది.

అతను మధ్యలోనే అందుకుని టెంపరేచర్ చూసుకున్నాడు.

"ఎంత ఉంది" అంది శిరీష.

"నూట ఒకటి"

"అరే... ఎలామరి. డాక్టర్ దగ్గరికి వెళ్దాం పదండి" అంది శిరీష.

"మీరు మీటింగుకు వెళ్ళాలిగా. అసలే నారీజనం, ఈ పురుషపురుగుకోసం మీరు ఆగిపోయారంటే ఊరుకుంటారా" అతను భయపడ్తున్నట్లు అన్నాడు.

తను జాగృతనారి సభకు నాలుగు గంటలకల్లా బయల్దేరి వెళ్తుందని చెప్పింది అతనికి. అతను జాగృతనారి పేరు వినగానే భయపడ్డట్లు మొహంపెట్టాడు. అతని మనసులో ఉన్న తేలిక అభిప్రాయం, చులకనభావం తెలిసి శిరీష కొద్దిగా చిన్నబుచ్చుకుంది. కానీ అతను యిప్పుడు తమాషాగా మాట్లాడటంతో నవ్వాపుకోలేకపోయింది.

"మీకు జోక్స్ వెయ్యటం కూడా వచ్చా" అంది పకపకా నవ్వుతూ.

"నేను మనిషిని కానా"

"కారని ఎవరన్నారు"

"మరి... మనిషన్నవాడు ప్రతివాడు లైక్‌చేసేది హాస్యరసం"

"నిజమేలెండి. మరిప్పుడు ఏంచేద్దామనుకుంటున్నారు. డాక్టర్ దగ్గరికి వెళ్దాం పదండి. మా డాక్టర్ నాలుగు గంటలకల్లా క్లినిక్‌లో ఉంటాడు... వెళ్దామా"

"వద్దు... నాకేంకాదు. టీ తాగి పడుకుంటాను. ఏవన్నా టాబ్లెట్ ఉంటే యివ్వండి చాలు" అన్నాడు శరత్.

శిరీష మందులడబ్బా వెతికి క్రోసిన్ టాబ్లెట్ ఒకటి తెచ్చి యిచ్చింది.

"మీరు మీటింగ్‌కి వెళ్ళండి. నాకోసం మానుకోవద్దు" అన్నాడు శరత్.

"నేను వెళ్ళనండీ. వెళ్ళినా మీరొక్కరే ఏం అవస్థపడ్తున్నారో అని భయంగా ఉంటుంది" అన్నది శిరీష.

అతని కళ్ళల్లో ఆనందమో, విషాదమో అర్థంకాని భావం. ఆ కళ్ళల్లో తడి... ఆర్ద్రత... శిరీష గమనించింది.

"థాంక్యూ" అన్నాడతను మృదువుగా.

"పడుకోండి. రెస్ట్ తీసుకుంటే తగ్గిపోతుంది"

"ఏంటో... రెస్ట్ కాక మరేం ఉంది నాకు" అతను స్వగతంలా అనుకున్నాడు.

శిరీష అతని గదిలోకి వచ్చి పక్కదులిపి "పడుకోండి" అంది.

"శిరీషగారూ... ప్లీజ్ మీరు వెళ్ళండి. మీరు వెళ్లకపోతే నేను చాలా అనీజీగా ఫీలవుతాను. మీరు నామూలంగా మీటింగ్‌కి అటెండ్ కాలేకపోతే నాకు చాలా బాధగా అనిపిస్తుంది. నా జ్వరం యింకా పెరుగుతుంది. ప్లీజ్ వెళ్ళండి" అన్నాడతను.

శిరీష విస్ఫారిత నేత్రాలతో అతన్నే చూస్తోంది.

జీవితంలో ఓడిపోయి, తగిలిన ఎదురుదెబ్బలతో బండబారిపోయినట్లు పైకి కనిపిస్తున్న అతని మనసుపొరల్లో అతి సున్నితమైన మనసు యింకా మిగిలి ఉందన్నమాట. అతని మూలంగా తనకు ఇబ్బందని అడుగడుగునా ఫీలవుతూనే ఉన్నాడు.

ఈ మనిషిలో యింకా ఆ సున్నితత్వం మిగిలేఉంది కాబట్టి వాస్తవాల్ని అవగాహన చేసుకోగలడు. ఫర్వాలేదు... తను అతన్ని మార్చగలదు. ధైర్యం వచ్చేసింది శిరీషకి.

శరత్ ఈ రెండ్రోజులూ అనుకోకుండానే శిరీషని గమనిస్తూనే ఉన్నాడు. సుజాత మాటలవల్ల, పనిమనిషి వెంకమ్మవల్ల, శిరీష గదిలో ఉన్న పుస్తకాలవల్ల శిరీషకి జాగృతనారితో

ఉన్న అనుబంధం తెలిసింది. మనసులో ఆడ వాళ్ళంటే ఎంత చులకన ఉన్నా శిరీషని ఎందుకో తక్కువగా అంచనా వెయ్యలేకపోయాడు. ఆమె తనకోసం శ్రమపడటం, శలవు పెట్టుకుని మరీ తనని కనిపెట్టుకుని ఉండటం చూసి మనసులోనే ఆమెకు కృతజ్ఞుడైపోయాడు.

నిజంగా శిరీష ఎంత మంచిది పాపం... అని అతనికి ఆమెను చూస్తే జాలికలిగింది కూడా. భర్తకి ఫ్రెండు... సరైన మతి కూడా ఉందో లేదో తెలీదు, అట్లాంటి తనకోసం యింట్లోనే ఉంటూ బాధ్యతగా అన్నీ చూసుకుంటోంది. పైగా ఆఫీసులో ఆమె పనిచేసే సీటులో బోలెడు పనుంటుందిట. సెలవు పెట్టి తిరిగి వెళ్ళగానే పెండింగ్‌లో ఉండిపోయిన ఫైళ్లన్నీ మళ్ళీ చూసుకోవాలి కాబోలు. శిరీషని చూస్తే జాలేసింది. ఏం ఆడవాళ్ళు... యింటి పని చాలక పాపం ఉద్యోగాలు కూడా... రాఘవ మంచివాడు కాబట్టి హెల్ప్ చేస్తాడు వీలైనంత వరకూ. కానీ ఆ అదృష్టం కూడా లేనివాళ్ళు ఎందరో అనిపించింది.

శిరీష అతని బలవంతంమీద కదిలింది.

జాగృతనారి సభలో శిరీష హాయిగా పాల్గొనలేకపోయింది. శరత్ ఎట్లా ఉన్నాడోనని భయం... రాత్రి ఎనిమిదిన్నరకల్లా ఫంక్షన్ పూర్తికాగానే బయల్దేరి వచ్చేసింది.

అతని గదిలోకి వెళ్ళి చూసేసరికి శరత్ నీరసంగా మూలుగుతూ కనిపించాడు. అతని కళ్ళు మూతలు పడిఉన్నాయి.

''శరత్‌గారూ'' తట్టిలేపింది.

అతను నీరసంగా కళ్ళు తెరిచి చూశాడు.

అతని ఒళ్ళు కాలిపోతున్నంత వేడిగా ఉంది.

''అరే... జ్వరం బాగా పెరిగిందండీ. యిప్పుడెలా'' ఆందోళనగా అంది శిరీష.

''ఫర్వాలేదులెండి. కళ్ళు మూసుకు పడుకుంటే అదే తగ్గిపోతుంది. మీరేం గాభరా పడకండి అనవసరంగా'' అన్నాడు అతను హీనస్వరంతో.

''భలేవారేలెండి'' అని బయటికి వచ్చింది శిరీష.

ఈ పరిస్థితిలో అతను లేచి డాక్టర్‌దాకా రావటం కూడా కష్టమే. డాక్టర్ పరమేశం క్లినిక్ కొద్దిదూరంలో ఉంది. ఆయన బహుశా ఈ టైమ్‌కి క్లినిక్ మూసి వెళ్తుంటాడు. వెంటనే వెళ్తే ఉండొచ్చు.

గబగబా బయటికి వచ్చి క్లినిక్‌వైపు నడిచింది.

దార్లో మెడికల్‌హాల్‌లో గ్లూకోజ్ కొంది.

డాక్టరు పరమేశం క్లినిక్‌లోనే ఉన్నాడు. ఆయన బయల్దేరబోతున్నాడు.

శిరీష చెప్పింది విని బయల్దేరి వచ్చాడు.

యిద్దరూ యింటికి వచ్చేసరికి శరత్ దాదాపు అపస్మారకస్థితిలో ఉన్నాడు.

''బాగా జ్వరం ఉందమ్మా. నయమే రాత్రి యింకా ఎక్కువయితే కష్టపడేవాళ్ళు'' అన్నాడాయన.

యింజక్షన్, మందులు రాసి యిచ్చాడు. ఆయన్ని కూర్చోబెట్టి అప్పటికప్పుడు మెడికల్ హాల్‌కి వెళ్ళి అవి తెచ్చింది శిరీష. ఆయన ఇంజక్షన్ చేసి వెళ్ళాడు. ''ఈ మాత్రలు ఆరు గంటలకొకటి చొప్పున వెయ్యాలి. ఈ సిరప్ కూడా తాగించమ్మా. రేపటికి తగ్గిపోతుంది. నేను రేపొద్దున్న క్లినిక్‌కి వెళ్తూ మళ్ళీ వచ్చి చూస్తాను'' అన్నాడాయన.

ఆయన ఫీజు యిచ్చి, థాంక్స్ చెప్పి, సాగనంపి లోపలికి వచ్చింది.

పదకొండు గంటలకి రాఘవ వచ్చాడు. శరత్‌ని చూసి గాభరాపడ్డాడు. శిరీషతో - ''పాపం బోలెడు శ్రమపడ్డావు నువ్వు. రాత్రంతా నేను చూసుకుంటాలే'' అన్నాడు రాఘవ.

''మీరు మళ్ళీ రేపు పొద్దున్న ఆఫీసుకి వెళ్ళాలి. రాత్రి నిద్రలేకుండా ఎలా తంటాలు పడతారు. నేనెలాగూ యింట్లోనే ఉంటాను కాబట్టి రేపు పగలైనా పడుకుంటాను'' అంది శిరీష.

రాఘవ ప్రేమగా ఆమె చెయ్యి నొక్కి వదిలేశాడు.

దాదాపు అపస్మారకంగానే ఉన్నా శరత్‌కి ఆ మాటలు అస్పష్టంగా వినపడుతూనే ఉన్నాయి. శిరీష తనకోసం గాభరాగా డాక్టర్ దగ్గరికి పరుగెత్తటం, డాక్టర్‌ని తీసుకొచ్చి మళ్ళీ మందులకోసం వెళ్ళటం అన్నీ తెలుస్తూనే

ఉన్నాయి.

శిరీష రాత్రికి అతని మంచంపక్కనే పడక్కుర్చీ వేసుకుని టైమ్‌ప్రకారం మందులు యిచ్చింది. అతను దాహం అన్నప్పుడల్లా గ్లూకోజ్ వాటర్ యిచ్చింది. అతని నుదిటి మీద చల్లని నీటితో తడిపిన బట్ట వేసి తుడుస్తూనే ఉంది.

శరత్ హృదయం యింతదాకా ఒక మోడు గా ఉంది. ఒక్కొక్కరే తమ ద్వేషాన్నీ స్వార్థాన్నీ అతనిమీద ప్రసరించినప్పుడల్లా ఆ హృదయంలో చిగిర్చిన స్నేహలతలూ, ప్రేమ పుష్పాలూ ఎండి, కాలి మసయిపోయాయి. మిగిలింది కేవలం మోడుమాత్రమే.

తెల్లవారుతుండగా నిద్ర బాగా పట్టింది అతనికి. ఆ తర్వాత ఎనిమిది గంటలకి నిద్ర లేచాడు. ఒళ్ళంతా తేలిగ్గా అనిపించింది.

"ఎలా ఉంది మీకు" ఆదుర్దాగా అడిగింది శిరీష.

"బాగానే ఉంది. చాలా తేలిగ్గా ఉంది కూడా" అన్నాడు శరత్.

"అమ్మయ్య. చాలా భయం వేసింది మాకు" అన్నది శిరీష.

శరత్ మొహంలోకి కాంతి వచ్చింది ఆ మాటలతో. తనకోసం, తన ఆరోగ్యంకోసం తాపత్రయపడే మనుషులు తనకూ ఉన్నారని అదో మాదిరి ధైర్యం కలిగింది.

"సారీ. మిమ్మల్ని హడావిడి పెట్టానులా వుంది"

"అదేంలేదుగానీ కాఫీ తాగుతారా"

"ఊ..."

"నీళ్ళు తెస్తాను" శిరీష వంటగదిలోకి వెళ్ళింది.

ఒక గిన్నెలో వేడినీళ్ళు, టబ్, బ్రష్, పేస్టు వగైరా తెచ్చి అతని టేబుల్‌మీద పెట్టింది.

"మీరు రోజురోజుకీ నన్ను మీకు ఋణపడిపోయేట్లు చేస్తున్నారు"

"ఎప్పుడో వడ్డీతోసహా ఋణం తీర్చమంటాంలెండి"

"ఈ బికారి దగ్గర ఏముంది మీ ఋణం తీర్చటానికి" నవ్వాడు శరత్.



"మీ జ్వరం తగ్గగానే ఫీజు వసూలుచేస్తాను. కాదనకుండా యివ్వాలి"

"తప్పకుండా" మాట యిచ్చేశాడు శరత్.

అతని జ్వరం మర్నాటికి పూర్తిగా తగ్గిపోయింది.

"సమయానికి ఆ అమ్మాయి కనిపెట్టుకుని ఉండబట్టిగానీ లేకపోతే సీరియస్ అయివుండేది" అన్నాడు డాక్టర్ శరత్‌తో.

"అవునండీ... పాపం ఆవిడ చాలా శ్రమపడ్డారు" అన్నాడు శరత్.

సాయంకాలం శరత్ ముందుగదిలో కూర్చుని మాగజైన్ చదువుతున్నాడు.

శిరీష వంటగదిలో పనిలో ఉంది.

"నన్నేమన్నా సాయం చెయ్యమంటారా" లేచి వంటింటి గుమ్మంలో నిల్చుని అడిగాడు.

"అక్కర్లేదు" నవ్వింది శిరీష.

"మరి ఫీజు వసూలు చేస్తానన్నారు. మర్చిపోయారా"

"లేదు. ఆ ఫీజు తప్పకుండా వసూలు చేస్తాను. కూర్చోండి వచ్చేస్తున్నాను" అంది శిరీష.

కుక్కర్ స్టౌమీద పెట్టి ముందుగదిలోకి వచ్చి అతని ఎదురుగా కూర్చుంది.

"శరత్‌గారూ" అంది.

"చెప్పండి మేడమ్"

"మీకు ఆడవాళ్ళమీద చాలా చులకన భావం ఉందికదూ"

అతను యిబ్బందిగా కదిలాడు.

"మీకు శరీరానికి పట్టిన రుగ్మతలు వదిలించినట్లే మీ మనస్సుని పీడిస్తున్న భావాల్ని కూడా దూరం చెయ్యాల్సిన బాధ్యత మామీద ఉంది... కాదంటారా?"

"అవుననుకోండి..."

"అందుకే మీరు నన్ను అర్థంచేసుకోండి. నేను మీ స్నేహితురాల్ని. మీ మంచి నాకు ముఖ్యం. నాకే పక్షపాతాలూ లేవు. ప్లీజ్ కమ్ ఔట్ విత్ యాన్ ఓపెన్ హార్ట్. మీ మనసులోని బాధలూ, అభిప్రాయాలూ నాతో పంచుకోండి. మీకా భావాలు ఎందుకేర్పడ్డాయో చెప్పండి"

శరత్ మొహంవంకే ఏమంటాడోనని ఎదురుచూస్తోంది శిరీష.

"సరే మీ యిష్టం" అన్నాడు శరత్ అయిదు

నిమిషాలు గడిచాక.

'అమ్మయ్య...' ఊపిరి పీల్చుకుంది శిరీష.

''యిప్పుడు చెప్పండి. మీకు ఆ అభిప్రా యాలు ఎలా ఏర్పడ్డాయి?''

శరత్ హృదయంలోయిన్నాళ్ళుగా దాచుకు న్న వేదన, బాధ, అక్కసు, కోపం అన్నీ బయటికి వచ్చాయి.

విలాసినితో పరిచయం దగ్గరనుంచి, శాంత మ్మ మరణంవరకూ... అన్నీ వివరించాడు. ఆవేదనతో కూడిన కంఠస్వరంతో ఎంతో భావో ద్వేగంతో చెప్పాడతను.

అంతా అయ్యాక శిరీషవంక చూశాడు. ''యిప్పుడేమంటారు శిరీషగారూ. ఆడది ఒక రాక్షసి. సారీ... మీలాంటివారు కోటికొక్కళ్ళు ఉంటారేమో. కానీ నా అనుభవంలో ఆడది సదా మొగాడ్నెలా పీల్చి పిప్పిచేద్దామా అనే చూస్తుంటుంది! కష్టపడి సంపాదించలేక ఆ కష్టపడే వెధవని చేసుకుని హాయిగా కూర్చుందామనే చూస్తుంది. విలాసినీ, మా ఆవిడా దానికి ఉదాహరణలు. ఆడది తన స్త్రీత్వంతో మొగాడ్ని బుట్టలోకి వేసి మోసంచే ద్దామని చూస్తుంది. కమలిని దానికి తా ర్కాణం. నేను మంచిమనసుతో చేసిన సాయా న్ని కూడా తను ఆడది కాబట్టే చేశాననుకుంది. ఆడదాని మనసు అతి కఠినం. రాజేశ్వరిని చూడండి. మా అమ్మని చంపిందాకా ఆవిడ శాంతించలేదు''

శిరీష నవ్వింది. అతని మొహంచూస్తే ఆమెకి కోపం రావటంలేదు. వేడిపాలు తాగి మూతికాలిన పిల్లి మజ్జిగ కూడా ఊదుకుని తాగుతుంటే చూసినప్పట్లా నవ్వు వచ్చేస్తోంది.

''శరత్‌గారూ! మీ దురదృష్టంకొద్దీ మీకు అట్లాంటివాళ్ళు ఎదురయ్యారు. దానికి సమస్త స్త్రీజాతినీ తిట్టటం దేనికి. ఒకరు చేసిన తప్పు జాతి మొత్తానికీ ఆపాదించటం విజ్ఞుల లక్ష ణమా'' అంది.

శరత్ తడబడ్డాడు.

''స్త్రీమీద యింత కోపం పెంచుకున్నారు గానీ మిమ్మల్ని కని, పెంచి, పెద్దచేసి, మీ దంపతులమధ్య తనమూలంగా గొడవలు రాకూడదని ఆఖరికి తన ప్రాణాన్నే త్యాగంచే సిన మీ తల్లి... ఒక మహిళ కాదా''

తల్లి జ్ఞాపకం వచ్చి శరత్ కుప్పకూలిపో యాడు.

అవును... యిన్నాళ్ళూ తనకు ఈ ఆలోచనే రాలేదేం...

విషం తాగి మరణించిన శాంతమ్మ అతని కళ్ళముందు కదుల్తోంది. పోయేముందురోజు కూడా తన చేతుల్తో రెండు ముద్దలు కొడుక్కి తినిపించాలని తాపత్రయపడ్డ కన్నతల్లి కని పిస్తోంది.

''అమ్మా... అమ్మా...'' చేతుల్లో మొహం దాచుకుని ఏడ్చాడు.

ఒక్కోసమయంలో ఏడుపుని మించి మరేదీ ఊరటనివ్వదుమరి. శిరీష అతన్ని ఏడవనిచ్చి పదినిమిషాలు గడిచాక అంది - ''శరత్! స్త్రీ ప్రథమంగా మాతృమూర్తి. ఆ మాతృత్వం ఆమెకి యిచ్చిన వరం క్షమ. ఎట్లాంటివాళ్ల నైనా ఆ మాతృత్వపు భావంతోనే క్షమించగలు గుతుంది. దేనికైనా మినహాయింపులు తప్పవు. అట్లాగే ఆడవాళ్ళల్లో కూడా కొందరు దుష్టులూ, దుర్మార్గులూ ఉన్నారు. కాదనను...'' ఆమె గొంతు మృదువుగా వినిపిస్తోంది.

శరత్ వింటున్నట్లు తల ఊపాడు.

''కాపరం అన్నాక మగవాడికీ, ఆడదానికీ యిద్దరికీ ఒకటే. సంసారంలో బాధలుంటే ఎవరైనాపడే బాధ ఒకటే. కానీ మగవాడు పైకి చెప్పుకోడు. ఆడది చెప్పుకుంటుంది. అంతేకా దు, మీకింకో ముఖ్యమైన విషయం తెలి యాలి''

శరత్ ఏమిటన్నట్లు చూశాడు.

''యిందాక అన్నారు చూడండి గోవింద య్య, వీరాంజనేయులు, మీ ఆఫీసర్, గు ర్నాథం అందరూ ఆడవాళ్ళ చేతిలో కష్టాలు పడ్డవాళ్ళేనని. నిజమే... కానీ అందులో మీ ముకుందం ఒక్కడికి తప్ప మిగిలినవాళ్ళకి జరిగిన నష్టం పెద్దగా లేదు. ముకుందంమా త్రం జీవితంలో దగాపడ్డాడు. నిజంగా విచార కరం. పోతే గుర్నాథం సంగతి అతను పెళ్ళాం బెదిరించిందని తనూ ఆమెని బెదిరించి చావటం నాకు నచ్చలేదు. అతను చిరాకుమ నిషి అయ్యుంటాడు. ఒళ్ళు తెలియని కో పంలో అట్లా చేసి ఉంటాడు. ఆరోజు ఆ దురదృష్టకర సంఘటన గనక జరగకపోయి ఉంటే గుర్నాథం యిప్పటికీ తన భార్యతో హాయిగా పోట్లాడుకుంటూ గడిపేస్తూ ఉండేవా

దేగదా!"

శిరీష అతనివైపు చూసింది. అతను శ్రద్ధగా వింటున్నాడు. "గోవిందయ్య భార్య పెట్టే కష్టాలు భరించలేక పారిపోయాడన్నారు. వీరాంజనేయులు భార్యపోరు తప్పించుకోవటానికి నాటకాల్లో వేషంవేసి ఊరట పొందుతున్నాడన్నారు. ఆఫీసర్‌గారు భార్యా బాధితుడవడంవల్ల ఆఫీసే పట్టుకుని వేళ్ళాడుతాడన్నారు. మీమటుకు మీరు అన్ని బంధాలూ తెంపుకుని హాయిగా వెళ్ళిపోయారు. అవునా..."

"అవును"

"అక్కడే స్త్రీకీ, పురుషుడికీ తేడా ఉంది శరత్. మగాడు భార్యనుంచి తప్పించుకోవటానికి యిన్ని మార్గాలున్నాయి. కానీ ఆడదానికో. మగాడు పెట్టే బాధలు భరించటం. లేకుంటే చావటం. యింతే తప్ప యింకోవిధంగా ఆలోచించి ఆ సమస్యల్ని ఎదిరించి నిలవగల స్త్రీలు ఎంతమందున్నారు. కారణం ఏమిటో తెలుసా. మగాడు ఎక్కడికెళ్ళినా అడవులు పట్టినా, హిమాలయాలకి పోయినా అతనికేమీ కాదు. కానీ ఆడదానికి అంత అదృష్టంలేదు. ఒంటరిగా తిరిగే భాగ్యానికి స్త్రీ ఎప్పుడు నోచుకుంటుంది..."

"నిజమే..."

"భార్యమీద కోపంవచ్చిన పురుషుడు తాగుతాడు, తిరుగుతాడు, మరేమన్నా చేస్తాడు. కానీ భార్య అవేవీ చెయ్యదు. ఎందుకంటే పిల్లల మీద ప్రేమను, మగాడు తెంచుకున్నట్లు స్త్రీ తెంపుకోలేదు"

"అవును"

"బాధ ఆడవాళ్ళకైనా, మగవాళ్ళకైనా ఒక్కటే. కానీ ఆ బాధ తీవ్రత మగవాడికి తక్కువ. ఎందుకంటే సామాజికంగా అతనికి లభించే రక్షణ, గౌరవం, ఆర్థిక స్వేచ్ఛ, శారీరక బలం. యివన్నీ అతనికి మానసికంగా సపోర్ట్‌ని యిస్తాయి. కాబట్టి కుంగిపోడు. భర్త నిరాదరణకి గురైన స్త్రీ లోనయినంత తీవ్ర మానసిక సంక్షోభానికి భార్య ప్రేమ లభించని పురుషుడు అదేస్థాయిలో గురికాడు. అతనికి ఉన్న వ్యాపకాలు, లోకం వేరుకావటం అందుకు కారణం. బలహీనులలోకెల్లా బలహీనమైన జాతి స్త్రీదే. ఏకులం అయినా, ఏమతం అయినా, ఏ ప్రాంతం అయినా అది అంతే!

మీరు చూసిందే లోకం, మీకు తెలిసిందే సర్వంకాదు. లోకాన్ని మన అనుభవాలతో కాకుండా వాస్తవ దృక్పథంతో చూడాలి. మన అనుభవాలు మనకి పాఠాలు నేర్పాలి తప్ప ఆ అనుభవాలవల్ల మనం మూర్ఖులం, అజ్ఞానులం అయిపోకూడదు. నాతోరండి. మీకు లోకం చూపిస్తాను. ఆడవాళ్లు కూడా ఎన్నెన్ని బాధలు పడ్తున్నారో మీరే గమనించవచ్చు చూపిస్తాను. రేపే మనం 'జాగృతనారి'కి వెళ్దాం. వస్తారా" అడిగింది శిరీష.

"వస్తాను" అన్నాడు శరత్.

మర్నాడే ఇద్దరూ జాగృతనారి కార్యాలయానికి వెళ్ళారు. ఆఫీసుకి ఆనుకుని చిన్న హాస్టల్...

అందులో ఆశ్రయం పొందుతున్న ఆడవాళ్ళలో ఒక్కొక్కళ్ళదీ ఒక్కో విషాద గాథ.

ప్రేమించానని చెప్పి, ఇంట్లోంచి పారిపోయి వచ్చేట్లు చేసి అవసరం తీరాక అయిపులేకుండా పోతే తిరిగి ఇంటికి వెళ్లే అవకాశం లేక శరణార్థుల్లా వచ్చి చేరినవాళ్ళూ...

కట్నం చాల్లేదని తన్ని కిరసనాయిల్‌పోసి నిప్పంటిద్దామని చూస్తే భయంతో వణికిపోతూ పారిపోయి వచ్చినవాళ్ళూ...

వచ్చిన జీతమంతా తాగేసి వద్దంటే చితక బాది, అప్పులవాళ్ళు చుట్టుముడితే పలాయనం చిత్తగించిన భర్త ఏమయ్యాడో తెలీక ఇక్కడచేరి బతుకు తెరువు నేర్చుకుంటున్న అమ్మాయిలూ...

భర్త చచ్చిపోగానే ఆమెనెక్కడ పోషించాలో అని భయపడిన అత్తింటివాళ్లు ఏదో ఒక వంకతో తరిమెయ్యగా, పుట్టింటివాళ్ళు పెళ్ళి చేశాం మా బాధ్యత తీరిపోయింది ఇక చావో బతుకో మీ అత్తగారింట్లోనే అని ఖండితంగా చెప్తే... ఏ దిక్కూలేక ఇక్కడికి వచ్చినవాళ్లూ... ఇలా ఎందరెందరో...!

ఒకమ్మాయి పేరు రాధ. భర్తకి ఆమె అంటే అనుమానం. ఆమె చాలా అందంగా ఉండటం మూలంగా ప్రతివాళ్ళూ ఆమెవైపు చూసేవాళ్ళు. ఇతనేమో అది ఆమె తప్పే అయినట్లు ఆమెని తిట్టేవాడు, కొట్టేవాడు. అయినా అతనికి తృప్తి కలగలేదు. అందంగా

సచిత్ర విచిత్రం

## మైమరపించే గార్ధభ మోహం!



హాలెండ్‌లో గాడిదలను పెంచడం చట్టవిరుద్ధం. అయినా మార్లీ సెబెస్టిక్ అనే
ఈ ముద్దుగుమ్మకి గాడదలంటేనే మహాముద్దు. అందుకే పోలీసులు పట్టుకున్న
ప్పుడు చూసుకోవచ్చు అనుకుని ఓ రెండు గాడిదలను పెంచుకుంటోంది. వాటి
పేర్లు పొలెక్, మ్యాప్. భోజన సమయంలో కూడా యజమానురాలిని వదిలివుండ
లేని ఈ గార్ధభాలను ఎప్పటికయినా పోలీసులు పట్టుకెళ్లడం ఖాయమని తెలిసి
అప్పుడప్పుడు బాధపడుతున్నా వాటితో వున్నప్పుడు మాత్రం ఈ లోకమే
తెలియదు మార్లీకి.

## పట్టుబడిన జలసర్పం



సముద్రంలో అట్టడుగున నివశించే ఈ రకం జలసర్పాలు పొరపాటున నీటి ఉపరితలానికి గానీ, ఒడ్డుకిగానీ వస్తే వాటికిహ మూడిందన్నమాటే. ఇవి ఎప్పుడు బయటకు వస్తాయా... అని ఎదురు చూస్తూ ఆకలితో యమ దూతల్లా పైన తిరుగుతూ వుంటాయి సముద్రపు పక్షులు. సున్నంలోకి ఎముక మిగలనట్టు వీటి ఎముకలన్నీ ఏరి తినేస్తాయి ఆ పక్షులు. ఆ సంగతి తెలిసీ చావో, సుఖమో తేల్చుకుందామని ఈ జల సర్పం ఓసారి సరదాగా ఒడ్డుకొచ్చింది. అంతే... సముద్రపు పక్షుల కళ్లు గప్పి దాన్ని ఒడిసిపట్టుకున్నాడు బాబ్‌గ్రీన్ అనే ఓ జూ అధికారి. ఆయనా, ఆయన అసిస్టెంటూ కలిసి ఓ పెన్నిధి దొరికినంత ఆనందంగా దాన్ని మోసుకెళ్లి జూలోని ఓ కొలనులో పడేశారు.

ఉన్న భార్య మొహం చూస్తేనే కసి పుట్టేది. ఒకరోజు రాత్రి పూట ఆమె నిద్రపోతుంటే మొహం మీద వాతలు పెట్టాడు. అయినా అత నికి ఇంకా అనుమానంగానే ఉండేది. చివరికి ఆమెను చంపేద్దామని ప్రయత్నిస్తే ఆమె పారిపోయివచ్చి జాగృతనారిని శరణుచొచ్చింది.

శిరీష అవన్నీ చెప్తూ ఒక్కొక్కళ్ళనే పరిచయం చేస్తుంటే శరత్ ఒణికిపోయాడు.

వాళ్ళందరితో పోల్చుకుంటే తను పడిన కష్టం ఏపాటి? అసలు తను పడింది కష్టమేనా? తను అసమర్థతవల్ల ఎదుటి మనిషి చేసిన దౌర్జన్యానికీ, వీళ్ళు అసహాయతవల్ల భర్తల దుర్మార్గానికీ గురి అవటానికి తేడా ఏమిటో అర్థమైంది.

ప్రస్తుత సమాజంలో ఆడది నిస్సహాయురాలు, మగాడు కాదు. నిస్సహాయురాలు, బలహీనురాలు అయిన స్త్రీకి తగినంత ప్రోత్సాహం ఇచ్చి ఆమెను ముందుకి నడిపించాల్సిన బాధ్యత ప్రతివాళ్ళమీదా ఉంది.

తరతరాలుగా ప్రకృతికీ, పురుషుడికీ బానిసై కన్నీళ్ళ చరిత్రతో వెనకబడిపోయిన స్త్రీ జాతికి ఈ జాగృతనారివారు చేతనైన సాయం చేస్తున్నారు.

శిరీషనీ, ఆవిడ సహచరురాళ్ళనీ చూస్తే అతనికి మూర్తీభవించిన మానవత్వం కనుపించింది.

శరత్ అరిచేతుల్లో మొహం దాచుకుని ఆలోచిస్తున్నాడు.

"శరత్"

"ఊc..."

"ఏమిటి ఆలోచిస్తున్నారు"

"నేను చాలా పొరపాట్లు చేశాను శిరీషా. నా మూలంగా కొందరి బతుకులలో తుఫాను చెలరేగిందేమోనని భయంగా ఉంది. విలాసిని, కమలిని ఎక్కడున్నారు. నీకేమైనా తెలుసా" అన్నాడు శరత్.

"తెలుసు... వాళ్ళ మనసుల్లోనూ, బతుకులోనూ మీరు తుపాను రేపిన మాట నిజమే. కానీ ఆ తుపాను సమసిపోయింది. వాళ్ళగురించి ఆలోచించకుండా నిశ్చింతగా ఉండండి" నవ్వుతూ చెప్పింది శిరీష.

"అంటే ఏం జరిగింది. ప్లీజ్ నాకర్థం కావటం లేదు"

శిరీష జరిగిందేమిటో చెప్పింది.

శరత్ చెప్పిన మాటలు, రాసిన ఉత్తరాలవల్ల విలాసిని, భర్త అనుమానానికి గురై విలాసినిని వదిలేసి విడాకులు పుచ్చుకుందామనే ప్రయత్నంలో ఉన్నాడు. కమలిని భర్త అంత పని చెయ్యకపోయినా ఆమెని కాల్చుకు తింటున్నాడు. అదే సమయంలో వాళ్ళు శిరీషని ఆశ్రయించగా ఆమె వాళ్ళని కలుసుకుంది.

నిష్కారణంగా భార్యల్ని అనుమానిస్తున్నారని ఖండితంగా చెప్పింది. దానికి రుజువుగా శరత్ రాఘవకి రాసిన ఉత్తరాన్ని చూపించింది. కేవలం కక్షసాధించటానికే తను అట్లా రాసినట్లు శరత్ అందులో స్పష్టంగా రాశాడు. అది చూసి వాళ్ళ మనసులు శాంతించాయి. శరత్ మానసికస్థితి సరిగ్గా లేని సమయంలో అట్లా రాసినట్లు శిరీష వాళ్ళకి నచ్చచెప్పింది. శరత్ తల్లి పోవటం, అతను దేశాలు పట్టిపోవటం అంతా తెలుసుకున్న వాళ్ళు పశ్చాత్తాపపడి భార్యలతో కలిసి హాయిగా కాపరం చేసుకుంటున్నారు. విలాసిని, కమలిని శరత్‌తో తమ ప్రవర్తన గురించి శిరీష దగ్గర బాధపడ్డారు కూడా.

"ఆయన చాలా మంచివాడు. ఒక గురువులాగా నాకు ఆఫీసు పనంతా నేర్పితే నేనే అవాకులూ, చవాకులూ పేలి ఆయన మనసు నొప్పించాను. అందుకు తగ్గ ఫలితం అనుభవించాను. ఆయన కనిపిస్తే క్షమాపణ అడుగుతాను" అందిట కమలిని.

"శరత్ హృదయం ప్రేమతో నిండి ఉంటే, దాన్ని పగలగొట్టి, విషంతో నిండేట్లు చేసిన పాపిష్టిదాన్ని నాకు తగ్గ శిక్ష లభించింది. శరత్ కనిపిస్తే చేసిన దానికి క్షమించమంటాను" అని కళ్ళనీళ్ళు పెట్టుకుందిట విలాసిని.

శిరీష చెప్తుంటే శరత్ మౌనంగా విన్నాడు. మనసు కాస్త తేలికపడింది.

అతనికి శిరీషని చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది. ఎంత సహనం లేకపోతే ఇంత ఓపికగా ఇన్ని పనులు చేస్తుంది. తమ పనులు తాము చేసుకోవటానికే బద్ధకించే మనుషులు

న్న ఈ రోజుల్లో శిరీషలాంటి వాళ్ళని చూస్తే ఆశ్చర్యంకాక మరేమిటి.

ఆ కళ్ళల్లో లోకం మీద ఎంత ప్రేమ! ఎంత కరుణ!.

శిరీష కాఫీ కప్పు తీసుకుని శరత్ గదిలోకి వెళ్ళేసరికి అతను పై కప్పుకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఏంటి ఆలోచన" నవ్వింది శిరీష.

"ఏముంది... ఎన్నాళ్ళు ఇలా మీరు మేపటం... నేను తినటం అని"

"నేనో మాట చెప్తాను వింటారా"

"చెప్పండి"

"కోపగించుకోకూడదు"

"మీరేమన్నా కోపం తెచ్చుకోను"

"నేనూ మీ గురించే ఆలోచిస్తున్నాను. ఎన్నాళ్లిలా మీరు ఒంటరిగా ఉంటారు చెప్పండి. మళ్ళీ మీరు మీ వాళ్ళతో కలిసి బతకవచ్చుగా"

శరత్ నిస్పృహగా నవ్వాడు.

"వాళ్ళతో కలిసి ఉండొచ్చు. కానీ శిరీషా... మీకు తెలియనిదేముంది. రాజేశ్వరితో నేను కలిసి బతకటం అసంభవం. ఆ స్వార్థపరురాలి నీడ కూడా నేను సహించను. ఆవిడలో నిలువెల్లా స్వార్థం తప్ప మరోటి లేదు"

"అప్పుడు అజ్ఞానంతో ఏదో చేసింది. మీరు తల్చుకుంటే క్షమించగలరు"

"కావచ్చు... కానీ ఆవిడ అంటే నాకు అసహ్యం... ఎంత ప్రయత్నించినా ఆవిడ్ని క్షమించలేను"

"మీరు ఆవిడ భర్త కాబట్టి ఏదో స్వతంత్రంగా ప్రవర్తించింది. అందులో అవధులు దాటిపోయేసరికి కొన్ని అనుకోని సంఘటనలు జరిగి ఉంటాయి. చాలామంది ఇంతే. ఆ మన మొగుడేగా అనో, ఆ నా భార్యేగా మర్యాద యిచ్చేది ఏంటిలే అనో కాస్త చనువుగా, కాజువల్‌గా ఉండిపోతారు. అవతలి మనిషికి అది కొరుకుడు పడక వాళ్లంటే అసహ్యం వేస్తుంది. రాజేశ్వరి చేసిన దానికి మీరు తగిన శిక్ష వెయ్యనే వేశారు. మీరు వెళ్ళిపోయింతర్వాత ఆవిడ నానా కష్టాలూ పడింది. ప్రస్తుతం ఒక ప్రైవేటు కంపెనీలో పనిచేస్తోంది. మీరిద్దరూ యిప్పటికైనా కలిసి ఉంటే బాగుంటుంది"

"మీరు స్త్రీజన పక్షపాతికదూ. ఇట్లాగే మాట్లాడ్తారులెండి"

"అదికాదు శరత్, ఆలోచించండి. నేనన్నదాంట్లో ఏం తప్పు ఉంది. ప్రతివాళ్లూ పొద్దస్తమానం వాళ్ళ భార్యల్నో భర్తల్నో ప్రేమిస్తూనే ఉండరు. ఎంతటి వాళ్ళకైనా ఒక్కోసారి సంసారంలో కలహాలు తప్పవు. మీ విషయంలో కాస్త అతిగా జరిగిందికానీ పోట్లాటలూ భేదాభిప్రాయాలూ లేని దంపతులు ఉండనే ఉండరు. అందరిలాగే నేనూ అనుకుని సరిపెట్టుకోండి"

శరత్ శిరీషవంక చూశాడు.

"శిరీషా, మీరు చెప్పినట్లు చెయ్యటానికి నేను సిద్ధంగా ఉన్నాను. కానీ ఒక్క షరతు"

"నిజంగానా" శిరీష ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది.

"నిజమే...కానీ నా షరతేంటో వినండి. మీరెళ్లి రాజేశ్వరితో మాట్లాడండి, నేనిక్కడ ఉన్నానని చెప్పండి, కానీ మీరొక అబద్ధం ఆడాలి. నాకు మతి చలించిందనీ, మనలోకంలో ఉండనని ఆవిడకి చెప్పండి. వచ్చి ఆవిడ భర్తని, ఆవిడ్ని వెంటపెట్టుకుపొమ్మనండి... ఆవిడ గనక వస్తే... జీవితాంతం ఆవిడ్ని దేవతలా కొలుచుకుంటాను"

"ఇదేం షరతు..." శిరీష మొహం చిన్నబోయింది.

"అంతే... ఇంక మీ యిష్టం, కానీ నేను చెప్పమన్న మాటలు చెప్పాలి సుమా. మీమీద నమ్మకంతో ఈ పని మీ కప్పగిస్తున్నాను" నవ్వాడు శరత్.

"బాగుంది...సరే మీరడిగినట్లే చేస్తాను" అన్నది శిరీష. ఆరోజు సాయంత్రమే రాజేశ్వరిని కలుసుకుంది.

రాజేశ్వరిని ఒప్పించటం చాలా తేలిక అనుకున్న శిరీష అంచనా తల్లకిందయింది.

ముందుగా తను శరత్ స్నేహితుడు రాఘవ భార్యగా పరిచయం చేసుకుంది శిరీష.

రాజేశ్వరి ఆమె గురించి ఏ వివరాలూ అడగలేదు. శిరీష అసలు ఎందుకొచ్చిందో కూడా అడగలేదు.

''ఆయన చెప్పేఉంటారనుకుంటాను మా వారి గురించి'' అంది శిరీష.

''అయ్యో అంత భాగ్యం కూడానా. ఎప్పుడూ ఏదో లోకంలో ఉన్నట్లు ఉండేవాళ్లు. నాతో ఒక మాటా మంచీ కూడానా'' అంది రాజేశ్వరి పుల్లవిరుపుగా. శరత్ కనబడ్డాడని విన్నా ఆమెలో చలనం లేకపోవటం శిరీషకి చాలా ఆశ్చర్యం కలిగించింది. తను ఊహించినదా న్ని బట్టి శరత్ తమ ఇంట్లో ఉన్నాడనగానే రాజేశ్వరి ఆనందంతో తబ్బిబ్బయి వెంటనే తన వెంట వచ్చేస్తానంటుందనీ, అప్పుడు మెల్లగా శరత్ చెప్పమన్నట్లుగా అతనికి మతి స్థిమితంలేదని చెపుదామనీ, అపుడు రాజేశ్వరి మరింత ఆందోళనపడి తక్షణం తనతో వచ్చే స్తుందనీ అనుకుంది శిరీష. అలాగే ''ఆయన్ని నేను తిరిగి మామూలు మనిషిని చేసుకుంటా ను'' అంటుందని కూడా ఆశించింది.

అప్పుడు రాజేశ్వరిని తీసుకెళ్తే మామూ లుగా ఉన్న శరత్‌ని చూసి ఆనందపడిపో తుందనుకుంది. ఇదంతా నిన్ను పరీక్షించటా నికే అంటే చిరుకోపం ప్రకటిస్తుందనీ ఆ తర్వాత వాళ్లిద్దరూ హాయిగా బతుకుతారనీ అనుకుంది. ప్రయత్నిస్తే శరత్‌కి మళ్లీ ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. ఆ తర్వాత అంతా సుఖాంతం అనుకుంది. శిరీష ఊహించిన ఇవేవీ జరగనేలేదు.

''శరత్ మా ఇంట్లోనే ఉన్నాడు. చూడ్డానికి వస్తారా'' అంది శిరీష.

''వస్తాలెండి వీలు చూసుకుని'' అంది రాజే శ్వరి.

శిరీష తటాపటాయించింది. చెప్పాలా వద్దా అని.

''ఏమిటి సందేహిస్తున్నారు'' అంది రాజే శ్వరి.

''ఏంలేదు. మీకో మాట చెప్పాలి. శరత్ మతిస్థిమితం లేని పరిస్థితిలో మా వారికి కనపడితే తీసుకొచ్చారు. ఇంకా అతను కోలుకో లేదు... అంటే తగ్గిపోతుందనుకుంటాను'' నసిగిందిశిరీష.

రాజేశ్వరి లేచి నిలబడింది.

''చూడండి శిరీషగారూ, నేను ఉద్యోగం చేస్తే తప్ప గడవదు. ఇంక ఆ పిచ్చాయన్ని కూడా తెచ్చుకుని ఎక్కడ పెట్టుకోమంటారు. నేను ఆయన్ని చూసి కూడా పట్టించుకోలే దంటే లోకం నవ్వుతుంది. ఉద్యోగం చేసే ఆడవాళ్ల సంగతి, వాళ్ళ సమస్యలు మీకు తెలియనిదేముంది. మన పనులే మనం చేసు కోలేకుంటే ఇంట్లో ఆయన్ని చూడటం ఎక్కడ కుదురుతుంది చెప్పండి...'' అంది.

''అందుకని...'' శిరీష పెదవులు కంపించాయి.

''అందుకని మీరే ఆయన్ని పిచ్చాసుప త్రిలో చేర్పించెయ్యండి. ఆయనకు తగ్గాక నేను వెళ్లి చూసొస్తాను'' అంది రాజేశ్వరి.

శిరీష మొహం పాలిపోయింది.

నిజంగానే శరత్‌కి పిచ్చిపట్టినట్లు, పిచ్చాసు పత్రిలో చేరినట్లు,శరత్ పిచ్చిగా ఆడవాళ్ళని తిడ్తున్నట్లు ఊహించుకుని వణికిపోయింది.

''మీరు ఆయన భార్య... మీకేం బాధ్యత లేదా'' అంది గొంతు పెగుల్చుకుని.

రాజేశ్వరి కోపంగా చూసింది.

''హు... భార్య... చెప్పాపెట్టకుండా అన్నివి ధాలా నన్ను అన్యాయం చేసి పారిపోయాడే... అప్పుడు అతనికి నేను భార్యనన్న సంగతి గుర్తుకు రాలేదా... యిన్నాళ్లూ నేను ఏమయ్యా నని కూడా ఆయన ఆలోచించలేదే... అప్పుడే మయ్యారు మీరంతా... యివాళ ఆయనికి పిచ్చిపట్టిందని చెప్పటానికి వచ్చారుగానీ ఆయనికి పిచ్చుందని నాకెప్పుడో తెలుసు. ఆయనకి పెళ్లికిముందునుంచి పిచ్చివుంది. నేనెంత గుట్టుగానో కాపురం చేసుకోబట్టి ఆయన పిచ్చి ఎవరికీ తెలియలేదు'' అంది రౌద్రంగా.

శిరీషకి ఒళ్లు తెలియని కోపం వచ్చింది.

''మీలాంటి దుర్మార్గురాలు దొరకటం ఆయన దురదృష్టం. ఇంత జరిగినా మీకు పశ్చాత్తాపం కలగకపోవటం ఎంతో విచారం కలిగిస్తోంది'' అనేసి వెనక్కు తిరిగి వెళ్లిపో యింది.

రాజేశ్వరి శిరీషవంక ఒకసారి చూసింది. శిరీష చరచరా అడుగులు వేస్తూ వెళ్లిపోతోంది. రాజేశ్వరి ఒక్కనిమిషం ఏదో ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చి తలుపు తాళం వేసి తనూ బయటికి నడిచింది.

శిరీషకి ఇంటికి వెళ్ళబుద్ధికాలేదు. అసలే

ఎదురు దెబ్బలు తిని గాయపడి ఉన్న శరత్‌కి మరోగాయం తను చెయ్యాలి. ఇప్పుడు వెళ్ళి అతనికేం సమాధానం చెప్పాలి. ఉన్నది ఊరు కోకుండా అతనికి ఎందుకు హితబోధ చెయ్య బోయింది తను. ఆ ఆలోచనే లేని మనిషిని అనవసరంగా మళ్లీ సంసారంలోకి ఈడ్చబోయి తనే ఓడిపోయింది.

నలువైపులా చీకట్లు కమ్ముతూ రాత్రి వచ్చే సింది. శిరీష బస్‌స్టాప్‌లో అట్లాగే కూర్చుండిపో యింది.

రాత్రి ఎనిమిది అవుతుండగా ఎట్లాగో తేరు కుని బస్ ఎక్కింది.

ఇంటికి వెళ్లేసరికి తొమ్మిదిన్నర అయింది.

శరత్ ముందు గదిలోనే కూర్చుని ఉన్నాడు.

"వచ్చారా, మీరింత రాత్రి అయినా రాకపో యేసరికి ఎంత గాభరా పడ్డానో తెలుసా" అన్నాడు.

శిరీష బలవంతాన నవ్వి బాత్‌రూమ్‌లోకి నడిచింది. బట్టలు మార్చుకుని మొహం కడు క్కుని రిఫ్రెష్ అయి వచ్చేసరికి కొంత తేలిగ్గా అనిపించింది.

"భోంచేసారా" అంది.

"ఆహా... మీ ట్రైయినింగ్‌కదా మరి, ఎవరి మీద కోపం వచ్చినా అన్నంమీద మాత్రం రాకూడదని..." అన్నాడు శరత్.

"నేను..." శిరీష మాట పూర్తికాలేదు.

"ఇప్పుడేం మాట్లాడకండి. ముందు భోజనం కానివ్వండి"

శిరీష భోజనం చేసి వచ్చింది.

శరత్ తన గదిలోకి వెళ్లిపోయాడు.

"నేను ఆవిడ్ని కలిశానండీ..." అంది శిరీష. నాన్చేకన్నా చెప్పేస్తేనే మంచిదని.

"ఆ తర్వాత ఏం జరిగిందో నేను చెప్తా నండీ. ఆ పిచ్చోడితో నాకేంటి పొమ్మని ఉంటుంది ఆవిడ అంతేగా" అన్నాడు శరత్ తేలిగ్గా.

"మీకెలా తెల్సు"

"ఎందుకు తెలియదండీ. అయిదింటికి బయల్దేరిన మీరు రాత్రి పదిదాకా రాకపో వటం... మీవెంటే రావల్సిన మనిషి అయిపులే కపోవటం... మీరు బాధగా లోపలికి రావటం... నాకీ సంగతి ఎలా చెప్పాలా అని తటపటా యించటం... అన్నం ఏవో నాలుగు మెతుకు లు కొరికి అయిందనిపించటం... ఇవన్నీ అక్క డేం జరిగిందో చెప్పకే చెప్పేశాయండీ"

గదిలో లైటు లేదు, కాబట్టి వెలుతురులేదు.

శరత్ బాధ పడ్తున్నాడో లేదో తెలియటం లేదు.

బాధ పడకుండా ఎలా ఉంటాడు. మనిష న్నాక ఎంత ధీమంతుడికైనా ఒక ఆలంబన కావాలి. ఆ ఆలంబన భార్యే అయిఉంటుంది. కానిపక్షంలో... ఆ మనిషిపడే ఆవేదన ఎవరిక ర్థం అవుతుంది.

"శరత్... అయామ్ సారీ" అన్నది శిరీష.

"ఎందుకండీ మీరు బాధపడ్తారు. ఆవిడ తత్వం మీరు స్వయంగా ఎన్నడూ చూసిన భాగ్యం పొందలేదు కాబట్టి ఆవిడ మారిందేమో అనుకుని వెళ్ళారు. కానీ నాకు బాగా తెలును. ఆవిడ మారదు. పుచ్చుకోవడ మేగానీ ఇవ్వడం అనేది ఆవిడ జాతకంలోలే దు. నాకేం ఆశ్చర్యంగాలేదు. నిజానికి ఇట్లా జరగకపోతేనే ఆశ్చర్యంతో, ఆనందంతో గుండాగి చచ్చేవాడిని" అన్నాడు శరత్.

అతని కంఠం కంపిస్తోంది.

శిరీష ముందుకి అడుగులు వేసింది అప్ర యత్నంగా.

"శరత్..." అంది ఆప్యాయంగా.

కిటికీలోంచి పల్చటి వెల్తురు పడుతోంది.

శిరీష అతనికి దగ్గరగా నిలబడింది.

అతని దుఃఖం ఆమెకి తెలుస్తూనే ఉంది... కావలసిన మనిషి చస్తే ఆ దుఃఖం అందరికీ అర్థం అవుతుంది. కానీ కావల్సిన వ్యక్తి మాన సికంగా దూరం అయితే కలిగే దుఃఖం ఎవరి కర్థం అవుతుంది... హృదయం ఉన్న మను ష్యలకి తప్ప.

అస్పష్టమైన ఆ వెల్తురులోనే అతని చెంప లమీద కన్పిస్తున్న కన్నీటిచారికలు, కంపిస్తు న్న అతని భుజాలు చూడగలిగింది శిరీష.

శరత్ ఏడుస్తున్నాడు. ఒంటరితనం మన సుని చుట్టుముట్టి మనిషిని బలహీనుడ్ని చేసే సినప్పుడు కలిగే దుఃఖం అతనిలో చూడగలి గిన శిరీష కదిలిపోయింది.

"ప్లీజ్ శరత్.. బాధపడకు" అంది.

"బాధపడకూడదనుకున్నా నావల్ల కావటంలేదు శిరీషా. నేనేం పాపం చేశాను. అందరీన్నీ ప్రేమిద్దామనుకున్నానే. కానీ వాళ్ళు నా హృదయం ముక్కలు చేశారు. నన్నో వెధవని చేసి వాడుకుని ఆ తర్వాత తప్పుకున్నారు. చెప్పు శిరీషా... చెప్పు..."

శిరీష మాట్లాడలేదు. అతని హృదయంలోని ఆవేదన అంతా మాటల రూపంలో బయటికి వచ్చేస్తే తప్ప అతను మామూలు మనిషి కాలేడు.

"నేను పిచ్చివాడినైపోయానని తెలిసినా నన్ను చూసేందుకు కూడా రాలేదు నా భార్య..." శరత్ ఏడుస్తున్నాడు వెక్కివెక్కి.

శిరీష అప్రయత్నంగా ఇంకో అడుగు ముందుకేసింది.

"చెప్పు శిరీషా... చెప్పు. నిజంగా నేను పిచ్చివాడినైపోయినా నాకు దిక్కులేదు. నేనెవరికీ అఖ్ఖర్లేదు. అఖ్ఖర్లేదు. అసలు నేనెందుకు బతకాలో నాకర్థం కావటంలేదు" అతను కదిలి కదిలి ఏడుస్తున్నాడు.

శిరీష చప్పున అతన్ని తన చేతుల్లోకి తీసుకుంది. అతను ఆమె గుండెల్లో తల దాచుకున్నాడు. తల్లి ఒడిలో దాగిన పసిపాపలా అనిపించాడు అతను ఆమె కళ్ళకి. అతనిమీద సానుభూతి, ఆప్యాయత ఉప్పొంగాయి.

"శరత్..." అంది ప్రేమగా.

"చెప్పు శిరీషా..."

"మనం బతికేది ఒకళ్ళకోసం కాదు. దేవుడు ప్రసాదించిన ఈ జీవితాన్ని ఆయన తిరిగి తీసుకునేవరకూ బతికితీరాలి. తెలిసిందా..."

అతను తల ఊపాడు పసిపాపలా.

"శరత్. దేన్నైనా పొందనివాళ్ళు దాన్ని ఇంకోళ్ళకి తిరిగి ఇవ్వలేరు. కానీ ప్రేమ అలాక్కాదు. మనం జీవితంలో ప్రేమ ఏమాత్రం పొందలేకపోయినా ఇంకొకళ్ళకి మాత్రం ఇవ్వగలం... అర్థమైందా"

"ఊ..."

"ప్రేమ రాహిత్యంలో జీవిస్తున్నా నువ్వు మాత్రం ప్రేమను ఇంకొకరికి పంచి ఇవ్వగలవు. ఒకళ్లని ప్రేమించటంలో ఉన్న ఆనందం ద్వేషించటంలో లేదు. నువ్వు ఇంతవరకూ ప్రేమించింది అపాత్రులని. నీ ప్రేమని అపాత్రదానం చేసి దుఃఖం మిగుల్చుకున్నావు. నాతో రా. ప్రేమకోసం, సానుభూతికోసం తపించిపోయేవాళ్ళని నీకు చూపిస్తాను. వాళ్ళకి ప్రేమాభిమానాల్ని పంచి ఇస్తే నీకు అప్పుడు తెలుస్తుంది ప్రేమ విలువ..."

"అలాగే శిరీషా..."

"ఇంకెప్పుడూ జీవితంలో నిరాశ అన్నది రాకూడదు నీకు. అంతేకాదు. నీకు ఎవరూలేరని ఎట్లా అనుకున్నావు. నీకు మేమున్నాము, శరత్. మేమున్నాము" అంది శిరీష ఆవేశంగా.

శరత్ చిన్నపిల్లాడిలా ఆమెవంకే చూస్తున్నాడు. ఆ చూపుల్లో ఇందాకటి బేలతనం లేకపోవటం గమనించిన శిరీష ఊపిరి పీల్చుకుంది హాయిగా.

"శరత్... మన కోసం ఎవరూ లేరనుకుంటే మిగిలేది నిరాశే. కానీ నీ కోసం ఒకమనిషి ఉండాలనుకోవటంకన్నా నువ్వే నలుగురికి ఆ మనిషి కావచ్చు. మనకోసం, మన ఒంటరితనాన్ని దూరం చెయ్యటం కోసం కావల్సిన ఆ మనిషి నీ భార్యే కానక్కర్లేదు శరత్. సృష్టిలో ఒక్క ఆ సంబంధమే కాదు... అన్నా చెల్లెళ్లు... తల్లీబిడ్డలు... స్నేహితులు ఎన్నోరకాల సంబంధాలు ఉన్నాయి. మనిషి ప్రేమ రాహిత్యంలో బతకలేడన్న నిజం నాకూ తెలుసు. కానీ ఆ ప్రేమని పంచేమనిషి నీ భార్యా, కొడుకులేనని ఎందుకనుకుంటున్నావు. స్నేహితులుగా నీ కోసం, మేమున్నామని మర్చిపోకు" అంది శిరీష ఆదరంగా.

అతను శ్రద్ధగా మంత్రముగ్ధుడిలా వింటున్నాడు.

"ఇంకెప్పుడూ ఇట్లాంటి డిప్రెషన్‌కి లోను కాకూడదు నువ్వు సరేనా"

"సరే... ప్రామిస్" శరత్ ఆమె చేతిలో చెయ్యివేశాడు. అతను అట్లాగే ఉండిపోయాడు. ఒకరెండు నిమిషాలకాలం గడిచిపోయింది.

శిరీష అతన్ని మాట్లాడించలేదు.

మౌనంగా ఉంటేనే మంచిది. ఒక్కొక్క విషయమూ అన్వయించుకుని, బేరీజు వేసుకుని, మనసులోనే అర్థం చేసుకోగలగటం మౌనంలోనే సాధ్యమవుతుంది.

శరత్ కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాడు. స్త్రీ అంటే ఏమిటో అతనికి అర్ధమైంది.

స్త్రీ మాతృస్వరూపిణి.

తల్లిలాగా ఆదరించగల కెపాసిటీ ఒక్క స్త్రీకి మాత్రమే ఉంది.

నిరాశతో నీరసపడిపోయి, క్రుంగిపోయిన మనిషిని స్త్రీ తల్చుకుంటే పరుగులు పెట్టించ గలదు.

శిరీష మాటలతో అతనిలో ఏదో తెలియని ఉత్తేజం, ఉత్సాహం కలిగాయి. నిజానికి ఇందాక కలిగిన నిరాశలో అసలు చచ్చిపోదాం అని అనిపించింది కూడా. అతనికి రాజేశ్వరి మీద ప్రేమలేదు. ఆమెతో కలిసి మళ్ళీ కాపరం చెయ్యాలన్న కోరికాలేదు. కానీ ఆమె తిరస్కృతితో తన ఒంటరితనం కళ్ళకు కట్టినట్లు అర్థమై అతన్ని ఆత్మహత్య చేసుకుందామా అనుకునేంత భయపెట్టింది. శిరీషే గనక పక్కన లేకపోతే ఆ పనే చేసుండేవాడేమో కూడా.

శిరీష చెప్తున్న మాటలు వింటూ అదేరకమైన ఆనందానికి లోనయ్యాడు.

ఆమెలో తన తల్లిని, చెల్లినీ, భార్యలో తను కోరుకున్న ఆదరణనీ చూశాడు.

స్త్రీ యొక్క ఔన్నత్యం కళ్ళకు కట్టినట్లు సాక్షాత్కరించింది. ఆమె గుండెల్లో తలదాచుకుని ఉన్నాడతను. కానీ అతనిలో కోరికలేదు. అదేరకమైన శాంతి లభించి అతను ఆమెకు అలాగే చేరువగా ఉన్నాడు. ఆమె అతనికి శిరీషలా కనిపించలేదు. సాక్షాత్తూ తన తల్లి శాంతమ్మే మళ్ళీ బతికివచ్చి తనకు ధైర్యం నూరిపోస్తున్నట్లనిపించింది.

శిరీష పరిస్థితి కూడా అలాగే ఉంది.

ఆమెకింకా పిల్లలు లేరు. కానీ అసహాయస్థితిలో ఉన్నవాళ్ళనీ, కష్టాల్లో ఉన్నవాళ్ళనీ చూస్తే ఆమె గుండె ద్రవించిపోతుంది. వాళ్ళు ఆమెకి కన్నబిడ్డల్లాగా కనిపిస్తారు.

శరత్ ఆమెకి అట్లాగే కనిపిస్తున్నాడు.

పసిపాపలా కనిపిస్తున్నాడు. ఆటబొమ్మ పారేసుకుని అమ్మా అని ఏడుస్తున్న బాబులాగా ఉన్నాడు.

ఇద్దరూ అట్లా ఉన్నప్పుడే...

గదిలోలైట్ వెలిగింది.

రాఘవ గదిగుమ్మందగ్గర నిల్చుని ఉన్నాడు.

అతని కళ్లనిండా ద్వేషం... అసహ్యం.

శిరీష లేచి నిలబడింది.

శరత్ అతనంత కోపంగా ఉండటం చూసి అపరాధభావంతో కుంచించుకుపోయాడు.

"తలుపులన్నా వేసుకోరా... సిగ్గులేదూ" అరిచాడు రాఘవ.

శిరీష ఉలిక్కిపడి అతనివంక చూసింది. ఏమంటున్నాడో అర్థంకాలేదు.

"నేనిప్పుడప్పుడే రాననుకున్నారుకదూ. హు... నేనూ అలాగే అనుకున్నాను కానీ తప్పలేదు" అన్నాడు రాఘవ.

వెంటనే గిరుక్కున తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయాడు. శిరీష అతన్ని వెంబడించింది.

"ఏమండీ. మీరేం మాట్లాడుతున్నారో తెలుసా" అంది.

"బాగా తెలుసు. కానీ నువ్వేం చేస్తున్నావో నీకు తెల్సా. సిగ్గూ లజ్జా వదిలేసి వాడితో కులుకుతున్నావు" అరిచాడు రాఘవ.

శిరీష చెవులు మూసుకుంది వినలేక.

"ఎంత ఘోరంగా మాట్లాడుతున్నారు. నేనేం చేశాను. మీరు మీ ఫ్రెండ్ జీవితం చక్కదిద్దుదాం అన్నారు. నా చేతులు పట్టుకుని బతిమాలారు. మర్చిపోయారా. మీకిచ్చిన మాట ప్రకారమే నేను అతన్ని కనిపెట్టుకుని ఉంటూవచ్చాను. అతను భార్యతో కలిసివుంటే బాగుంటుందనుకుని ఆ ప్రయత్నం కూడా చేశాను. కుదరలేదు. అందువల్ల అతను చికాకులో ఉంటే ఓదార్చాను. తప్పా" ఆవేశంగా అడిగింది.

"అందుకని అతనికి భార్యలేని లోటు తీరుస్తున్నావన్నమాట" కర్కశంగా, వ్యంగ్యంగా అన్నాడు రాఘవ.

"ఛీ... మీరిట్లా మాట్లాడగలరని కలలో కూడా అనుకోలేదు" అన్నది శిరీష.

రాఘవ శిరీష చెంప ఛెళ్ళుమనిపించాడు.

"నీకు నేనెంతో స్వేచ్ఛనిచ్చాను. అది ఇట్లా దుర్వినియోగం చేస్తావనుకోలేదు. నేను పిచ్చోడిలా కనిపిస్తున్నానా. ఓదార్చటం అంటే చీక

ట్లో, లైట్లుతీసి, రాత్రి పదిగంటలకి అతని గదిలోదూరి కౌగిలించుకుని కబుర్లు చెప్పటం అన్నమాట. బాగుంది'' అన్నాడు.

శిరీష ఏడుస్తోంది.

తనేం అనుకుంది. ఏం జరిగింది.

రాఘవ ఎందుకిట్లా మారిపోయాడు.

శరత్ తన గదిలోంచి బయటికిరాలేదు.

రాఘవ బిగ్గరగా అరుస్తుండటంతో అన్నీ అతనికి వినబడుతున్నాయి.

శిరీష ఏడుపు అతని గుండెల్ని పిండేస్తున్నట్లు వినిపిస్తోంది. వెళ్ళి ఏం మాట్లాడాలన్నా భయమే అనిపించింది. ఇంత కోపంలో, ఆవేశంలో ఉన్న రాఘవ తనమాట మాత్రం ఎందుకు వింటాడు. ఇంకా అసహ్యంగా మాట్లాడతాడు.

ఏం చెయ్యాలి. అతనికేం తోచలేదు.

తననితానే శపించుకుని తిట్టుకున్నాడు.

ఇన్ని జరిగినా తనకి చావు రాదేం. తనమూలంగా, తన దురదృష్టం మూలంగా అనవసరంగా శిరీష అన్ని మాటలు పడ్తోంది. ఇప్పుడు రాఘవ ఏం చేస్తాడు...

రాఘవ శిరీష వంక హేళనగా చూశాడు.

''నువ్వూ ఏడుస్తావా. పెద్ద సంఘసంస్కర్తవీ, స్త్రీ జాతిని ఉద్ధరించేదానివీగదా...'' అన్నాడు.

''కావచ్చు. కానీ ఎవరికైనా కావల్సింది ఇంట్లో శాంతి. చెప్పులోని రాయిలా, చెవిలో జోరీగలా ఇంట్లోనే పోరుంటే ఎవరూ భరించలేరు. నేను మామూలు మనిషిని... దేవతని కాదు'' అన్నది శిరీష.

''నువ్వు మామూలు మనిషివని నాకర్థం అయిపోయిందిలే. చెప్పు ఇప్పుడేం జరగాలి. తెగతెంపులు చేసుకునిపోదాం'' అన్నాడు రాఘవ.

రాఘవ విసురుగా శరత్ గదిలోకి వచ్చాడు.

''శరత్. నువ్వన్నమాటలే నిజం. ఆడదంటే రాక్షసి. విషకుంభం. అనుభవంలోకి వచ్చాక గానీ నాకూ అర్థం కాలేదు'' అన్నాడు.

''రాఘవా... నన్ను మాట్లాడనిస్తావా... ప్లీజ్'' అన్నాడు శరత్.

''చెప్పు శరత్. నీమీద నాకు కోపం రావటంలేదు. ఎన్నాళ్ళో భార్యకు దూరమై బతుకుతున్న నువ్వు స్త్రీ సుఖంకోసం తాపత్రయపడి ఉంటావు. ఆ స్త్రీ నా భార్య కావటం నా దురదృష్టం. దాని పాడుబుద్ధికి నేను నిన్ను తప్పుపట్టను. మీ ఇద్దరికీ అడ్డులేకుండా రేపు నేనిక్కడ్నుంచి వెళ్ళిపోతాను'' అన్నాడు రాఘవ.

''రాఘవా... ఎంత మాట అన్నావు. నేను... నీ శరత్‌ని. నన్నంత నీచుడిగా జమకట్టావా. నన్నర్థం చేసుకోకపోతేపోయావు. నీ భార్యనైనా అర్థం చేసుకోవేం'' అన్నాడు శరత్.

''ఇంకేం అర్థం కావాలి. ఆడదంటే తేనెపూసిన కత్తి. స్వార్థపరురాలు... ఛీ... నీకు ఎప్పుడో అర్థమైన విషయం నాకిన్నాళ్ళయ్యాకగానీ అర్థం కాలేదు'' అన్నాడు రాఘవ.

శరత్ నిస్పృహగా నవ్వాడు.

''పొరపాటు రాఘవా. నేనూ ఇలాగే అనుకుని తప్పటడుగు వేశాను. నేను చేసినపొరపాటు నిన్ను చెయ్యనివ్వను. స్త్రీ అంటే ఏమిటో అర్థం కావాలంటే ఒక జన్మచాలదు రాఘవా. స్త్రీ మాతృమూర్తి. కరుణామూర్తి. మగాడికి కలిగే తుచ్ఛవాంఛలు స్త్రీకి కలగవు. ఎన్ని కష్టాలైనా భరించే సహనం ఆమెకుందనే కాబోలు ప్రకృతి కూడా శారీరకంగా ఆమెని అనేక శ్రమలకి గురిచేస్తోంది. మనం మగవాళ్ళమై పుట్టేందుకు ఒక మాతృమూర్తి ఎంత శ్రమనీ, బాధనీ ఓర్చుకుంటుందో ఆలోచించు. నాకు ఆడవాళ్లంటే ఉన్న తేలిక అభిప్రాయం పోయేందుకు శిరీషగారే కారణం. నా బాధలో ఆవిడ స్త్రీ అన్న విషయం మర్చిపోయి ఆవిడ చేతుల్లో తలదాచుకుని ఓదార్పుపొందాను. నన్ను క్షమించు. నాకే శిక్ష అయినా వెయ్యి... కానీ ఆవిణ్ని మాత్రం అపార్థం చేసుకోకు'' అన్నాడు శరత్.

''నీకేం నువ్వెన్నైనా చెప్తావు. నీ భార్య నిన్నెంత ఏడిపించినాశారీరకంగానీకు ద్రోహం చెయ్యలేదు. అందుకే ఆవిడ్ని క్షమించగలవు. కానీ నావల్లకాదు'' అన్నాడు రాఘవ.

''నువ్వు నమ్మటానికి నేనేం చెయ్యాలో చెప్పు. చేస్తాను''

''నువ్వేం చెయ్యఖ్ఖర్లేదు... నేనే చేస్తాను. ఇక్కడ్నుంచి వెళ్లిపోతాను''



"వద్దు రాఘవా... వద్దు... నేనే వెళ్లిపోతాను, వద్దంటున్నా నన్ను తీసుకువచ్చావు. దౌర్భాగ్యుడిని. ఇక్కడికి వచ్చి మీ ఇద్దరి మధ్యా అపార్థాలు తెచ్చాను. రాఘవా! భార్యాభర్తలంటే ఎలా ఉండాలో మిమ్మల్ని చూశాక నాకు అర్థమైంది. నువ్వెంతో వివేకవంతుడివని నమ్ముతున్నాను... నన్ను నమ్ము. నేను నీకే ద్రోహం తలపెట్టలేదు. రాఘవా. శలవు. నీ మేలు మర్చిపోలేను. నన్ను మళ్ళీ ఒకమనిషిని చేశావు. వెళ్తాను" అన్నాడు శరత్.

"ఎక్కడికి వెళ్తావు. కొంపదీసి ఆత్మహత్య గానీ చేసుకుంటావా?"

శరత్ నవ్వాడు.

"చావను. బతికితీరుతాను. ఇదివరకటి శర

త్‌ని కాను నేను. ఇప్పుడు ఎవరిమీదా కక్షలూ, కార్పణ్యాలూ లేవు. బతకలేని పిరికితనమూ లేదు. అందుకే బతుకుకి ఎదురు నిల్చిపోరాటం సాగిస్తాను. నన్నీస్థితికి తెచ్చింది మీరే. కాబట్టి మీరు సుఖంగా ఉంటే నాకంతే చాలు వెళ్తాను'' అన్నాడు.

శరత్ తన బాగ్ తీసుకుని ముందుకి నడిచాడు. అక్కడున్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు.

రాజేశ్వరి... చేతుల్లో మొహం దాచుకుని ఏడుస్తోంది. రాఘవ శరత్ ముందుకి వచ్చాడు.

''శరత్. నువ్వు ఇంత ధైర్యంగా ఉండగలవో లేదో చూడటానికి నేనిలా ప్రవర్తించాను. నన్ను నువ్వే క్షమించాలి'' అన్నాడు.

''ఏమిటి... రాఘవా?''

''నేను నిన్ననే రాజేశ్వరిగారితో మాట్లాడాను. ఆవిడ జరిగినదానికి చాలా బాధపడ్తున్నారు. మనం మానవమాత్రులం. పొరపాట్లు కొన్ని చేస్తే, మూర్ఖత్వంతో, అహంతో చేసే తప్పులు కొన్ని. తప్పు చెయ్యటం మానవసహజం. దాన్ని ఒప్పుకుని పశ్చాత్తాపపడేవాళ్ళని క్షమించటం మానవత్వం. నిన్ననే రాజేశ్వరిగారు క్షమాపణ కోరుకుంటానంటే నేనే వారించాను. ఎందుకంటే నీ భావాలు ఎలా ఉన్నాయో నాకు తెలీదు. నీలో కరడుగట్టుకుపోయిన భావాలు పూర్తిగా తొలగిపోతేగానీ నువ్వు మళ్ళీ ఆవిడతో సజావుగా సంసారం చెయ్యలేవు. ఆవిడ కూడా పశ్చాత్తాపంతో తన మనసుని ప్రక్షాళన చేసుకున్నారు. మీరు మళ్ళీ కొత్త జీవితం ప్రారంభించండి...'' అన్నాడు శరత్.

''రామ్మా...'' అని రాజేశ్వరిని లోపలికి పిల్చాడు.

''శిరీషా. నాటకం రక్తికట్టటానికి కాస్త ఓవర్ యాక్షన్ చెయ్యాల్సివచ్చింది. అయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ. నేను నిన్న రాజేశ్వరితో మాట్లాడిన విషయం తెలియక నువ్వు ఇవాళ వెళ్ళి మాట్లాడావు. మీరు ఆడుతున్న నాటకం ఆవిడకి అర్థమై తనూ చిన్న నాటకం ఆడింది. ఆ వెంటనే ఆవిడ నా దగ్గరకు వస్తే మేమిద్దరం కలిసి ఇట్లా వచ్చాం. నన్ను క్షమించవూ...'' అన్నాడు రాఘవ.

''అంటే మీరు నిజంగా నన్నునుమానించలేదా'' అంది శిరీష.

''నిన్ను అనుమానిస్తే నన్ను నేను అనుమానించుకున్నట్లే. నాకోసం నా స్నేహితుడికి ఇంత సేవచేసి, అతన్ని మళ్ళీ సంతోషంగా చూడాలని తాపత్రయపడిన మనిషిని నేను అనుమానిస్తానా... శిరీషా...'' రాఘవ ఆర్ద్రంగా చూస్తూ అన్నాడు.

''మా మూలంగా శిరీషగారికి బోలెడంత శ్రమకలిగింది. శిరీషగారూ ప్లీజ్... మమ్మల్ని మన్నించండి'' అంది రాజేశ్వరి.

''ఏం పర్వాలేదమ్మా మా ఆవిడకి మీరిద్దరూ కలుసుకున్నందుకు కలిగిన సంతోషంలో, ఎంత శ్రమ అయినా మర్చిపోతుంది'' నవ్వుతూ అన్నాడు రాఘవ.

''అవును. రాఘవా! శిరీషగారి పేరు కరుణ అని ఉంటే బాగుండేది. బాధల్లో ఉన్నవాళ్ళని చూస్తే కరుణ వర్షించి వాళ్ళ బాధలు పోగొట్టాలని ఎంతో ప్రయత్నిస్తారు'' నవ్వాడు శరత్.

''ఏమోగానీ, నాకైతే కొంచెం దిగులుగానే ఉంది'' అంది రాజేశ్వరి.

''దేనికీ'' అంది శిరీష.

''ఏంటో, బతుకంతా నిష్ప్రయోజనంగా, నిరర్థకంగా గడిచిపోయింది. తెలివి వచ్చేసరికే సగం బతుకు గడిచిపోయిందికదా'' అంది రాజేశ్వరి.

''రాజేశ్వరీ... అట్లా అనుకోకు. మనకు చేతనైనంతలో మనమూ ఏదో ఒక ప్రయోజనకరమైనపని చేద్దామనుకుంటే సరి, హాయిగా ఉంటుంది'' నవ్వాడు శరత్.

''అదెలా'' రాజేశ్వరి ఆశ్చర్యంగా అంది.

''అంతేమరి. కొందరి జీవితాలు ఎట్లా జీవించాలో నేర్పితే, మరికొందరి జీవితాలు ఎట్లా జీవించకూడదో చెప్తాయి. భార్యాభర్తలంటే తేనే పాలల్లా కలిసిపోవాలిగానీ, పాలూ నిమ్మరసంలా కలవలేక విరిగిపోకూడదని మన అనుభవాలు చూసి నేర్చుకుంటారు'' నవ్వుతూ అన్నాడు శరత్.

వాళ్ళిద్దరూ అలా నవ్వుతూ మాట్లాడుకుంటుంటే శిరీష రాఘవ ఒకరినొకరు చూసుకున్నారు, తృప్తిగా!

★

# మంచివాడు పై సమీక్షలు



డిసెంబర్ 'చతుర'లో ప్రచురించిన కె.ఎమ్. కోకిల నవల 'మంచివాడు'పై పాఠకులనుండి అందిన సమీక్షలలో ఉత్తమంగా భావించిన ఆరింటిని ఎన్నిక చేసి అందజేస్తున్నాం.

## మంచితనానికి కూడా ఓ హద్దు!

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

**'చ**తుర' నవల 'మంచివాడు' ఈ సమాజం మనిషి అతి మంచితనాన్ని కూడా వాజమ్మ కింద జమకట్టేస్తుందని చిత్రీకరించి మలచిన మంచి నవల. మంచితనం ఒక దుర్వ్యసన మెలా అవుతుందో ఊరించి వర్ణించిన లోకేశ్వ రరావుని, అలాంటబ్బాయికి అమ్మాయినిచ్చి పెళ్ళి చేయటానికి సాహసించలేని పాత్రలుగా మాధవరావు, జోగాంబలను రచయిత్రి సజీ వంగా చిత్రించారు.

దయాసాగర్, బ్రాందీపాపు, మెడికల్‌షాపు నిర్వాకం కూడా ఇంట్రస్టింగ్‌గా నవ్వు పుట్టించేలా ఉన్నాయి. ప్రపంచంలో పనికిరాని వస్తువేదీ లేదనీ, దేంట్లోనయినా అడుగుపెట్టి పట్టుదలతో కృషిచేస్తే లక్షలు సంపాదించవ చ్చు అని ఆలోచింపచేసేది చెత్తరాయుడి పాత్ర!

'ఇచ్చేవాడుంటే చచ్చేవాడు లేచివస్తాడు!' అన్న సామెతను రుజువుచేస్తూ ముసలాడి కోసం దయాసాగర్ కిడ్నీ అడగటానికి సాహ సించిన మాధవరావు పాత్రను కూడా బాగా మలిచారు.

ఇకపోతే గోల్డ్‌మెడలిస్ట్ అయినా దయాసా గర్ 'కిడ్నీ' అంటే ఏమిటో, దాని ప్రాముఖ్యం ఏమిటో తెలియని పసివాడిలా తనను గు రించి ఏమాత్రం ఆలోచించుకోకుండా అడ గ్గానే జేబులోంచి విజిటింగ్ కార్డు తీసిచ్చినంత సులభంగా కిడ్నీ ఇవ్వడానికి పూనుకోవడం అసమంజసంగా ఉంది.

అమ్మాయిలు సామాన్యంగా సాహసాన్ని హీ

రేయిజాన్ని మాత్రమే ఇష్టపడతారనే రొటీన్ వాక్యాలు నవలల్లో చదివి విసిగెత్తినవారికి అబ్బాయిల మంచితనం, అమాయకత్వం కూడా ప్రేమార్హత పొందవచ్చుననీ, ఆ అమాయకత్వం నలుగురి దృష్టిలో చేతకానివాడిలా నమోదు కాకూడదనే తాపత్రయంతో పెళ్ళి కాకుండానే కాబోయే భర్తను ప్రశాంత్‌ద్వారానూ, రజిత ద్వారాను గుణపాఠాలు చెప్పించి మనసు మార్చుకుని బ్రతికేలా చేసిన లలిత పాత్ర అద్భుతంగా, ఇంట్రెస్టింగ్‌గా ఉంది. తన్నుమాలిన ధర్మం పనికిరాదనే సత్యాన్ని చాటి, మంచితనానికి కూడా ఓ హద్దు ఉండాలి, ఉంటుందికూడా అని ఆలోచింపచేసే మంచి నవల 'మంచివాడు'.

-ఎ.జయలక్ష్మిరాజు
అనంతపురం

## ఆత్మహత్యా సదృశం...

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

**ఓ** అతి మంచి అమాయక చక్రవర్తి చుట్టూ అందంగా అల్లిన 'చతుర' నవల 'మంచివాడు'. కథలో కొత్తదనం లేకపోయినా, కథనం, దయాసాగర్ చుట్టూ తిరిగిన పాత్రలు, బోర్ కొట్టించకుండా, నవలను ఏకబిగిన చదివింప చేస్తాయి.

జీవితంలో కష్టపడి పైకి వచ్చిన చెత్తరాయుడు, తన కొడుకు అతి మంచివాడయినందుకు కోపగించుకోవడం, అతడిని దార్లోకి తేవడంకోసం ఇంటిలోనుంచి వెళ్ళిపోతున్నా కూడా లెక్కచేయకపోవడం గంభీరంగా వుంది. 'మా పుట్టింటివారిచ్చిన మామిడితోట అమ్మయినానసరే' అనే ఊతపదంతో, అఖిలాండేశ్వరి కొడుకును వెనకేసుకురావడం, ఒకింత హాస్యంగా ఉన్నా, సహజ మాతృవాత్సల్యంతో కూడుకుని వుంది. కాలేజీలో తనకు చేసిన సహాయానికి ప్రతిగా దయాసాగర్‌కు తన యింట్లో ఆశ్రయం ఇచ్చి, సమయానుకూలంగా సలహా, సహాయాలను అందించిన నిరంజన్, అతనికి తగిన ఇల్లాలిగా వరలక్ష్మి పాత్రలు ఉదాత్తంగా వున్నాయి. దయాసాగర్‌లోని మంచితనాన్ని చూసి ప్రేమించిన లలిత, గడుసుగా అతడిని మార్చి, తనవాడిగా చేసుకోవడం రమ్యంగా మలచబడింది. ముఖ్యంగా చివరిఘట్టంలో ప్రశాంత్, రంజితలతో లలిత ఆడించిన నాటకం, దయాసాగర్, నిరంజన్, వరలక్ష్మిలతో పాటు, పాఠకులను కూడా నమ్మించడం, ఈ నవలలోని బిగువయిన కొసమెరుపు! అలాగే, నాలుగేళ్ళ కృపాసాగర్, తండ్రి మాదిరిగానే అతి దయతో, స్కూల్లోని పేదపిల్లవాడికి తన చొక్కా ఇచ్చి రావడం, పాఠకులను నవ్వుల్లో ముంచెత్తుతుంది!

ఒక అభ్యర్థికి అనుకూలంగా ఇంటర్వ్యూ నుండి వెనక్కి రావడం, బ్రాందీషాపులోని అప్పు తీర్చని నారయ్యకు యాభయి రూపాయలు ఎదురివ్వడం, లలిత తాతగారికి మూత్రపిండం దానం చేస్తాననడంలాంటి దయాసాగర్ చర్యలు కొద్దిగా అతిశయోక్తిగా వున్నాయి.

ఏమయినా, అవధులు మించిన మంచితనం, ఆత్మహత్యాసదృశమనే సత్యాన్ని హాస్యస్ఫోరకంగా, హృద్యంగా చెప్పడంలో సఫలీకృతురాలయ్యారు రచయిత్రి ఈ 'మంచివాడు' నవలద్వారా.

-నెల్లుట్ల సుదర్శనరావు
మణుగూరు

## అపర శిబిచక్రవర్తి

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**ధ**ర్మం ఒకేకాలుతో నడిచే ఈరోజుల్లో విలువలు తగ్గి, స్వార్థం పెరిగిన సమాజంలో ఓ 'మంచివాడు' ఎదుటివాళ్ళ స్వార్థానికి, స్వప్రయోజనాలకి ఎన్నిరకాలుగా బలి అవుతాడో డిసెంబరు నెల 'చతుర' నవల 'మంచివాడు'లో కె.ఎం.కోకిలగారు దయాసాగర్ పాత్ర ద్వారా అద్దంపట్టినట్టు చూపేరు.

దయాసాగర్ తన మంచితనంతో ఇతరులకు ఉపయోగపడుతున్నాననుకుంటాడు. స్నేహితుడు నిరంజన్ విషయంలో అది

మంచే జరిగినా, ఓ 'వీరాంజనేయులూ, మరో మాధవరావులు దయాసాగర్‌లో మంచితనాన్ని తమ స్వార్ధంకోసం ఉపయోగించుకుంటున్నవైనాన్ని తెలుసుకోలేకపోవడంవల్ల హితులచేతా, పరులచేతా వెర్రిబాగులవాడుగా జమకట్టబడతాడు!

అయితే, ఒక ముసలాయన్ని బ్రతికించేందుకు తన కిడ్నీ దానంచేస్తానని ముందుకు రావడం ముదిరిన మంచితనమనుకున్నా... అందరూ ఛీదరించుకుంటున్న తనని, తనలోని మంచితనాన్ని మెచ్చి ప్రేమిస్తున్న లలితను కూడా త్యాగం చేస్తానన్న వైపరీత్యంమాత్రం మరీ అసహజంగా తోస్తుంది! అంతటి అర్భకుడ్ని పెళ్ళిచేసుకుంటానని లలిత అనుకోవడమూ కొంత అతిశయోక్తే అవుతుంది! ఏమైతేనేమీ మారిన మనిషిని పెళ్ళిచేసుకోవాలనుకోవడం సబబేకదా!

దయాసాగర్ అతి మంచివల్ల జరిగిన తప్పుల్ని కప్పిపుచ్చే మాతృహృదయాన్ని మలచడంలోనూ, చేతకానితనాన్ని ఎత్తిపొడిచే తండ్రి పాత్రను మలచడంలోనూ, స్నేహంతో ఆతిథ్యం ఇచ్చే నిరంజన్, వరలక్ష్మి దంపతుల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడంలోనూ కోకిలగారు సహజత్వం చూపేరు.

కథాగమనం హాస్యంగా సాగుతూ, సెలయేరులా సాగే శైలితో హాయిగొలిపిన నవలకు 'మంచివాడు' అనే టైటిల్ మరీ సీరియస్ 'టైటిల్ అనిపించింది.

-ఎం.రమాదేవి
సికింద్రాబాద్

# అగ్నిపరీక్షలమయం!

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**డి**సెంబర్ 'చతుర' నవల 'మంచివాడు' అతి మంచితనం ఎలా అనర్థాలకు దారితీస్తుందో హృద్యంగా, హాస్యస్ఫోరకంగా వివరించింది. కుళ్ళూ, కల్మషం, స్వార్థం, అసూయ, పరనింద, ఆత్మస్తుతి ఆదిగాగల ఆధునిక రుగ్మతలతో కిక్కిరిసిపోయున్న ప్రస్తుత సమాజంలో దయాసాగర్ 'మంచివాడు'గా కాదు... అసమర్థుడుగానే గుర్తించబడతాడనడంలో సందేహంలేదు.

కథానాయకుడు దయాసాగర్ తప్ప దాదాపు మిగతా పాత్రలన్నీ మనచుట్టూ కనబడే సాధారణ వ్యక్తుల ప్రతిరూపాలే. రైలులో తను కూర్చున్న సీటు పోగొట్టుకోవడం దగ్గర్నించీ, కిడ్నీ దానం చేయడానికి సిద్ధపడడంవరకూ దయాసాగర్ అన్ని చేష్టలూ అతనికి సవ్యంగానూ, ఇతరులకు అపసవ్యంగానూ కనిపించడం, సమాజం పొందిన మార్పులకు ప్రతీకగా రచయిత్రి వర్ణించడం సబబుగానే వుంది.

మన హీరో వీరాంజనేయులు ఉరఫ్ బొండాంకోసం ఇంటర్వ్యూకి అటెండ్ కాకుండానే వచ్చేయడం. బ్రాందీరాయుళ్ళకు అప్పులు పెట్టేయడం, మెడికల్‌షాపులో మందులు తన జీతం డబ్బుల్తో కొనివ్వడం, తన సూట్‌కేస్ కొట్టేసి దొరికిపోయిన దొంగతరపున తనే వకాల్తా పుచ్చుకోవడం, కోచింగ్ సెంటర్‌లో కన్సెషన్‌లిచ్చేయడం... వీటన్నిటికీ పరాకాష్ట - ప్రాణాపాయం వుందని తెలిసి కూడా కిడ్నీ దానమివ్వబోవడం... ఇవన్నీ అతని అతిమంచితనానికి నిదర్శనాలయితే, అంతోటి మంచివాడ్ని యదార్థ సమాజంలోకి లాక్కురావడానికి కంకణం కట్టుకున్న లలిత అతన్ని గాఢంగా ప్రేమించడం అతనిపాలిట ఓ వరం. ఆమె లేకుంటే అతను మారడానికి మరెంత మూల్యం చెల్లించవలసి వచ్చేదో? ఆమె అతనికి పెట్టిన అగ్నిపరీక్షలు కాస్తంత తీవ్రంగా వున్నా 'మంచితనం' జబ్బుతో బాధపడ్తున్న అతనికి అంతకన్నా గత్యంతరంలేదు మరి.

'అతి సర్వత్ర వర్జయేత్'! మంచితనం మోతాదు మించితే ఎలాటి అవస్థలు పడవలసి వస్తుందో చక్కగా విపులీకరించారు కోకిలగారు. చక్కని సందేశాత్మక నవలనందించిన కోకిలగారికీ, స్టాండర్డ్ తగ్గని కథల్ని ప్రచురించుకుపోతోన్న 'చతుర' సంపాదకులకూ కృతజ్ఞతలు.

-ధూళిపాళ శ్రీనివాసమూర్తి
విజయవాడ

## మంచితనం హద్దుమీరితే..

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'మంచివాడు' మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. కాటు వేయద్దంటే బుసకొట్టడం కూడా మానేసి ప్రాణంమీదికి తెచ్చుకున్న పాముకథకు ఈ నవలకు చాలా దగ్గరి పోలిక ఉంది. అతి మంచితనంవల్ల కలిగే అనర్థాలు, కష్టనష్టాలు ఏమిటో రచయిత్రి ఈ నవలద్వారా తెలియచెప్పారు. తన మంచితనమే తన పాలిట శాపంగా మారిన ఓ దయార్ద్ర హృదయుడి కథను రచయిత్రి చక్కగా మలిచారు.

రచయిత్రి అన్ని సుగుణాలు ఒక్కనికే ఉన్నట్లు దయాసాగర్ పాత్రను రూపొందించారు. కథాపరంగా ఆ పాత్ర బాగానే సరిపోయింది. కాని ఈ కలికాలంలో అంత 'మంచివాడు' ఈ సమాజంలో ఎవరూ లేరేమో! ఇది కేవలం సినిమాల్లోను, నవలల్లోను సాధ్యమౌతుందే తప్ప నిజజీవితంలో కాదు. రచయిత్రి దయాసాగర్ పాత్రను మరీ జాలిగుండె కలవాడిగా, లోకజ్ఞానం లేనివాడుగా తీర్చిదిద్దారు. బ్రాందీషాపు పెట్టి లక్షలు ముంచినపుడయినా తన తప్పు తాను తెల్సుకోవాల్సింది. అంతేకాని తండ్రితో ఛాలెంజ్ చేసి ఇంటినుండి వెళ్ళిపోవడం, ముక్కూమొఖం తెలియనివాడు చావు బతుకుల్లో ఉన్నాడని తన కిడ్నీ దానం చేయాలనుకోవడం, చివరకు తన ప్రేమను కూడా దానం చేయాలనుకోవడం వంటివి దయాసాగర్‌ను ఉన్నతుడిగా తీర్చిదిద్దేందుకు పనికివచ్చాయేతప్ప అవి ఏమాత్రం సహజంగా అన్పించలేవు! దయాసాగర్‌ను మార్చడానికి రజిత, లలితలు కలిసి ఆడిన నాటకం సినిమాటిక్‌గా అన్పించినా మొత్తానికి ఈ నవల హాస్యాన్నందిస్తూనే ఆలోచింపచేసేదిగాను, సందేశాత్మకంగాను ఉంది. తన అతి మంచితనంవల్ల తానెంత మోసపోతున్నాడో చివరివరకూ దయాసాగర్‌కు తెలియకపోవడం ఆశ్చర్యకరం. మంచితనానికి, త్యాగానికి కూడా ఒక హద్దుంటుందని తెలుసుకోవడానికి దయాసాగర్‌కు అంతకాలం పట్టిందన్నమాట.

భిన్నత్వాన్ని ప్రోత్సహించి 'చతుర' తన ప్రత్యేకతను మరోసారి నిలబెట్టుకుంది. ఒక మంచి నవలను మాకందించిన రచయిత్రికి, ప్రచురించిన 'చతుర'కు అభినందనలు.

-గంప శ్రీనివాస్‌రావ్
జగిత్యాల

## ఆహ్లాదకరం

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

మంచితనం, అమాయకత్వం వేర్వేరు గుణాలు. మంచితనాన్ని ఎవరైనా ఆదరిస్తారు. అభినందిస్తారు. అయితే అమాయకత్వాన్నిమాత్రం అందరూ స్వార్థానికి వాడుకొంటారు. ఈ నవల నాయకుడు దయాసాగర్ అమాయకుడేకాదు 'మంచివాడు' కూడా. అతని అమాయకత్వాన్ని సారా తాగే సాంబడి దగ్గర్నుండి కిడ్నీ కావాలని అడిగే మాధవరావు వరకూ అందరూ అలుసుగా తీసుకొన్నవాళ్ళే. ఆ అమాయకత్వాన్ని తగ్గించి మంచివాడుగా, మనిషిగా మార్చటానికి లలితలాంటి చురుకైన అమ్మాయీ, రజిత సహాయమూ కావాల్సి వచ్చాయి. మంచితనం సరిహద్దును అర్థంచేసుకొనేలా వాళ్ళు చేయగల్గారు. అతని దయాగుణం నిరంజన్‌లాంటి ఉత్తములకు ఉపకారాన్నే చేసింది. కానీ అందరూ ఉత్తములే కారుకదా!

ముగింపు అనూహ్యంగా ఉండి, ఆహ్లాదం కలిగించింది. కథలోని వైవిధ్యం, సున్నితమైన హాస్యం ఉక్కిరిబిక్కిరి చేశాయి. నవల పేరు 'అమాయకుడు' అయితే బాగుంటుందని మొదట్లో అనిపించినా, చివరకు 'మంచివాడు' అనేదే మంచి పేరని అర్థం అయింది. ఆహ్లాదమైన రచన అందించిన కె.ఎమ్.కోకిల గారికీ, 'చతుర'కూ అభినందనలు.

-చిరంజీవి.టి
కావలి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

CHATURA Telugu Monthly Hyderabad–500 482 Regd. No. H/HD